# మొదటి అధ్యాయము

జయంతి బాణాసుర మౌలి లాలితా
దశాస్య చూడామణి చక్రచుంబినః
సురాసురాధీశ శిఖాంత శాయినో
భవచ్ఛిద త్ర్యంబక పాదపాంసవః॥ *

నేను 'బాణభట్టు' అను పేరున ప్రసిద్ధిచెందినను, అది నా నిజమైన పేరుకాదు. ఈ పేరునకు సంబంధించిన కథ అందఱికి తెలియకుండిన బాగుగ నుండెడిది. ఈ కథ నెవరికి తెలియకుండ నుంచవలె ననియే నే ననుకొంటిని. కాని చాల కారణములవలన నేను దాని నింక దాచలేను. ఈకథ నందఱికి చెప్పుటకు నేను సిగ్గుపడుచున్నాను. అందుకు కారణ మేమన నేను ప్రఖ్యాతి చెందిన వాత్స్యాయన వంశములో జన్మించితిని. నా కథవలన ఆ వంశమునకే కళంకము కలుగవచ్చు నని నా యనుమానము. నా పితృ పితామహుల గృహములు వేదాధ్యాయులతో నిండి యుండెడివి. వారి యింట శుక శారికలు కూడ విశుద్ధమైన మంత్రోచ్చారణ చేయగలిగెడివి. ఈ విషయమందఱికి అతిశయోక్తిగా తోచవచ్చు. కాని మా పూర్వుల గృహావరణములో పెరుగు

---

* చూ : కాదంబరి, కథాముఖము 2

చుండిన శుక శారికాదులను చూచి వారి విద్యార్థులు భయ పడుచుండెడి వారను మాట సత్యము. ఆ పక్షులా విద్యార్థుల తప్పులను సరిదిద్దుచుండెడివి. * మా పూర్వుల గృహములు నిరంతరము యజ్ఞధూమముతో సంవ్యాప్తమై యుండెడివి. కాని యిది యంతయు నేను వినిన సంగతి. పూజ్యపాదులు మా తండ్రి చిత్రభాను భట్టుగారిని స్వయముగా చూచు భాగ్యము నాకు దక్కినది. హోమ సమయములందు సరస్వతి స్వయముగా మా తండ్రిగారి శ్రమబిందువులను తన పాణిపల్ల వములచే తుడుచుచుండిన దనుట అత్యుక్తికాదు. ఏలయన ఉషఃకాలము నుండి సూర్యోదయమైన తరువాత రెండుఘడి యలవరకు మా తండ్రిగారు హవనకార్యములను నిర్వర్తించు కొని చెమటలు కారుచున్నను లేచిన వెనువెంటనే విద్యార్థు లకు పాఠము చెప్పుటకై కుశాసనముపై కూర్చుండెడివారు. విద్యార్థులచే వేదాభ్యాసము చేయించుచున్నపుడే వారి శ్రమ బిందువులు క్రమక్రమముగా ఆరిపోయెడివి. ♦ దీనిని సర స్వతియే చెమట తుడిచిన దనియుటకే మాటి యేమనగలను! అట్టి పుణ్యాత్ముని పుత్రుడను నేను. చిన్ననాటినుండి నేను మనస్థైర్యము లేక, చెప్పినమాట వినక చెడిపోయిన దేశ ద్రిమ్మరిని. నేనింటినుండి పారిపోయినపుడు చాలమంది కుర్రవాళ్ళను కూడ వెంటబెట్టుకొని వెళ్ళితిని. వారందరు చివరివరకు నాతో కలసి యుండలేదు. కాని గ్రామములో మాత్రము నాకు చెడ్డపేరు తప్పినది కాదు. మగధభాషలో

* చూ: కాదంబరి, కథాముఖము 1

♦ కాదంబరి 19. హర్షచరితము, రెండవ యుచ్ఛ్వాసము-[illegible] వ. పుట.

తోక తెగిన యెద్దును 'బండ్' అందురు. 'తోక తెగిన యెద్దు తాను పోయినదే గాక తొమ్మిది మూరల పగ్గమును కూడ యెత్తికొని పోయిన' దను సామెత ఆ దేశములో ప్రసిద్ధమైనది. అందువలన అందరు నన్ను 'బండ్' అని పిలుచుచుండిరి. ఈ పదమునే నేను సంస్కరించి 'బాణ' అని సంస్కృతపు పేరుగా మార్చి ఆ నామ గౌరవమును కొంచెము పెంచగలిగితిని. 'భట్టు' తరువాత ప్రజలుచేర్చిన పేరు. నా మొదటి పేరు 'దక్షుడు'. ఈ మధ్య నాపై ప్రజలకు గౌరవాభిమానము లెక్కువయినందున, కొందరు నన్ను 'దక్షభట్టు' అని కూడ పిలిచెడివారు. ఈ పేరును నేను చాల జాగ్రత్తగ కాపాడు కొనుచు వచ్చినాను. దాని కథ మీ కిప్పుడు చెప్పెదను.

నా తండ్రులు పది యొకండు మంది అన్నదమ్ములు. వారిలో నందరిని నేను చూడలేదు. నాకు 'ఉమాపతి' అను పినతండ్రి కుమారుడు మండెడివాడు. అతడు నాకంటె పెద్దవాడైనను, సమ వయస్కుని వలె నాతో మెలగుచుండెను. ఆ కాలపు ప్రసిద్ధులగు తర్కశాస్త్రజ్ఞులలో నతడొకడు. అతడు 'వసుభూతి' యనెడి బౌద్ధభిక్షువును శాస్త్రార్థములో నోడించియుండెను. అతని పాండిత్య సౌశీల్య ప్రభావము మహారాజాధిరాజులగు హర్షవర్ధనుల పై ప్రసరించెను. అతని ప్రభావము వలననే హర్షదేవు లొక్కసారిగ వేద మతమును స్వీకరించిరి. ఆ ఉమపతిభట్టు * నన్ను ప్రేమించినంత మా

* హర్షచరిత్రము నందు బాణభట్టుని పినతండ్రికుమారుడు గణపతి అని యున్నది. ఒక వేళ ఉమపతిభట్టు అతడేనేమో !

పసుపుపచ్చని వర్ణముదాల్చి యుండినవి. వారి గాన
మాధుర్యముచే రాచబాట ప్రతిధ్వనించుచుండెను.

నేను 'చౌకు'లో నిలబడి ముగ్ధుడనై యీ
దృశ్యమును జూచుచుంటిని. ఇందులో చాల రస
వంతమైనది, రాజాంతఃపురములో పనిచేయు గుజ్జారి
గూని, నపుంసకుల యుద్ధత నృత్యము. పాప మొక వృద్ధ
కంచుకి స్థితి చాల జాలిని కలిగించెను. నృత్యముచేయుచున్న
యొక రమణి ఉత్తరీయ మతని మెడను చుట్టుకొనెను.
దాని నిటునటు లాగుటచే పాప మా ముసలివాడు నవ్వుల
పాలగుచుండెను. ఈ ఊరేగింపు నట్టనడుమ రాచకన్య
లుండిరి. ఇక్కడ జరుగుచుండిన నృత్యము సంయమిత
గంభీరమై మనోహరముగ నుండెను. ఒకవైపున భేరీ,
మృదంగ, శంఖ నినాదములచే భూమి దద్దరిల్లుచుండ
మఱియొకవైపు పల్లకీలు రాచకన్యకల కపోల స్పర్శాం
దోళిత మణికుండలముల చేతను, కమలపత్రముల చేతను
అలంకరింపబడి యుండి, మధ్య మధ్య అందెల చప్పుడుచే
ఝంఖరిత మగుచుండెను. అందఱి వెనుక వందిమాగధులు
స్తోత్రపాఠములు చేయుచు వచ్చుచుండిరి. వారిలో కొందఱు
ఆనందాతిరేకముచే తమ నోళ్ళనే విచిత్ర వాద్య
యంత్రములుగ నుపయోగించు చుండిరి. ఈ ఊరేగింపు
దాటిపోవుటకు కొన్ని నిముషములు పట్టినవి. * నేను నిశ్చల
ప్రతిమవలె నచట నిలచి యీ వింతలను చూచుచుంటిని.

* 'కాదంబరి' యందలి శుకనాసుని పుత్రోత్సవ సమయపు
వర్ణనతో నిది సరిపోలుచున్నది.

ఊరేగింపు దాటిన తరువాత నేను నిద్రనుండి మేల్కొన్నట్లు స్వస్థుడ నైతిని. మహారాజాధి • రాజగు హర్ష దేవుని సహోదరు లగు కృష్ణవర్ధను నింట పుత్రుడు జన్మించెననియు, నేడు నామకరణము జరుగనున్న దనియు నేను కర్ణా కర్ణిగ వింటిని. ఈమాట వినగానే. ఒక్క క్షణము సేపు నేను నివ్వెరబోతిని. నాకు నాస్థితి జ్ఞప్తికి వచ్చినది. ఎంత విచిత్రము ! ప్రపంచములో నొకవైపు తమ జన్మదినోత్సవము నింత వైభవముగ జరుపుకొనజాలు భాగ్యవంతు లుండ, మఱియొకవైపు నాబోటి దేశ దేశాంతరములు తిరుగునట్టి దౌర్భాగ్యులును కలరుగదా! నాకు నా పుట్టుక జ్ఞప్తికి వచ్చినది. నేను జన్మించిన కొన్ని సంవత్సరములకే నా తల్లి స్వర్గస్థురాలైనది. అప్పటికే మా తండ్రి ముదుసలి. అధ్యయన, అధ్యాపనాదు లందు నిమగ్నుడైన మా తండ్రిపై నన్ను పెంచవలసిన భారము కూడ పడినది. వాత్సల్యము చాల దారుణ మైనది ! మమత్వము ప్రచండ శక్తి గలది! ఏల యన జర్జరితాంగు డైన మా తండ్రిపై ముసలితనమున దైవప్రేరేపితముగ నొక కార్యభారము పడినది. కాని వారు దానిని సంతోషముగ వహించు చుండిరి. హోమవేదిక నుండి లేచి శిష్యులచే వేదాధ్యయనము చేయించుటకై వారు కుశాసనముపై గూర్చున్నపుడు తఱచుగ నా ధూళి ధూసరితమగు శరీరము వారి యొడిలో నుండెడిది. విద్య కంటె వాత్సల్యమే వారివలన నా కధికముగ లభించినది. పదునాలుగు సంవత్సరముల వయస్సులోనే. వారు నన్నును,

లోకమును వీడిరి. నా జీవితమున మిగిలినది. నా పితృ ప్రేమయే. ఆ ప్రేమ వలననే నేను చెడిపోయినది; నా వృద్ధికి కారణముకూడ నా ప్రేమయే. ఈ నాటి యానం దోత్సవము మఱల నన్ను నా తండ్రిగారి యొడిలోనికి త్రోసివది. ఒక్కమారు నే నా కాసముపైపునకు చూచితిని. నా తండ్రితాతలు నన్ను జూచి నాపై దుఃఖాశ్రువులు కురిపించుచున్నారా యన్నట్లు నా కనిపించినది. వేదా ధ్యయన సంపన్నమగు 'యశోంశు శుక్లీకృత సప్తవిష్టప' వంశ మెక్కడ? దరిద్ర దామోదరుడనై 'తోక తెగిన యెద్దు' వలె తిరుగు నే నెక్కడ? ఓ భూమాతా! ఒక్క సారి పగిలి నన్ను నీ యొడిలో దాచుకోరాదా?

ఉన్నట్టుండి నాకొక యాలోచన తట్టినది. 'పుత్రజన్మోత్సవ సమయమున కృష్ణవర్ధన రాజకుమారుల నేల నభినందించకూడదు?' అని నే ననుకొంటిని. ఆశీర్వ దించుట బ్రాహ్మణుని ధర్మము, కర్తవ్యము, వృత్తి. (నే నేకార్యమును ముందుగ నాలోచించి చేయజాలను. అందువలననే నే నే గ్రంథమును పూర్తిచేయలేక పోతిని. కాని కర్తవ్యము నిర్ణయించుకొనుటకు నా కాలస్య ముండదు.) ఈ యాలోచన తట్టగనే నేను రాజకుమారుల యంతఃపురమునకు బయలుదేరుటకు సిద్ధపడితిని. చక్కగా స్నానముచేసి విభూదిరేఖల నమర్చి తెల్లని పూలమాలను ధరించితిని. పాల నురుగువంటి తెల్లని యుత్తరీయము దాల్చి తిని. ఇదే నాకు నచ్చిన వేషము! ♦ అటు తరువాత

---

♦ హర్ష చరితము. ద్వితీయోచ్ఛ్వాసము – 40 పుట.

త్ర్యంబకుని చరణారవిందములను కన్నీటి ధారలచే కడిగి నమస్కరించి నేను బయలుదేరితిని. అప్పటికి సాయంకాల మైనది. సూర్యభగవానుని కిరణములు మెల్ల మెల్లగ పృథ్విని, అటు తర్వాత వృక్ష శిఖరములను విడచి అస్త్రాద్రిపై ప్రసరించు చుండినవి. క్రమ క్రమముగా చిఱువెన్నెల నలువైపుల వ్యాపింప సాగెను. ఆనాడు శుక్లపక్ష త్రయోదశి. నేను మిక్కిలి యుత్సాహముతో కృష్ణవర్ధనుని భవనము వైపునకు నడచుచుంటిని. వారు నా కిపుడు దర్శనమిత్తురా? యని కూడ నాలోచింపక నేను ముందుకు సాగితిని. నా మనసునం దొక విచిత్రమగు నుత్సాహము కలుగుచుండెను. నా పాప పంకిల మంతయు కడిగివేయబడి నా మనస్సు చాల నిర్మలముగ నున్నట్లు నాకు తోచుచుండెను. 'పోకిరి' యను చెడ్డపేరు ఒక్కసారిగ పోగొట్టుకొనవలెనను నిశ్చయము నాకు కలిగెను. 'ఈనాడు నేను కృష్ణవర్ధనుని మైత్రి సంపాదించి పది దినములలో మహారాజుల కృపకు పాత్రుడ నయ్యెదను. అటు తరువాత నా గృహమునుండి వెడలు యజ్ఞధూమ మన్నిదిశలను ధౌతమొనర్చగలదు. నా యింటి ముంగిట వేద మంత్రవాణుల నుచ్చరించు శుకశారికలు బ్రహ్మచారుల నడుగడుగున అడ్డగించు చుండును. నేనిక వాత్స్యాయన వంశమునకు కళంకముగ నుండను' అని నేను నిశ్చయించుకొంటిని. కాని నా భాగ్యరేఖ యింకను అంధకారావృతమై యుండెను. జరుగవలసినది జరిగినది. కాని నే ననుకొన్నదిమాత్రము జరుగలేదు. అటు తరువాత నొక భయంకర సంఘటన

జరిగినది. దానిని తలచుకొన్నంత మాత్రముననే నా యొడలు భయముతో కంపించి పోవును. నేను దేనినుండి తప్పించు కొనవలెనని కోరుచుంటినో దానినే యెదుర్కోనవలసి వచ్చెను. విధి లిఖితమును మార్చుట కెవరితము! భాగ్యరేఖను త్రిప్పుట కెవరి శక్యము! అదృష్ట సముద్రమును తరించుట కెవరు సమర్థులు!

## రెండవ అధ్యాయము

నేను వేగముగ పోవుచుంటిని. భావి జీవితపు మధుర భావ తరంగములలో మునిగి తేలుచుండునట్టి వారికి చుట్టు ప్రక్కల చూచు అవకాశ మెక్కడ? నేను కన్నులు మూసి కొని వెళ్ళుచుంటిని. ఆ సమయముననే "భట్టూ! ఓభట్టూ! ఇటు చూడు! నన్ను గుర్తించలేదా?" అను కోమల కంఠస్వరము వినబడినది. ఆ స్వరము విని నే నొక్కసారిగ త్రుళ్ళిపడితిని. ఇంత దూరముననున్న స్థానేశ్వరములో నన్ను గుర్తెఱిగినవా రెవ్వరు? పరుగెత్తుచున్న గుఱ్ఱమును కళ్లెము లాగి యాపినట్లు నా యాలోచనల కా కంఠస్వరము అంత రాయము కలిగించినది. నేను వెనుకకు తిరిగి చూచితిని. మిక్కిలి సుందరము కాని యొక స్త్రీమూర్తి నన్ను పిలుచు చుండినది. ఆమె ముఖముపై యౌవన రేఖలు కనబడు చుండినవి. కాని వాని దీప్తి పొగరాజుచున్న దీపపు కాంతి వలె మందగించి యుండినది. సాయంకాలపు నీరెండలో ఆమె కన్నులు మెఱయుచుండినవి. ఆ కన్నులచుట్టు స్పష్ట

ముగ నగపడుచుండిన మలినరేఖ లామె నయన కాంతులను తగ్గింపజాల కుండినవి. ఆమె యొక కిళ్ళీ కొట్టుపై కూర్చుండి యుండినది. ఆమె వాలకము జూడ నామె కిళ్ళీలకంటె మంద హాసమునే యెక్కువగ నమ్ముచున్న ట్లగుపడుచుండెను. పసికట్టుటలో నేర్పరినని నేను గర్వపడుచుందును. ఏడ్పుతో కూడిన నవ్వు, నవ్వుతో కూడిన యేడ్పును గుర్తించుటయందు నేను దక్షుడ ననుకొనుచుందును. కాని యీ నవ్వు చాల విచిత్రముగ నుండినది. అందు ఆకర్షణకలదు. కాని ఆసక్తి లేదు. మమత్వ మున్నది. కానిమోహము లేదు. అప్రయత్నముగా నా కాళ్ళు ఆ వైపునకు సాగిపోయినవి. నే నామెను పోల్చుకొనుటకు ప్రయత్నించు చుండగనే ఆమె "భట్టూ! నీవు కూడ నన్ను గుర్తించలేకపోతివా? అయ్యో! నేను నిఫుణికను" అని యన్నది. ఒక క్షణకాలము నేను విభ్రాంతిజెంది సంజ్ఞా శూన్యుడనై స్తంభించి పోయితిని. తరువాత "ఓహో, నీవా! నిఉనియా!" అని బిగ్గఱగ నఱచితిని. 'ప్రాకృత' భాషలో 'నిపుణిక'ను 'నిఉనియా' అని వ్యవహరింతురు. నే నా పేరునకే యెక్కువ అలవాటు పడియుంటిని. ఆమె తన దీర్ఘమగు నేత్ర ముల నన్ను చూచుచు "ఎందుకు గోలచేసెదవు. మెల్లగ మాటలాడరాదా?" అని నన్ను మందలించెను. ఆమె యొక ఆసనమును నా వైపునకు జరిపి, "కూర్చుండి తాంబూలము వేసికొనుము" అని తా నన్నంతనే నేను కూర్చుంటిని.

ఇట నిపుణికను గురించి సంగ్రహముగ ప్రస్తావించ వలసి యున్నది. నిపుణిక ఒకప్పుడు అస్పృశ్యులుగా నెంచ

బడు చుండిన యొకానొక జాతికి చెందినది. కాని యదృష్ట వశమున నామె పూర్వులకు గుప్తవంశపు రాజులవద్ద ఉద్యోగము లభించినందున వారికి సంఘములో గౌరవము లభించినది. ఆ జాతివారీమధ్య తాము పవిత్రమగు వైశ్యకులమునకు జెందిన వారమని భావించుకొనుచు, బ్రాహ్మణ క్షత్రియుల యలవాట్ల నాచరణలో పెట్టసాగిరి. ఈ మధ్యనే వారు తమలో చాలకాలమునుండి యాచరణలోనున్న విధవావివాహమునకు స్వస్తి చెప్పిరి. సెనగలు వేయించుకొని బ్రతుకుచు శ్రేష్ఠిగా రూపొందిన నొక కాందవిక వైశ్యునితో నిపుణికకు వివాహము జరిగెను. కాని వివాహమైన తర్వాత సంవత్సరము తిరుగక ముందే నిపుణికకు వైధవ్యము సంప్రాప్తించినది. విధవయైన పిమ్మట నిపుణిక యెట్టి సుఖదుఃఖముల పాలైనదో నే నెఱుగను. కాని, ఆమె మాత్ర మింటి నుండి వెడలిపోయినది. తన మొదటి జీవితమును గురించి నిపుణిక నాతో నింతకన్న నెక్కువ చెప్పలేదు. కాని అటు తర్వాత జరిగిన కథ నాకు బాగుగ తెలిసినదే. మొదటిసారి నిపుణిక నా దగ్గఱకు వచ్చినపుడు ఉజ్జయినిలో నేనొక నాటక మండలికి సూత్రధారునిగ నుంటిని. నిపుణిక ఆ మండలిలో చేరెదనని యర్థించగా నే నొప్పుకొంటిని. నిపుణిక గొప్ప అందకత్తెకాదు. ఆమె మేని కాంతి శేఫాలికా కుసుమనాళమును పోలి యుండెడిది. కాని యామె సౌందర్య సంపద యంతయు ఆమె కన్నులలోను వ్రేళ్ళలోను మూర్తిమంతమై యుండెను. అందమిచ్చువానిలో వ్రేళ్ళు ముఖ్యమని నా యభిప్రాయము. నీటియొక్క ప్రణామాంజలి

పతాకముద్రలను చక్కగ నిర్వహించుటలో పలుచని వేళ్ళు అద్భుతముగా ప్రభావమును ప్రసరింపచేయగలవు. అందు వలననే, నిపుణిక నాటకమండలిలో చేరుటకు నే ననుమతించితిని. నా నాటకమండలిలో పురుషులకంటే స్త్రీలే సుఖముగ కాలము గడుపుచుండిరి. చిన్ననాటినుండియు స్త్రీని గౌరవించుట నేనెరుగుదును. చంచలలై కుల భ్రష్టులైనట్లు భావింపబడు స్త్రీలలో కూడ నొక దైవశక్తి యుండునను సంగతి సాధారణముగ నందరు మరతురు. కాని నేను మఱువను. నేను స్త్రీ శరీరమును దేవతామందిరము వలె పవిత్రమని భావింతును. దానిని గురించిన ప్రతికూలమగు వ్యాఖ్యలను నేను సహింపజాలను. అందువలననే, మండలిలో నెవరైనను స్త్రీల యిష్టమునకు విరుద్ధముగ వారితో మాట్లాడ కూడదను నియమమును నేనేర్పరచి యుంటిని. బాణభట్టుని నటీమణులు 'ఘోషా' లో నుందురని జనులలో వాడుక యుండెను. దాని ఫలముకూడ మంచిదే యైనది. ప్రజలు నా నాటకమండలిని ఆదరింపసాగిరి. నిపుణిక యనుమతి గొనియే, నేనామెను క్రమక్రమముగ రంగస్థలముపై ప్రవేశపెట్ట దొడగితిని.

ఒకనాడు ఉజ్జయనిలో నాచే రచింపబడిన ప్రకరణ మొకటి ప్రదర్శితము కానుండెను. ఆనాడు పరమభట్టారకులు కూడ విజయము చేయవచ్చునని యూహించు చుంటిమి. నేను నా శక్తికొలది కావలసిన యేర్పాట్లు గావించి ప్రధాన నటీ నటులను తమ కళ నుత్తమ రీతిని ప్రదర్శింపుడని ప్రోత్సహించితిని. గొప్ప యాడంబరముతో నభినయము జరుగవలెనని నే నుత్సాహపడుచుంటిని. ఆ విధముగనే జరిగినది.

మహాకాళనాథుని సాయంసమయ పూజలైనతర్వాత ప్రేక్షక గృహమ్ము జనముతో క్రిక్కిరిసి పోయెను. నగరములోని సంపన్ను లందఱు యథాస్థానములం దాసీనులైరి. నగారా మ్రోగినంతనే, యవనిక వెనుక జరుగవలసిన పూజా విధానము జరిగిన పిదప గాయకులు, వాద్యగాండ్రు తమ తమ స్థానముల నాసీనులైయుండ, నటీమణుల నూపుర నినాదములతో, వీణావేణు మృదంగము లొక్కసారిగ మ్రోగినవి. నేను భృంగారధర, జర్జరధరులవెంట రంగస్థలమున జర్జర స్థాపనకై వచ్చినపుడు ప్రేక్షకుల ఔత్సుక్యమును చూచి నా మేను గగుర్పాటు జెందెను. నా యభినయము చాల రక్తి గట్టినది. జర్జర స్థాపనమైన తర్వాత నేను చాల సంతోషముతో నేపథ్యమునకు తిరిగివచ్చితిని. అప్పటికే నిపుణిక పుష్పోపహారమును గైకొని సిద్ధముగ నుండెను. నగారామీఁద దెబ్బ పడగనే నిపుణిక పుష్పాంజలి గైకొని రంగస్థలమునకు వెళ్లెను. తెరచాటునుండి నేనామె యపూర్వ నృత్యమును చూచుచుంటిని. వీణా వేణు మృదంగముల ధ్వనితోపాటు కంచు తాళములు మ్రోగుచు నిపుణిక నూపుర క్వణనమును మఱింత మనోహర మొనర్చు చుండినవి. తటాలున వాద్యము లాగిపోయి నిపుణిక కలస్వనము వినబడినది. నాటి నిపుణిక కళాకౌశలమునుజూచి నేను విస్మయ విముగ్ధుడనైతిని. పాట ముగియగనే వాద్య ధ్వనులతోపాటు నూపుర నినాదము వినబడినది. సుకుమార హావభావములతో నిపుణిక దేవతా ప్రీతిగ పుష్పాంజలి సమర్పించి యభిరామ సంచారగతిని అల్ల నల్లన నేపథ్యభూమి కేతెంచినది.

ఒక క్షణములో నా మానస సాగరమును తుఫాను చెలరేగి శాంతించెను. అట్టి పరిస్థితులలో నన్ను నే నదుపులో నుంచుకొనగల శక్తి నాకు గలదు. అందును గుఱించి నేను గర్వపడుచుందును. నే నొక్కసారి 'నిఉనియా'యని ఆసక్తితో గూడిన కంఠస్వరమున ఆమెను పిలచితిని. నిపుణిక తటాలున ఆగిపోయెను. ఆమె వామహస్తము కటిప్రదేశమున నేలంక రించుచుండ, కంకణము ముంజేతిపైకి జారి యుండెను. దక్షిణ హస్తము సోమలతవోలె వ్రేలాడుచుండెను. ఆమె కమనీయ తనులత నృత్యభారముచే నించుక వంగియుండెను. ముఖమంతయు స్వేద బిందువులచే నిండియుండెను. ఆమెను చూచినపుడు నాకు 'మాళవికాగ్నిమిత్రము'లోని మాళవిక జ్ఞప్తికి వచ్చినది. నవ్వుచు నేను కాళిదాసుని ఆ శ్లోకమును చదివితిని. * నిపుణికకు సంస్కృతము తెలియనందున నేమి యర్థము చేసికొన్నదో తెలియదు కాని ఆమె యధరములపై మందహాసము నాట్యము చేసినది. ఆమె రెప్పలు క్షణకాలము వాలిపోయినవి. ఆ సమయముననే జారిన ఆమె కబరీ బంధము నుండి యొక మల్లికా కుసుమము క్రిందకు జారి పడినది. పాపము! దానికి తగిన శా వెంటనే జరిగినది. నిపుణిక తన పాదాంగుష్ఠముతో దానిని రాచసాగినది. ఇంతవఱకు కాళిదాసుని మాళవికతో సరిపోలిమికి నిపుణికలో నున్న

* వామం సంధి స్తిమిత వలయం న్యస్త హస్తం నితంబే,
కృత్వా శ్యామా విటప సదృశం స్రస్తముక్తం ద్వితీయం।
పాదాంగుష్ఠాలులిత కుసుమే కుట్టిమే పాతి తాక్షం,
నృత్యా దస్యాః స్థితమతి తరాం కాంత మృజ్వాయతాక్షం॥

లోటుకూడ నిప్పుడు తీరిపోయినది. ఆ మూర్తినిచూచి నేను కిలకిల నవ్వితిని. నా నవ్వును విని నిపుణిక తల యెత్తినది. కాన్ని ఆమె కన్నులు చెమ్మగిలి యుండినవి! వెంటనే ఆమె మెల్ల మెల్లగ అచటనుండి వెడలిపోయెను. నా నవ్వామెకు దుస్సహమాయెనా యన్నట్లు నాకు స్ఫురించినది. తరువాత నే నితర కార్యములలో నిమగ్నుడ నైతిని. నాటకము ప్రారంభమై ఐదు ఘడియల కాలము గొప్ప యుత్సాహముతో ప్రదర్శించబడెను. ఆనాడు నా యానందమునకు మేర లేదు. పరమభట్టారకుల యానందభరితమగు మోమును చూడ, నాకు మఱునాడు గొప్ప బహుమానము లభ్యమగు ననుట తథ్యమని తేటతెల్ల మగుచుండెను. మఱునాడు రాజసభలో దర్శన మొసంగెదమని వారు సెలవిచ్చియుండిరి. ప్రేక్షకుల పొగడ్తలమధ్య నాటక ప్రదర్శనము ముగిసెను. ఆనాటి పను లన్నిటిని నిర్వర్తించుకొని నే నిల్లు చేరుకొంటిని. నిపుణికకు సరియైన బహుమానమివ్వవలయునని మనసునం దాలోచించు కొను చుండగ నెవరో వచ్చి నిపుణిక కనబడ లేదని తెలిపిరి. మేఘములేని యుఱుమువలె నా వార్త నన్ను సంక్షుభితుని గావించెను. ఆ రాత్రియంతయు నిపుణికకై వెదకుచునే యుంటిని గాని ఆమె జాడ తెలియక పోయెను. అట్లే నాల్గు దినములవఱకు నే నామెకై వెదకుచునే యుంటిని గాని నిపుణిక మరల కనబడ లేదు. నేను రాజసభకు వెళ్ళజాలక పోతిని. అనుక్షణము నిపుణిక యశ్రుపూరిత నయనముల స్మృతి నన్ను కలత నొందించుచుండెను.

నా అమంగళకరమైన నవ్వును స్మరించినప్పుడెల్ల అకాల పుష్పితమగు పువ్వు బోలె నేను భయపడుచుంటిని. ఐదవనాడే నేను నా నాటకమండలిని ఛిన్నాభిన్నము గావించి నేను వ్రాసిన ప్రకరణమును శిప్రానది ఉత్తాల తరంగముల కర్పించితిని. ఆనాటినుండి ఆఱు సంవత్సరములు గడచిపోయినవి. ఆ వృత్తిని నేను సంపూర్ణముగ వదలివేసితిని. ఈనాడు బహుమతి పొందగోరి రాజసభకు వెళ్ళుచుండ మరల ఆ నిపుణికయే నాకు ప్రత్యక్షమైనది. ఎవరిని చూడలేనందున నాడు రాజదర్శనమున కంతరాయము కలిగెనో ఆ నిపుణిక సందర్శన మీనాడు రాజదర్శనమున కంతరాయము కలిగించునా యేమి? ఏమో అదృష్టము నడ్డువా రెవ్వరు?

కొంత సేపటి వఱకు నేనేమియు మాటలాడలేక రెప్ప వాల్చక నిపుణికను చూచుచుంటిని. ఆమె కిళ్ళీ కట్టుచుండెనే కాని యామె మనస్సునందేదో భయంకరమగు సంక్షోభము కలుగుచున్నదని, యే యనామకుడైనను చెప్పగలడు. చాల కాలమైన తర్వాత తాంబూలమును నమర్చుచున్న నిపుణిక శుష్కించిన వ్రేళ్ళను చూచి నేనపూర్వాహ్లాదమును పొందుచుంటిని. ఆమె పెదవులపై చిరునవ్వు తొణికిసలాడుచుండెను కాని యామె కన్నులు అశ్రుపూరితములై యుండెను. ఆమెయును మాట్లాడలేదు. ఒక కిళ్ళీ కట్టుటకు ఆమెకొక ఘడియ కాలము పట్టినది. అటు తర్వాత ఆమె నా వైపు తనదృష్టిని ప్రసరించెను. ఆమె కన్నులనుండి కన్నీరు తెరపిలేక ప్రవహించుచునే యుండెను. నేనామెను స్తబ్ధుడనై చూచుచుంటిని. కాని కన్నీరాగలేదు. కడపట నేను "నిఉనియా,

ఏడ్వవలదు" అని గట్టిగా అరచితని. ఆ నా కంఠస్వరము తప్పక భయసూచకముగ నుండినదేమో! నామాట లను విని యామె దుఃఖపడసాగెను. ఆమె కన్నీటిని తుడుచు టకై నేనాత్రముతో లేచితిని కాని ఆమె యంతలోనే తన్ను తానణచుకొని నన్ను మందలించుచు "ఛీ. ఛీ భట్టూ, ఏమిటీ పని? బజారులో కూర్చుండి యున్నామని గమనించ లేదా?" అని యనెను. నేను "మనమెక్కడ కూర్చుండియున్నా మను విషయమును గురించి నేను లెక్కచేయను. నేను నిన్ని విధముగ నేడువనీయను. దరిద్రురాలా! నీవానా డేల పారి పోయి వచ్చితివి?" అని గట్టిగా అడిగితిని. నిపుణిక నన్ను మఱల తన క్రీగంట మందలించుచు తాంబూలము వేసి కొమ్మని ప్రార్థించినది. ఇప్పుడామె కంఠస్వరము సహజముగ నుండెను. నేను తాంబూలము తీసికొంటిని.

నేను పోవుచున్నచోటికి పోలేకపోయితిని. ఈ దౌర్భా గ్యురాలి కష్ట సుఖములు తెలిసికొనకయే అచటనుండి నేను వెడల జాలకుంటిని. ఏమఱుపాటున నవ్విన నవ్వువలన నేర్ప డిన్న పరిస్థితిని చక్కదిద్దుట కవకాశము లభించినది. ప్రమత్తు డనై నేనానాడు నవ్వినందువలన నీమె కేదుఃఖము జ్ఞప్తికి వచ్చెనో, ఈ యాఱు సంవత్సరములు పాపమామె యెట్టి యిక్కట్టులకు లోనైనదో, యెట్టి దౌర్భాగ్యమునకు వశమై నదో తెలిసికొనకుండ బాణభట్టు ఆ చోటువదలి పోగలడా? ఈ జాలిగుండెయే కదా నన్ను దేశద్రిమ్మరిగా చేసివేసినది. ఆరు సంవత్సరములుగా నన్ను కలచి వేయుచున్న నా నిర్ల క్ష్యపు నవ్వున కీనాడు కన్నీటి ధారలతో ప్రాయశ్చిత్తము

చేయవలసి యున్నది. ఈ నగరపు సదాచార పరాయణులు నిపుణిక శీలమును శంకించుచుందురనుటలో సందేహములేదు. ఆమె దుకాణములో కూర్చుంటిని. నేనపకీర్తి పాలగుదునను మాట నిజమే. కాని నిపుణిక నా కంటే శ్రేష్ఠురాలు. నేను నా జీవితమంతయు స్త్రీ శరీరమును దేవమందిరమనియే భావించి యుంటిని. ఈ రోజు ఇతరుల మాటలకు భయపడి యీ దేవమందిరము నాపదలపాలు జేసి వెడలిపోవుట నాకు సాధ్యము కాని పని. నేను మరల "నిఉనియా, నీవు ఉజ్జయని నుండి యేల వెడలిపోయితివి? ఇన్నాళ్లెచట నుంటివి? ఏమి చేయుచుంటివి? నీవు దుఃఖమున మునిగియున్నట్లు కనబడు చున్నావే? నిన్నీస్థితిలో వదలి నేను వెళ్ళలేను. నాడు నీవెందులకు పారిపోయి వచ్చితివో చెప్పరాదా? ఆఱు సంవత్సరముల నుండి నా చిత్తము నన్నే ధిక్కరించుచున్నది. నీదుఃఖముల కన్నింటికి నేనే కారణముగదా? నీవు నీనోట నామాట సరి కాదని చెప్పగలవా? నేను నిర్దోషినా?" అని యంటిని.

నిపుణిక నిట్టూర్పు విడచి "భట్టూ, నీవన్నమాట నిజమే. నేను వచ్చివేయుటకు కారణము నీవే. కాని, దోషము నీది కాదు. నాది. నీపై నాకాసక్తి యుండినది. నాటకము జరిగిన నాటి రాత్రి నాకే విజయము లభించనున్నదను భ్రమ నా కొకక్షణకాలము కల్గినది. కాని మఱు క్షణముననే నీవు నా యాశలను కూలద్రోసితివి. నిర్దయుడా! నీవు స్త్రీ శరీరమును దేవమందిరముగ భావించుచున్నానని నాతో నెన్నోసార్లు చెప్పియుంటివి గాని యీ మందిరము ఇటుక సున్నములతో గాక రక్తమాంసములతో నిర్మింపబడినదని

యొక్క-సారియైనను తలంచితివా? నా సర్వస్వమును చేతబట్టు కొని నీవు దానినంతయు స్వీకరించెదవను గంపెడాసతో నేను నీ వైపునకు వచ్చినదే తడవుగ నీవుదానిని ఘుంటగలిపితివే? ఆనాడు నీవు పాషాణహృదయుడవని నాకు విస్పష్టమైనది, నీలో దైవత్వము లేదు, పశుత్వమూ లేదు, ఉన్నదంతయు చలించని జడత్వమే! అందువల నేనక్కడ నిలువజాలకపోయి తిని. అటు తర్వాత నేను జీవితములో నెన్నో కష్టములు సహించితిని కాని ఆనాటి తిరస్కారమువలన గలిగిన దుఃఖము వంటిది నా కెన్నడు కలుగలేదు. ఆఱుసంవత్సరములీ కుటిల ప్రపంచములో నసహాయురాలనై ద్రిమ్మరితిరిగితిని. ఇపుడు నా యాసక్తి యంతయు భక్తిగా మారినది. 'భట్టూ, నీవు నా గురుదేవుడవు. నీవు నాకు స్త్రీ ధర్మమ్మును నేర్పినావు. ఈఆరు సంవత్సరములలో కలిగిన యనుభవములవలన నీ జడ త్వమే మంచిదని నిశ్చయముగా చెప్పగలను. నాదురదృష్టము వలన నేను నీ యండను వదలి వచ్చితిని. అప్పటినుండి నా జీవిత మేవిధముగ గడచినది తెలిసికొనవలసిన యవసరమేమి? ఇప్పుడు నేను తమలపాకు లమ్ముకొనుచు జీవితము గడుపుచు న్నాను. చిన్న రాజకుటుంబములో విడెములందజేయు పని నాది. మొత్తముమీద నాకిపు డేవిధమైన దుఃఖములేదు. నన్నుగూర్చి నీవు చింతపడవద్దు. నీవు వెళ్ళదలచుకొన్న చోటికి వెళ్ళుము. ఈ నగరములో నీవున్నచో అప్పుడప్పుడు నిన్ను చూడగోరెదను. కాని నీవీదుకాణమువద్ద యెక్కువకాలము కూర్చుండవద్దు. (ఇక్కడివారు స్త్రీశరీరమును దేవతామందిర ముని భావింపరు.)" అని యనెను. ఈ విధముగ పలికిన

తర్వాత ఆమె యొకసారి సవ్వి నా వైపు చూచెను. ఆ చూపులో నొక విధమగు తృష్ణాభావము గోచరించినదే గాని యే విధమగు పశ్చాత్తాపము గాని యనుతాపమ్ముగాని కనబడలేదు. కొంచెముసేపాగి ఆమె, "భట్టూ, నాకేవిధమైన పశ్చాత్తాపమునులేదు. నేనింతకంటే వేఱొకటి కాజాలను. కాని నీవింతకంటే శ్రేష్ఠుడవు కాగలవు. అందువలననే నీ విక్కడ నుండవలదని నేను చెప్పుచున్నాను. నేను పశ్చాత్తాప పడినయెడల నేనున్న నరకములో కూడ నాకు చోటుండదు. నీవు జాగరూకుడవై మెలగిన, నీవు చేరగలుగు నున్నతస్థితిని నేను గాని నీవుగాని యూహింపజాలము. నాకు ప్రపంచానుభవము తక్కువ. కాని నీవంటి పురుషశ్రేష్ఠులను గాంచుట దుర్లభము" అని యనెను. ఏదో యనగూడని మాట యామె నోట వెలువడినదా యన్నట్లామె కన్నుల ప్రయత్నముగా క్రిందికి వాలిపోయినవి. ఆమె వ్రేళ్ళు త్వర త్వరగా తములపాకులపై కాచు రాయ దొడగినవి.

నిపుణిక చివరిమాట నాహృదయమున శల్యమైనది. 'ఆమె పశ్చాత్తాప పడినచో తానున్న నరకములోకూడ ఆమెకు చోటు లభింపదా? ఆమె కులభ్రష్టురాలు. అందువలన సంఘములో నామె సుగుణముల కేమి విలువ? లోకము దుర్గుణములను మాత్రము తప్పక గమనించును, గుంటలలోనికి జొచ్చుకొని పోయిన ఆమె కన్నులను నే నొకసారి మరల చూచితిని. ఆమె కన్నులలో నీరు తిరిగియుండెను. నేను "నిఉనియా, నీవు అసత్యముపలుకుచున్నావు. నీవు పశ్చాత్తాప పడుటయేగాక కష్టములలోనుండి యితరుల యాధారము

నపేక్షించుచున్నావు. నేనిటనుండి వెడలిపోవుట నీకిష్టములేదు. నేను ఘొద కొట్లుంటినో యీనాడుకూడ నావిధముగనే యున్నాను. ప్రపంచమంతయు కలిసివచ్చినను నిన్ను నా యండనుండి తొలగింపజాలదు. దుకాణమిక కట్టిపెట్టుము. నిన్నెవరెఱుగనిచోట నీవు శాంతితో కాలము వెళ్ళబుచ్చుకొనుము. నిన్ను నేనీ పంకిలములో వదలి వెళ్ళజాలను. నాపై నీకున్న మోహపాశము తెగిపోయినది. అది చాల మంచిదే. కళంకపూరితమైన యీ నగరపు రాజమార్గమును నీవు వదలిపెట్టుము. నీకం ట్లెవిధముగ గుంటలు పడియున్నవో చూడుము. అభాగ్యురాలా! నా వద్దనే దాపరికమా!"అని యంటిని. నిపుణిక యీ దెబ్బను సహింపలేకపోయినది. ఆమె వెక్కి వెక్కి యేడ్వసాగినది. ఈ సమయముననే ఒకరిద్దరు దుకాణము వైపునకు వచ్చుచుండిరి. దూరమునుండే వారి రాకను గమనించి నిపుణిక జాగ్రత్త పడినది. ఒక క్షణమైనను ఆలస్యము చేయక ఆమె దుకాణమును మూసివేసి నన్ను లోపలికి రమ్మని సైగ చేసెను. దుకాణము వెనుక భాగమున నొక ముంగిలి కలదు. దానిమధ్య ఒక తులసిమొక్క కలదు. దాని ప్రక్కన ఒక చిన్న వేదికపై మహావరాహుని భవ్యమగు శిలాప్రతిమ యొప్పుచుండెను. ఆవిగ్రహము చిన్నదైనను దానిని నిర్మించిన శిల్పి చాల నేర్పరియని తోచుచుండెను. మహావరాహుని దంష్ట్రములపై చెక్కబడియున్న భూదేవి ముఖ మండలమున ప్రకటితమగుచుండు ఉల్లాస తేజోభావములుచూడ నింపుగనుండినవి. ఏమి యామూర్తిలో వెల్లివిరియు శిల్ప నైపుణి! ఏమి అంగ విన్యాసము! నడుము

మీాద కీవిగా నుంచబడిన యీా హ.స్తములు! బలిష్ఠమై మెలి దిరిగిన యీా కంఠరములు! ఆ ప్రతిమను జూడ మన సునం దపూర్వమగు నాత్మ విశ్వాస ముద్రిక్తమగు ననుట తథ్యము. ఆ విగ్రహామే నిపుణిక ఆరాధ్య దేవతయని నిర్ణయించు కొనుటకు నా కెక్కువకాలము బట్టలేదు. బహుశః నిపుణిక తానుగూడ నిట్లే యుద్ధరింపబడుదునని యాశించు చున్నదేమో యని నేను భావించితిని. నిపుణిక ఒకసారి ఆ మూర్తిని తృష్ణోజ్జ్వల నయనములతో జూచి యొక చిన్న గదిలో నన్ను కూర్చుండుమని సైగ చేసినది. నేను కూర్చుండిన తర్వాత నామె వెళ్ళి స్నానముచేసి వచ్చినది. "ఇదిగో ఇప్పుడే వచ్చెద"నని చెప్పి ఆమె యీా మూర్తియెదుట నొక కుశాసనముపై కూర్చుండి బొంగురు పోయిన కంఠముతో స్తోత్రముచేయ మొదలిడెను. ఆమె కన్నులనుండి నిరంతరముగా స్రవించు కన్నీటిధార లామె యెదపైని వసంతపు పైటను తడిపివేసెను. నే నీ దృశ్యము నిర్నిమేష నేత్రములతో జూచుచుంటిని. నిపుణిక ధన్యురాలు! మహావరాహుడు ధన్యుడే! తులసీ వృక్షము ధన్యమైనది! ఈ మూాడింటిని చూచుచుండిన మందభాగ్యుడైన బాణుడును ధన్యుడే! నేనిది వఱ కెంత విఱ్ఱవీగుచుంటిని! తుచ్ఛమగు నా గర్వమును దలచుకొని నాకే సిగ్గువేసినది. అయ్యో! నే నెవరి కాశ్రయ మియ్య సంకల్పించుచుంటిని! నిపుణికకు లభించిన ఆశ్రయము నెదుట నాయండ యెంత తుచ్ఛమైనది! నేను పురుషుడనను గర్వము, కులీనుడనను గర్వము, పండితుడనను గర్వమొక్కసారిగ మటుమాయమైనవి. నిపుణికను అర్థము చేసుకొనుటలో

నే నెంత పొరబడితిని! ఆమె భక్తిపూర్వకముగ గద్గద స్వరముతో మహావరాహుని స్తోత్రము చేయుచుండ నే నామెను రెప్ప వాల్చక చూచుచుంటిని. ఆమె శరీర కాంతు లపుడు దివ్యములై కనబడుచుండినవి. గుంటలు పడియున్న యామె కన్ను లుప్పొంగిన నీటిప్రవాహమున వికసించిన పుండరీకముల వలె నొప్పుచుండినవి. ఆమె కుంతలములు మహావరాహుని పాద పద్మముల నంట నుత్సాహపడుచున్నవా! యన్నట్లు చంచలములై యిటునటు జారుచుండినవి. నిపుణిక మా నాటక మండలిలో నుండిన సుపరిచిత యగు నిడునియ యే యని నే నొకక్షణము మఱచిపోతిని. ఆమె యెవతెయో దేవాంగనయనియు, ఈ పాప పంకిలమైన భూలోకమును విడచి యెప్పుడు వెళ్ళిపోవునదియు మనకు తెలియదని నేను భావించుచుంటిని. ఆ రమణీ హృదయాంతరమున సుస్థిరముగ నాటుకొన్న ప్రేమమూర్తి యగు మహా వరాహునికి నేను మనసునందొక పరి ప్రణమిల్లితిని. నిపుణికను జూచినపుడు ఆమె యేడుపుతో గూడిన నవ్వును గుర్తించినాననియు, నేనేదో గొప్ప సహృదయుడననియు, గర్వపడుచుంటిని. ఆ గర్వము చాల పొరబాటని నేడు నేను గ్రహించితిని. నా యల్పజ్ఞతకు నేను సిగ్గిలితిని. ఆ సమయమునకే నిపుణిక పూజనుండి లేచినది. ఆమెతోబాటు శాంతిశ్రీ కూడ లేచి నిలువబడి యున్నట్లు నా కనిపించినది. అంతేకాదు. ఆమె నడక భావవిహ్వలమై, గంభీరమై, మూర్తీభవించిన భక్తి యొక్క మంథరగతిని బోలియుండెను. ఆమె మోముపై చిఱునవ్వు చిందులు త్రొక్కుచుండెను. ఈ రమణీ మణిని

తొలుదొల్త చూచి నేనెంత పొరబడితిని! కరుణా రసభరిత మైన యామె ముఖమును జూచి, పరితాపము చెందుచున్న ముఖమని నే నను కొనుటెంత పొరబాటు! ఆమె కొంచెము సేపు నా యెదుట కూర్చుండినది. నా నోట మాటరాలేదు. కొంచెముసేపూరకుండిన తర్వాత నామె "భట్టూ, నిజముగ నీవు నాకు సహాయము చేయగలవా?" అని ప్రశ్నించినది.

"నీ కా సందేహమేల కలిగినది; నిపుణికా! ఇదివఱ కెన్నడైన నే నాడిన మాటను తప్పితినా?"

"కాని నాకు సహాయము చేయుట కేదైన యనుచిత కార్యము చేయవలసి వచ్చినచో?"

"చూడు, నిఉనియా, నీ కిచ్చట దొరకిన యాశ్రయ మును మించి నీ కితర సహాయమనవసర మని నేను ప్రత్యక్ష ముగా జూచుచునే యున్నాను. అయినను నీవు నన్ను పరీ క్షించుటకై యిట్లు మాట్లాడుచున్నావు. అందుకు నాజవాబు వినుము. సాధారణముగ అందరును ఉచితానుచితములని నిర్ణ యించుకొని యనుసరించు మార్గమును నే ననుసరించువాడను కాను. నేను నా స్వబుద్ధితో నుచితా నుచితములను వినిు ర్ణయించుకొందును. మోహలోభములచే ప్రేరేపింపబడి చేయ బడు కార్యములన్నియు అనుచితములని నా యభిప్రాయము. కాని యింతవఱ కెప్పుడును యిరువురి శత్రువుల బారి నుండి నేను తప్పించుకొనలేక పోయినమాట వాస్తవమే. కాని నేనీరోజు దృఢనిశ్చయము చేసి కొంటిని. దానిని నెరవేర్చు టలో నేనెంత వఱకు కృతకృత్యుడ నయ్యెదనో నాకే తెలి యదు. అనుచిత కార్యములనుండి యెల్లప్పుడు తప్పుకొనలేక

పోయినను ఉచితమగు కార్యములను చేయుటలో నేను నా ప్రాణము సైతము లెక్కచేసి యుండలేదు. నేను సహాయము చేయవలసిన కార్యమేదో చెప్పుము. నీవు నన్ను బాగుగ నెరుగుదువు. నాచే ననుచితకార్యము చేయించుటకు ప్రోత్స హించవని నేనాశించు చున్నాను."

నిపుణిక నవ్వినది. ఆమె "తప్పించు కొనుటకు మార్గము వెదకుచున్నావా! నావంటి స్త్రీ నీచే నుచితకార్య ములనే చేయించునని యాశించు చున్నావా? చాల యమా యకుడ వయ్యా!" అని యనెను.

ఈ మాట నేను నిజముగనే వ్యాకుల చిత్తుడనైతిని. కాని కొంచెము ధైర్యముతో "మఱి నేను చేయవలసినకార్య మెదో నాకు చెప్పరాదా!" అని యంటిని.

నిపుణిక మఱింత బిగ్గరగా నవ్వి "దేవమందిరము నుద్ధ రించవలసి యున్నది!" అని యనెను.

నాకర్థమైనది. దేవమందిరమనగా స్త్రీయే కదా! ఇది యనుచితమైన పని కాదే! చిరునవ్వుతో నేను "నిన్ను మహా వరాహుడే యుద్ధరించి నాడు. నిన్నుగురించి నాకు చింతయే లేదు. ఆపదలో జిక్కుకొన్న మఱి యే యువతిని నేను రక్షింపవలసి యున్నదో చెప్పుము!" అని యంటిని.

నిపుణిక "భట్టూ, ఇదివఱకు స్త్రీ శరీరమును నీవు దేవ మందిరముగ భావించుచుండుట నీ యమాయకపు కల్పన మాత్రమే. కాని నేనీరోజున నిజమైన దేవమందిరమును జూపె దను. కాని అందులకు నీవు నా చెలికత్తె వేషముతో చిన్న రాజనగరునకు వచ్చి బురదగుంటలో చిక్కుకొనిన దేవ

మందిరము నుద్ధరింపవలెను. ఈ నాడే దానికి సరియైనది. నిజముగ మహావరాహుడే నాకు సహాయకుడు. అతడే నిన్ను నాకడ కంపెను. నీవు రాకయుండినచో నేనైనను ఈపనిచేసి యుండవలసినది. ఈ పని చేయగలవా భట్టూ? రాక్షసుల చెరయందున్న లక్ష్మీదేవి నుద్ధరించుటకు సాహసమున్నదా? కల్లుగుంటలో చిక్కుపడియున్న కామధేనువును రక్షింప గలవా? చెప్పుము. నేనిపుడే వెళ్ళవలసి యున్నది. మహా వరాహుడీ వేళనే నా కనుజ్ఞ నొసగినాడు. ఈ సీత నుద్ధరించు నపుడు జటాయువు వలె ప్రాణముల నర్పింపవలసి యుండు నేమో! సాహసింపగలవా?" అని యడిగెను.

నాకు నవ్వువచ్చినది. నేనీ పనిని తప్పక చేయగలను. ఒక పర్యాయము నేను మనసునందే నా పితృపాదులకు ప్రణ మిల్లి, "తండ్రీ! ఈ రోజు ఆత్మోద్ధరణ కార్యమునుండి విర మించుకొనవలసి వచ్చినది. అవకాశము లభించిన మఱియొకప్పు డది జరుగగలదు. దుఃఖమునందు మునిగియున్న యొక స్త్రీని దుఃఖ విముక్తురాలినిగా నొనర్చు యజ్ఞమున నా ప్రాణ ముల నాహుతి చేయవలసి నట్లాహ్వానము వచ్చినది. తండ్రీ! ఆ మహాకార్యమునకు ఋత్విజుని కానిమ్ము" అని ప్రార్థించి తిని. తర్వాత నిపుణిక నుద్దేసించి "నిఉనియా! నేను సంసిద్ధు డను. అవసరమగు వేషమును గొనిరమ్ము" అని యంటిని.

# మూడవ అధ్యాయము

నిపుణిక ముంగిట నాకొఱకు వేచియుండెను. ఆమె సఖనై నేను వెలుపలికి వచ్చితిని. హంసచ్ఛాయను పోలిన వెన్నెల పృథ్వి నావరించి మనస్సున కిదివర కెన్నడును గలుగని ఆనందమును చేకూర్చుచుండెను. శివుని శిరస్సు నుండి ప్రవహించు గంగానదీ ధార సముద్రమును నింపునప్పుడిటువంటి శోభయే గోచరమగుచుండ వచ్చునని నేను భావించితిని. చంద్రోదయమై చాలసేపయినది. చంద్రోదయ సమయపు టరుణరాగ మిప్పుడు బొత్తిగా నగుపడుటలేదు. ఇంద్రుని ఐరావతము ఆకాశ గంగాతోయముల స్నానముచేసి వెడలునపుడు దాని శ్వేత కుంభస్థలమున, నుండు సిందూరము కడిగివేయబడినందున అదికూడః నీవిధముగా శోభిల్లుచుండ వచ్చును. ఎవడో శిల్పియొక్క సుధావిలేపనచూర్ణపు బరిణె తల్లక్రిందుగా పడిపోయినట్లు ఆకాశ మెల్లెడలను పాల వెన్నెల వ్యాపించి యుండెను. మిణుకు మిణుకు మనుచున్న నక్షత్రములను చూచి అవి తూగుచున్నట్లును, ఏ క్షణమున నైనను పడి నిద్రపోవచ్చునేమో యన్నట్లును, నాకనిపించినది. సాయంకాలపు పిల్లవాయువు లిండ్లలోనుండు ఆవులపై తమ ప్రభావము ప్రసరింప చేసినవి. వాని స్పర్శచే పాపము, అవి నిద్రచే తూగు చుండినవి. నెమరువేయుచున్నవారి దవుడ లలసిపోయి వాని కన్నులు మూతలు పడుచుండినవి. చందమామలోనున్న జింక యగచాట్లు చూచి నాకు జాలి కలిగినది. పాపమా మందభాగ్యుడు దప్పిక గొని నీటికై

యీ యమృత సరోరవముకడకు వచ్చి, అమృత పంకిలములో జిక్కుకొని ఏమి చేయుటకు తోచక అచటనే నిలచిపోయెను. ♦ నేనుకూడ అట్టి యమృత పంకిలములో చిక్కుకొంటినా యేమి, అని నా కనిపించినది. కాని యిప్పుడు విచారించుట వ్యర్థము! నిపుణిక సైగగాని నేను ఆమె చెలికత్తెవలె ఆమె వెంట వెళ్లుచుంటిని. ఎందుచేతనో ప్రకృతియందంతట నిరాశాపూరిత మగు జడత్వము వ్యాపించి యున్నట్లు నాకు తోచుచుండెను. నిపుణిక సంగ్రహముగ నాకు నాకర్తవ్యమును తెలియజెప్పినది. తనవరకు ఆమె యౌచిత్యమును గమనించుచునే వచ్చినది. తన మాటలలో నన్ను తిరస్కార భావముతో నెప్పుడును మాట లాడలేదు. కాని ఆమె మహావరాహునే తన నిజమైన సహాయకునిగను కార్యసాధనకు నన్ను నిమిత్తమాత్రునిగను భావించుచున్నట్లు నాకు విస్పష్టమగు చుండినది. ఆమె దృఢనిశ్చయమునకు ప్రమాణము లామె యశ్రుపూరిత నయనములే. వీరాగ్రేసరులగు మౌఖరీ వంశపు రాజుల అంతిమ చిహ్నమే చిన్న రాజకుటుంబమేని ఆమె నాతో చెప్పి యుండినది. శ్రీ హర్షవర్ధన మహారాజు తన బావగారి రాజ్యమునుకూడ తన ఛత్రచ్ఛాయలోనికి చేర్చుకొన్న ప్పటి నుండియు మౌఖరీ వంశీయ సింహాసనమునకు వారసుడు కాగల హర్షవర్ధనుని బావగారి యొకానొక దూరపు బంధువున కీ నగరములో ఆశ్రయము లభించినది. ఇంకను నిక్కడి ప్రజలకు మౌఖరీ వంశము నెడల ఆదరాభిమానములు గలవు.

---

♦ కాదంబరి. కథాముఖమునందలి సంధ్యావర్ణనముతో సరిపోల్చునది.

మౌఖరీ వంశీయుడగు ఆ బంధువు కొన్ని దినములుగ స్థానే శ్వరములోనే నివసించుచున్నాడు.

అతని అంతఃపురముననే చిన్న రాజ కుటుంబమని అందురు. నిపుణిక ఈ చిన్న రాజ పరివారపు వైభవమును గుఱించియు అక్కడి కళంకపు సమాచారమును గుఱించియు నాకు విపులముగ చెప్పియుండెను. కన్యాకుబ్జపు ప్రజలలో మౌఖరీ వంశీయులయెడ ఆదరము, శ్రద్ధ యున్నదని హర్ష వర్ధన మహారాజెఱుగును. అందువలననే యీ మౌఖరీ వంశపు వారసును స్థానేశ్వరమున 'మహారాజ'ని పిలుతురు. అతని కేయధికారము నిచ్చియుండలేదు. కాని ధన మొసగ బడినది. ఆ కారణమువలన అతనియందు బాధ్యతలేని భోగ లాలస పెంపొంది అది యిప్పుడు అనాచారముగ పరిణమించి నది. మహారాజాధి రాజున కీ సంగతి తెలిసియున్నను మౌఖరీ వంశపువారియెడ ప్రజలకుగల ఆదరాభిమానములను గుర్తించి అతడు సాహసించి యతనిని తొలగింపజాలకుండెను. ఈ చిన్న మహారాజునింట నిప్పటికొక నెలనుండి యొక సాధ్వియగు రాజకుమారి తన యిచ్ఛకు వ్యతిరేకముగ బంధింపబడి యున్నది. నిపుణిక ఈ విషయమును సంగ్రహముగ చెప్పి నను ఆ రాకుమారి ప్రసంగము రాగానే ఆమె తన్నుతా నాపుకొనలేక పోయినది. ఆమె యతని పనుల నన్నిటిని నొక్కొక్కటిగ సవిస్తరముగ చెప్పి కడపట కంటినిండ నీరు బెట్టుకొని "భట్టూ, ఆమె అశోక వనముననుండు సీత. ఆమె నుద్ధరించి నీవు నీ జన్మమును సార్థకము చేసికొమ్మ"ని చెప్పినది. జీవితమును సార్థకము జేసికొను సాధనముకూడ

నిపుణిక స్వయముగ నా కిచ్చినది. అది యొక విషము పూసినకత్తి. కంచుకములో దాచుకొనఁ వీలైనదే. దానినిచ్చు నపు డామె మందహాసముతో "దీని అవసరము కలుగక పోవచ్చును కాని దగ్గర నుంచుకొనుటలో తప్పు లేదుకదా!" అనినది. ప్రాణము లియ్యవలసిన అవసరముగాని తీయవలసిన అవసరముగాని లేదు. కాని ప్రాణము లియ్యవలసి వచ్చినను తీయవలసి వచ్చినను నష్టములేదను విషయము నా కర్థమైనది! నేను నిపుణికను నవ్వుచు చూచితిని. ఆమెకూడ నవ్వసాగెను.

మే మిరువురము మాటలాడక నడచు చుంటిమి. స్త్రీ వేషముననున్న నాలో కొంచెము మార్పు వచ్చిన ట్లగు పడినది. ఏల యన అకారణముగ నాలో అధైర్యము ఉండి యుండి నన్ను హెచ్చరిక చేయుచున్న ట్లనిపించినది. కట్టి యున్న కంచుక బంధములు ఏదో రానున్న గొప్ప గౌరవము నడ్డగించు యంత్రములవలెను, పిక్కలవరకు వ్రేలాడు ఉత్త రీయము ఏదో యననుభూత సౌందర్యశ్రీని బాహ్య జగత్తు నుండి దాచినట్లు అనిపించినది. రాజమార్గము ప్రశాంతముగా నుండినది. ఎచ్చటనో దూరమునుండి యేదో గొప్ప జన సమ్మర్దపు కోలాహలము వినబడుచుండినది. నిపుణిక వెనుకకు తిరిగి నావైపు చూచి నవ్వుచు "సుదక్షిణా" అని పిలిచినది. నేను కొంచె ములికిపడి ఆమెవైపు చూచితిని. నేను మంద హాసము చేయుచు, సన్నని గొంతుతో "సఖి! నిపుణికా!" అని పిలచితిని.

నిపుణిక కన్నులు ఆనందాతిరేకముచే వికసించిన పుండ రీకమువలె ప్రసన్నములైనవి. నవ్వుచున్న ఆమె ముఖమండల

మృదు భారముచే ఆమె మెడ కొంచెము ప్రక్కకు వంగినది. ఆమె యుల్లాస భరితయై నన్నభినందించుచు "అభినయము చాల గొప్పగా నున్నది" అని యనెను. నేను సంకోచము సిగ్గును కనుబఱచు నవ్వు నవ్వితిని. ఈ విషయములలో నేను నిపుణుడను. నిపుణిక గాలిలో తేలిపోవుచున్నదానివలె చక చక నడిచిపోవుచుండినది. నిపుణిక "ఈ ధ్వని మదనోద్యాన వనము నుండి వచ్చుచున్నది. ఈరోజు చైత్రశుద్ధ త్రయోదశి. కామదేవుని పూజాదినము. ఈరోజు కన్యలు వ్రతము సల్పి మన్మథుని పూజించి యిచ్ఛవిచ్చిన వరులను కోరియుందురు. కన్యాకుబ్జములో నీ యుత్సవము గొప్ప యాడంబరముతో జరుపుదురు. ఈరోజు మదనోద్యాన వనమున కన్యలు పూలుకోసి హారములు కూర్చి యుందురు. కుంకుమతో అభ్రకపు పొడి చేర్చి తిలకముదిద్ది, లాక్షారసముతో భూర్జ పత్రములపై తాము కోరిన వరుల చిత్తరువులను వ్రాసి వానిని కుసుమాయుధుని చరణములపై నర్పించి యుందురు. ♦ అశోక వృక్షమునకు దోహద క్రియ లొనర్చుటకై అంతఃపుర కాంతలు ప్రమదా వనమునకు వెళ్ళుదురు. అచట నీరోజు మద్య మృదంగోత్సవములు జరుగుచుండును. భట్టూ-కాదు-సుదక్షిణా, ఈరోజు యువతు లానందకేళి ననుభవించు ఉత్సవము. ఆ రాచకన్నియ నుద్ధరించుట నింతకంటె మంచి యవకాశము దొరుకదు. సరే కాని నీవు కొంచెము

♦ ఈ యుత్సవమును సరిపోలు వర్ణన భవభూతి విరచితమగు 'మాలతీ మాధవము'న చూడవచ్చును.

జంకుచున్నట్లు నాకగుపడుచున్నదే! చెలి, ఈజంకు పనికిరాదు సుమా!" అని యనెను.

నేను మాటాడక వినుచుంటిని. నాలో జంకు లేదు కాని నేను గుర్తించబడుదు నేమో యన్న సందేహము మాత్రము నాకు తప్పక కలుగుచుండినది. కోమల కంఠముతో అభినయించు చున్నట్లు నేను "సఖి, లజ్జ యువతులకు సహజమైన అలంకారము గదా!" అని యంటిని. నిపుణిక ఆనందించుచు, "కావచ్చు, కాని అది యస్వాభావికము కాగూడదే! సఖి, ఈ రోజు లజ్జా సంకోచములను వదలి పెట్టుము. ఇది యువతీ మణుల ఉన్మత్త విలాస దినము" అని యనెను. నేనామె మాటల నర్థము చేసికొంటిని. సందేహమున్న చోట ఈనా దున్మత్తత ప్రబలును కాబోలు! చంద్రుడు మెలమెల్లగ ఆకాశముపై కెగబ్రాకుచు నలుదెసల వ్యాపించిన యంధకారమును తొలగింప కృత సంకల్పుడై యుండెను. మేము రాజ నగరు సింహద్వారమును సమీపించితిమి.

నిపుణిక నాకు పలుమారు చిన్నరాజ కుటుంబమును గురించి చెప్పియుండెను. ఆమెమాటలలోని 'రాజకుటుంబము' కంటె 'చిన్న' పదము నా చెవులయందు గింగురు మను చుండెను. అందువలన నేను మనస్సునందొక 'చిన్నయంతఃపురము'నే భావించి యుంటిని.

కాని ద్వారముకడ చేరగనే నేను నా అభిప్రాయమును మార్చుకొనవలసి వచ్చెను. ద్వారముకడ అంతఃపురమునకు సంబంధించిన విశాలమైన వృక్షవాటిక చాల దూరము వరకు వ్యాపించి యుండినట్లు నేను కాంచితిని. వెలుపల అశోకము,

పున్నాగము, వేము, దిరిసెన మొదలగు నీడనిచ్చు వృక్షము లుండెను. దట్టమైన వాని నల్లని పత్రసమూహముపై పండు వెన్నెల వ్యాపించి యుండెను. ఇనుప గడియల గొప్పకవాటము, దానికడ నుండు సాయుధ సైనికులు నా కగపడక పోయి యుండిన, నేనా రాజనగరు నొక గొప్ప అడవియనియే తలంచి యుందును. ఆ రాచనగరు బహిఃప్రకోష్ఠ మెచట నున్నదియు నాకు సరిగా తెలియలేదు. కాలి బాటలో వెళ్ళు చున్నందున, కుడివైపు పురుషుల ప్రకోష్ఠ ముండవచ్చునని మాత్ర మూహింప గలిగితిని. ద్వారపాలకుడు నిపుణికను గుర్తించుచున్నందున లోపలికి వెళ్ళుటకు మా కభ్యంతరము గలుగలేదు. నిపుణిక చిఱునవ్వుతో ద్వారపాలకునికి కిళ్ళీ అందించుచు "నాగూ. ఏమిసమాచారము?"అని ప్రశ్నించెను. వాడు నవ్వుచు, "సమాచార మేముండును? అంతయు నల్లరి" అని యనెను. మే మిరువురము లోపలికి వెళ్ళితిమి. వృక్ష వాటికలో మార్గములు విశాలముగ నుండెను. కాని మార్గ మున కిరువైపుల నుండు దట్టమగు వృక్షచ్ఛాయలచే మార్గ మంధకారావృతమై యుండెను. కొంచెము చుట్టు దిరిగి మే మంతఃపుర ద్వారము చేరితిమి. అచట ద్వారమున కొక వైపు ఒక ద్వారపాలిక కూర్చుండి యుండినది. ఆమె ఒర నుండి దూసిన కరవాలము చేబూని యుండెను. ఆమె నడుము నకు నెడమప్రక్క ఒరయం దొక చిన్న కటారు వ్రేలాడు చుండెను. ఆమె యెక్కువ బలము గలది గాదు గాని, ఆమెను చూడ విషసర్పములచే చుట్టుకొనబడిన చందనలత వోలె నా కగుపించినది. ఒక నిమిషమాత్రము నా గుండె

దడదడ లాడినది. కాని కొంచెము సమీపించగనే నాకు రహస్యము బయటపడినది. ఆ క్రూరవేష మామె సహజకోమలత్వమునకు మరింత వన్నె పెట్టుచుండినది. ఆమె నల్లని మేని చాయ గలదైనను విలక్షణమగు మోహనదీప్తి ఆమె మేని నుండి వెలయు చుండినది. ఆమె సజీవ నీలమణి నిర్మిత మూర్తియా యన్నట్లు కనబడు చుండెను. ఆమె శరీరము పిక్కల వరకు వ్రేలాడు నల్లని కంచుకావృతమై యుండెను. ఆమె శిరస్సున నెఱ్ఱని యుత్తరీయము పాగావలె చుట్టబడి యుండెను. ఇందువలన ఆమె సౌందర్యమునకు లేశమాత్ర మైనను లోపముకలుగలేదు, సరికదా సాయంకాలపు సూర్యుని అరుణ కిరణాచ్ఛాదిత మైన నీల కమల వనమువలె మఱింత రమణీయముగ నుండెను. ఒకవైపు సుధాకరుని ధవళకాంతులు వృక్షవాటిక యొక్క దట్టమైన స్నిగ్ధ నీల వర్ణము నుజ్జ్వల మొనర్చుచుండ, మఱియొక వైపు ద్వారపాలిక కుండలములు ఆమె నునుపు చెక్కిళ్ళను భాసమాన మొనర్చు చుండెను. ఆమె పాదముల యందలి పారాణి దూరమునుండే కనబడు చుండెను. ఆమె మహిషాసురుని వక్షఃస్థలమున విజయ నృత్యము చేసి కరాళ కృపాణధారిణియై అపుడే వచ్చిన మహా దుర్గయా యన్నట్లు నాకొక క్షణ మనిపించినది. ఆమె భయంకర మోహనరూపము నన్ను శంకితుని చేయుటకన్న నెక్కువ యానందింప చేయుచుండెను. అయినను నామనస్సు శంకించుచునే యుండెను. నేను నా మేలిముసుగును పాపట కంటే చాల క్రిందికిలాగి, చకితహరిణము వలె నభినయించుచు నిపుణిక వెనుక దాగుకొంటిని. ఆ ద్వార పాలిక మధ్యము

సేవించి యుండినది. ఆమె రూపలావణ్యాత మాలిన్యములు, ముక్కంటి నయనాగ్నిచే భస్మీభూతుడైన మదనుని, ధూమావృతమైన రతిని జ్ఞాపకము చేయుచుండెను. ఆమె క్రీగన్నుల వ్యాపించిన యెర్రదనము, కొయ్యబారిన భూలతలు మద్యపాన ప్రభావ మామెపై పూర్తిగా ప్రసరించి నట్లు చాటుచుండినవి. ఆమె తడబడుచు నిపుణిక నేదో యడిగి యూరకుండెను. అటు తర్వాత మేము అంతఃపురమున ప్రవేశించితిమి. ఇచటగూడ కొంతదూరము వఱకు గొప్ప వృక్షములు కలవు. ఆ వృక్షములను దాటిన తర్వాత మాలతి, మల్లె, గోరింట, విరజాజి పొదలు గలవు. వెన్నెలలో ఆ ప్రదేశమంతయు చక్కగ కనబడక పోయినను పొగడచె ట్లెవైపుండినది, వావిల చెట్లపొదు లే పక్కనుండునది, చంపకపొదలెక్కడనుండునది స్పష్టమగు చుండెను. పలువిధములగు పుష్పసౌరభములు పుత్తమును చంచలమొనర్చు చుండెను. తూగుటుయ్యెలల ఘంటల ధ్వని స్పష్టముగ వినబడుచుండెను. మదనోత్సవము చరమస్థాయి నందుకొనుచున్నదని నాకు సువ్యక్తమగుచుండెను.

మేము పుష్పవాటికా మార్గమున నుండగనే యిరువురు పరిచారికలు ద్విపదీ ఖండమును పాడుచు మా వైపుకు వచ్చుట మేము గాంచితిమి. వారు చేత నామ్రమంజరిని పట్టుకొని ఉన్మత్తులైనట్లు నృత్యము చేయుచుండిరి. వారు మధుపాన ప్రమత్తలై యున్నందున స్త్రీ సహజమగు మర్యాదను కూడ వీడి యుండిరి. నృత్యముచే వారి కేశములు జారి యుండెను. వారి కొప్పులం దమర్చబడియుండిన మాలతీ

మాల యెచ్చట పడిపోయినదో వారికే, తెలియదు. కాళ్ళ గజ్జెలు వారి నృత్యవేగము ననుసరించ జాలక ద్విగుణీకృతమై మ్రోగుచుండినవి. వారి హృదయముననే గాక వెలుపలకూడ ఆనందోన్మత్తత వ్యాపించి యుండెను.♦ వారిలో ఒకతె నిపుణిక కడకువచ్చెను. ఆమెపేరుగూడ నిపుణికయే అయియుండ వచ్చును! ఏలయన ఆమె నిపుణికను "మిత్త్రియా" యని సంబో ధించినది.

ఇంచుక సమీపమున కేతెంచి యామె నిపుణికను పిలచి "మిత్త్రియా ! ఈ రోజు నీ భాగ్యము పండినట్లే. క్రొత్త కోడలిని ప్రమదోద్యానమునకు గొనివచ్చు పరిచారి కకు తన రత్నహారమును బహుమతిగా నిచ్చెదనని మహా రాజులు ప్రకటించి యున్నారు. వెళ్ళవే సఖి, క్రొత్తకోడలిని ఇంటినుండిబయటికితీసుకొనిరాగలభాగ్యవంతురాలవు నీవుతప్ప మఱెవరున్నారమ్మా! ఆమె పూజ చేయుచున్నది. ఈ యంతః పురమున ఇటువంటి భక్తురాండ్ర నెందఱినో నేను చూచినానమ్మా! మిత్త్రియా! ఈ క్రొత్తపిట్ట నెచటనుండి పట్టి తెచ్చితివే?" అని యామె నావైపు తిరిగినది. నిపుణిక నా చెవిలో మెల్లగ "ఇది క్షీబా" అని యన్నది. నాకు విషయము బోధపడినది. కన్యాకుబ్జ భాషలో 'క్షీబా' అనగా "మద్యము త్రాగిన స్త్రీ" యని అర్థము. నాకు ధైర్యము గొల్పుటకై నిపుణిక ఈ విధముగా అన్నది. ఇంతలో నామె నావద్దకు వచ్చినది. నా గుట్టు బయట పడిపోయినదనే నేను తలచితిని. కాని ఆమె నోటనుండి వెలువడుచున్న దుర్గం

♦ చూ: రత్నావళి–మొదటి అంకము.

ధము వలన అప్రయత్నముగా నా ముఖము మఱియొక వైపునకు తిరిగినది. నిపుణిక ఈ యవకాశమును పురస్కరించుకొని "మిత్రియా, దానిని పలుకరించబోకు. అది క్రొత్తగా పల్లెటూరు నుండి వచ్చినది. ఇక్కడి అలవాట్లు దాని కింకను తెలియవు" అని అన్నది. మిత్రియ పకపక నవ్వి "రెండు నాళ్ళలో నేర్చుకొనెదవులే పిల్లా! ఎందఱిని మోహించెదవో ఎవరి కెఱుక ?" అని అన్నది. మాతో కలసి మాట్లాడుట కెక్కువ అవకాశము లేనందున ఆమె తన చెలికత్తెతో నాట్యమాడుచు ఒకవైపునకు వెడలిపోయినది. నేను శాంతముగా నిట్టూర్పు విడచితిని. నిపుణిక ధైర్యము గొల్పుచు "సఖీ, ఆమె త్రాగియున్నది" అనెను.

మలయ మారుతము మందమందముగా వీచుచుండినది. వృక్ష లతా గుల్మము లన్నియు నూగుచుండినవి. పగడాలతో సమానమైన చిగురుటాకుల యెఱ్ఱదనము వాని శోభను రక్తిమ మొనర్చుచుండెను. వానిపై రొదచేయు తుమ్మెదల చప్పుడు తోట్రుపాటు చెందుచున్న సంభాషణమువలె వినబడుచు మందమారుత తరంగములందు అవి తేలియాడుచున్నవాయన్నట్లగుపడుచుండెను. వసంతఋతువు మధువునుగ్రోలి అవియును మదించి తూలుచున్నట్లు తోచుచుండెను. అంతఃపుర పరిచారికలే కాక పుష్పలతలుకూడ మద్యపానోన్మత్తములై యుండినవి. ♦ నేను నిపుణిక మాటలను వ్యాఖ్యానించుచు "నిఉనియా ! అందఱు మదోన్మత్తులే సుమా !"అని యంటిని. నిపుణిక తర్జనిని పెదవుల కానించి ఊరుకొమ్మని సైగచేసి,

♦ చూ: రత్నావళి – మొదటి అంకము.

ఒక వృద్ధునికి వంగి నమస్కరించెను. అంతఃపురము నెల్లెడల వ్యాపించిన ఉన్మత్త విలాస లీలలకు వ్యతిరేకముగ నీవృద్ధుడు తన జీవితపు టనుభవము నంతయు నొక్కచో చేర్చినట్లు గంభీరాకృతి దాల్చి నిలుచుండెను.

అతని యింద్రియము లన్నియు పట్టు తప్పి యుండెను. అతని శరీరమంతయు శ్వేత కంచుకముతో కప్పబడియుండెను. శిరోజము లన్నియు పాలవలె నెరసిపోయి యుండెను. అతడు కంచుకి. అతనిని చూచియే నిపుణిక నన్నూరుకొమ్మని సైగచేసినది. వృద్ధునికి మాటలాడ నవకాశ మియ్యకయే నిపుణిక "ఆర్యా, ఇది పల్లెప్రాంతమునుండి క్రొత్తగా వచ్చినది. దీనికిచటి మర్యాదలు తెలియవు" అనుచు "సుదక్షిణా, ఆర్యవాభ్రవ్యులవారికి నమస్కరించు. వారు అంతఃపుర రక్షకుల కందఱకు పితృతుల్యులు" అనెను. నే మోకాళ్ళను భూమిపై నాన్చి ప్రణామ మాచరించితిని. వాభ్రవ్యునివలన 'సౌభాగ్యవతీ భవ!' అని ఆశీస్సుపొంది మేము విశాలమగు రాజసౌధము జొచ్చితిమి.

మహారాజు ఏ క్రొత్త వధువును ప్రమదావనమునకు గొనితెచ్చినవారికి రత్నహార మొసగెదని వాగ్దానముచేసెనో ఆమె నుద్ధరించుటకే నేను చోరునివలె నంతఃపురమును ప్రవేశించితిని. నిపుణిక నా చెవిలో "మహావరాహుడు నిశ్చయముగ ఈ రోజు ప్రసన్నుడే! కానిచో మహారాజీ ప్రకటన యేల చేసియుండును?" అనెను. అటు తర్వాత నెన్నో ప్రాకారములను దాటి మేము రాజకుమారి గృహమును చేరితిమి. ఆ సమయమున నామె పూజావేదికపై నాసీనయై

యుండెను. ఆమె పూజ కంతరాయము కలుగకుండ నన్నొక వైపు కూర్చుండ నియమించి, నిపుణిక తానును మెల్లగ కూర్చుండెను. నేను గృహమంతయు ఒకసారి పరికించితిని. ఆయింట నొకవైపు ఒక శయ్య యున్నది. దాని కిరువైపుల రెండు గిండ్లమర్చబడినవి. శయ్యపై పాలవలె తెల్లనగు దుప్పటి పఱచబడి యుండెను. తలవైపున, మధ్య భాగమున, మహావరాహుని భావగర్భితమగు ప్రతిమ పుష్పమాల్యాదులచే నలంకృతమై విరాజిల్లు చుండెను. మహావరాహుని విశాల దంష్ట్ర యిప్పుడే సముద్రమునుండి వేగముగ బయటికి వచ్చినదా యన్న ట్లాకాశమువైపుకు తిరిగి యుండెను. ఆ దంతముపై భయచకితమైన భూదేవి మూర్తి మనోహరముగ నుండెను. మహా వరాహుని కన్నులు విరిసిన తామరల వలె నుండెను. శరీరమంతయు నీలోత్పల పత్రమువలె నల్లనై నునుపుగ నుండెను. నిజముగ నా ప్రతిమ యంతయు నల్లరాతితో చెక్కబడియుండినది. నీలాద్రినిబోలి జీవకళలుట్టిపడు ప్రకాశిత వీర్యుడగు మహావరాహుని ధ్యాన మంత్రమును *పఠించుచు నేను మనస్సునందే యతనిని స్మరించితిని. ఈ మహా వరాహుని విగ్రహమునకుముం దాయంతః పురపు క్రొత్త కోడలు మా 'అశోక వనపు సీత' ధ్యానమగ్నమై యుండెను. ఆమె ప్రక్క నొక వేదికపై మాల్యచందనాదులు మఱియు నితరములైన యుపలేపన ద్రవ్యము లుంచబడినవి. ఒక చిన్నస్ఫటికపు టరుగుపై సుగంధపు మైనపువత్తులపెట్టె,

---

* తతః సముత్క్షిప్య ధరాం స్వదంష్ట్రా। మహావరాహః స్ఫుట పద్మలోచనః। రసాతలాదుత్పల పత్రసన్నిభః। సముత్థితో నీల ఇవాచలో మహాన్॥

అత్తరుబుడ్డియు నుండెను. కొంచెము దూరమున నొక బంగారు పాత్రయందు మాదీఫలవృక్షపు బెరడు, తమలపాకులు నుండినవి. శయ్యకు పాదములవైపు వెండి ఉమ్మిపాత్ర యుండెను. గోడపై వీణ నమర్చి యుంచుటకు ఏనుగుదంతపు గూటము లేర్పఱుపబడి యున్నవి. ప్రస్తుతమా విపంచి గూటములపైగాక పూజా పరాయణయగు నా రాజకుమారి యొడిలో నున్నది. గోడకు మఱియొకవైపు తెల్లని పలక లమర్చబడి యుండెను. అవి బహుశః ఏనుగు దంతములవై యుండవచ్చును. లేదా తెల్లని రాతివేవైయుండవచ్చును. వానిపై చిత్రఫలకము, తూలిక, రంగు డబ్బాలు భూర్జ పత్రముల పుస్తక మొకటి పెట్టబడి యున్నవి. ఆ పుస్తక మీ దేశములో వాడుకలోనున్న పుస్తకములకంటె నించుక విలక్షణముగ నున్నది. వాని యాకులపై పలకలు కట్టబడి యుండెను. మఱియొక గూటమునకు గోరంట దండ సుకు మార మగు రీతిని వ్రేలాడుచుండెను. బహుశః గోరంట మాల యెక్కువ కాలమువఱకు వాడిపోదను కారణముచే దాని నచటికి గొనివచ్చి యుండవచ్చు. * ఇంటిలో సామానులు చాల కొంచెమున్నను ఇల్లు నిండియున్న ట్లగు పడు చుండెను.

ఈ సమయముననే ఆ రాచకన్నియ వీణ మీటసాగెను. క్రమ క్రమముగ ఆమె వీణానాదమున తన్మయత జెందెను. నేనీమాఱు నా సంకోచమును వదలి యీ కమనీయ

---

* చూ: వాత్స్యాయనుని కామసూత్రములలోని నాగరికుని గృహ వర్ణన.

రూపము నొక్కసారి తనివితీర తిలకించితిని. ఆమెను చూచిన తరువాత నెంత పతితుని హృదయమున గూడ భక్తి రేకెత్తక పోదు. ఆమె శరీరమునుండి స్వచ్ఛకాంతులు నలుదెసల వ్యాపించుచుండెను. స్ఫటిక మందిరమున నున్నట్లు, పాల వంటి నీట మునిగి యున్నట్లు విమలమగు చీనాంశుకముచే నావృతమైనట్లు, దర్పణమున ప్రతిబింబించినట్లు, శరత్కాలపు మేఘ సమూహమున ప్రకాశించు చంద్రకళవోలె ఆమె శరీర మంతయు మిక్కిలి తెల్లని కాంతిపుంజముచే గప్పబడి నట్లు తోచుచుండెను. ఆమె శరీరపు ధవళకాంతులు చూచు వాని కన్నులనుండి హృదయమునందు ప్రవేశించి మందాకిని తన ధవళధారల పాప పంకిలమును క్షాళన మొనర్చు చున్నదా యన్నట్లు వాని కల్మషము కడిగి ధౌత మొనర్చు చుండెను. ఇట్టి పవిత్ర రూపరాశి పాప భూయిష్ఠమైన యీ ధరిత్రిపై నెట్లు జన్మించెనా యను ప్రశ్న మాటిమాటికి నా మనస్సున జనించుచుండెను. నిక్కముగ ఈమె ధర్మము నుండే ఉద్భవించినది. శంఖమునుండి త్రవ్వి ముత్యముల రాచి, మృణాళములచే తట్టి, చంద్ర కిరణముల కుంచెతో ప్రక్షాళనము చేసి, యమృత చూర్ణముతో రుద్ది, రజిత రసముతో తుడిచి, గిరి మల్లికా కుంద సింధువార పుష్పముల ధవళ కాంతులచే నలంకరించి, విధాత యీమెను నిర్మించెనా యన్నట్లుండెను. ఆహా! ఎట్టి యపురూపపు పవిత్ర సౌంద ర్యము! మునీశ్వరుల ధ్యాన సంపదయే యీమె రూపమున నిచట సాక్షాత్కరించినదా? లేక రావణుని స్పర్శవలని భయముచే కైలాస పర్వతపు శోభయే స్త్రీ రూపమును

దాల్చి యిచట ప్రత్యక్ష మైనదా? లేక బలరాముని దీప్తియే యతడు ప్రమత్తుడై యుండ నతనినుండీ పాఱిపోయి వచ్చి నదా? లేక మందాకినీ ధారలే యీ పవిత్ర రూపమును గ్రహించినవా? ♦ ఆమె భక్తిచే గద్గదమైన స్వరముతో పాడుచు వీణ మీటుచుండెను. నే నట్టి వీణ నెప్పుడు విని యుండ లేదు. బాల్యము నుండియు అభినయము చూచుచునే జీవితమును వెళ్ళబుచ్చితిని.

అయ్యో! నిజమైన భక్తిస్వరూపమును నేనెన్నడు చూడనే లేదే! శూద్రకుని మృచ్ఛకటికమును ప్రదర్శించు చున్నప్పుడు నేనొకపరి వీణను అసముద్రోత్పన్నమగు రత్న మని అన్నమాట వాస్తవమే కాని దాని నర్థము చేసుకొన్న దీనాడే. నాడు నేను నా చెలికాండ్రతో వినోదము సల్పుచు శూద్రకుని యీ శ్లోకము నెగతాళి చేసితిని. సంకేత స్థలమున వేచియుండి ప్రేమికుని ఓదార్చి, అతని రాగమును వర్ధిల్ల చేయుట తప్ప శూద్రకుడు "ఉత్కంఠితుని వయస్యత' యన్న మఱిదేని ననియుండు నను విషయము నా కర్థము కాలేదు. విరహాతురునే ఉత్కంఠితు డందుము. అతని ఆనుకూల్యము రాగమును వర్ధిల్లచేయుట యందే పూర్తియయినది. నాడు నే నా రహస్యమును తెలిసికొనలేక పోతిని. నేడు నేను నిజ మైన ఉత్కంఠితుడనేమో ప్రత్యక్షముగ చూచుచున్నాను. నిజముగ వీణ అసముద్రోత్పన్నమగు రత్నమే! నేను నేడు

♦ చూ: 'కాదంబరి'లోని మహాశ్వేత వర్ణన.

శూద్రకుని మాటలలోని రహస్యమును తెలిసి కొంటిని. ♦

కొంతసేపటికి వీణాగానము మాగిపోయినది. ప్రమదా వనము వైపు గవాక్షము నుండి అచట జరుగుచున్న యానందోత్సవమును గురించి సూచనగ తెలియవచ్చుచుండి నది. ఆట కత్తెల గుంపొకటి చర్చరీ తాళముల ననుసరించి పాడుచు ఈ వైపునకే వచ్చుచున్న ట్లగుపడుచుండెను. వారి స్వరసమ్మేళనమున నెట్టి లిప్స, ఎట్టి పిపాస యున్నదో చెప్ప నలవి కాదు. వారి క్షుధా పిపాసలయందు ఎన్నడు అణగారి పోజాలని తత్తరపాటుండినది. దూరము నుండే యించుక స్పష్టముగ ఈ పాట వినబడుచుండెను.

"ఇహాపథమం మహు మాసో జణస్సహి అఆ ఇన్ కుణఇ మిదులాఇన్। పచ్ఛా బిద్ధ ఇ కామో లద్ధప్పసరేహి కుసుమ బాణేహి॥"

ఈ రాగరుగ్ణమగు పాట వెను వెంటనే మా 'అశోక వనపు సీత' భక్తికాతర స్వరమున మహావరాహుని స్తుతించెను:-

"జలౌఘమగ్నా సచరాచరా ధరా। విషాణ కోట్యాఖిల విశ్వమూర్తి నా। సముద్ధృతాయేన వరాహ రూపిణా సమే స్వయంభూ ర్భగవాన్ ప్రసీదతు"

ఆమె యశ్రుపూరిత నేత్రములతో నొకసారి మహా వరాహుని చూచి అమిత ధీర పద సంచారమున తన యిష్ట

---

♦ ఉత్కంఠితస్య హృదయా నుగుణో వయస్యా। సంకేతకే చిరయతి ప్రవరో వినోదః। సంస్థాపనా ప్రియతమా విరహాతురాణాం। రక్తస్య రాగ పరివృద్ధి కరః ప్రమోదః॥

—మృచ్ఛకటిక 3-4

దేవతకు ప్రదక్షిణము గావించి శయ్యావైపుకు నడిచినది. శయ్యపై ఆసీనురాలైన తర్వాత కొంత సేపటివరకు ఆమె నేత్రములు భక్తి పారవశ్యముచే నిమీలితములై యుండినవి. అటు తర్వాత ఆమె మా యిరువురి వైపు చూచినది. ఆహా! చూపులలో గూడ పునీతమొనర్చునట్టి స్వభావము కలదా? ఆమె దృష్టి తన పుణ్యరశ్మి ప్రభావమును ప్రసరింపచేసి ద్రష్టవ్యమును పునీత మొనర్చు చున్నదా లేక తీర్థ స్నాన వారి ధారలచే ఆప్లావ మొనర్చు చున్నదా లేక తన తపోబలమున పవిత్రమొనర్చు చున్నదా లేక సత్యాంతర్నిహిత తాపముచే హృదయములోని అశేష పాప భావములను భస్మము చేయు చున్నదా యన్నట్లగపడుచుండెను.

ఆమ్నాయవాణి విగ్రహవతియై యీనాడు నన్ను బ్రాహ్మణత్వమునకు అర్హునిగా చేయుచున్నట్లు నాకు తోచినది. నా ప్రతిజ్ఞ యీనాడు నెరవేరగలదా?

నిపుణిక భక్తిపూర్వకముగ నామెకు ప్రణమిల్లెను. నేను కూడ నామె ననుసరించితిని. రాజకుమారి నిపుణికను విశ్వాస పూరితమగు నేత్రములతో చూచినది. నిపుణికకు ఆమెపార్వతీ దేవి వలె పూజ్యురాలు. ఆమెకు నిపుణిక స్నేహితురాలు; దుఃఖమును పంచుకొను చెలికత్తె. ఆమె యొకసారి తన స్నేహ సించిత నేత్రములతో నన్ను చూచినది. ఈ చూపులందేదో తెలిసికొన వలెనను కోరిక యుండినది. నిపుణిక ఆమె సమీపమునకు వెళ్ళి రహస్యముగ నేదో చెప్పినది. ఆమె నన్ను గురించి యేమియు దాచలేదు. ఏల యన క్షణ కాలములోనే రాజకుమారి నేత్రములందు లజ్జాభావ మంకురించినది. ఆమె

ధవళ కపోలములు లజ్జచే నెర్రబారి యామె యొక్క క్షణము సేపు నల్లబడినది. అపుడు నా యనధికార ప్రవేశమును తలంచుకొని నా చిత్తము క్షోభ జెందినది. నిపుణిక యేమి చెప్పినదో యెఱుగను కాని ఆమె కొంత తేఱుకున్నదని మాత్రము చెప్పవచ్చును. రాచకన్నియ క్రీగంట నన్నొకమారు తిలకించి మహావరాహుని భయభీతయై చూచినది. ఆమె కన్నుల గ్రీరున నీరు తిరిగినది. "ప్రభూ, నేనింక నేమేమి చూడవలెనో కదా"యని దాని భావమని నాకు స్పష్టమైనది. కాని నిపుణిక ఆమె చెవిలో నేదేదో రహస్యముగ చెప్పుచునే యుండినది. ఒక ఘడియకాలము నేను లజ్జాగ్లానిచే బాధపడుచుంటిని. రాజకుమారి ఈ ఘడియకాల మెన్నెన్నో యాలోచనలలో మునిగి తేలుచుండినది. అటుతర్వాత ఆమె మెల్లగ లేచినది. నిపుణిక గృహాము వెలుపల కూర్చుండి యున్న చామరగ్రాహిణిని పిలిచి "ఓసీ, నిపుణిక క్రొత్తకోడలిని ప్రమదావనమునకు వెళ్ళుటకు సమ్మతింప జేసినదని ఆర్య వాభ్రవ్యుల వారికి విన్నవింపుము. ఇదిగో, ఆమె యిప్పుడే వచ్చుచున్నది" అని పలికెను.

చామర గ్రాహిణి ఆశ్చర్యపడినది. ఒక నిమిషకాలమది యీ వార్తను నమ్మలేకపోయినది. కాని నిపుణిక మఱియొకమారు ఈ వార్తను చెప్పగా నది హర్షోల్లాసముతో బయటికి వెళ్ళిపోయినది. ఒక క్షణములో నీ వార్త అంతఃపురమంతయు ప్రాకిపోయిన ట్లగుపడినది. ప్రమదావనములో మాంగల్య శంఖధ్వనులుతప్ప మిగిలిన వాద్యముల ధ్వని యాగిపోయినది. ఆర్య వాభ్రవ్యుడు జయనాదము

చేయుచు, "భావి మహాదేవిగారికి జయము జయము" అనెను. నిపుణిక ఉచ్చైస్స్వరమున "జయము జయము" అని తిరిగి పలికెను. నేను, నిపుణిక, రాజకుమారి, అంతః పురమునుండి ప్రమదావనమునకు వెళ్ళుటకు సిద్ధపడితిమి. రాజకన్య మఱియొకమారు మహావరాహుని భక్తి పూర్వకముగ చూచి అతని చరణ కమలములకు ప్రణమిల్లి, చరణ తలమునం దుండు ఒక వస్త్రఖండముతీసి నిపుణిక కిచ్చెను. నిపుణిక దానిని జాగ్రత్తగా నుంచుమని నా చేతి కిచ్చెను. మహావరాహుని యీ ప్రసాదము నేను బహు జాగ్రత్తతో దాచితిని.

ప్రమదావన ప్రవేశ ద్వారమును మేము చేరగనే అంతఃపుర పరిచారికల గుంపొకటి ఆనందాతిరేకముచే కోలాహలము చేయుచు మా వైపుకు వచ్చుట మేము గాంచితిమి. వారు "భావి మహాదేవిగారికి జయమగుగాక!" అని జయ జయ ధ్వనులు గావించుచు, తమ హర్షమును వెలిబుచ్చుచుండిరి. వారి వేషము అస్తవ్యస్తమై వారి స్వరము తడబడుచుండెను. భావి మహాదేవిగారి గంభీర ముఖ మండలమున నేవిధమైన మార్పు గోచరము గాలేదు. ఆమె నన్నొకపరిచూచి ఆగిపోయి నిపుణికతో జనాంతికముగ నేమో చెప్పినది. కాని ఆమె బిగ్గరగ చెప్పినందున నేను దానిని వినగల్గితిని. నేను వినవలెననే ఆమె కోరిక కూడ. "నిపుణికా, అంతఃపుర నియమములకు లోటు జరుగకూడదు. పరిచారికలయు, కన్యకలయు నడవడిక యీరోజు శృతి మించినది." అని ఆమె నావైపుకు తిరిగి, "భద్రా, నీవు

నాకు అకారణ బంధువవు. అన్యథా తలంచకుము. అంతః పుర ప్రవర్తనకొక మర్యాద గలదు" అని యనెను. నేను ఆమె భావమును గ్రహించితిని. చేతులుమోడ్చి శిరమువంచి నోట చెప్పకయే నాకామె ప్రతి ఆజ్ఞయు శిరోధార్యమని తెలియజేసితిని. నిపుణిక చాల చతురత గలది. ఆమె వెంటనే ఆర్యవాభ్రవ్యునికడ కేగి, అతనిని వెంట నిడుకొని వచ్చినది. నా కిదంతయు అర్థముకాలేదు. ఆర్య వాభ్రవ్యుడు పరిచారికల ముఖ్యురాలిని పిలచి, "భావి మహా దేవిగారు ఈనాడు తన చెలికత్తెలతో ప్రమదావనమున విహరింప గోరుచున్నారు. మీ రెవ్వరుగూడ వారి కార్య మున కంతరాయము కలిగించకూడదని వారి యాజ్ఞ" అని చెప్పెను. సంభ్రమచిత్తలై వా రా మాటలను విని ఒకే స్వరముతో, "భావి మహాదేవిగారికి జయమగుగాక !" యని ఒక్కమాఱు జయధ్వనిచేసి, మఱియొక వైపునకు వెడలి పోయిరి.

'భావి మహాదేవి' ప్రమదావనమున వెలుపలి భాగ మున విహరించుచు, వృక్షవాటిక వైపునకు వెడలినది. ఆవాటికమధ్య నొక తటాకముండెను. తటాక మంతయు, కమల కల్హారములతో పరిపూర్ణమై యుండెను. వెన్నెలకాంతి దానిని మఱింత తెల్లగా నొనర్చి యుండెను. రాజకన్య నిపుణికవైపుచూచి "మఱి కర్తవ్యమేమి ?" అనుచు ఆ తటా కపు ఱాతి మెట్లపై దుఃఖముతో చతికిలబడెను. నిపుణిక, "దేవీ, మహా వరాహుడే మన రక్షకుడు. దక్షభట్టునివంటి సాహసుడు, సజ్జనుడు మన కండగా దొరికినందుకు

భగవతునికి వందనములర్పించుము. సంకోచమువదలి లెమ్ము" అనెను. రాజకన్య నావైపు ప్రశ్న సూచకముగ చూచినది. నేను "భగవతీ, ఈ నిర్భాగ్యుడగు దక్షునికి పుణ్యకార్యము చేయు నదవకాశము లభించినది. సాహసము చిక్కబట్టుము. యముడుకూడ నీ కనిష్టము చేయజాలడు." అని యంటిని. నిపుణిక ఒకసారి నావైపు జూచి రాజకన్య బదులు చెప్పక మునుపే, "భట్టూ, వేషము తీసివేయుము. మహావరాహుని ప్రసాదమగు వస్త్రమును ధరించి ప్రహరీవద్దనుండు వృక్ష శాఖల సహాయమున, ప్రహరీదాటి. వెలుపలి ద్వారమువద్ద మాకొఱకై వేచియుండుము" అని చెప్పెను. నిపుణిక సఖి వేషమును నేనామె కప్పజెప్పి, ఒక శిరీష వృక్షముపైనుండి వెలుపలికి దాటి రాజమార్గమున వేచియుంటిని. నాగుడు అప్పుడు తూగుచుండెను. నేను దూరమున వేచియుంటిని. ఆ సమయమున చంద్రుడు ఆకాశమధ్యమునకు వచ్చి శుక్ల వసన ధారిణియగు ధరిత్రీ లలాట చందన తిలకము వోలె నగుపడుచుండెను. తన్నుద్ధరించిన మహావరాహు నీనాడు ధరిత్రికూడ పూజించుచున్నదా యేమి ?

# నాల్గవ అధ్యాయము

నిపుణిక తన స్వామినిని దాచుటకై యేర్పఱచిన స్థలమును చూచి నేను ధైర్యమును కోల్పోయితిని. అదియొక దేవీ ఆలయము. చేరువ నున్నది ఒక చిన్న జీర్ణగృహము. నిపుణిక యింటినుండి అవసరమగు వస్తువులను తీసుకొని మేము చోరులవలె నగరమునకు వెలుపలనున్న యా యాలయము చేరినపుడు చంద్రుడు ఆకాశమున పశ్చిమ దిక్కున క్రుంకుచుండెను. సప్తర్షి మండలము మానస సరోవరమున మజ్జనము గావించుటకై సిద్ధపడుచుండెను. కాలపురుషుడు అస్తగిరి శిఖరమును తాగుచున్నట్లు కనబడుచుండెను. పాల వెన్నెల అప్పటికిని భూమి నంతయు కప్పుకొని యుండెను. చండికాలయమునకు లావైన యినుప యూచలతో చేసిన యొక గొప్ప కవాటము కలదు. కవాటపు సందులలోనుండి చండీదేవి విగ్రహము స్పష్టముగ కనుపడుచుండెను. దేవి యెదుట నొక యినుప వేదికపై కాటుక నలుపువంటి మహిషము స్థాపింపబడి యుండెను. దాని శరీరముపై భక్తులు ఎఱ్ఱని అరచేతి ముద్రలు వేసియుండిరి. అది సాక్షాత్తు యమధర్మరాజు వాహనమువలెనుండి, యముడు రక్తసిక్తము లగు హస్తములచే దాని వీపు చఱచి దానిని నడపించెనా యన్నట్లగుపడుచుండినది. దేవి చరణములవద్ద ఒకచిన్న వేదికపై నేదో యెఱ్ఱని వస్తువు కనపడుచుండెను. అది వసంతముతో తడిపి యుంచబడిన వస్త్రమని తరువాత పరిశీలించగా తెలిసినది. ఆలయము నెదుట ఒక విశాలమైన ముంగిలి కలదు.

దాని ఱాతి చప్పట శిథిలమైపోయి అచ్చటచ్చట వాని సందులనుండి పచ్చనిగడ్డి మొలచి జీవశక్తి విజయమును ఘోషించుచుండినది. ఈ ముంగిట నానుకొని ఒక చిన్న యిల్లున్నది. అది వెలుపలనుండిచూడ గుహవలె కాన్పించుచుండెను. ఇంటి యెదుట పడిమొలచిన ఎఱ్ఱ గన్నేరు చెట్లుకలవు. రాత్రులందు అడవికోళ్ళు వానినే తమ నివాసముగ నేర్పఱచుకొనుచుండెను. నిపుణిక బహు జాగ్రత్తగా వాకిలిని తెరచి మేము లోనికి వెళ్ళగనే తలుపు బిగించెను. ద్వారముకడ ఒక ముంగిలి కలదు. ముంగిటనే రెండుమూడు చిన్న గదులు, ఒక పాడుబడిన బావియు నుండినవి. ముంగిటి గోడలపై ఎఱ్ఱ రంగుతో వ్రాసిన పలువిధములగు చిత్తరువులు స్పష్టముగ కనబడుచుండెను. ఎప్పుడో యీ యింట నొక భైరవుడు తన భైరవితో కలిసి, వామమార్గ సాధనము చేసి యుండవచ్చునని తోచుచుండెను. ఆ గుర్తులు నా యభిప్రాయమును సమర్థించుచుండెను. సుకుమారమైన రాజ కన్యను దాచుట కిటువంటి భయంకర స్థాన మేర్పఱచుటలో నిపుణిక తెలివైనపని చేసినది కాదు. కాని ఆమెకు గత్యంతరములేదు. ఆమె శ్రేణికి చెందిన దాసి అంతకంటె ఉత్తమమైన చోటు నేర్పఱచుట అసంభవము. ఆమె నన్నొకసారి కాతర నేత్రములతో జూచెను.

'ఇంతకంటె నెక్కువ నా చేతకాని పని' అనియే దాని భావము. ఆమెకూడ సంతోషముగ లేదు. పురుషుడ ననెడి నా గర్వము దెబ్బతిన్నది. ఒకే వేడి నిట్టూర్పు విడిచి నేను నా యసంతృప్తిని వెలిబుచ్చితిని. నా గుండె

కొట్టుకొన సాగినది. సహజ సుకుమారియగు ఆరాచ కన్నియను తిలకించుటకుకూడ నాకు సాహసము లేకపోయినది. ఖిన్నుడనై నేను చతికిల బడుటకు సిద్ధమగుచుండ ఆమె హీనస్వరమున "భద్రా, ఆలస్య మగుచున్నది. కర్తవ్యమాలోచింపుము" అని యనెను. ఈ వాక్యము విద్యుద్వేగమున' నన్నొకమా రూపివేసి కర్తవ్యోన్ముఖుని చేసినది. నా జడత్వ మంతరింపసాగినది. అమృత సంజీవిని నాయందొక క్రొత్త చైతన్యము కలుగజేసిన ట్లనిపించినది. నమ్రుడనై నేను, "దేవీ ఈనాటి కిచటనే విశ్రమించుడు. రేపునే నేదైన మఱియొక స్థానము సిద్ధపఱచెదను. ఇటువంటి చోట మిమ్ములను చూచుట నాకే కష్టముగ నున్నది. కాని విధిలేదు" అని యంటిని. "నాకేమియు కష్టము కలుగదు. మీపని కానిండు" అని ఆమె పలికెను. నిపుణిక ఆమెను ఒక చిన్న గదివైపునకు రమ్మని సంజ్ఞ చేసెను. పాపము ఏడ్చుచున్నందున కాబోలు నిపుణిక నోటినుండిమాట వెలువడలేదు. అచట నొక కంబళము మొదటనే పరుచబడి యుండినది. ఆ చీకటిలో రాజకుమారి నచట విశ్రమించుమని చెప్పితిమి. ఆమె కూర్చున్న తరువాత మే మిరువురము నితర కార్యములందు నిమగ్నుల మైతిమి.

నిపుణిక కొంతసేపు మాటలాడకయే పనులు చేయుచుండినది. కాని ఆమె ప్రతి చేష్టయందు వ్యాకులము, భయము ప్రకటితమగుచుండెను. కారణమేమని నేనామెను అడుగగా ఆమె రిత్తవడి, యించుకసేపు నిలుచుండి తరువాత మెల్ల మెల్లగ తానెట్లు ఆలయపు ముసలి పూజారిని లోబరచు

కొని యీ యింటిని సంపాదించినదో చెప్పదొడగెను. ఆ యాలయమునకు చాల కొద్దిమందే వచ్చుచుండినను ఆ చోటు నిరపాయమైనది కాదని నిపుణికకు రూఢిగ తెలి యును. "దినమంతయు ఈ యిల్లు మూసియుంచుటయే యుచితము. నీవు దినమంతయు వెలుపలనే యుండి పూజారి నిదురించిన తర్వాతనే నన్ను కలిసికొనవలసి యుండును." అని ఆమె నాకు చెప్పినది. కాని తాను ముఖ్యముగ చెప్పవలసి నది నిపుణిక చెప్పలేదు. ఆమె చాల భయపడుచుండినది. ఇచటికి వచ్చుటవలన నేర్పడు పరిస్థితి యామె యనుకున్నంత తేలికయైనది కాదు. స్త్రీ సహజమగు భీరుత్వ మామెను వశ పఱచుకొనినది. నేను ధైర్యము చెప్పుచు "నిఉనియా, బాణ భట్టుని వెంటనుండికూడ నీవు భయపడుచుంటివా!" అని ప్రశ్నించితిని. ఆమె కన్నులు క్రిందికి వాల్చియే తడబడుచు "లేదు" అని లోపలికి వెళ్ళిపోయినది. తెల్లవారుట కింకెంతయో సమయము లేదు. నేను బయటకు వెడలిన తరు వాత నిపుణిక తలుపులు లోపల బిగించెను.

చూచు చుండగనే తామర తేనెలచే తడిసిన కల హంసవలె చంద్రబింబ మాకాశ గంగా తీరమునుండి పశ్చిమ జలధి తీరమునకు దిగజాఱెను. దిఙ్మండల మంతయు శ్వేత హరిణ రోమరాజివలె పాండురమయ్యెను. గజరక్తరంజితమైన సింహపు జూలును బోలెను, లోహిత లాక్షారస సిక్తసూత్ర ములవలెను, పద్మరాగ మణి శలాకపు సమ్మార్జని భాతిని విల సిల్లు సూర్యకిరణములు ఆకాశ వనప్రాంత మందలి నక్షత్ర కుసుమములను చిమ్మివేయుచున్నదా యన్నట్లుండెను. క్రమ

క్రమముగ నక్షత్రము లంతర్హితము లగుచుండెను. అక్కడక్కడ అస్తమించక యున్న నక్షత్రములు పశ్చిమ గగన సముద్రపుటొడ్డున తెరచుకొనబడిన ముత్యపు చిప్పలనుండి వెదజల్లబడిన ముత్యపు సమూహమువలె కాన్పించు చుండి నవి. . తూర్పు తెల్లవారుచుండెను. శిశిర హిమబిందు భారము వహించుచు, కమలవనమును కంపింపజేయుచు, అలసిపోయిన నగర రమణీమణుల స్వేదబిందువులను తుడిచి వేయుచు, వన మహిషముల పేన బిందువుల తడిసి, అల్లనల్లన ఆడుచున్న చిగురుటాకులకు లతాసమూహములకు నృత్యము నేర్పుచు వికసిత కమలముల నుండి పూదేనెను వర్షింపజేసి భ్రమరములకు తృప్తి గలిగించుచు, ప్రభాత సమీరము మంద మందముగ వీవసాగినది. ఇప్పటికి చిన్నరాజుగారి అంతఃపురమున నేమి జరిగియుండునో గదా! వృద్ధ వాభ్రవ్యుడే అందరికంటే నెక్కువగ కష్టపడవలసి యుండును. ఈపాటికి నిపుణిక యిల్లు కాల్చి వేయబడి యుండవచ్చును! కాని యీ యాపత్కాలమున నేను నిపుణిక చెంతనుంటి నని మాత్రము నాకు తృప్తి కలిగినది. ఈ నగరమున నన్ను గుర్తెరిగినవా రెవ్వరును లేరు. నిపుణిక యింటికి అవసరమగు సామానులు తెచ్చుటకై వెళ్ళినపుడే నేను నా తెల్లని దుస్తులను ధరించితిని. ఇపుడు నేనొక నిరీహ బ్రాహ్మణుడనే. రాత్రంతయు శ్రమపడుట వలన నా శరీర మలసిపోయి యుండినను, విశ్రమించవలెనను కోరికనాకు కలుగలేదు. ఇచటనుండి యేదైన మంచిస్థానమున కెట్లు వెళ్ళ గలుగుదుమా యని నేనాలోచించు చుంటిని. ప్రక్కనుండు పాడుపడిన పుష్కరిణి యందు కాలుచేతులు కడిగికొని

నేను చండీదేవి యెదుట కేగి కేలు మోడ్చి స్తోత్రము చేయ సాగితిని. కొంతసేపటికి ఒక వృద్ధ బ్రాహ్మణుడు చండికాలయము వైపుకే వచ్చుచుండుట నేను గమనించితిని. అతడు భక్తిపూర్వకముగ చండీదేవికి నమస్కరించి ఆలయ ప్రదక్షిణము చేసి ముంగిట నిలబడి యుండెను. నేనుకూడ ప్రదక్షిణము గావించి దేవికి ప్రణమిల్లితిని. నా విషయమును గురించి తెలిసికొన నిచ్ఛగించు చున్నట్లు నన్నాతడు చూచుచుండెను. నే నాతనివద్దకేగి నమస్కారము చేసితిని. నన్నాశీర్వదించుచు నతడు తాను నన్నిదివర కెన్నడును చూడలేదనియు నేనెట్లు ఈ ప్రాంతమునకు రాగలిగితినో తెలిసి కొన గోరుచున్నా ననియు పలికెను. నేను "అయ్యా! నేను పరదేశస్థుడను. రాత్రి యిక్కడనే బసచేసితిని" అని కడు నమ్రముగ పల్కితిని. అతడు కొంచెము సేపటివరకు నవ్వుచుండెను. తర్వాత "అయితే పూజారి తాతగారి దర్శనము కలుగలేదన్నమాట!" అని యనెను. నేను వినయముతో "పూజారి తాతగారిని నే నెరుగను" అని యంటిని. అతడు "తెలిసియుండిన ఇచట నిలచి యుండవు!" అనెను.

నేను అతనిని అందులకు కారణమడిగితిని. అతడు నవ్వుచు పూజారిని గురించిన వృత్తాంతము చెప్పసాగెను. ఆ వృద్ధుడు సరసునివలె తోచెడిని. ఏలయన పూజారిని గురించి మధురమైన భాషలో అతడు వర్ణించెను.

పూజారి ద్రావిడ దేశమునకు చెందిన ఒక వృద్ధ సాధువు. కాలిపోయిన స్తంభమని భ్రమించి పూసరవెల్లులు దానిపై కెగబ్రాకి యున్నట్లు అతని నల్లని శరీరమున నరము

లన్నియు పైకుబికి యుండెను. దరిద్రదేవత అతని శరీరము నుండి శుభలక్షణములను కోసి కోసి తీసి పారవైచినదా యన్నట్లు ఆతని శరీరము గాయపు మచ్చలతో నిండియుండెను. అతడు చాల షోకిల్లా పురుషుడు. వృద్ధుడైనను, చెవులయందు మంత్ర పుష్పమును ధరించుట మఱువడు. అతడు భక్తుడు. చండికాలయపు ద్వారముపై తలను మాఱు మాఱు కొట్టు కొనుట వలన అతని లలాటము మిట్ట పల్లములుగ నుండినది. అతడుమంత్రవేత్త. తీర్థయాత్రకై వచ్చిన వృద్ధస్త్రీలపై తఱచుగ అతడు వశీకరణ చూర్ణము చల్లుచుండును. ప్రయోగకుశలు డగుటచే అత డొకసారి గుప్తస్థానము నందున్న నిధినిచూపు నట్టి కాటుకను కండ్లకు పెట్టుకొని కండ్లను పోగొట్టుకొనెను. అతడు మంచి చికిత్సకుడు. ఎత్తైన ముందటిపండ్ల నితరపండ్లకు సమానముగ చేయుటకై ప్రయత్నించి ఆ పండ్లను పోగొట్టు కొన్నాడే కాని యెత్తయినపండ్లు మునుపటివలెనేయుండిపోయి నవి. అతడు వినోద స్వభావము గలవాడు. యిటుకరాయి తీసి కొని పిల్లలవెంటబడినపు డొకసారి బోర్లపడి అతని పెదవులు తెగిపోయినవి. అతని పాండిత్య మపారము. సమస్తదక్షిణాపథము నందలి ధనము పొందుదు నను నాశచే ఫాలమున తిలకమును దిద్దుకొనుచుండును. పచ్చని ఆముదపాకు రసములో శ్మశానపు బొగ్గులను నూఱి దాని నొక ముత్తెపు చిప్పకు పూసియుంచి నాడు. దానిని చూచిన ధనికులు అతనికి వశులై తమ ధన మును వదలి పోవుదురని అతని నమ్మకము. వశీకరణముపై కూడ అతనికి నమ్మకము కలదు. అందువలన తమాల పత్ర పుస్తకముపై నతడు లక్ష పర్యాయములు "హుం ఫట్"అని

వ్రాసియుంచి దాని కతడు తఱచుగా గుగ్గిలము ధూపము వేయుచుండును. ఆ పుస్తకమును చూచిన స్త్రీలు తనకు లోబడి తన దాసీలవలె నుందురని అతనినమ్మకము. అతనికి కన్నొకటేయైనను ఆ కంటికి అతడు ప్రతిదినము నునుపైన శలాకతో కాటుక పెట్టుచుండును. రేజీకటివలన రాత్రులందు అతడు చూడలేడు కాని యెవరో అప్సరసలు తన కొఱకై వచ్చెదరను ఆశచే అతడు రాత్రి యంతయు దీపములు వెలిగించియుంచును. నిదురించుటయం దతడు కుంభకర్ణుని తల దన్నినవాడైనను స్వప్నములో నిరంతరము నూపురక్వాణనము వినుచుండును. కోతులతో పోటీ పెట్టుకొని చెట్టునుండి క్రిందికి దుమికి ఒక కాలు విరుగ కొట్టుకొన్నను తన చెప్పులజోడును జాగ్రత్తగ నుంచుకొను చుండును. బ్రాహ్మణులన్న అతనికి బద్ధవైరము. అందువలన మీరిచట నుండి వెడలిపోకున్న అతడు తప్పక యేదో గొడవచేయక మానడు. దయామయు డైన భగవంతుడు అతనిని ఒక కంటివానిగను, కుంటివానిగను, చెవిటి వానిగను చేసినాడు. లేకున్న ఈ స్థానేశ్వర మిప్పటికి నాశనమై యుండవలసినదే" అని యా వృద్ధ బ్రాహ్మణుడు తెలిపెను.

వృద్ధ బ్రాహ్మణుని ఆ వర్ణనము విని నిపుణిక పూజారిని తన వశము చేసి కొనిన విధము, ఆమె భయపడుటకు కారణము నేనూహింప గల్గితిని. కాని పూజారిని చూడవలె నను కుతూహలము నాకు మెండుగ నుండెను. నేనువవ్వుచు "అట్టి లోకోత్తర మహాపురుషుని దర్శించక వెళ్ళిపోవుట పాడిగాదే!" యని యంటిని.

వృద్ధుడు నవ్వుచు "తప్పక అతనిని దర్శించుకొనుడు. కాని మీరు కడు జాగరూకులై యుండవలెను సుమా! ఎప్పుడు తలపై కఱ్ఱతో కొట్టునో చెప్పలేము!" అని చెప్పి అతడు వెడలిపోయెను. నేను ముంగిట నుండి కొంచెము దూరమున నా ముసలి పూజారి ♦ రాకకై వేచి యుంటిని.

కొంతసేపటికి పూజారి బయటకు వెడలెను. చండికాలయపు గర్భ గృహముననే అతడు నిదురించి యుండెను. అతని కన్నులెర్రగ నుండినవి. వృద్ధబ్రాహ్మణుడు వర్ణించిన రూపము తు. చ. తప్పకుండగ నాకు గోచరించినది. చండికాలయము నుండి వెడలి అతడేవో కొన్ని మంత్రములు పఠించి చేతులో నున్న డబ్బాలోనుండి కొంత నల్లని చూర్ణమును తీసి ఆ ప్రాంగణమునం దున్న యింటిపై చల్లెను. ఆ యింట ద్వారముకడ అతడు కొంత చూర్ణమును నిక్షేపము చేసి, చంకనున్న తమాల పత్రముల పుస్తకము ముందునుంచుకొనెను. తరువాత అతడు ఆ యింటి తలుపును 'దబదబ' తట్టెను. నిపుణిక జాగ్రత్తగ బయటకి వచ్చి తన లీలాకటాక్ష వీక్షణముల నొకసారి యా వృద్ధుని చూచెను. పూజారి బోసినోట విరిగిపోయి యున్న మిట్ట పండ్లు బయట పడినవి. అతని వాడి పోయిన కపోలములు అనురాగ హారీతిచే ఒక్కమారు నిగనిగ లాడినవి. ఎన్నాళ్ళకో అతని తంత్రము ఫలించినది. ఆ తమాల పత్రముల పుస్తకమును మాత్రమతడు తన చేత నుంచుకొనియే యుండెను. నిపుణిక ఆ పుస్తకమును ఒక పర్యాయమైనను చూడలేదు. కాని ఆ పూజారి తన

---

♦ 'కాదంబరి' లోని జరద్ద్రావిడ ధార్మికునితో సరిపోల్చవచ్చును.

విజయమునకు కారణ మాపుస్తకమే యని భావించుచుండెను. పొత్తమెదుట లేకున్న వశీకరణ ప్రభావము తొలగిపొవునేమో యని ఆ పూజారికి భయము! నేను దూరమునుండే ఘా విచిత్ర మంతయు చూచుచుంటిని. నిపుణిక యేమి చెప్పినదీ నాకు తెలియదు కాని యొక్కసారి మాత్ర మామె నావైపు వ్రేలు చూపెను. పూజారి నన్ను చూడగనే ఉగ్రుడై పోయెను. నిపుణిక తలుపులు బిగించగనే పూజారి నావైపుకు పరుగెత్తి వచ్చుచుండెను. ఒకవేళ నిపుణిక నన్ను చూపి, ఆ చోటు నిర్మానుష్యమై యుండలేదనియు అట్టి తటి తనను కలసి కొనుటకై పూజారి రాక సరికాదనియు పూజారికి చెప్పి యుండవచ్చును. పూజారినాతో నేమనుచుండెనో నాకర్థము కాలేదు. ఏల యన అతని బోసినోట నుండి మాట స్ఫుట ముగ వెలువడలేదు. కాని అతడు పలుకుచున్న మాటలు సజ్జనులు వినదగినవి మాత్రము కావనుట నిస్సందేహము. అతడు మూర్తీభవించిన కోపమై కన్పట్టుచుండెను. అతని కాలొకటి కుంటిగా నున్నను పరుగెత్తుట కతడు కాయశక్తుల ప్రయత్నించెను. తొందరపాటు వలన అతని చేతనున్న కాటుక చూర్ణపు సంపుటము క్రిందబడి చూర్ణమంతయుపాడై పోయెను. నేనచట కూర్చున్న పాపమునకు ప్రాయశ్చిత్తము చేసికొనవలసి యుండునేమో! అని నేననుకొనుచుండ అత డొక పెద్దరాతిని నా పైకి విసరెను. కాని అచ్చట శిలాఖండ ములు కూడ అతనిని పరిహసింప నెంచినవా అన్నట్లారాయి అతని యుత్తరీయముననే తగుల్కొని అతని వీపుపైననే బడి నది. పూజారి కోపము పొంగిపోయినది. అతనిని శాంతింప

జేయుటకు ఉపాయమాలోచించుటకుకూడ నాకువీలుకాలేదు. కాని ఆ రాయి సరియైన సమయమున నాకు సహాయపడినది. అది, యుత్తరీయమున తగుల్కొన్నందున అతని వక్షస్థలమనావృతమై శుష్కించిపోయిన ఔంద్ర పుష్పములహారము, నల్లని దారమున కట్టి మెడను వ్రేలాడుచున్న ఉచ్చాటనోపకరణమగు ముత్తెపుచిప్పయు నాకుకాన్పించినవి. నాకు నాకర్తవ్యము బోధపడినది. వినయముతో నేనతనికి ప్రణమిల్లి కేలుమోడ్చి "మహాత్మా! ధన్యుడవు! నీ ఉచ్చాటనాశక్తి అమోఘము. దాని మహిమ అద్భుతము! నన్నీనగరమునందున్న ప్రసిద్ధ శ్రేష్ఠి యగు ధనదత్తుడు తమవద్దకు పంపినాడు. తమ అద్భుతశక్తి ప్రభావమును తిలకించి అతని మోహము పటాపంచలైనది. ధన వైభవములు తామరాకుపై నీటి బిందువుల వంటి వని నిర్వికారుడై యతడు వానిని త్యజించినాడు. అతనికి వైరాగ్యము కలిగినది. అతడు తన సమస్త సంపదలను మీ చరణారవిందములపై సర్పిపం నిచ్ఛగించుచున్నాడు. అతనిని మీరు శిష్యునిగా చేసికొన్నచో మీ సన్నిధి నిప్పుడే వ్రాలగలడు. తమ యంగీకార సూచకమగు వార్తను వినునంతవఱకు అతడన్నపానీయములను గ్రహింపడు"అని యంటిని. ఆ ధార్మికుడా మాటల నాలకించి తన వైభవ కారణమగు ముత్తెపు చిప్ప నొకసారి గర్వముచే చూచి, శాంతస్వరమున "ధనదత్తునికి శుభమగుగాక! అతడు పరమ ధార్మికుడు. తన సంపదను నా కప్పగించి పొమ్మని అతనికి చెప్పుము. శిష్యత్వమే చేయవలెనన్న బౌద్ధుడగు ఆ సుగతభద్రుని చెంతకు

పోమ్మని చెప్పుము. నే నెవరిని శిష్యునిగా స్వీకరించను" అని పలుకుచు తన ముత్తెపుచిప్ప నొకసారి తిలకించెను. "చిక్కితివిలే! ఇరిక నన్ను తప్పించుకొని యెచటికి పోగలవు" అని దాని భావముకాబోలు. అంత నాకొక క్రొత్త ఆలోచన తట్టినది. నేను చేతులు జోడించి "మహాత్మా! అతడు తన సంపద నింకెవ్వరికి నిచ్చుట కిచ్ఛగింపలేదు. తమ చరణ సన్నిధినే సర్వస్వము నర్పింప సంకల్పించినాడు. తమ రనుమతించిన యతడు బౌద్ధాచార్యుని శిష్యుడు కాగలడు. ఈసందేశమునే యతని కందజేయుట కనుజ్ఞ నొసంగెదరా?" అని అడిగితిని. అందులకు పూజారి—"సరే వెళ్ళు, ఇపుడే వెళ్ళు. నేను రేపటిదిన మేమియు తీసికొనను. నేనీదినమే కన్యాకుబ్జము వైపుకు వెళ్ళిపోవుచున్నాను. ఛూ, ఛూ! ఈ స్థానేశ్వరపు ప్రజలు అసభ్యులు, భాగ్యహీనులు, కుత్సితులు! పరిహాసము చేయవలయునన్న నిచటికి వచ్చెదరు!" అని ఉమ్మివేసెను. తిరిగి అతడు, "పూర్ణిమనాడు వారి వేళాకోళము నేను సహింపజాలను" అని యనెను. అసలువిషయ మేదో నాకు తర్వాత తెలిసినది. ఫాల్గుణశుద్ధ పౌర్ణమీదినమున నెన్నియో సార్లు నగరవాసు లాపూజారి తాతకు వృద్ధ వేశ్యలతో వివాహము చేసి యుండిరి. ఆ నగరవాసు లట్టి పరిహాసముచేయుట యందు దారితేరినవారు. పూజారి తాతకుకూడ వారి పరిహాస మర్థము కాకపోలేదు. అత డీనాడే స్థానేశ్వరము వదలివెళ్ళ నుద్దేశించి యుండెను. వెళ్లునపుడు నిపుణికనుకూడ వెంట నిడుకొని పోవలయునని అతని యుద్దేశ్యమై యుండవచ్చును. నేనీ యుత్తమావకాశమును పురస్కరించుకొని, "అట్లైన పరమ

ధార్మికుడగు ధనదత్త శ్రేష్ఠి భవనమువైపు తమరు వెళ్ళ కూడదా? నగరము చివర యెత్తైన భవనమే అతని నివాస స్థానము" అని యంటిని. పూజారితాత నేడు విజయోల్లాస ముతో నుబ్బిపోవు చుండినందున "నే నెవరి ఇంటికిని వెళ్ళను. ధనదత్తుని కవసరముండిన వందసార్లు అతడే యిచటికి వచ్చును. నీ విచటినుండి వెళ్ళిపొమ్ము. బౌద్ధసుగతభద్రుని వద్దకు వెళ్ళుము. వా డింటింటను బిచ్చ మెత్తుకొనుచు తిరుగుచుండును. నేను చండికాలయమును వదలి యెచ్చటికిని వెళ్ళను" అని యనెను. నేను "మహాత్మా! పరమధార్మికులన మీవంటివారే! తపస్సు అనగా నిదేకదా! స్వామీ! ఇట్టి దీక్షనే భక్తి యందురు. ఆ సుగతభద్రు డెచట నివసించు చున్నాడో సెలవిచ్చెదరా?" యని ప్రశ్నించితిని. పూజారి కొద్ది దూరముననున్న బౌద్ధవిహారమును వ్రేలితో చూపుచు, నిర్లక్ష్యముగ "అదిగో అక్కడ" అని నావైపు చూడకయే చండికాలయములోనికి వెళ్ళిపోయెను. నేనొక క్షణముసేపు ఆ బౌద్ధభిక్షువు సంగతికూడ తెలిసికొని వత్తునాయని యాలో చించుచు నిలబడియుంటిని. ధనదత్తునివద్దకు పూజారితాత యాజ్ఞనుగొని పోవలసినపని, చేయవలసి యున్నదని నేను మఱచిపోయి యుంటిని. పూజారి నన్నొకసారిచూచి గబగబ నాదగ్గరకువచ్చి "ఇటనుండి వెళ్ళిపో! పాపమా ధనదత్తుని చంపదలచితివా యేమి? నీవు పాపభృత్యుడవు! అతడచట అన్నపానీయములు వదలియుండ నీ విచట నిలుచుండి యేమి చేయుచున్నావు? త్వరగా వెళ్ళు!" మని యాజ్ఞాపించెను. నిజముగా నేను కుభృత్యుడనే సుమా!

నేను చేతులు జోడించి "స్వామీ! ధనదత్తుని భవనమునకు తమరిరాక అవసరము. అచటనుండి యతడు మీతో గంగానదీ తీరమునకు వచ్చి గోధూళి శుభలగ్నమున గంగానదీ జలముతో సంకల్ప పూర్వకముగ తన సంపద నంతయు తమ శ్రీచరణములయం దర్పింపగలడు. మీ రందులకు అనుమతించువఱకు నేనిచటనుండి కదలజాలను"అని యంటిని. పూజారి కొంత సుముఖుడయ్యెను. "నీవు చాల మొండివాడవయ్యా! భక్తునికి చేతకాని దేమున్నది? సరే, నేను వెళ్లెదను పొమ్ము. కాని నిన్ను నావెంట నిడుకొని పోజాలను. నీ విచటనుండి వెళ్ళిపొమ్ము" అని యనెను. పాపమా ధార్మికునికి నే నేమైన భాగ మపేక్షింతునేమో యని సందేహము కాబోలు. నేను వినయముగ "స్వామీ, అదెట్లు సంభవము? తాము ధనదత్త శ్రేష్ఠిగారి భవనమును చూచినారా?" అని యడిగితిని. నేను నా కల్పనా లోకమున ధనదత్తుని సృష్టించుకొని నగరము వెలుపల నొక భవనముకూడ అతనిదిగా భావించుకొని యుంటిని. కాని యాశ్చర్యమేమన ఈ పరమ ధార్మిక శిరోమణికూడ నా కల్పనా భవనమును చూచియుండెను! నామాటలను విని పూజారి – "ఆఁ! బాగుగ చూచినాను. ఆ గొప్ప అశ్వత్థ వృక్షమునెదుటనున్న యిల్లే కదా?" అని యడిగెను. నేను – "తమరు ధన్యులుస్వామీ! ధన్యులు! ఆ యశ్వత్థవృక్షము నెదుటనున్నదే శ్రేష్ఠిగారి భవనము. తాము భవనములోనికి దయచేయుటకు సమ్మతించనియెడల యశ్వత్థము క్రిందనే వేచియుండుడు. ఇదిగో నే నిపుడే వెళ్ళి శ్రేష్ఠిగారి కీ శుభవర్తమాన మందజేసెదను"

అని యంటిని. పూజారి నిర్లక్ష్యముగ - "వెళ్ళు. నేను అశ్వత్థముక్రింద కాచుకొని యుందును" అనెను. నేను శిరస్సు వంచి ప్రణామము చేసి యొక వైపుకు వెడలిపోయితిని. కొంత సేపటికి పూజారి వసంతపు రంగుతో తడిపిన వస్త్రమును నుత్తరీయమును ధరించి కాటుక చూర్ణమును చంక నిడుకొని బయలు దేరెను. నాలో నేను "నగరపు సరిహద్దు చేరుటకీ కుంటి పూజారికి కనీసము రెండు ఘడియలు పట్టవచ్చు. రెండు ఘడియల కాలము వేచియుండుటకు, అజ్ఞాత భవనమున ప్రవేశించకుండిన తిరిగి వచ్చుటకు రెండు ఘడియల కాలము, మొత్తము ఆరు ఘడియల కాలము నేను నిశ్చింతగ నుండవచ్చును. ఈ లోపుగ నేను సాధ్యమైనంతవఱకు తగిన యేర్పాట్లు చేయవలయు" ననుకొంటిని. నేను ముంగిటనున్న యింటివద్దకు వెళ్ళి మెల్లగ నిపుణికను పిలచితిని. ఆమె నాకై యెదురుచూచు చుండినది. నన్ను చూడగానే ఆమె నవ్వుచు, 'భట్టూ! నీ పన్నాగము ఫలించినది. పూజారి యిచటికి వచ్చి కావలసినంత బత్తె మిచ్చి వెళ్ళినాడు. గోధూళి సమయము వఱకు అతడు అశ్వత్థ వృక్షముక్రింద నిరీక్షించును. నీవు కల్పించుకొన్నట్టి భవనమువంటిది యిచటికి రెండుయోజనముల దూరమున నున్నది. రేజీకటి కలవాడైనందున పూజారి యీ రాత్రికి కూడ నిచటికి తిరిగి రాలేడు. ఈ లోపున నేదైన మంచి యేర్పాటు చేయగలిగినచో చేయుము. భట్టిని చాల విచారముతో నున్నది." అని యనెను. నిపుణిక ఆ రాజకుమారిని "భట్టిని" అని పిలచుచుండెడిది. అంతఃపుర పరిచారిక లందరును రాణీగారి

నీవిధముగానే సంబోధించుట యలవాటు. నేనుకూడ నామెను 'భట్టిని' యనియే పిలచుట యుచితమని భావించితిని.

భట్టిని విచారసాగరమున మునిగి యున్నదని తెలిసి నాకు చాల దుఃఖము కల్గెను. నేను ధైర్యము గొల్పుచు నుచ్చైఃస్వరమున "భట్టిని విచారపడవలసిన యవసరములేదు. నేనిపుడే ఏదైన నుపాయ మాలోచించుటకు వెళ్ళుచున్నాను. ఈ పరిసరముల నేమియున్నదియు నాకు తెలియదు. పూజారి మాటల వలన సమీపమున బౌద్ధవిహారమున్నదనియు, అచట సుగత భద్రుడను బౌద్ధభిక్షువు కలడనియు తెలిసినది. నేనొక సారి యచటికివెళ్ళి యేదైన యేర్పాటు చేయుటకు వీలుండు నేమో తెలిసికొందును. భిక్షువుల కెన్నియో విషయములు తెలిసి యుండును." యని యుగ్గడించితిని.

నా మాటలు భట్టిని విన్నది. నా యుద్దేశ్యముకూడ ఆమె తెలిసికొన వలయుననియే నన్ను పిలిచి— "భట్టూ! యేమంటివి? తక్షశిలా ప్రాంతములకు ధర్మప్రచారార్థమై వెళ్ళిన సుగతభద్రుడేనా యితడు? నలందలోనున్న ఆచార్య శీలభద్రుని సహాధ్యాయినేనా నీవు పేర్కొనుచున్నది?" అని యడిగెను.

"దేవీ! నాకాసంగతి తెలియదు. సమీపమున నుండు బౌద్ధవిహారమున సుగత భద్రుడను భిక్షువు కలడని మాత్రమే నేను వింటిని."

"భద్రా, వెళ్ళి సంగతి కనుగొని రమ్ము. అతడు ఆచార్య శీలభద్రుని సహపాఠియైన సుగతభద్రుడే యైనచో

నా భాగ్యము పండినట్లే. వారు నాకు పితృసమానులు. నేనత నికి సందేశము పంపెదను."

"నే నిపుడే వెళ్ళి కనుగొనెదను. కాని యతడు మీ రనుకొన్న సుగతభద్రుడే యైనచో నన్నేమి చెప్పమందురు?" అని యంటిని.

భట్టిని, "భద్రా! దేవీపుత్రులు, తువరమిళిందుల పుత్రిక, తమకు ప్రణమిల్లుచున్నదియు, తమ దర్శనభాగ్యము నభిలషించు చున్నదినియు, వారికి నా పరముగ జెప్పుము." అని యనెను.

నాగుండె జల్లుమనెను. "దేవీ! విషమసమర విజయుడు, వాహ్లీక విమర్దనుడు, ప్రత్యంత బాడవ దేవ పుత్రులైన తువర మిళింద మహారాజుగారి పుత్రికారత్నములా మీరు?" అని యడిగితిని.

రాజకుమారి కన్నులు వాలిపోయినవి. పుండరీక దళ ముల బోలు కన్నులలో గ్రుఱన నీరు తిరిగినది. డగ్గుత్తికతో ఆమె "అవును భద్రా" అని పలికెను.

నే నొకింతసేపు ఆశ్చర్యసాగరమున మునిగి తేలు చుంటిని. విధాతృ సృష్టి విధానము ధర్మబద్ధమైనదే. గంగా నదీ ధార హిమవత్పర్వతమున తప్ప మరెచ్చట నుండి పుట్ట గలదు? కౌస్తుభమణి మహోదధిని తక్క మరెచ్చట నుత్పన్న మగును? ధరిత్రిగాక మరెవ్వరు సీతాదేవిని గర్భమున ధరించ గలరు? మహిమా సమన్విత యగు ఈ రాజకుమారి సేవ చేయు నవకాశము లభించుట నాభాగ్యమే! ఏ పాపభూయిష్ఠ మైన కుత్రవలన నీ కుసుమ కళిక యపహరించబడినదో తెలి

యదు కదా! ఏ దుర్వ్యామోహ భోగలాలసత ఈ పవిత్రశరీరమును కలుషిత మొనరింప సంకల్పించునో కదా! ఏ దుర్నివారపాప కల్పన ఈ జ్యోత్స్నను మలినము గావింప నెంచునో కదా! నా హృదయమామె యెడ భక్తిభరితమైనది. సంభ్రమ చిత్తుడనై నేను చేతులు జోడించి, "రాజనందినీ! తమ యాజ్ఞ శిరోధార్యము. కాని ఈ నాడీ సందేశము గొనిపోవుట వివేకమైన పని గాదేమోయని నా యభిప్రాయము. మనమెట్టి పరిస్థితిలో నున్నది తమరొకసారి ఆలోచింపుడు." అని యంటిని.

భట్టిని దుఃఖపడుచు— "భద్రా, నాకావిషయము తెలియదు. ఉచితమేదో దానిని చేయుము. అతడు నేనను కొన్న సుగతభద్రుడేయైన అతనికేమి జెప్పినను నష్టములేదు" అని యామె విలపించసాగెను.

నిపుణిక గద్గద స్వరముతో "అమ్మా, భట్టినీ! యేడువకుము," అని ఆమెను అక్కున జేర్చుకొనెను. నేను దిక్కుతోచక నిలుచుంటిని. కొంతసేపటికి నిపుణిక గద్గదస్వరముతో "భట్టూ, నీవిక వెళ్ళుము" అని యనెను.

నేను వెంటనే వెలుపలికి వచ్చితిని. వచ్చునపుడు భట్టిని వెక్కి-వెక్కి యేడ్చుచుండుట గమనించియే వచ్చితిని. నా హృదయము కాష్ఠమువలె సంజ్ఞాశూన్యమై యుండెనని కాబోలు. లేనిచో నేనామె దుఃఖము నెట్లు సహించి యుండగలను? నిపుణిక తలుపులు బిగించిన తర్వాత నేను బౌద్ధ విహారము వైపునకు నాకు తెలియకయే వెడలితిని. నా కాళ్ళలో శక్తియే లేదు. దేవపుత్రులు తువర మిళిందుని పుత్రికకు తగిన నివాసము వెదుకగలనా? సుగతభద్రుడు

"తమరు శాస్త్రార్థమునకై వచ్చితిరా ?"

"నేను ఆచార్యపాదులతో అవసరమైన కొన్ని విషయములను విన్నవించుటకై వచ్చియున్నాను."

"తమ రిచటనే యుండుడు. నేను వెళ్ళి అడిగి వచ్చెదను."

కొంతసేపటి కతడు తిరిగివచ్చెను. ఈమాఱు అతని స్వరమునందు నాయెడ ఆదరభావ మగుపడినది. అతడు వచ్చిన వెంటనే "అయ్యా, తమరు మగధయం దుండిన మహా పండితులు, కీర్తిశేషులైన జయంతిభట్టుగారి కనిష్ఠ పౌత్రులా ? ఆచార్యపాదులు మీ పేరు వినగనే నన్నీ విషయము నడిగి రమ్మని పంపినారు" అనెను. నేను చకితుడనైతిని. 'అయితే, ఆచార్యులు నన్నెఱిగియున్నారా ? నా పాపభూయిష్ఠమైన జీవితమును గుఱించి వారికి తెలియునా యేమి ?' అని నే నాలోచింపసాగితిని. నా తల తిరిగిపోయినది. కష్టముమీద నేను "అవును. నే నా మహా పండితుడగు జయంతిభట్టుగారి దౌర్భాగ్యపు పౌత్రుడనే" అని యంటిని. నా యుత్తర మపేక్షింపకయే అత డాచార్యుల వారివద్దకు వెళ్ళివచ్చి "అయ్యా, ఆచార్యపాదు లిప్పుడే తమకు దర్శన మొసగుటకు సంతసముతో నంగీకరించినారు. తమరు భాగ్యశాలులు. దయచేయుడు" అని యనెను. ఉరికంబము నెక్కుటకు పోవువానివలె నే నాతనిని వెంబడించితిని.

రెండవ అంతస్తునుండి క్రిందికి దిగి మేము ఒక చిన్న వసారాలోనుండి వెళ్ళి ఒక రాతి చప్పట వేయబడిన ప్రాంగణము చేరితిమి. ఈ ప్రాంగణపు మధ్యభాగమున అశ్వత్థ

వృక్షమొకటి కలదు. అది నవకిసలయములతో నిండియుండెను. ఆ వృక్షచ్ఛాయలయం దాచార్యులవా రాసీనులై యుండిరి. వారి యెదుట నొకరిద్దరు శిష్యులుమాత్ర ముండిరి. నే నచట చేరినపుడు ఆచార్యులవా రొక శిష్యున కేదో తెలియజెప్పు చుండిరి. అందువలన వారు నారాక గమనించలేదు. ఇది కూడ ఒకందుకు మేలే యైనది. ఏలయన నే నింతలో స్వస్థ చిత్తుడ నైతిని. ఆచార్యపాదులు కడు వృద్ధులు. వారు శిరోముండనము గావించుకొనియుండిరి గాని వారి చెవుల యందలి పలితకేశములు ఆచార్యులపై పరివ్యాప్తమైయుండిన వార్ధక్య ప్రభావమును చాటుచుండెను. వారి కన్నులు కరుణార్ద్రములై మిలమిల లాడుచుండెను. వారి కంఠస్వరము దృఢమై మధురముగా నుండెను. వారి వాగ్ధోరణి తర్కయుక్తమై విశ్వాసమును గొల్పుచుండెను. నిర్నిమేష నేత్రములతో నేను వారిని కొంతసేపు చూచుచునే యుంటిని. ఆహా! తపస్సెంత శక్తిగలది! తపస్సేకదా వారి శరీరమును తప్తకాంచన వర్ణము గలదిగా నొనర్చినది! ఆ మేనికాంతినుండి విలక్షణమగు కాంతిధారలు వెలువడు చుండినవి. కొన్ని క్షణములకు పిదప ఆచార్యులవారి దృష్టి నాపై బడినది. శివుని జటాజూటమునుండి సహస్రధారల ప్రవహించు నిర్మల మందాకినీ ప్రవాహము తాపతప్తమైన ధరిత్రిని శీతల మొనర్చుచున్నదా యన్నట్లు వారి కన్నుల నుండి యపార కరుణా స్రోతస్విని ప్రవహించినది. కంఠమును నా వైపునకు త్రిప్పుటకు వారి కొకింత శ్రమ కలిగినది. పిదప వారు, "వత్సా! రమ్ము. నీవు జయంతుని కనిష్ఠ

సోదరు

పౌత్రుడవుకదా? ఏదీ చూడనిమ్ము! ఆహా! మూడుమూర్తులా జయంతునే పోలియున్నావే! నాయనా! జయంతుడు నా సహపాఠి. మా కిరువురికి గొప్ప స్నేహము. అతడు నన్ను తన సోదరునిగా భావించెడివాడు. నేను చివఱకు తక్షశిలనుండి వచ్చిన తరువాత మే మిరువురము ఒండొరులము చూచుకొనలేదు. నలువది సంవత్సరముల తర్వాత నలందకు వెళ్ళినప్పుడు నే నతనిని గుఱించి వాకబు చేసితిని. అతడు పరలోకగతు డైన వార్త నా కప్పుడే తెలిసినది. ఆ సమయముననే నీవు యిల్లూ వాకిలీ వదలి దేశద్రిమ్మరివై తిరుగుచున్నావనికూడ తెలిసినది. నీవీరోజున నన్ను కలిసికొనుట మంచిదే యయినది. ఇంకనూ ఇంటికి వెళ్ళుట కిష్టము కలుగలేదా నాయనా!" అని యనెను.

వృద్ధాచార్యుల కన్ను లశ్రుపూరితము లయ్యెను. నేను ఆత్మగ్లాని, ప్రేమభావముల మునుగుచు గౌరవము పొందినట్లు భావించి యూరట చెందితిని. వృద్ధులు నన్ను ప్రేమసాగరమున ముంచివేసిన ట్లనిపించినది. నేను భయభక్తులతో "ఆర్యా! నా దేశమునకు తిరిగి వెళ్ళవలెనను ఆశకలదు కాని నేనొక విశేష కార్యములో చిక్కుకొని యున్నాను. ఆచార్యపాదులను, మా పితామహులకును గల స్నేహసంబంధము విని
...తో ఆనందము కల్గినది. కాని యిపుడు నేను తగుల్కొని
...క్కు గొప్పదైనను మా వంశ గౌరవమునకు తగి
... ఆ విషయముననే తమ సహాయ మపేక్షించి
...గ జేయ వచ్చియున్నాను. నేను మంద

భాగ్యుడన్ను. నేను మీ సహాయ మపేక్షించి వచ్చిన కార్య మును అన్యథా భావించవలదు" అని యంటిని.

ఆచార్యుల కన్నులు వికసించిన పుండరీకములవలె విచ్చినవి. "పని యేదో చెప్పరాదా?" అని వారనిరి.

నేను నలువైపుల దృష్టి ప్రసరించి "ఆర్యా! ఆ విష యము చెప్పుటకు నేను ఏకాంతము కోరుచున్నాను." అని యంటిని.

ఆచార్యులు తమ శిష్యులవైపు చూచుటయే తడవుగ వా రాయన యభిప్రాయమును గమనించి వెళ్ళిపోయిరి. ఒక శిష్యుడు మాత్ర మచటనే నిలచి యుండెను. అతని పాఠము పూర్తి కాలేదు కాబోలు. ఆచార్యపాదులు నన్నుచూచి "వత్సా! యించుక సేపాగుము. ఈ విద్యార్థి సందేహము పూర్తిగా తీర్చలేదు." అని శిష్యు నుద్దేశించి— "నీవేమి అడుగుచుంటివి? అసంగుడు 'శూన్య' శబ్దమునకింత ప్రాధాన్య మేల ఇచ్చెననియే కదా? దేనిని ఉన్నదని కాని లేదనికాని చెప్పుటకు వీలుకాదో దానిని 'శూన్యము' అని ఏల పేర్కొన వలయు ననియేనా నీ ప్రశ్న?"

"అవును గురుదేవా!"

"నాయనా! అయితే నీవు దాని కేదైన సరిపడిన శబ్దము చెప్పగలవా? సంకోచపడక చెప్పుము"

"దానిని 'నిరాలంబము' లేక 'పరమతత్త్వ'మనుట దోషమగునా?"

"భలే! ఈనాటి బౌద్ధ పండితుల యందొక తెగ వారు 'నిరాలంబము' అను శబ్దమున కెక్కువ ప్రాధాన్య

మిచ్చుచున్నారు. అయితే 'లేనిది కాదు' అను అర్థము ఈ నిషేధాత్మకమైన శబ్దము వలన బోధపడునా?"

"బోధ పడదు స్వామీ!"

"'పరమతత్వము' అనినచో 'తత్' అను వస్తువు యొక్క అస్తిత్వమును ఒప్పుకొనవలసి యున్నదికదా? అపుడు 'ఉన్నది కాదు' అని యెట్లు చెప్పగలవు?"

"చెప్పలేము గురుదేవా"

"మంచిది నాయనా! నీవు చెప్పిన రెండు పదములు పనికి రావని బోధపడినదా?"

"ఆ విధముగనే తోచుచున్నది స్వామీ"

"నాయనా! నిజముగ 'శూన్యము' 'నిరాలంబము' 'నిర్వాణము' ఇవి అనుభవైక గమ్యములు. భాషకు ఈ భావములను వ్యక్తీకరించు శక్తి చాలదు. ఆ భావములను సూచించుటకై యీ పదములను వాడుచున్నాము. కావున నీవు శబ్దార్థమును గురించి ఎక్కువగ ఆలోచింపక మననము చేయుము. ఈ రహస్యమును నీవు కేవల పుస్తక పఠనము వలన అర్థము చేసికొనలేవు."

"అయితే, ఆచార్యులందరును వ్రాసిన గ్రంథములు నిరర్థకములేనా స్వామీ?"

"కాదు, ఆచార్యులందఱు జ్ఞానజ్యోతిని వెలిగించినారు. 'దీప మెట్టిది?' అని దానినే పరీక్షించుచున్నంత కాలము ఆ వెలుగులో భాసించు వస్తువులను నీవు చూడలేవు. నీవు దీపమునే పరీక్షించుచున్నావు కాని ఆ వెలుగున భాసిల్లు సత్యమును నీవు చూచుటలేదు."

"గురుదేవా! దీపము దోషయుక్తమైనచో వెలుగు నకు లోటేగదా?"

"నాయనా! వితండ వాదమునకు దిగుచున్నావు. (ఉపమ) పోలిక ఒక అంశమునకే చెల్లును. ఉపమాన గత మగు అధిక ధర్మవత్త్వము ఉపమేయమున కలుగుటయే సాదృశ్య మందురు. సాధారణ ధర్మమువైపు పరిశీలించిన ఉపమయొక్క తాత్పర్యము బోధపడును. సద్ధర్మమునకు తర్కము ప్రబలుచున్నది. బిడ్డా! సంయమివై ఆచార్యుల ప్రవచనమున తాత్పర్యమునుగూర్చి యాలోచింపుము. సద్విచారములకు తర్కము దావాగ్నివంటిది. వత్సా! నా కిపుడు అవసరమగు పని యున్నది. నీ విప్పటికి చాలించి తర్వాత రమ్ము. నేను దక్షభట్టుతో మాట్లాడుచున్నంతసేపు ఇచటికి ఎవరును రాకూడదని భిక్షువులతో చెప్పు" మని ఆదేశించిరి. గురువుగారి ఆజ్ఞను తలదాల్చి శిష్యుడు వెళ్ళిపోయెను. తర్వాత ఆచార్యపాదులు నా కభిముఖులై నాకార్యమును తెలిసికొనగోరిరి. ఇంతదనుక నే నాచార్యుల వారి స్నేహాసిక్తమైన అధ్యాపనా పద్ధతిని ముగ్ధుడనై వినుచుంటిని. నే నే కార్యార్థమై వచ్చియున్నదికూడ ముహూర్త కాలము మఱచిపోతిని. తర్వాత ఉపోద్ఘాతము లేకయే నేను "స్వామీ! విషమసమర విజయుడు, వాహ్లీక విమర్దనుడు, ప్రత్యంత బాడవదేవ పుత్రుడును అగు తువరమిళిందుని పుత్రిక తమ దర్శన మపేక్షించుచున్నది" అని అంటిని.

ఆచార్యపాదుల విస్మయమునకు మేరలేదు. కొంచెము ముందుకు వంగి విప్పారిన కన్నులతో వారు "వత్సా!

ఏమంటివి? దేవపుత్రులు తువరమిళిందుల ఏకైకపుత్రిక చంద్రదీధితి యింకను జీవించి యున్నదా? నాయనా, ఆమె కుశలముగ నున్నదికదా? ప్రత్యంత దస్యువు లామె నపహరించుకొని వెళ్ళిరని నేను విని యుంటిని. నీవు చక్కగా చూచినావా? ఆమె మూర్తీభవించిన సౌకుమార్యము; పవిత్రతకు జన్మస్థానము; సౌందర్యరాశి; శుచిత్వమునకు లీలాభూమి, సాక్షాత్కరించిన భక్తి; కరుణయే రూపొందిన తేజః పుంజము. ఆహా! తువరమిళిందుని నయనతార ఇంకను జీవించియే యున్నదా? త్వరగా చెప్పుము, వత్సా! నేనామెను చూచుటకై తహ తహ పడుచున్నాను" అనెను.

నేను ఆమె పేరు మొదటిసారిగ నిపుడే విన్నాను. నేను చేతులు జోడించి "ఆర్యా, ఆమె సమీపముననే యున్నది. కాని తమరు వృత్తాంతమంతయు విని యుచిత మేదో దానిని గావింపుడు." అని నిన్నటినుండి యిప్పటి వఱకు జరిగిన కథయంతయు విన్నవించితిని. ఆచార్యపాదుల శాంత కోమల ముఖమండలమున వక్రరేఖ యొకటి ఉదయించినది. వారు కొంతసేపు నా ముఖమును తిలకించుచుండిరి. తర్వాత "మంచిది వత్సా, నీవు జయంతునికి సరియైన పాత్రుడవు" అని కనుబొమల నించుక ముడివెట్టి "మౌఖరివంశమునకుశుభమగుగాక! ఈచిన్న రాజకుటుంబము మౌఖరి వంశపు గౌరవమునకు కళంకము తెచ్చును. పాపము శాంతించుగాక! పాపము శాంతించుగాక!" అని పలికిరి. నేను ఆచార్యపాదుల ముఖారవిందమును గమనించుచునే యుంటిని. ముహూర్త కాలమున ఎన్నియో భావములు అందు ప్రతిబింబించి మాసిపోయినవి. వారు మనస్సునందే

యెవరితోనో మాట్లాడుకొనుచుండిరి. కాని ఒక మాటకూడ పలుకలేదు. కొంతసేపటివఱకు మే మిరువురము మౌనముగ నుంటిమి. పిమ్మట వారొక శిష్యుని పిలిచి "శీఘ్రముగ కుమార కృష్ణవర్ధనుల వద్దకువెళ్ళి మిక్కిలి అవసరమైన కార్యమున నేనతనిని కలిసికొన గోరుచున్నానని చెప్పుము" అని ఆదేశించిరి.

శిష్యుడు వెళ్ళినతర్వాత వారు నన్నుచూచి "వత్సా! రాజదండన కఠోరమైనది. నీవు సాహసించితివి. నీ ధైర్య సాహసములను విని నాకు చాల సంతోషమైనది. కాని యంతఃపురమున రాత్రులందు ప్రవేశించుట ధర్మవిరుద్ధము. ఇచటనున్నచో నీవు రాజాగ్రహమునకు పాత్రుడవు కావలసి వచ్చును. శీఘ్రముగ నీవు చంద్రదీధితిని, నిపుణికను వెంటబెట్టుకొని మగధవైపునకు వెళ్ళిపొమ్ము. నేను దానికై తగిన యేర్పాటు చేసెదను. చంద్రదీధితికి నా ఆశీస్సుల నందజేయుము. ఆమె నిర్భయముగా వెడలిపోవుట కేర్పాట్లు చేయుచున్నాను. ఆయేర్పాట్లు జరుగునంతవఱకు ఆమెను చూడవలెనను నా కుతూహలమును నేను అణచుకొను చున్నాను. నీవు వెళ్ళి యామె నూఱడించుము. ఆమె కేవిధమైన హానియు కలుగదని నా పరముగ నీ వామెకు చెప్పుము. ఇక శీఘ్రముగ వెళ్ళుము. ఆఁ! ఒకమాట, పూజారిపట్ల జాగ్రత్తగ మెలగుము. వాడు మూర్ఖుడు, నీచుడు సుమా!" అని యనిరి. నేను భక్తి పూర్వకముగ ప్రణామము చేసి శీఘ్రముగ చండికాలయము వైపునకు వెడలితిని.

# ఐదవ అధ్యాయము

విహారమునుండి బయట పడినపుడు నేను ప్రసన్న చిత్తుడనై యుంటిని. ఇచటికి వచ్చుచున్నపుడు నేను నలు వైపుల చూచి యుండలేదు: చింతాకులితుడైన మనుజుడు గ్రుడ్డివానిని సరిపోలుచుండును కదా! ఇపుడు నేను వృక్ష లతాదులపై విరాజిల్లుచుండిన వసంతఋతు శోభను గాంచ గల్గితిని. మామిడిపూల కమ్మని పరిమళములచే నాకర్షింప బడిన భ్రమరములు మామిడి చెట్లపై వ్యాపించి యుండినవి. వికసించిన పూలనుండి పచ్చని పుప్పొడి అనంతముగా రాలి వన ప్రదేశ మంతయు పచ్చని యిసుక తిన్నెలచే నిండి యున్నట్లగుపడుచుండెను. పుష్ప మధుపాన మదవిహ్వాల లైన ఆడు తుమ్మెదలు లతాడోలికల నూగుచుండినవి. లవలీపల్లవములలో దాగిన గండు కోయిలలు తేనెను విరజిమ్మగా చెట్లక్రింద మధువృష్టి యగుచున్నట్లుండెను. అక్కడక్కడ వృక్ష లతాదులనుండి వాడిన పువ్వులు రాలు చుండెను. భ్రమరభార జర్జరితములైన వాని గర్భ కేసర ములచే లతా మండపములు మనోహరములై యుండెను. వివిధములగు రంగు రంగుల పక్షులచే వృక్ష సమూహ మత్యంత రమణీయముగ నుండెను. ఒకవైపు ఒక జువ్విచెట్టు అడుగువఱకు రక్త కిసలయములచే నిండియుండి పద్మరాగ మణు లాకస్మికముగ ఆవిర్భవించినందున ఎఱ్ఱనై యుండి మేరు పర్వతమా యన్నట్లు కనబడుచుండెను. నగరపు సరిహద్దుల యందున్న వనప్రదేశమంతయు కుసుమిత కోవిదార వృక్ష ములచే శోభిల్లుచుండెను. అచ్చటచ్చట మంజిష్ఠ పొదలందు

పూగుత్తులు తమ మాధుర్య సౌరభములను విరజిమ్ముచు పాంథుల చిత్తముల కుత్సాహము చేకూర్చుచుండినవి. కన్యాకుబ్జమునందు మామిడిచెట్టు చాల ప్రియమైనది. వసంత శోభా సమన్వితమైన యీ మామిడిచెట్లిపుడు కన్యాకుబ్జ సామ్రాజ్య వైభవమును ప్రతిబింబింపజేయు చిహ్నముల వలె తోచుచుండినవి.

అట్టి వైభవోపేతమగు వసంతకాలమున నేను గాలిలో తేలియాడుచున్నట్లు పోవుచుంటిని. నా ఆశయము ఫలించినది. ఆచార్యపాదులను దర్శించిన పిదప నా హృదయ భారము తగ్గినది. ఇంతవఱకు భట్టినిని భద్రమైన యే స్థలము నకు గొనిపోవుదునా యనెడు యాలోచన ప్రబలముగ నుండినది. ఆమెకు భోజన సదుపాయములను గల్పించవలసి యుండునను మాటయే నేను మఱచితిని. నిన్నటి రాత్రి నుండియే ఆమెయు నిపుణికయు నిరాహారముగ నున్నారు. నేనుకూడ భుజించి యుండలేదు. ఇప్పటికే జాము ప్రొద్దెక్కినది. బజారునకు వెళ్ళి ఫలములను గొనివెళ్ళుదమని అనుకొంటిని. కాని భట్టినిని ఓదార్చుట అంతకంటె అవసరమైన పనిగా తోచెను. అందువలన నేను ఆమెను కలిసికొనిన తర్వాతనే బజారునకు వెళ్ళుట యుచితమని భావించితిని. చండికాలయమునద్ద అపుడెవరును లేరు. నేనువెళ్ళి ప్రాంగణ గృహద్వారమును తట్టితిని. నిపుణిక చప్పుడు కాకుండ తలుపులు తెరిచెను. నేను లోపలికి వెళ్ళగనే ఆమె జాగ్రత్తగ తలుపులు బిగించెను. నా మనస్సు అప్పుడు సంతృప్తి చెంది యుండుటయేగాక నేను లోలోపల గర్వపడుచుంటిని. నేను

లేకుండినచో పాపము వీరికెన్ని కష్టములు కలిగియుండునో కదా! కాని నా గర్వము వెంటనే పటాపంచలై పోవుట కూడ మంచిదే అయినది. భట్టిని మెచ్చుట నున్నదని నేను నిపుణికను ప్రశ్నించితిని. నిపుణిక నన్ను సైగతో వారించి ప్రాంగణమున ఒకమూలకు వ్రేలు చూపించెను. భట్టిని స్నానముచేసి ఒక సాధారణమైన వస్త్రమును ధరించి ధ్యాన మగ్నయై కూర్చుండి యుండెను. ఆమె యెదుట పచ్చి మన్నుతో నిర్మించిన వేదికపై నిపుణిక ఉపాస్యదేవత యగు మహావరాహుని చిన్నవిగ్రహము విరాజిల్లు చుండెను. సాధారణ వస్త్రధారణము వలన నామె సౌందర్యసంపద శతగుణ సమృద్ధమై యలరారు చుండెను. నిశ్చలసమాధి యందున్న ఆమె యెదుట అంజలిబద్ధమైన సుకుమార పాణి పల్లవములు, రమణీయంబు లగు నామె యంగుళులు శిఖరపర్యంతము పుష్పభారాన్వితమైన మాలతీ లతలచే ఆచ్ఛాదితమగు తరుణాశోకవృక్ష కిసలయములా యని భ్రమ గొల్పుచుండినవి. ధ్యాన స్థిమితము లగు నయనములనుజూడ మహా వరాహుని యపూర్వ తేజః పుంజమును గాంచి విస్మయ చకితులై చిత్ర లిఖితముల వలె స్థిరముగ నుండు ఖంజన శాబకములా యని తోచు చుండెను. భట్టినికి నలువైపుల విలక్షణమగు మహత్తరమైన తేజః పుంజ మావరించి యుండెను. నేను ముహూర్త కాల మా శోభను చూచుచుంటిని. ఆహా! విధాతయొక్క రూప రచనా నైపుణి యెంత ఆశ్చర్యకరమైనది! కోమలమగు ఆ తనూలత యెక్కడ? మహత్తర తేజఃపుంజ మెక్కడ?

మృదుల మగు ఆమె హృదయ మెక్కడ? ఈ కఠోరమగు తపశ్చర్య యెక్కడ! ఇటువంటి రూపమును గాంచియే కాళిదాస కవిశేఖరుని మనస్సునకు కాంచన పద్మధర్మముగల శరీరము స్ఫురించినది కాబోలు! అతడు "ధ్రువం వపుః కాంచన పద్మ ధర్మి యన్మృదు ప్రకృత్యాచ సమారమేవచ" అని చక్కగనే చెప్పినాడు. ఇట్లాలోచించుకొనుచు అనవసర ముగ అచ్చట ఎక్కువసేపు నిలుచుంటి నేమో! నిపుణిక నన్నొక వైపునకు తప్పుకొనుమని సైగ చేసెను. నాకు నా ఆచరణపై అకారణ పశ్చాత్తాపము కల్గినది. అసలు పశ్చాత్తాప పడవలసిన అవసర మేమియునులేదు. నిపుణికతో నేను తలుపువద్దకు వచ్చి బౌద్ధవిహారమున జరిగిన సంగతు లన్నియు ఒక్కొక్కటిగ చెప్పితిని. సంగతులను వివరముగ చెప్పుటకు ముందు నేను కొంత ఉపోద్ఘాతముకూడ అల్లితిని. నిపుణికకూడ స్నానముచేసి రాత్రి యలత యంతయు తీర్చు కొని యున్నందున ప్రసన్నచిత్తయై యుండినది. కోటర గతములై యున్న ఆమె కన్నులయం దింకను దుఃఖపురేఖలు కనబడుచునే యుండినను ఆమె దృఢ విశ్వాసము వానిని చాలవఱకు తుడిచివేసి యుండెను. ఆ కన్నులనుజూడ కోవి దార కుసుమములపై చంద్రుని ధవళకాంతులు ప్రసరించి యున్నవా- యన్నట్లుండెను. నా మనసులోని గర్వము మెల్ల మెల్లగ పైకుబికి వచ్చుచుండెను. నా గొప్పదనమును చాటుకొనుటకై నేను సంభాషణము సాగించితిని.

"నిఉనియా! నిన్న అదృష్టవశమున నిన్ను నేను కలిసి కొంటిని."

"నిజమే భట్టూ."

"నీవే ఒంటరిగ భట్టిని నీచటికి గొనితెచ్చి యుండి నచో చాల కష్టపడి యుందువుకదా ?"

"నిజమే."

"ఇపుడు నేనుచేయుచున్నంత సాయముకూడ అప్పుడు సాధ్యమై యుండదనుకొందును."

"ఇంతపని జరిగియుండెడిదే !"

"ఎవరు చేసియుందురు చెప్పు ?"

"మఱెవరు ? పూజారియే."

"పూజాఱియా ? మఱి, నీవు పూజారినిజూచి భయ పడుచుంటివే ?"

"పూజారివంటి మూర్ఖ రసికులకే భయపడినచో ఈ నిపుణిక ఆఱు సంవత్సరముల క్రిందటనే చనిపోయి యుండెడిది భట్టూ !"

6 "మఱైతే ఈరోజు ప్రాతఃకాలమున నీవు భయపడి యుండినట్లు కనబడినావే ?"

"భయపడినమాట వాస్తవమే."

"ఎవరినిజూచి భయపడితివి ?"

"నిన్ను జూచి."

"నన్నా ?"

"అవును భట్టూ, నిన్నే."

"నన్నుజూచి భయపడనేల నిఉనియా ?"

"ఏమి చెప్పను భట్టూ! నావంటి స్త్రీ నీవంటి పురుషుని కేల భయపడు నను విషయ మింతవఱకు నీకు తెలియకుండిన, ఇక నీవు తెలిసికొనలేవు!"

నేను నిజముగ వ్యాకుల పడితిని. నన్నుజూచి నిపుణిక యేల భయపడవలెనో నా కర్థము కాలేదు కాని, నిపుణిక సత్యమే చెప్పినది. నే నింతవఱకు దాని యజ్ఞాత కారణమును తెలిసికొనలేకుంటిని. ఊహించగా కొంత అర్థమైనదే కాని, నాకు నా తెలివిపైని గల నమ్మకము తగ్గిపోయినది. నేను ఆశ్చర్యముతో నిపుణికనుచూచి పరాజితునివలె "అయితే నేను వెళ్ళిపోవుదునా, నిపుణికా?" అని యడిగితిని.

నిపుణిక నవ్వుచుండెను. ఆమె కండ్లయందు అల్లరితన ముండినది. "భట్టూ, నే నిందుకే భయపడుచుంటిని. నీవు ఏ మాటనుబట్టి నేను వెళ్ళిపోదు నందువో తెలియదుగదా!" అని ఆమె యనెను.

ఇది విచిత్రమైన సమస్యయే! నేను కొంతతడవూరకుండి, తరువాత "నిఉనియా, నేను నా ఓటమిని ఒప్పుకొనుచున్నాను. నా అవసరములేదు మీాకు. పైగా నీవు నన్నుగుఱించి భయపడుచున్నావు. కాని నేను వెళ్ళిపోవుటకూడ ఉచితముకాదు—ఏమి చేయవలెనో నాకు తెలియుటలేదు" అని యంటిని.

నిపుణిక కళ్ళలో అద్భుతమైన ఆనందము తాండవమాడినది. "ఇదే గొప్ప చిక్కు. ఓడినది ఎవ రనికూడ నీవు తెలిసికొనలే కున్నావు. ఆ విషయము నీవు తెలిసికొన్నచో భయపడున దెవరనికూడ నీవు తెలిసికొని

యుందువు. భట్టూ, నీవు అమాయకుడవయ్యా! నీవ
భూమిపై నవతరించిన దేవతా స్వరూపుడవు!" అని ఆమె
యనెను.

నేను మఱింత చిక్కులో పడితిని. నేను అమాయకుడ
నను మాట నిజమే కావచ్చు. దేవతనే కావచ్చు. కాని
నన్నుచూచి భయపడవలసిన అవసర మేమున్నది? నేన
మాట్లాడినచో నేర్పరియైన యీ నిపుణిక నా మాటలనుండి
ఏదేదో అర్థముతీసి నన్ను మఱియొకమాఱు నిరుత్తరుని
చేయునేమోకదా యని ఆలోచించుచు నవ్వి యూరకుంటిని
నిపుణికకూడ మాటలాడకయే నవ్వుచుండెను. నేనుకూడ
నవ్వసాగితిని. తర్వాత ప్రసంగమును మార్చివేయుటకై నేన
"నిఉనియా, భట్టిని కీరోజు ఏదో మంచి యేర్పాటు జరుగ
గలదు. కాని యిప్పుడు ఆమె అన్నపానాదుల విషయమై
యాలోచించవలెను. నిన్న ఆమె రాజభోజనము గావించి
యుండినది. ఒక్కసారిగ ఆమెకు సాధారణ భోజన మీనాడ
పెట్టకూడదు సుమా!" అని యంటిని.

నిపుణిక ప్రసన్న మనస్కయై యుండినది. నా మాట
లలో విశేషముగ గమనింపదగిన దేమియు లేదన్నట్లు ఆమె
నా మాటలను నిర్లక్ష్యముగ వినినది. భట్టిని విషయమై
యోగ్యమగు నేర్పాట్లు జరుగగలవని ఆమెకు ముందుగనె
తెలిసియున్నట్లు కనబడుచుండినది. ఆమె, "ఏర్పాటు తప్పక
జరుగగలదు. ఆ విషయమై నాకు చింతలేదు. నేను భోజనమ
సిద్ధపఱచితిని. భట్టినికి కొంచెము పాలు, తేనె లభించి
యుండిన బాగుండెడిది. కాని యిపు డాలస్యముచేసి

ప్రమాదము సంభవించును. నీవు శీఘ్రముగ స్నానము చేసి రమ్ము. నీవు భుజించక మునుపే భట్టిని భోజనము చేయదు" అని అనెను.

నేను ఆకాశమునుండి ఒక్కసారిగ క్రింద బడినట్లు త్రుళ్ళిపడితిని. "అదెట్లు నిఉనియా? భట్టిని భోజనము చేయకముందే నే నెట్లు భుజింపగలను? నేను అకించనుడ నైన సేవకుడను... ...!"అని అనుచుండగనే నిపుణిక నన్ను సైగచేసి బిగ్గరగ మాట్లాడకు మని నిర్దేశించినది. తర్వాత ఆమె "భట్టూ! ఈ చిన్న కుటుంబమున నీవే శ్రేష్ఠుడవు, బ్రాహ్మణుడవు, పండితుడవు, పైగా దేవతుల్యుడవు. నీకు భోజనము పెట్టకయే, భట్టిని భుజించునా? శీఘ్రముగ వెళ్లుము. సంధ్యా పూజాదికముల అలవాటింకను ఉన్నదికదా? చూడు! వెళ్ళి త్వరగా ముగించుకొనిరమ్ము" అని అనెను. నేను హత చేతస్కుడనై మెదలక కూర్చుండియుంటిని. నిఉనియా తిరిగి "లేవరాదా మరి, భట్టిని భోజనమునకు అకాలమైపోవును" అని అనెను.

నేను లేవవలసియే వచ్చెను. స్నానసంధ్యాహ్నికము లను త్వర త్వరగ ముగించుకొని వచ్చునప్పటికే భట్టిని నాకై భోజనము సిద్ధము చేయుచుండినది. ఆమె కన్నులు ప్రసన్నములై ఆమె శరీరమున చురుకుదనము స్పష్టముగ కనబడుచుండినది. ఆమె లభ్యమైన ఆ కొద్ది ఆహారమును అమర్చుటయందు తత్పరత చూపుచుండెను. నిపుణిక నన్ను కూర్చుండుమని సంజ్ఞ చేసెను. సిగ్గుచే నేను క్రుంగిపోవు చుంటిని. భోజనము చేయుటకై నేనీ యవస్థ యెప్పుడును

పడియుండలేదు. భట్టిని రెప్పలు వాల్చియే మందహాసము చేయుచు "సిగ్గుపడుచున్నావా?" అని ప్రశ్నించెను.

నేను మాట్లాడక తప్పినదికాదు. నేను తలవంచియే, చేతులు జోడించి, "దేవీ! ఈ అకించనునికి మీరు తగని గౌరము చూపుచున్నారు. తమయాజ్ఞ శిరోధార్యమే యైనను, ఈ యకించనుని ఇకముం దెన్నడు ఇట్టి గౌరవమునకు పాత్రుడని మీరు తలప వలదని నా ప్రార్థన" అని యంటిని.

భట్టిని ముఖమున నవ్వు తాండవించినది. ఆమె ఆర్ద్ర ముఖమండలము ప్రత్యూషకాలపు వృష్టిచే తడిసిన తామర మొగ్గవలె వికసించెను. ఆమె "భట్టూ, నా స్వబుద్ధితో నెవరెవరి కేమర్యాద జరుపవలెనో నిర్ణయించు అధికారము నా కుండవలెనుసుమా!" అని యనెను.

నిపుణిక కొంచెము దూరమున కూర్చుండియుండినది. ఆమె నవ్వుచు "భోజనమునందు భట్టుకే గౌరవము లభింపవలెను" అని యన్నది.

నిపుణిక మాటవిని నాకు నవ్వు వచ్చినది. ఈ నవ్వు నాలోనున్న జంకును తొలగించినది. అకు దొన్నెలలో నా యెదుట నుంచబడిన భోజనము సాధారణమైనదే యైనను మధురముగ నుండినది. నా మనసునందు హర్ష విషాద భావముల ద్వంద్వయుద్ధము చెలరేగినది. నాకు కలుగుచున్న మర్యాదలను గని నేనొకవైపు హర్షించుచు, ఈ సాధారణ మగు భోజనమును భట్టిని యేవిధముగ తినగలదని ఆలోచించుచు మఱియొక వైపున దుఃఖించుచుంటిని. కాని నేను సాధారణమని తలచుచున్న భోజనమును భట్టిని మహోవరా

హుని ప్రసాదమని భావించుచుండినది. ప్రసాదము మంచిదని గాని చెడ్డదనిగాని భావించుట భక్తి రహితమగు చిత్త వైకల్యమే కదా! భక్తునికి అది అమృతముకంటె శ్రేష్ఠ మైనది. భట్టిని సాధారణమగు ఆ భోజనమును తన వద్దనచే మహిమా సమన్విత మొనర్చినది. నేనీనాడె ప్రప్రథమముగ ప్రసాదమన నేమో తెలిసికొంటిని. భట్టిని ఆ సమయముననే "సుగతభద్రుడు నే నూహించి నతడేనా, భట్టూ ?" అని యడిగెను.

"అవును దేవీ, మీరు తలచిన సుగతభద్రులే వారు. తమతో కలిసి మాట్లాడుటకై వారు తమ యుత్కంఠతను తెలుపుచు మిమ్ములను సురక్షితముగ నుంచుట కేర్పాట్లు గావించి మిమ్ములను కలిసికొందునని మీకు తెలియజేయుమని సెలవిచ్చినారు. వారికి మీపై నపార వాత్సల్యము కలదు" అని యంటిని. భట్టిని విశాలమైన నేత్రములు బాష్పపూరి తము లయ్యెను. ఆమె సంక్షేపముగ, "నిజమే భద్రా"అని బదులు చెప్పెను.

"దేవీ, తమకు మఱియొకమాట వినిన ఆశ్చర్యము కలుగకపోదు. వారు మా పితామహుల సహాధ్యాయులు. నాపై వారికి పుత్ర వాత్సల్యము కలదు. నాకీసంగతి బొత్తిగ తెలియదు" అని యంటిని.

భట్టిని ఆశ్చర్య చకితయై తన విశాల నయనములతో నన్ను కొంతసేపు చూచి "నీకు బొత్తిగా తెలియదా ?" అని యడిగెను.

"నాకు తెలియదు."

"ఆశ్చర్యమే, సుమా!"

నేను కొంచెము సంకోచపడితిని. భట్టిని సరళతనుజూచి నాకంతకంటె నెక్కువ యాశ్చర్యము కలిగెను. ప్రసంగము మార్చదలచి నేను "వారు కృష్ణవర్ధన రాజకుమారులకు కబురంపినారు. ఒకవేళ అతడేమైన ఏర్పాటు గావించవచ్చు నేమో!" అని యంటిని. ఈ మాట వినగనే భట్టిని కొయ్యబాఱిపోయినది. ఒక క్షణములో ఆమె స్ఫటిక ప్రతిమవలె హతచేష్ట యయ్యెను. నిపుణికకుకూడ కొంత సందేహము కలిగినది. నేను త్రుళ్ళిపడితిని. "దేవీ, అనుచిత మేదైన జరిగినదా?" అని అడిగితిని.

భట్టిని కుదురుబాటుచెంది "నేను స్థానేశ్వర రాజవంశమునే ద్వేషగించుకొనుచున్నాను. ఆ రాజవంశము వారిలో నెవరి ఆశ్రయమైనను పొందుటకు ముందే నేను యముని ఆశ్రయము గ్రహింతును. భద్రా! ఆచార్యపాదులు నా మేలు చేయుచున్నానని భ్రమపడి నన్ను నాశనము గావించినారే!" అని యనెను.

నేను స్తంభించిపోతిని. పరిస్థితి చాల సున్నితమైనదిగా నాకు తోచినది. చిన్న పొరబాటు జరిగినను మహీయసి యగు నీ రాజకుమారి నాశనము కాగలదు. నేను, "దేవీ! తమరు బాణభట్టునిపై విశ్వాసముంచుడు. కన్యాకుబ్జ రాజ్యములోని సేనయంతయు కలసివచ్చినను మీయిచ్ఛకు విరుద్ధముగ మిమ్ములను కొనిపోజాలదు. నిన్నటివఱకు నీ యకించనుడు దారితప్పిన సోమరి. ఈనాటినుండి విషయసమర విజయుడు, వాహ్లీక విమర్దనుడు, ప్రత్యంత బాడవ దేవపుత్రులైన తువర

మిళిందుని ప్రాణాధిక యగు పుత్రికకు సేవకుడగు భాగ్యము లభించినది. కృష్ణవర్ధన రాజకుమారుల సంగతి నేను చూచు కొనెదను. రాజనందినీ! మీరు ధైర్యముగ నుండుడు. సింహకిశోరికి భయము శోభించదు. ఇటు చూడుడు. ఈ సేవ కునిపై నమ్మిక నుంచుడు" అని దృఢముగ పలికితిని.

భట్టిని ఊరట జెందినది. "భట్టూ! నీవు సేవకుడవు కాదు. సంరక్షకుడ వనుము" అని అనినది.

"దేవపుత్రులు తువరమిళిందుని ప్రాణాధిక యగు కన్యక మర్యాద కాపాడుటయేగాక యితరు లామెను గౌర వించునట్లు చేయుట నాకు తెలియును. దేవీ! మీరు సంజ్ఞ చేసినంత మాత్రమున నేను చక్రవర్తుల తల లెగురగొట్ట గలను. సింహపు జూలును కాలరాచ సాహసించినవారు దానికి తగిన ఫలమును అనుభవింతురు" అని యంటిని.

భట్టిని ప్రాంగణమున ఒక మూలనున్న మహావరా హుని విగ్రము వైపొకసారి విశ్వాసముతో తిలకించెను.

గంభీరమైన ముఖముతో మృదుల స్వరమున నామె "భద్రా! ఆవేశపడకుము. నీపై నాకు పూర్ణ విశ్వాసము కలదు. ఉచితమని నీకేది తోచునో దానిని చేయుము. కాని ఒక మాట మాత్రము జ్ఞాపక ముంచుకొనుము. రాజాంతః పురమునగాని దానికి సంబంధించిన లేక చేరువనున్న యే యింటిలో నైనను గాని నేనుండజాలను" అని అనెను.

నేను శాంతించితిని. "బాణభట్టుడు ఈ విషయము మఱువడు" అని మాత్ర మనగలిగితిని.

భోజనముచేసి నేను చండికాలయము నెదుట నుండు ప్రాంగణమున నాసీనుడ నైతి. ఎప్పుడు నా కన్నులు మూతబడినవో నాకే తెలియదు. కొంతసేపటికి నాకు అడుగుల చప్పుడు వినపడినది. నేను జాగరూకుడనై కూర్చుంటిని. పరికించి చూడగా బౌద్ధారామమునకుజెందిన శ్రమణుడు వచ్చుచుండెను. నా దగ్గఱకువచ్చి అతడు అత్యంత మృదుస్వరమున 'భద్రా! శుభమగుగాక! పూజ్యపాదులగు సుగతభద్రులు తమరిని పిలచుకొని రమ్మని సెలవిచ్చినారు. కృష్ణవర్ధన రాజకుమారులు స్వయముగ విహారమునకు వేంచేసి తమ్ము కలిసికొనుట కుత్కంఠితులై యున్నారు" అనెను.

నే నీ శుభ సందేశమునకై వేచియుంటిని. అచటికి వెళ్ళుటకు ముందు భట్టిని యాజ్ఞగై కొని వెళ్ళదలచితిని. కాని యది సాధ్యపడలేదు. ఏల యన శ్రమణుని వెను వెంటనే నలుగు రైదుగురు బలిష్ఠకాయులగు యువకులు వచ్చి చండి కాలయమునకు నలువైపుల,నక్కడక్కడ నిలువబడిరి. నాకు వారి వాలకము చూడ సందేహము కలిగినది. వారి వేషము లందు రాజోద్యోగుల చిహ్నము లెచటను కానరానందున సాధారణ పౌరులేమో యనుకొంటిని. నేను గది తలుపు తెఱువకయే ఉచ్చైస్వరమున "కృష్ణవర్ధన రాజకుమారుల దర్శనార్థమై నే నిప్పుడే వెడలుచున్నాను" అని యంటిని. నామాటలు లోపలినుండి భట్టినీ, నిపుణికలువిని జాగరూకులై యుండవలెననియే నా ఉద్దేశము. తర్వాత నేను సరోవరము నందు కాలుచేతులు కడిగి ఉత్తరీయమును సవరించుకొని

ఆలోచనా పరంపరలలో నిమగ్నుడనై శ్రమణుని వెంబడిం చితిని. శ్రమణుడు వాచాలుడగుటచే కొంతసేపటి కాతడు నాతో మాటలాడ సాగెను. అతడు "రాజకుమారు లుదార స్వభావులు. విద్వాంసులను గుణవంతులను ఆదరించుట వారికి బాగుగా తెలియును. యువకులైనను వారి శీల ముజ్వలమైనది. బుద్ధి పరిపక్వము నొందినది. వా రాచార్య పాదుల భక్తులు, పరమభట్టారకులైన శ్రీ హర్షవర్ధన మహా రాజుగారికి ఆంతరంగికులు. వారు రాజాగ్రహమునకు పాత్రులైన వారినెందఱినో కాపాడియున్నారు. ఎందఱో గుణ వంతులను ఆపదనుండి తప్పించి యున్నారు" అని అనెను. నేను ప్రత్యుత్తరమొసగకయే అతని మాటలను వినుచుంటిని. శ్రమణు డుత్సాహముతో ఇంక నిట్లు చెప్పసాగెను: "భద్రా! కన్యాకుబ్జము విచిత్రమైనదేశము. ఇచట తత్వము నెరుగుట కంటె బాహ్యాచారములకే యెక్కువ ప్రాధాన్యము. బ్రాహ్మణులు, శ్రమణులు అందఱును బాహ్యాచారములనే ఎక్కువగా ఆదరింతురు. మహారాజాధిరాజులగు శ్రీ హర్ష దేవులు సైతము ఈ విషయమున నిర్దోషులని చెప్పలేము. బౌద్ధ తర్కవేత్తయగు వసుభూతి యెడ వారికి ఆదరాభి మానములు మెండు. ఆచార్య సుగతభద్రుల యెదుట అతడు చాల చిన్నవాడు. ఈ విషయము బుద్ధిమంతులకే అర్థమగును. కన్యాకుబ్జమునందలి పౌరులలో కృష్ణవర్ధనులు రత్నమువంటివారు. మంచిచెడ్డలను గుర్తింపగల సమర్థులు" అని అనెను.

"నీ వే దేశమునుండి వచ్చితివి బ్రహ్మచారీ?" అని నేను ప్రశ్నించితిని.

"నేను సౌవీరమునుండి ఆచార్యపాదుల వెంట వచ్చితిని. సౌవీరమునందు బాహ్యాచారములకు విలువలేదు. అచటివారు తత్త్వాన్వేషణము చేయగోరుదురు."

"కన్యాకుబ్జమున తత్త్వ జిజ్ఞాసువులే లేనిచో కృష్ణ వర్ధన రాజకుమారు లెట్లుద్భవింప గలిగిరి?"

"రాజకుమారుల మాటయే వేరు. ఇంత చిన్న వయసునం దంతటి గాంభీర్యము దుర్లభము."

"ఈ వసుభూతి యెవరు బాబూ?"

"వసుభూతి ఈ దేశపు గొప్ప తర్కవేత్త."

"అతడు తర్కమునే ఆధారముగాఁగొని సద్ధర్మ ప్రచారము చేయనెంచినాడు. భద్రా, యీ దేశమంతటను నీ యభిప్రాయమే ప్రబలి యున్నది. తర్కమువలన బుద్ధ భగవానుని కరుణను దేశమున పరివ్యాప్తము చేయగలరట! ఛీ! ఛీ!"

"నీ యభిప్రాయ మేమి బ్రహ్మచారీ?"

"తర్కమనునదే తప్పని ఆచార్యపాదుల యభిప్రాయము. తథాగతుడు జీవితమున కరుణను ప్రతిష్ఠింపగోరి యుండెను. కరుణలేనివాడు బౌద్ధుడు కానేరడు. వాడు సద్ధర్మమునే నాశన మొనర్చుచున్నాడు. తర్కమువలన ద్వేషము వృద్ధిచెందును. ద్వేషము వలన హింసాభావము పెరుగును. హింసవలన మానవత్వము ధ్వంసమగును. కాని వసుభూతి కీ మాటలు నిరర్థకములని తోచెడిని. అతడు ప్రతి

దినము ఆచార్యపాదులను శాస్త్రార్థమునకు రమ్మని పిలుచు చుండును. కాని గురుదేవులు క్షమానిధులు. శాస్త్ర చర్చ యందు ఆచార్యదేవులకు వసుభూతి దీటు కాడని మహా రాజాధిరాజులకూ ప్రపంచమున కంతటికి తెలియును. సుగత భద్రులు సింహమువంటివారు. వసుభూతి నక్కవంటివాడు. కాని దినమొల నున్నవాడు తాను తాను భగవంతునికంటె గొప్పవా డనుకొనునుగదా! మా విహారమున నుండు నెందఱో పండితులు వసుభూతిని శాస్త్ర చర్చకై పిలిచిరి. కాని అత డాచార్యపాదులతోనే వాదముచేయ కోరు చున్నాడు" అని యనెను.

శ్రమణుని వలన మనోరంజకములైన యెన్నో విష యములు నేను గ్రహించ గల్గితిని. ఇంకను తెలిసికొనగోరి నే నతనిని రెచ్చగొట్టుచు "మహా రాజధిరాజులకుగూడ నీ విష యము తెలిసి యుండవలెనే! అపుడు వా రట్టివానికి ఆశ్రయ మేల యొసగిరి?" అని యడిగితిని.

"కన్యాకుబ్జము బ్రాహ్మణ పండితులకు కోటవంటిది. ఇట్టి తర్క కుతర్కములను ప్రేరేపించు చుండిననే రాజు బౌద్ధుడై యుండగలడు!"

"అయితే యిదికూడ నవసరమైనదే!"

"కాని ఇట్టి తంత్రమువలన ముప్పువాటిల్లునని ఆచార్య పాదుల యభిప్రాయము. ఏనాడైనను బౌద్ధమతము అడుగంటి పోవలసివచ్చిన దానికి నాంది కన్యాకుబ్జమునందే జరుగును."

ఈ విధముగ మాటలాడుచు మేము విహార ద్వారము కడ చేరితిమి. శ్రమణుడు నన్ను తిన్నగ ఆచార్య పాదుల

వద్దకు గొనిపోయెను. ఆచార్య దేవులు కుశాసనముపై ఆసీనులై నా రాక కెదురుచూచుచున్న ట్లుండిరి. నన్ను జూచి మందహాసముతో "వత్సా, రమ్ము. కృష్ణవర్ధన రాజ కుమారులు నిన్ను చూడవలెనని కుతూహల పడుచున్నారు. వారిని కలిసికొని ఆయుష్మతి చంద్రదీధితికి కావలసిన యేర్పాట్లు చేయుము. రాకుమారులు నాకు విశ్వాసపాత్రు లగు శిష్యులు. వారికడ నేవిషయమైనను దాచనక్కఱలేదు. అన్ని సంగతులు నీవు నిస్సందేహముగ వారికి చెప్పవచ్చును. నేనును కొంతవఱకు వారికి చెప్పియున్నాను." అని పలికి శ్రమణుని పిలచి "పండిత ప్రవరులగు బాణభట్టుగారిని మహాసంధి విగ్రహాకులగు కృష్ణవర్ధన రాజకుమారులవద్దకు గొనిపొమ్ము. ప్రక్కనున్న ధర్మాయతనమందు వా రితని రాకకై వేచియున్నారు." అని యాజ్ఞాపించిరి.

నేను ప్రణతుడనై సెలవు గైకొంటిని. శ్రమణుడు నన్నొక చిన్న భవనమునకు గొంపోయెను. అచట కుమారు లొక రత్న కంబళముపై కూర్చుండి నా రాక కెదురు చూచుచుండిరి. ఆచార్యులమాటల వలన కుమారులు మహా సంధి విగ్రహికు లనెడు గొప్ప పదవిని వహించుచున్నారని నాకు తెలిసినది. నన్ను చూడగానే వారు లేచి నిలుచుండి తమ యాసనముపైననే నన్నొకవైపు ప్రేమతో కూర్చుండ చేసిరి. కుమారుల యౌదార్యము, వినయము సౌశీల్యమును జూచి నా కాశ్చర్యము కలిగినది. వారు గుణవంతుల కాధారము, గుణములకు జన్మభూమి, విద్వాంసులకు రక్షకులు, విద్యలకు గని. వారి కన్నులు ప్రేమామృతములతో నిండి

యుండినవి. కాని వారి కనుబొమలనుండి తేజము తొణకు చుండినది. ఇప్పుడు వారు విహారోచితమైన దుస్తులు ధరించి యున్నను సహజముగ వారి ముఖమున రాజతేజస్సు వ్యక్త మగుచు తరుణావస్థయందున్న గజరాజువలె నుండిరి. ఆ సమ యమున హస్తమున శస్త్ర మేదియు లేకుండినను సహజమగు తేజస్సు వారి నావరించియుండి వారు విషసర్పవేష్టితమైన బాల చందన వృక్షమువలె భయంకరముగను మనోహరము గను అగపడుచుండిరి. అతని వయస్సు చిన్న దేమైనను అతని ముఖ మండలమున నిష్కల్మషమగు బుద్ధి, శీఘ్ర వివేచనా శక్తియు స్పష్టముగ గోచరించుచుండినవి. ముహూర్తకాలము నే నా తేజస్సునకు వశ్యుడనైతిని. కాని భట్టిని తలపునకు రాగానే నన్ను నే నదుపులో బెట్టుకొంటిని. సమయోచితమగు ఉపచారముల తర్వాత రాజకుమారులు నన్ను దేవపుత్రులగు తువరమిళిందుని పుత్రికను గురించి ప్రశ్నించిరి. నేను జరిగిన విషయము నంతయు మొదటినుండి చివరవరకును సంగ్రహముగ తెల్పితిని. నిన్నటి దినము వారి దర్శనార్థమై వచ్చుచున్నపుడే ఈ కార్యమున తగుల్కొనవలసి వచ్చెనని కూడ నేను వారికి విన్నవించుకొంటిని. నేను చెప్పిన దంతయు వారు ప్రశాంతముగ వినిరి. వినుచున్నపు డొకమాత్రైనను వారి ముఖమున మార్పు గోచరింపలేదు. అందువలన నేను చేసిన దేది వారికి నచ్చినది, ఏది నచ్చలే దను విషయము నా కర్థము కాలేదు. నేను చెప్పవలసిన దంతయు చెప్పి జిజ్ఞాసతో వారివైపు చూచితిని. వారు శాంతముగ నుండి దేనిని గురించియు తమ యభిప్రాయమును వెలిబుచ్చక

"దేవపుత్రుల కుమార్తెకు మా గృహము సిద్ధముగ నున్నది" అని యనెను.

వినయముతో నేను "దేవపుత్రుల కుమార్తె స్థానేశ్వరపు రాజకుటుంబమునకు సంబంధించిన ఏ వ్యక్తి యింటను నుండజాలదు. స్థానేశ్వరము గౌరవనీయులను సమ్మానించుటకు అర్హతను బోగొట్టుకున్న దని నిరూపించు కొన్నది" అని నే నంటిని.

ఈ మాట రాజకుమారుని హృదయమును కలత పఱచినది. అతని కనుబొమలు ముడివడినవి. కఠోరమైన స్వరమున అతడు "భట్టా! ఒళ్ళు తెలిసియే మాటలాడు చున్నావా? వెనుకముందు లాలోచించుకొని మాట్లాడుము!" అని గర్జించెను.

"కుమారా! ఆచోచింఛియే మాటలాడుచున్నాను." అని నే నంటిని. రాజకుమారుని సహజారుణ నేత్రములు క్రోధముచే మఱింత ఎఱ్ఱబారినవి. "ఏమీ! నీ వెవరితో మాట్లాడుచుంటివో ఎఱుగుదువా?"

కొంచెముకూడ తడబడక "నేను కన్యాకుబ్జ సామ్రాజ్యపు మహాసంధి విగ్రహికులగు కృష్ణవర్ధన రాజకుమారులతో మాట్లాడుచున్నాను." అని యంటిని.

"భద్రా! నీవు దుర్వినీతుడవు సుమా!"

"రాజకుమారుల వలన నే నీ మాటలను విందునని యనుకోలేదు."

"ఇట్లు మాట్లాడుటకు నీవు సిగ్గుపడుట లేదా?"

"కుమారా! నేనెందుకు సిగ్గుపడవలయును?"

"నీవు కాక మఱెవ్వరు సిగ్గుపడెదరు?"

"రాజకుమారా! చిన్న రాజకుటుంబము వంటివారి! ఆశ్రయ మొసగి, తమ్ము తాము కళంకితులనుగా చేసికొన్న శక్తిమంతులగు రాజవంశము వారు సిగ్గుపడవలెను!"

రాజకుమారుని కనుబొమలు ముడి వడినవి. "దుర్వినీత బ్రాహ్మణ వటువా! నిన్న బిచ్చమెత్తుకొనుట కెవరిచెంతకు వెళ్ళనుంటివో ఆ వ్యక్తితో మాటలాడుట కిదియేనా పద్ధతి?"

"నిన్న నేను దారివెంట బిచ్చమెత్తుకొను భిక్షుకుడను. నిన్న నాకు స్థానేశ్వరమున రాజ్యముచేయుచున్న రాజ వంశము యొక్క కళంకమును గురించి తెలియదు"

"నేడు నీ వెవ్వడవు?"

"నేడు నేను విషమ సమర విజయుడు వాహ్లీక వివర్ధనుడు, ప్రత్యంత బాడవదేవ పుత్రుడైన తువరమిళిందుని ప్రాణాధిక పుత్రిక యొక్క సంరక్షకుడను!"

"సంరక్షకుడవా?"

"అవును. సంరక్షకుడనే!

"నా కనుసన్నమాత్రమున నీ రక్షణమున నున్న దేవ పుత్రుల కుమార్తెగతియు నీ గతియు నేమగునో నీ వెరుగుదువా?"

"ఎరుగుదును. కాని కుమారా! బాణభట్టుని గురించి మీకు పూర్తిగా తెలియదు. సైగచేయక మునుపే సైగచేయు కన్నులు దక్కవు సుమా!"

రాజకుమారుడు ప్రళయకాల రుద్రునివలె మండి పడుచు 'దుర్వినీతుడా! భిక్షాజీవి!, పోగరుబోతా! ఏమంటివి?" అని గర్జించెను.

నేను మాటాడక చిరునవ్వు నవ్వితిని. రాజకుమారుడు మఱింత మండిపడి "అంతఃపురమున చోరునివలె ప్రవేశించి ధర్మవిరుద్ధముగ ప్రవర్తించిన నీకు సిగ్గులేదా?"

"విలాసవంతులైన స్థానేశ్వరపు రాజకుటుంబమువారి యంతఃపురమును నేను లెక్క-చేయను. దౌర్జన్యముగ నప హృతలై బంధితలైన కుల స్త్రీలుండు అంతఃపురమున కెట్టి మర్యాదయు చూప నవసరములేదు. అట్టి అంతఃపురమున కాశ్రయమొసగు వారు సిగ్గుపడిన అది వారికి శోభనిచ్చును. కుమారా ! సామ్రాజ్యమదమున గ్రుడ్డివాడవు కావలదు. స్థానేశ్వరము రాజ్యలక్ష్మినే యవమానపరచినది. బ్రాహ్మణునిపై కోపము చూపుట వ్యర్థము. అతడు బిచ్చగాడుగాని మహా సంధి విగ్రహికుడు గాని కాబోడు. అతడు ధర్మమునకు వ్యవస్థ నిచ్చువాడు. నేనింతవరకు చేసినదానిని గురించి నేను సిగ్గు పడ నవసరము లేదు. దానివలన నా బ్రాహ్మణత్వము కలు షితము కాజాలదు. దేవపుత్రులగు తువరమిళిందుని గొప్ప దనము నేను చక్క-గ నెరుగుదును. అందువలననే నేను నిర్భ యముగ స్థానేశ్వరము పూజనీయులను గౌరవించుటకు అనర్హ మైనదిగా రుజువుచేసికొనినదని మరియొకమారు నొక్కి- చెప్పు చున్నాను. దేవపుత్రుల కుమార్తె ఈ రాజవంశము సేవగించు కొన్నది." అని అంటిని.

రాజకుమారుడు చింతానిమగ్నుడయ్యెను. నామాటల లోని సార మతని కర్ధమయినట్లున్నది. కొంతసేపు ఆపాద మస్తకము నన్ను భేదించునట్టి దృష్టి నాపై సారించి చూచు చుండెను. రాజకుమారుని కఠోర స్వరమును విని ఆచార్యులా సమయమున నచటికి వచ్చిరి. వారిని చూడగనే మేమిరువు రము లేచి నిలిచితిమి. వాదులాడు కొనుచుండి నందున ఆచార్యపాదుల యాజ్ఞను పాలించుటకై మేమక్కడ చేరితి మన్న సంగతియే మరచి పోయి యుంటిమి. వచ్చినవెంటనే ఆచార్యులు నన్నుద్దేశించి "ఏమి నాయనా! నీవేమైన అను చితముగ మాటలాడితివో? కృష్ణవర్ధన రాజకుమారుని వంటి సజ్జనునికి నీవేలకోపము తెప్పించితివి? ఛీ! అట్లుచేయదగునా?" అని నా తల నిమురుచు రాజకుమారుని వైపుకు తిరిగి "కుమారా! ఎందుకు కోపగించెదవు? వత్సా! బాణభట్టుడు అమాయకుడు. రాజోచిత మర్యాదల నెరుగడు. వాని మాటలలోని భావము మాత్రము గ్రహించుము. శబ్దప్రయో గముల వైపు చూడకుము." అని అత్యంత వాత్సల్యముతో రాజకుమారుని వీపు తట్టి "కూర్చో వత్సా!" అని యనిరి.

ఆచార్యపాదులు ఆసనముపై ఆసీనులైన పిదప మేము రాతి నేలపై కూర్చుంటిమి. రాజకుమారుడే ప్రథమమున "ఆర్యా, బాణభట్టు స్థానేశ్వర రాజవంశమునే యేవగించు కొనుచున్నాడు." అనెను.

ఆచార్యులు ఆశ్చర్యముతో నన్నుజూచుచు "పాపము శాంతించు గాక! నీ వామాట అన్నావా నాయనా!" అని యడిగిరి.

నేను ప్రశాంతముగ "స్వామీ! దేవపుత్రులు తువర మిళిందుని పుత్రికను అవమానించిన రాజకుటుంబమున కాశ్రయమిచ్చిన రాజవంశము పూజనీయులగు వారిని పూజించుట కనర్హమైన దని నిరూపించుకొన్నది. నేను దేవ పుత్రుల నందినిని ఆరాజవంశమునకు సంబంధించిన యేవ్యక్తి యింటనైనను ఆశ్రయము పొందనియ్యజాలను. ఈ మాట నేను ఆమె యనుమతి పొందే చెప్పుచున్నాను. నా యవి నీతిని క్షమింతురుగాక! నేనిప్పుడు అకించనుడగు బాణభట్టునై మాటలాడుచుండుట లేదు. దేవపుత్రులగు తువరమిళిందుని ప్రాణాధిక యగు కుమార్తె గౌరవప్రతిష్ఠల రక్షించు బాధ్యత గల వాడనై మాటలాడుచున్నాను. బాణభట్టుడు రాజ కుమారులకు వశం వదుడే. అయినను తువరమిళిందుని ఆహ తాభిమానమునకు ప్రతినిధినై యున్నంతవరకు అతడు లొంగునని మీరాశింప జాలరు." అని అంటిని.

"వత్సా! నీవు దేవపుత్రుని గౌరవము ననుసరించి మాటలాడినావు! రాజకుమారా! నీవు ధీరుడవు; వివేకము గల వాడవు. స్థానేశ్వరము పైబడిన కళంక పంకిలమును కడిగి వేయు పవిత్ర కార్య భారము నీపై నున్నది. నీవే యీ పనిని చేయగల సమర్థుడవు. వేడిపాలతో నోరు కాల్చుకున్నవాడు మజ్జిగను జూచి భయపడుచుండుట సహజమే గదా! వలదు నాయనా! ఆయుష్మతి యగు చంద్రదీధితి గౌరవమును నీవు కాపాడవలసినదే. ఒకపరి ప్రత్యంత దేశమువైపు దృష్టి మర లింపుము. యౌధేయులు సౌవీరమునుండి గాంధార దేశము వఱకు నున్న ప్రదేశమునందు భయోత్పాతములను వ్యాపింప

జేసి యున్నారు. సముద్రగుప్త మహారాజులకీర్తి యీనాటి వరకు చంద్రకిరణముల వలె ధవళమై యున్నది కాని రణ దుర్మదులైన, యాభేయుల నణచివేయకున్న, సద్ధర్మము తప్పక నశించి పోగలదు. ఈకార్యమున నీవు, దేవపుత్రునితో మైత్రి సంపాదించవలెను. ఈ మైత్రికొరకు నీవు ఆయుష్మతి యైన చంద్ర దీధితి యభిలాషను మన్నించి యీ యాపద యందు ఆమె కకారణబంధువైన బాణభట్టుని మాటలకు తగు మర్యాద చూపవలసి యుండును” అని ఆచార్యపాదులు పలికిరి.

రాజకుమారుడు నిర్వికారుడై వినుచుండి పిదప శాంత భావముతో “ఆర్యా! మాకేమి ఆజ్ఞ?” అని ప్రశ్నించెను.

ఆ మాట విని ఆచార్యులు “ఆయుష్మతిని ఆ స్థానము నుండి తరలించి భద్రమైన మఱియొక చోటికి గొనిపోవలెను. స్థానేశ్వరము పై బడిన కళంకమును పోగొట్టి, ఆమె విశ్వాస మును సంపాదించవలెను. అంతేకాదు. ఈ విషయమును గుఱించి దేవపుత్రునికి వెంటనే తెలుపవలయును. వత్సా! చండికాలయపు ఆ మూర్ఖపు పూజారిని గుఱించి నేను చాల భయపడుచున్నాను. వా డెప్పుడేమి చేయునో చెప్పలేము. కుమారా! ఆ విషయమున నీ వేమైన నేర్పాటు చేసి యున్నావా?” అని అడిగిరి.

రాజకుమారుడు మునుపటివలెనే నిర్వికార భావమున కూర్చుండి యుండెను. ఆర్ద్రి కంఠస్వరమున “ఐదుగురు సశస్త్ర సైనికులు పౌరుల వేషమున చండికాలయమును రక్షించుచున్నారు” అనెను.

ఆచార్యులు అందుకై తన సంతోషము వెలిబుచ్చి మఱల అతని నుద్దేశించి "ఏమాలోచించుచుంటివి బాబూ! నీ కోప మింకను శాంతించలేదా?" అని అడిగిరి. ఆ యవకాశమును పురస్కరించుకొని నేను, "ఆర్యా! కుమారులను త్తేజపరచి నే నపరాధము గావించితిని. దానికిగూడ నాకు శిక్ష విధించవలసినదే. కాని నా దుస్సాహసమువలన దేవపుత్ర నందిని కెట్టియాపద వాటిల్లకుండవలెను" అని యంటిని.

కృష్ణవర్ధనులు నావైపుజూచి "నేను నీ సాహసమును ప్రశంసించుచున్నాను భట్టూ! నే నింతవఱకు నీవంటి బ్రాహ్మణుని ఏల చూడలేదని యాలోచించుచున్నాను" అని యనిరి.

ఆచార్యులు ప్రేమతో మందహాసము చేయుచు "వత్సా! ఎప్పుడైనను అటువంటివాని కొఱకై వెదకి యుంటివా?" అని యడిగిరి.

కుమారులు, "ఆర్యా లేదు" అని యనిరి.

ఆచార్యులు పులకితగాత్రులై "బ్రాహ్మణుడేమి, శ్రమణుడేమి? మానవత్వము ఈ రెండింటిలోను అరుదే కుమారా!" అని నవ్వి రాజకుమారుని వీపు ప్రేమతో నిమిరిరి.

కొంతసే పూరకుండి రాజకుమారుడు నావైపు చూచెను. తర్వాత తన కన్నులను ఆచార్యపాదులవైపునకు త్రిప్పి, "స్థానేశ్వరమున రాజవంశమునకు సంబంధించని గృహ మొకటిగూడ లేదు. అదేకాదు. నే నెఱిగిన దంతయు మహారాజుగారికి నివేదించుట నా ధర్మము. తత్ఫలితముగ

బాణభట్టుడు రాజాగ్రహమునకు పాత్రుడగును. పాపాత్ము రాలగు నిపుణిక తప్పక నాశనమగును. అందువలన బాణ భట్టుడు రేపు సాయంకాలము లోపల దేవపుత్ర నందినిని; నిపుణికను వెంట నిడుకొని మగధవైపునకు వెళ్ళిపోవుట మంచిదేమో యని యాలోచించుచున్నాను. నే నీనాడే ఒక గొప్ప నావను సిద్ధము చేయించెదను. దేవపుత్రనందిని నీనాటి కచటనే విశ్రమింపనిండు. రేపు వెళ్ళుటకు ముందు బాణభట్టులు నన్నొకసారి కలిసికొందురుగాక! రేపు హోలి కోత్సవమైనందున శాసన ధర్మ విభాగములకు సెలవు దినము. నేను ఎల్లుండి మధ్యాహ్నము మహా రాజాధి రాజులకు అన్ని విషయములు విపులముగ చెప్పెదను. దేవపుత్రనందిని కేవిధ మైన కష్టము కలుగకుండ, నే నేర్పాటు గావింతును. సాధ్య మైన ఆమె ప్రీతిని సంపాదించుటకు కూడ ప్రయత్నించెదను" అని చెప్పెను. ఆచార్యు లుత్సాహము చూపుచు "భేష్! వత్సా! ఇదియే నీకు తగిన ప్రత్యుత్తరము" అని అనిరి.

కృష్ణవర్ధనులు — "గురుదేవా! దేవపుత్రనందిని దోషరహితమగు రాజవంశముపై కోపమూనిన దను పరితా పము మాత్రము నా హృదయమున ములికివలె గ్రుచ్చు చున్నది. చిన్నరాజ కుటుంబము చేయుచున్న పాపములకు మేమీ విధముగ ప్రాయశ్చిత్తము చేసికొనవలసి వచ్చిన యనర్థము సంభవించును" అని పలికి నావైపు తిరిగి "దేవ పుత్ర నందిని యెదుటికి వెళ్ళుటకు నాకు సిగ్గువేయుచున్నది. భద్రా! స్థానేశ్వర రాజవంశము పూజనీయులను పూజిం చుటకు తాను అనర్హమైనదిగా నిరూపించు కొన్నదని నీవు

నిజమే చెప్పితివి. కాని యిది యంతయు తెలియక జరిగినది. దేవపుత్రనందిని కోరికను మన్నించుటచే పూజనీయులను సత్కరించు నవకాశముకూడ నీ రాజవంశమునకు దక్క లేదని నీ వామెకు సరియైన సమయముజూచి తెలియజెప్పుము. నాకు చెప్పుటకు సాహసము రాకున్నది, కాని నా పరముగ నీ వామెను గంగానది యొడ్డునకు పల్లకిలో వెళ్ళుట కాయత్త పఱచుము. ఆమె నవమానపఱచినవారు స్థానేశ్వర రాజ్య లక్ష్మినే కాల దన్నినారు. దాని ఫలము వా రనుభవించి తీరవలెను. కాని యేవిషయమునందైనను తొందరపడి పని చేయుట రాజనీతికి విరుద్ధమైనది. చూడు భట్టూ! నీవు దేవ పుత్ర నందిని విశ్వాసపాత్రుడవైన భాగ్యశాలివి. అందువలన ఆమెకీ విషయములన్నియు విశదముగ చెప్పు భారము నీపై నున్నది. నేడా యపరాధులకు శిక్ష విధింపబడకుండుటకు రాజనీతికి సంబంధించిన చిక్కులే కారణము గాని వేరుకాదు. ఈ యవినీతిని మూలోచ్ఛేదనము చేసిగాని నేను శాంతింప నని యీనాడు ప్రతిజ్ఞ చేయుచున్నాను. దేవపుత్రనందినికి జరిగిన యవమానము నేను నా సోదరికి జరిగిన యవమాన ముగనే భావించుచున్నాను" అని యనెను. ఆచార్యులు కరుణార్ద్ర నయనముల రాజకుమారునిజూచి యతని నుత్సాహ పఱచుచు, "భలే, భలే, వత్సా! స్థానేశ్వరపు ప్రతాప శాలులైన రాజవంశీయులకు తగినట్లు మాటలాడినావు" అని యనిరి. కృష్ణవర్ధనులు "కాని గురుదేవా! నా హృదయ మున నాటిన ముల్లు నాటినట్లే యుండిపోయినది. దేవపుత్ర నందిని కోరికకు అడ్డువచ్చుట నే నిచ్ఛగింపని పని. కృష్ణ

వర్తను డింతగా నెన్నడును లజ్జితుడు కాలేదు. ఈనాడు ఆ శిథిలమైన దేవాలయ ప్రాంగణమునసున్న గృహమునందు కుసుమతుల్య సుకుమారియగు రాజకన్య పాడుతిండి తినియో తినకయో కాలము గడుపుచున్నదని తలచుకొన్నంత మాత్ర మున నాలోని క్షత్రియత్వ మంతయు నుడికి పొంగిపోవు చున్నది. గొప్ప ప్రయత్నముతో నన్ను నే నదుపులో నుంచుకొన గలిగితిని. నేనీ విషయమున నేమియు చేయజాల నందుకు చింతిల్లుచున్నాను. నే నొనర్చు ప్రతికార్యము దేవపుత్ర నందిని సందేహము నెక్కువచేయునను భీతి నాకు గల్గుచున్నది. ఎవని దోర్దండ ప్రతాపమునకు రోమక పత్తన మున కుత్తరదిశనుండు రాజ్యము లన్నియుకూడ కంపించు చుండునో; ఎవని ఖరతరాసిధారా స్రోతస్వినియందు శాక్య రాజులవంటి ప్రతాపశాలులు ఫేన బుద్బుదములవలె ప్రవ హించి పోయిరో, క్రీడాసక్తుడగు బాలుడు పుట్టగొడుగు కాడ నవలీలగ త్రుంచివేసినట్లు ఎవని ప్రతాపాగ్ని ఉద్దండ వాహ్లీ కులను భస్మము చేసినదో, యెవని స్ఫూర్జిత దీప్తమగు కీర్తి వహ్నియందు మ్లేచ్ఛులు మిడుతల దండువలె నాశన మగుచున్నారో అట్టి దేవపుత్రులగు తువరమిళిందుల పుత్రి కయే ఈమె యని తలంపునకు వచ్చినపుడు నా కోపము వెల్లువెరిగి పోవుచున్నది. ఆ విషము సమరవిజయుడు, అజ్ఞాత శత్రువు దేవపుత్రుడు అయిన తువరమిళిందుని కన్యను దుర్దశ యందు గాంచియు నే నామె కేసహాయ మొనర్ప లేకున్నానను విచారము నా హృదయమున తీవ్రశల్యమై నాటుకొని నన్ను పీడించుచున్నది. ఆర్యా, నా ప్రార్థన యొకటి మీరాకాంక్షచే

పాలింపజేయుడు. ఆ మహాత్మురాలు గంగానదీ తీరమునకు వెళ్ళునపుడు కాలినడకన వెళ్ళక నేను పంపు శిబిక నధిరోహించుటకు సంకోచింపవలదని చెప్పుడు. కృష్ణవర్ధనునికి ఆ పుణ్యాత్మురాలి సోదరుడగు గౌరవము దక్కవలెను" అని పలికెను.

రాజకుమారుని భాస్వర ముఖమండలమున, ఒకప్పుడు కోపము, మఱియొకప్పుడు క్షోభ, గ్లాని మొదలగున వెన్నో భావములు ప్రకటిత మగుచుండెను. సంధ్యాకాలపు మేఘ మండలమువలె అతని యార్ద్రి ముఖబింబమున నెన్నోరంగులు వచ్చి పోయినవి. ఆచార్య పాదులు నన్ను జూచి, "వత్సా! కృష్ణవర్ధనుల ప్రార్ధన నంగీకరింపుమని నా పరముగ నీవు కుమారికి చెప్పుము. నేను గంగానది యొడ్డున నామెను కలిసికొందును. నీవిక వెళ్ళుము" అని సెలవిచ్చిరి.

ఆచార్యుల యాజ్ఞను గొని రాజకుమారుడును నేనును లేచి నిలుచుంటిమి. వెలుపలికి వచ్చి చూడ మధ్యాహ్న కాల మార్తాండుడు తన సహస్ర కిరణములచే నిప్పులుచెరుగు చుండెను. వాతోద్ధూతమగు ధూళిచే నాకసము ధూసరమై యుండెను. విహారపు రాతిచప్పట సూర్యకిరణ తప్తమై యగ్నివలె మండుచుండెను. ఈ యగ్నిమయమగు పరిసరములలో విహారము నడుమ నున్న అశ్వత్థ వృక్షము ఆపాద తామ్ర కిసలయములచే నిండి పృథ్వీగర్భమునుండి యేదో మండుచున్న యగ్నిపర్వతము తన జ్వాలా సమూహముల మూలమున ధరిత్రియం దుండు వేడిమిని పైకి వెళ్ళగక్కు చున్నదా యన్న ట్లగపడుచుండెను. కాని అది నిజముగ

వేడిమి యేనా? కాదు! అశ్వత్థ కిసలయములను వేడిమి యను కొనుట వికృతమగు చింతనాపద్ధతియొక్క పరిణామము. వాస్తవముగ నది ధరిత్రీ హృదయస్థమగు రస సాగరము. ప్రచండ దావాగ్నివంటి వేడిమిలోకూడ ధరిత్రి తన శీత లత్వము నీ విధముగ చాటుకొనుచున్నది. కృష్ణవర్ధన రాజ కుమారుల శీతల ప్రేమధారను కూడ నేను వేడిమి యనియే భావించియుంటిని. అది నా వికృతమగు ఆలోచనాధోరణికి పరిణామము. నా ప్రక్కనే నిలుచుండియున్న రాజకుమారు లను క్షమాపణ వేడుకొనుచున్నట్లు నేను చూచితిని.

అతని ప్రశాంతమగు వదనమునుండి స్నిగ్ధకాంతులు వెడలుచు దర్శకులకభయదాన మొసగుచున్నావా యన్న ట్లగపడుచుండినవి. నా చూపులలోని అర్ధము రాజకుమా రుడు గ్రహించెను. మందహాసముతో "దేవపుత్రుని గౌరవ మును చక్కగా గుర్తించినావు భట్టూ! నేను నీయెడ ప్రస న్నుడను" అని యనెను. నేను కేలుమోడ్చి రాజకుమారుని యనుగ్రహమును వినయముతో గ్రహించితిని.

కృతజ్ఞతాధిక్యముచే నా కంఠము రుద్ధమైనదని సహృదయుడగు రాజకుమారుడు గ్రహించి ప్రసన్నచిత్తు డయ్యెను.

# ఆరవ అధ్యాయము

శిబికలు బయలుదేఱుసరికి గోధూళి వేళ కావచ్చెను. ఈయాలస్యమునకు కారణముకూడను నేనే. గంగానదియొద్దున నావల యేర్పాటు చూడనిదే భట్టిని నచటికి పంపుట సరికాదని నే ననుకొని యుంటిని. గంగాతీరమునుండి నేను తిరిగి వచ్చుసరికి ప్రొద్దు దిగజారియుండెను. ప్రేంకణ కుసుమ మంజరీ పరాగ వర్ణమువంటి సూర్య బింబము హారిదళము రంగరించబడిన పశ్చిమ సముద్రము వైపునకు దిగుచుండెను. దిగ్వధువుల ముఖముపై లీలగా పడియున్న, కుసుమ రసావిరల వర్ష ధారలచే తడిచి యెఱ్ఱనై, కోమలమై యున్న మేని ముసుగువలె అస్తమించుచున్న స్సూర్యుని నీ రెండ యగపడుచుండెను. ఆకాశపు నీలవర్ణము చాలవఱకు తొలగిపోయి చకోరపక్షుల నయన తారలవంటి పింగల వర్ణము నలువైపుల చుట్టుకొని యుండెను. కోకిల కండ్లను పోలిన పచ్చని కిరణములు సమస్త భూమండలమును అరుణ కాంతులచే నింపివేయు చుండెను. ప్రకాశవంతమైన ఒకటి రెండు నక్షత్రములు మాత్రము తూర్పు దిక్కున మెఱయుచుండెను. మోహాన వేషధారిణియగు సంధ్యాసుందరి గైరికవస్త్రధారిణియైన భైరవివలె చండికాలయమునం దవతరించుచుండినది. శిబిక లప్పటికే సిద్ధముగ నుండినవి. భట్టిని, నిపుణికయు సిద్ధముగ నుండిరి. నేను వచ్చి చేరినదే తడవుగ వారు శిబికలలో నాసీనలై గంగానదీ తీరమునకు బయలుదేరిరి.

ప్రాంగణ గృహమునుండి వెలుపలికి వచ్చి నేను నలు దెసలు పరికించి చూచితిని. ఆకాశమునందలి యరుణకాంతి తుడిచివేయబడినందున ఆకాశము దట్టమైన నీలిరంగువస్త్రము వలె వ్యాపించిన ట్లగపడుచుండెను. మధ్యాహ్నకాలపు నీలిరంగిపుడు మఱింత దట్టమైయుండెను. చుట్టుప్రక్కలనున్న వృక్షావళుల పచ్చనిరంగు నల్లని రంగుగ మాఱియుండెను. వనరాజి యంతయు అడవి మహిష మలిన శరీరమువలె నల్లనై యుండెను. పక్షుల కలకలము శాంతించి యుండెను. ఎదుటనున్న నడబావి తన శాంతమైన వక్షః స్థలమున సమస్తాకాశ సంపద నుంచుకొని నవ్వుచుండెను. ఆ ప్రదేశ మంతయు శాంతమై స్థిమితమై మహిమా సమన్వితమై యల రారు చుండెను. 'ఇపుడు పూజారి వచ్చియుండిన తనివితీర నతనితో పరిహాస మాడియుందునుకదా!' యని అనుకొంటిని. కాని పాప మతడిప్పు డెచ్చట నున్నాడో కదా! బయలు దేరుటకు ముందు నేను ఏదో మఱచిపోయిన వస్తువును వెద కుటకై పోయినవానివలె ఆ ప్రాంగణ గృహములోనికి మఱియొకసారి వెళ్ళితిని. మోహమెంత విచిత్రమైనది! ఆ శిథిలమైన ప్రాంగణ గృహము నన్నిపు డెక్కువగ నాక ర్షించు చుండెను. అది యంతకు మునుపే శూన్యముగ నుండెను కాని భట్టిని వెళ్ళిపోయిన తరువాత అది మఱింత శూన్యముగ కనబడుచుండెను. దాని గోడలు 'మేమీనాడు యదార్థముగ శూన్యమై పోతి'మని యెక్కువగ గోలచేయు చుండినవా యన్నట్లు నాకు తోచినది. భట్టినియొక్క ఒక నాటి పూజావేదిక యింకను తడిగా నుండెను. దానిపై

నుండిన మహావరాహుడు వెడలిపోయి యుండెను కాని యతడు తన యుద్ధారక శక్తిచిహ్నముల నచ్చట నంకితము చేసిపోయెను. కొంచెముసేపు నేనా వేదికను చూచి తరువాత గోడలపైనుండు తాంత్రిక చిహ్నములవైపు రెప్ప వాల్చక చూచితిని. తన పృష్ఠ భాగమున భైరవీ చక్ర చిహ్నముల నుంచుకొనియున్న యా యద్భుతమగు మహా వరాహుని వేదికను చూడగనే నేను దానిని భవిష్యత్తును సూచించు శకునమని భావించక తప్పినదికాదు. ఈ వ్యతిరేక స్వభావములు గల సంకేతముల సమ్మేళనము ఆకస్మికము కావచ్చును కాని నిశ్చయముగ నది యకారణము కాజాలదు. ఇది జరుగనున్న విపరీతమును గోచరింపచేయు సత్యమును సూచించుచున్నది. నా నోటినుండి హఠాత్తుగ నే నెన్నడో వ్రాసియుండిన ఆర్యావృత్తము వెలువడినది.

ఆరోజులలో నేను వారణాసి వద్దనుండు జనపదములలో పురాణ కాలక్షేపము చేయుచుంటిని. అది యొక నటన మాత్రమే. నా హృదయమున లేశమాత్రమైనను భక్తి లేదు. కాని స్వేదాశ్రు రోమాంచములను ప్రదర్శించుటయందు నేను నేర్పరి నైనందున సరళ స్వభావులైన జానపద స్త్రీలు, గ్రామీణులైన వృద్ధులు, నా పురాణ కాలక్షేపమునకు ముగ్ధులగుచుండిరి. ఒకనాటి సాయంకాలము నేను వ్యాస పీఠమునుండి లేచుచుండగనే అత్యంత కమనీయ రూపవతి యగు ఒక వృద్ధవనిత వచ్చి నా చరణముల నంటెను. నే నామెను చూచితిని. ఆమె ముఖము వాడిపోయిన కమలము వలె ఖేదము నొందుచుండెను. ఉంగరములవంటి ఆమె

కేశములు అస్తవ్యస్త మగుచుండెను. ఆమె కన్నులలో ప్రళయకాలిపు దృశ్యము కనబడుచుండెను. ఆహా! ఈమె యెంత భక్తురాలు! ఏమి యీామె భక్తి విశ్వాసములు! ఎట్టి సరళ హృదయము! ఆమెను చూచి నేను "తల్లీ! ఇంత వ్యాకులముగ నెందుకున్నావు? ఏమి సంగతి? మీాకు శుభమగుగాక! నీ హృదయావేదన నాకు చెప్పు తల్లీ! నే నేమైన నీకు సహాయ పడగలనేమో?" అని ప్రశ్నించితిని. ఆమె గద్గద స్వరమున "మీారు బ్రాహ్మణులు, భూసురులు. మీా యాశీర్వచన ప్రభావమున నాకుతప్పక మేలు కలుగును! నా ఏకైక పుత్రుడు ఇల్లు వాకిలి విడచి యెక్కడికి వెళ్లెనో తెలియదు. పోగొట్టుకొన్న నా నిధిని పొందుటకు నాకు మార్గ మేదైన సెలవిండు. నా ప్రాణాధికమగు పుత్రుని బడ యుటకు నే నే జపతపములు, మాంగల్యవ్రతము, హోమము, చేయవలెనో చెప్పుడు. చిన్న వయస్సునందున్న వాని భార్యను నే నేమని యూఅడింతును" అని యామె యనెను. ఆ వృద్ధురాలి మాట లాలకించి నే నొక క్షణము సంక్షు భితుడ నైతిని. నేనుకూడ ఇల్లు వాకిలి విడిచి వచ్చిన వాడనే కదా! కాని మఱుక్షణమునందే నే నూఅట జెందితిని; నేనే మేలు; నా వియోగమునకై దుఃఖించుచు, కపట వేష ధారులగు ధార్మికులను జపతపముల విషయమై యడుగుటకు నా తల్లి లేదుకదా! చిన్నదికాని, యువతియైనదికాని, యగు నా భార్య నూఅడించుటకై యెవరును బాధపడవలసిన పని లేదు, ఏలయన నాకు భార్యయే లేదు! కాని యిట్టి తల్లిని, భార్యను విడిచి పారిపోయిన ఆ దౌర్భాగ్యు డెవడో

నుండిన మహావరాహుడు వెడలిపోయి యుండెను కాని యతడు తన యుద్ధారక శక్తిచిహ్నముల నచ్చట సంకతము చేసిపోయెను. కొంచెముసేపు నేనా వేదికను చూచి తరువాత గోడలపైనుండు తాంత్రిక చిహ్నములవైపు రెప్ప వాల్చక చూచితిని. తన పృష్ఠ భాగమున భైరవీ చక్ర చిహ్నముల నుంచుకొనియున్న యీ యద్భుతమగు మహా వరాహుని వేదికను చూడగనే నేను దానిని భవిష్యత్తును సూచించు శకునమని భావించక తప్పినదికాదు. ఈ వ్యతిరేక స్వభావములు గల సంకేతముల సమ్మేళనము ఆకస్మికము కావచ్చును కాని నిశ్చయముగ నది యకారణము కాజాలదు. ఇది జరుగ నున్న విపరీతమును గోచరింపచేయు సత్యమును సూచించు చున్నది. నా నోటినుండి హఠాత్తుగ నే నెన్నడో వ్రాసి యుండిన ఆర్యావృత్తము వెలువడినది.

ఆరోజులలో నేను వారణాసి వద్దనుండు జనపదములలో పురాణ కాలక్షేపము చేయుచుంటిని. అది యొక నటన మాత్రమే. నా హృదయమున లేశమాత్రమైనను భక్తిలేదు. కాని స్వేదాశ్రు రోమాంచములను ప్రదర్శించుటయందు నేను నేర్పరి నైనందున సరళ స్వభావులైన జానపద స్త్రీలు, గ్రామీణులైన వృద్ధులు, నా పురాణ కాలక్షేపమునకు ముగ్ధులగుచుండిరి. ఒకనాటి సాయంకాలము నేను వ్యాస పీఠమునుండి లేచుచుండగనే అత్యంత కమనీయ రూపవతి యగు ఒక వృద్ధవనిత వచ్చి నా చరణముల నంటెను. నే నామెను చూచితిని. ఆమె ముఖము వాడిపోయిన కమలము వలె ఖేదము నొందుచుండెను. ఉంగరములవంటి ఆమె

కేశములు అస్తవ్యస్త మగుచుండెను. ఆమె కన్నులలో ప్రళయకాలపు దృశ్యము కనబడుచుండెను. ఆహా! ఈమె యెంత భక్తురాలు! ఏమి యీమె భక్తి విశ్వాసములు! ఎట్టి సరళ హృదయము! ఆమెను చూచి నేను "తల్లీ! ఇంత వ్యాకులముగ నెందుకున్నావు? ఏమి సంగతి? మీకు శుభమగుగాక! నీ హృదయావేదన నాకు చెప్పు తల్లీ! నే నేమైన నీకు సహాయ పడగలనేమో?" అని ప్రశ్నించితిని. ఆమె గద్గద స్వరమున "మీరు బ్రాహ్మణులు, భూసురులు. మీ యాశీర్వచన ప్రభావమున నాకుతప్పక మేలు కలుగును! నా ఏకైక పుత్రుడు ఇల్లు వాకిలి విడచి యెక్కడికి వెళ్లెనో తెలియదు. పోగొట్టుకొన్న నా నిధిని పొందుటకు నాకు మార్గ మేదైన సెలవిండు. నా ప్రాణాధికమగు పుత్రుని బడయుటకు నే నే జపతపములు, మాంగల్యవ్రతము, హోమము, చేయవలెనో చెప్పుడు. చిన్న వయస్సునందున్న వాని భార్యను నే నేమని యూఱడింతును" అని యామె యనెను. ఆ వృద్ధురాలి మాట లాలకించి నే నొక క్షణము సంక్షుభితుడ నైతిని. నేనుకూడ ఇల్లు వాకిలి విడిచి వచ్చిన వాడనే కదా! కాని మఱుక్షణమునందే నే నూఱట జెందితిని; నేనే మేలు; నా వియోగమునకై దుఃఖించుచు, కపట వేష ధారులగు ధార్మికులను జపతపముల విషయమై యడుగుటకు నా తల్లి లేదుకదా! చిన్నదికాని, యువతియైనదికాని, యగు నా భార్య నూఱడించుటకై యెవరును బాధపడవలసిన పని లేదు, ఏలయన నాకు భార్యయే లేదు! కాని యిట్టి తల్లిని, భార్యను విడిచి పారిపోయిన ఆ దౌర్భాగ్యు డెవడో!

వా డెక్కడికి వెళ్ళి యుండవచ్చు? అని యాలోచించుచు ఆ ముసలిదానికి ధైర్యము గొల్పుచు "అమ్మా చింతిల్లకుము. నీ కుమారుడు నీకు లభించగలడు" అని చెప్పి ఆమెకు కొన్ని వ్రతములు, ఉపవాసముల విధ్యులను తెలిపి తప్పించుకొంటిని. ఆ వృద్ధురాలు తన కోడలి చేయికూడ చూపించెను. ఆహా! ఆ బాలిక ముఖ మెంత మనోహరముగ నుండినది! నేను చకితుడనై ఆమె ముఖమును చూచితిని. ఆమె నిరాశ చెందుచున్నట్లగపడినది. వృద్ధురాలు వెడలిపోయినది కాని ఆమె నా మనః పటమున ఒక గొప్ప అభావమును చిత్రించి పోయినది. నాకెవ్వరు లేరుకదా! నాకై విలపించువారుకాని ఊరడించుటకై యపేక్షించువారుకాని లేరుకదా! నేనొంటరిని; సంగహీనుడను, మందభాగ్యుడను; అని నా మనస్సునందొక గొప్ప యారాటము కలుగసాగెను. నాకిది దుర్నిమిత్తమువలె గోచరించుచుండెను. ఇంతవఱకు ఈ ప్రాపంచిక సుఖ దుఃఖములు, ఎవని హృదయమునందు తామరాకుపై నీటిబిందువులవలె వచ్చి పోవుచు నంటకుండెనో యా వ్యక్తి నేడేల పరితపించుచుండెను? ఏమి! అరుణుని చూచి సూర్యోదయమును నూహింపమా? పవనమునుజూచి వర్షము వచ్చుననుకొనుట సంగతము కాదా? నేడు నా చిత్తమున కలగిన యీ వికార మేదేని పూర్వ నిదర్శనోదయము వంటిదా? అని నిట్టూర్పు విడచుచు నే నీ విధముగ అంటిని :

**అరుణ ఇవ పురః సరోరవిం, పవన ఇవాతి జవో జలాగమమ్ ।**
**శుభ మశుభ మథాపి వా నృణాం, కథయతి పూర్వ నిదర్శనోదయః ॥ ♦**

---

♦ హర్ష చరితము. నాలుగవ యుచ్ఛ్వాసము.

నాటి తర్వాత నేనా విషయమునె మఱచిపోతిని. నేడు హఠాత్తుగ ఆ వృత్తమే నా నోట వెడలినది. దుర్నిమిత్త మింకను తొలగిపోలేదా యేమి? నిన్న సాయంకాలమునుండి యిప్పటివఱకు నేను సుడిగాలివంటి ఘటనా వక్రములో చిక్కుకొని యుంటిని. ఏదైన అదృశ్యశక్తి యూహింపజాలని విషమ పరిస్థితుల వైపునకు నన్ను లాగుకొని పోవుచున్నదా ఏమి? నేటినుండి బాణభట్టుని హృదయము తామరాకువలె అనాసక్తమై యుండజాలదా? ఏమి జరుగనున్నదో యెవరి కెఱుక!

ఈ సమయముననే గృహద్వారమువద్ద అడవికోళ్ళు ఎగురుటవలన 'భర భర' మను శబ్దము వినబడినది. ద్వారమున కొకవైపు అయత్న వర్ధితములగు ఎఱ్ఱగన్నేరు చెట్లున్నవి. సాయంకాలము కాగనే అడవికోళ్ళు అచట చేరుచుండును. అవి తటాలున కదలుటచే నెవరో వచ్చిరని నాకు సందేహము కలిగినది. ఆ వచ్చినది తప్పక పూజారియే యయి యుండవచ్చునని యనుకొంటిని కాని వేగముగ వెలుపలికి చూడ నా కన్నులనే నేను నమ్మలేకపోతిని. ఇంతకు ముందెన్నడు చూడని దృశ్యము నాకు ప్రత్యక్షమైనది. పిడుగుదెబ్బ తిన్నవానివలె నేను రిత్తవోయి నిలుచుంటిని. నా యెదుట ముదురు గైరిక రంగుబట్టలను ధరించిన యువతి యుండినది. ఆమె యొకచేత త్రిశూలము, మఱియొకచేత నల్లని పాత్రను ధరించి యుండెను. విరబోసిన పింగళ వర్ణపు శిరోజములు పిక్కలవరకు వ్రేలాడుచు సాయంకాలపు టరుణ మేఘ మండలమున మెఱపు తీగలు అచంచలములై ప్రకా

శించు చున్నట్లు కనబడుచుండినవి. బంగారపుకాంతిగల ఆమె ముఖము గైరికవస్త్రముతో చుట్టబడి ధాతుమయమగు నుపత్యక యందలి. రేలచెట్టు పుష్పించినదా యన్నట్లుండినది. ఆమె కన్నులు వికసించిన కోవిదార కుసుమముల వలె నెఱ్ఱనై తీక్ష్ణమగు తేజము వానినుండి వెలువడుచుండినది. ఆమె రూపము మనోహరమైనది కాదుగాని భయమును కలిగించునదికూడ గాదు. ఆమె కఠోర స్వరమున నన్ను మందలించకుండిన నే నామెను సాక్షాత్తు చండీదేవియనియే తలచియుందును. నన్నచట చూచిన ఆమెకు కూడ ఆశ్చర్యము కలిగినది. ఒక్క క్షణకాలములో నామె యధరములు కంపింపసాగినవి. నేత్రములు మఱింత విప్ఫారినవి. నాసికాపుటములు అదరుచుండినవి. కనుబొమలు ముడివడినవి. ఆమె నుదుటిపై ముడుతలు స్పష్టముగ నగపడుచుండినవి. "ఈ సాధనా గృహమున చోరునివలె ప్రవేశించిన నీవెవడవురా?" అని యామె గర్జించినది.

నన్ను నే నింతవఱకు స్తిమిత పరచుకొనలేకుంటిని. ఏమి చెప్పవలెనో ఏమి చెప్పకూడదో నేను నిర్ణయించుకొనజాలకపోతిని. గ్రుడ్లు మిటకరించి నే నామెను ఎవరో భైరవి యనియే తలంచితిని. నాకప్పుడు ప్రాంగణ గృహమునందున్న విచిత్ర చిత్తరువులమాట జ్ఞప్తికి వచ్చినది. క్షణముముందు నే నేదుర్నిమిత్తమును గుఱించి శంకించుచుంటినో అది నా తలపై బడినట్లు నేను భావించితిని. కాని ఈ సమయమున భట్టిని యిటనుండి వెడలిపోయిన విషయము తలపునకు వచ్చినపుడు నా యానందమునకు మేఱలేదు. క్రమముగా నేను

స్తిమితపడి చేతులు జోడించి "మాతా! పరదేశస్థుడను. నా యపరాధమును క్షమింపుము" అని యంటిని.

భైరవి నన్ను పైనుండి క్రిందికి జాగ్రత్తగా పరికించి చూచి "నీవు బ్రాహ్మణుడవా?" అని ప్రశ్నించెను.

"నా జన్మము బ్రాహ్మణ వంశముననే జరిగినది."

"వేదవిహితకర్మల కలవాటు పడియున్నావా?"

"అత్యల్పము, తల్లి."

"ఈ సాధన గృహమున నీవేమి చేసినావు?"

భైరవి నావలన నేమి తెలిసికొన నభిలషించుచున్నదో నాకు బాగుగ నర్థముకాలేదు. నే నిచట వైదిక కర్మల నేమియు చేయలేదే? కాని ప్రాంగణ గృహమున పచ్చి మన్నుతో నిర్మింపబడిన వేదిక యున్నది. దానిని గుఱించి తప్పక జవాబు చెప్పవలసియుండును. ఆసందర్భమున భట్టినిని గుఱించిన ప్రస్తావన రావచ్చును. ఇప్పటివఱకు వామమార్గ సాధకులందు నా కంత గౌరవభావములేదు. విశేషించి ఆ మార్గము ననుసరించు స్త్రీల విషయమై నేను విన్న విష యములను బట్టి వారియెడ నాకు శ్రద్ధాభక్తులు కలుగు నవకాశములేదు. అందువలన నన్ను నేను అణచుకొని—

"తల్లీ! నే నీయింట తక్కువకాలమే యుంటిని. నే నిచట వైదిక అవైదిక కర్మ లేవియు నాచరింపలేదు" అని యంటిని.

నన్నుజూచి భైరవి నేనేదో దాచుచున్నానని పసికట్టి "నిజము చెప్పు. లేకున్న నీ కమంగళము కలుగును సుమా!" అని మందలించెను.

ఈమాఱు నేను భయపడితిని. వీరివలన శుభము కలుగక పోవచ్చును కాని అశుభముమాత్రము తప్పక జరుగ గలదని నా నమ్మకము. నేను కేలుమోడ్చి "మాతా! అజ్ఞానులను కరుణించవలెను!" అని యంటిని. భైరవి చిఱు నవ్వు నవ్వెను కాని యా నవ్వు నారీజనోచితమైన నవ్వు కాదు. సౌశీల్యము, వినయము, సిగ్గు, మాధుర్యము మొదలగు భావము లానవ్వులో మచ్చునకైనను లేవు. అది గూఢార్థము గల నవ్వు తోకచుక్క క్షణిక ప్రకాశమువలె ఆనవ్వు నా మనస్సులోని సందేహ భయాదుల నుద్దీప్త మొనర్చినది. నేను భయపడుచు "మాతా! అపరాధము! క్షమించుము" అని యంటిని.

భైరవి "ఇటు రమ్ము" అని నన్నాదేశించి బిగ్గరగ "ఆర్యా, వీడెవడో చూడుడు" అని యనెను.

భైరవి నన్ను శిథిలమైన యా దిగుడు బావి వద్దకు తీసుకొని వెళ్ళినది. అప్పటికే యచ్చట ముగ్గురు వ్యక్తులుండిరి. వచ్చిన నలుగురిలో నిద్దరు సాధకులు, ఒకడు భైరవుడు; నన్ను మందలించిన భైరవియు కలరు. వారిలో భైరవుడే ముఖ్యుడు. అతడు వ్యాఘ్రచర్మముపై నించుక మేను వాల్చి యుండెను. అతని శరీరమునుండి ఒక విధమైన తేజము వెడలుచుండెను. అతని తలపై వెంట్రుకలు లేనట్లే భావించవచ్చు కాని యతని కర్ణ శష్కులులు శ్వేత కేశములచే నాచ్ఛాదితములై యుండెను. నుదుటపడిన ముడుతలు కనుబొమల నడుమువఱకు వ్యాపించియుండెను. కనుబొమలు రెండును కలిసిపోయి యుండి ముఖమంతయు చిన్న చిన్న

వెంట్రుకలచే పరివ్యాప్తమై యుండెను. అతని కన్నులు ఆకర్ష ణీయముగనుండి చూచుట కవి పెద్ద పెద్ద సముద్రపు గవ్వలా యని భ్రమ కలుగుచుండెను. ఆ కన్ను లోకసారియైనను పూర్తిగా తెరువబడలేదా యన్నట్లు తోచుచుండెను. ఎల్లప్పు డును అర్ధనిమీలితములై యున్నందున కన్నులక్రింద మాంస ఖండము లుబ్బియుండి తత్పరిణామముగ చెవిలో ఒక ముడత స్థిరముగా నేర్పడియుండెను. అతని వేషము నతని వామ మార్గమును స్ఫురింపచేయు గుర్తేదియు లేదు. కాని కుడి వైపున ఉంచిన పాన పాత్రను జూచి వామ మార్గమునకు చెందిన అవధూతస్వామియా యని యూహింపవచ్చును. అతడు చిన్న వస్త్రఖండమును ధరించియుండెను. కాని అది యతని శరీరమును పూర్తిగా కప్పుటకు చాలలేదు. అతని కడుపు సాధారణముగ నుండక కొంచెము పెరిగి యుండెను. భైరవి అతని దగ్గఱకు వెళ్ళి "బాబా, ఇటు చూడుడు. ఇతడు సాధనాగృహము నపవిత్ర మొనర్చి యున్నాడు" అనెను. బాబాగారి కన్నులు మూతబడి యుండెను. భైరవి పలుకులు విని అతడు కొంచెము మెలకువజెంది తన అర్ధ నిమీలిత నేత్రములతో నన్ను చూచెను. ఆ దృష్టి పవిత్ర మైనదిగ నా కగుపడినది. తర్వాత అతడు తిరిగి కన్నులు మూసికొని కొంతసే పూరకుండిన పిదప "మాయావినీ! మాయావినీ! మాయావినీ!" అని ముమ్మాఱు పల్కెను. అతడు ప్రత్యక్షముగ నిదంతయును చూచుచున్నట్లును భూత భవిష్య ద్వర్తమానములు అరచేతిలోని యుసిరికాయవలె నతనికి కనబడుచున్నట్లును నాకు తట్టినది. భైరవి మఱియొక

సారి నేను చేసిన యపరాధమును నతనికి చెప్పెను. బాబాగారు పిల్లవానివలె నవ్వుచు "ఏమిరా! నీవచటి కెందుకు వెళ్ళితివి? పిచ్చివాడా! అది మాయావిని! దాని వలలో చిక్కితివా ?" అని పలుకుచు చండికాలయములోనున్న ప్రతిమ వైపునకు వ్రేలుచూపెను. తర్వాత అతడు నన్ను "ఒంటరిగ నుంటివా?" అని అడిగెను. బాబా అన్ని సంగతులు తెలిసికొన్నాడనియు అతని దగ్గఱ నిక దాచుట వ్యర్థమనియు నేను తలచితిని. కాని బాబా అభిప్రాయము వేఱు. నాకది అర్థముకాలేదు. నేను తడబడుచు "బాబా! నిన్న దుఃఖములో మునిగియున్న ఇరువురు స్త్రీలవెంట నేనును ఈ యింట బస చేసితిని. ఈ యింట మేము వంట చేసికొని భోజనము యెంగిలిచే దీని నపవిత్ర మొనర్చినాము. నేను ఆశ్రయమొసగుటకై తీసికొని వచ్చినవారిలో నొక కన్య ఇచట మహావరాహుని పూజ చేసినది. కాని యిది యంతయు తెలియక చేసిన పని. మా యపరాధము క్షంతవ్యము" అని విన్నవించుకొని భయముతో ప్రణమిల్లితిని. బాబాగారు "భయపడుచున్నావా?" అని ప్రశ్నించగా నేను "అవును బాబా" అని యంటిని.

పిల్లవాడు వింత వస్తువును చూచుటకు కుతూహల పడునట్లు బాబా కొంచెము మెలకువ పడెను. అతడు లేచి కూర్చుండి నన్ను దగ్గఱకు పిలచెను. నేను అతని దగ్గఱకు వెళ్ళగనే యతడు నా లలాటమును స్పృశించెను. తర్వాత నా రెండు కనుబొమల మధ్యభాగమును తన యంగుష్ఠముచే గట్టిగ నొక్కి విడచెను. నా తల గిఱ్ఱున తిరిగిపోయెను. ఒక క్షణములో నాయెదుట నొక భయంకరమైన దృశ్యము

ప్రత్యక్షమయ్యెను. భట్టిని నిపుణిక యిరువురు నావలో కూర్చుండి తూర్పు దిక్కుగా వెళ్ళుచున్నట్లు నేను గాంచితిని తూర్పుదిక్కున • ఆకాశము కారు మబ్బులచే నావరింపబడి యుండెను. మేఘముల ముందు పింగలవర్ణమగు గాలి దుమారము రేగుచుండెను; దానికి ముందు తాలచంచు పక్షుల సమూహ మొకటి మేఘములతోడను, దుమారము తోడను ఆడుకొనుచు వెళ్ళుచుండెను. నేను గట్టుపై నిలుచుండి యీ దృశ్యమును చూచుచుంటిని. మబ్బు మఱింత దట్టము కాజొచ్చెను. వాయు మండలము కొంచెము చల్లబడు చుండెను. తీవ్రమగు పెనుగాలి వీచుచు నాకాశ ముఱుములు మెఱపులతో నిండిపోయెను. గంగానదిలోని యుత్తుంగ తరంగములు క్రోధమూని పరస్పరము కలియబడుచున్న ట్లుండెను. ఆకాశము ధూళిచేతను, దిఙ్మండలమంతయు అంధకారము చేతను, గంగానదీ ప్రవాహము ఫేనపుంజము తోడను ఆవృతమయ్యెను. చూచుచుండగనే భట్టినిని గొనిపోవుచున్న నావ యంధకారమున నదృశ్యమయ్యెను నేను సంజ్ఞాశూన్యుడనై స్థంభించిపోతిని. నా నోట మాట రాలేదు. నాకాళ్ళ క్రిందనుండు పృథ్వి కుమ్మరి చక్రమువలె గిఱ్ఱున తిరుగు చున్నట్లుండెను. అట్టితఱి నొక మెఱుపు మెఱసెను. నావ నదీ ప్రవాహములో మునిగిపోయెను. భట్టినీ నిపుణికలు నదిలో దుమికిరి. అటు తర్వాత అంధకారము, మేఘ గర్జనము, సీత్కారము తప్ప మఱేమియు గోచరింపలేదు. నాతల గిఱ్ఱున తిరిగిపోయినది. రక్త ప్రవాహపు టొత్తిడి సహించలేవా యన్నట్లు రక్తనాళము లుబ్బిపోయినవి. క్రమ

క్రమముగ ఆకసమున మేఘము లావరించి తుఫాను చెలరేగు చుండెను. మేఘ గర్జనము మఱింత యెక్కువై పెనుగాలి ధ్వని దిఙ్మండలమంతయు వ్యాపించుచుండెను. నేను "ఆర్యా, రక్షించుము! రక్షించుము!" అని కేకలిడితిని. ఆ సమయమున నా లలాటముపై నంగుష్ఠముచే తాకినట్లు తెలిసినది. గంగా ప్రవాహము శాంతమై ఆకాశములోని మబ్బులు విచ్చి పోయినవి. భూమండల మంతయు ప్రశాంతముగ నుండినది. భట్టిని నావలో విశ్రమించుచుండుట నేను కాంచితిని. నిపుణిక ఆమె పాదములచెంత కూర్చుండి యామెతో నేదో మాటలాడు చుండెను. భట్టిని ప్రసన్నవదనయై యుండెను. ఆమె కన్నులలో నుత్సాహ మగుపడుచుండెను. ఆమె కపోలములు విప్పారి యుండెను. తర్వాత నేను బాబాగారిని చూచితిని. అతని యర్ధనిమీలితములైన కన్నులలో మంద హాసము నాట్యముచేయుచుండెను. నేను భయముతో "బాబా, నేను చూచిన దంతయు నేమిటి? ఈవిధముగ జరుగనున్నదా యేమి?" అని యడిగితిని. బాబాగారు బాల సహజ వినోదముతో "నా కేమి తెలియును!" అని తన కన్నులు మూసికొనిరి. ఇంచుక భావావేశమును కనబఱచుచు అతడు "ఎంతమాయ నేర్చినావే వెఱ్ఱిదానా!" అని నన్ను చూచి "ఏమిరా! భయపడుచున్నావా?" అని యడిగిరి.

"నా అపరాధమును క్షమించుడు, స్వామీ!"

"నీ వేమైనా యపరాధము చేసినావా, నాయనా?"

"స్వామీ, నేను మానవమాత్రుడను. తప్పులు చేయు

చునే యుందును. కాని తెలిసి తెలిసి యెవరికీ నేను కీడు చేయలేదు. నేను అశుభమునకు వెఱచుచుందును."

"బ్రాహ్మణుడవా ?"

"చిత్తము స్వామీ !"

"మీ జాతియే పిఱికిజాతి. సరే! మహావరాహునిపై నీకు విశ్వాసము లేదా ?"

"ఉన్నది స్వామీ."

"అసత్యవాదీ, నీ జాతియే అసత్యపు జాతి ! సరేకాని, నీవు ఆత్మను నిత్యమని భావించెదవా ?"

"చిత్తము స్వామీ !"

"ధూర్తుడా ! నీ శాస్త్రము లన్నియు నీకు వంచనయే నేర్పునుకదా ! నీవు కర్మ ఫలములను ఒప్పుకొందువా ?"

బాబాగారి ఈ ప్రశ్నకు నేను వెంటనే జవాబు చెప్ప జాలక పోతిని. నా జాతికి మఱొకతిట్టు తగులునేమోయను భయము కలిగినది. మాటను త్రోసిపుచ్చుటకై డొంక తిరుగుడుగ నేను "ఎలా చెప్పను స్వామీ ?" అని అంటిని.

బాబాగారు నవ్వి "కర్మఫలము ఒప్పుకొందువా, లేదా? చెప్పు" అని యనిరి.

"ఒప్పుకొందును స్వామీ !"

"అయితే అశుభమునకు వెఱపెందుకు ? నీవు మిథ్యాచారవంతుడవు !"

"చిత్తము స్వామీ !"

"సత్యమును గ్రహించరాదా ?"

"అనగా ?"

"అనగా భయము విడచిపెట్టుట, విశ్వాసము కలిగిన దానిపైన ఏమైనను సరే పూర్తిగ విశ్వాసము నుంచుట, దేని నొప్పుకొందువో దానిని చివరవఱకు వదలకుండుట."

"నేను మాయ పంకిలములో తగులుకొన్న కీటకమును స్వామీ! ఎన్నియో విషయములు తెలిసికొన కలిగినను, ఆచరింపలేకున్నాను."

"ప్రవంచకుడా! మీ జాతియే మోసపు జాతి. నానా విషయముల నెందుకు తెలిసికొనుచుందువు? ఒక్క దానిని చక్కగా తెలిసికొని దానినే యాచరించు. ఏమిరా! నీకా యమ్మాయిమీద మమత్వ మున్నదికదా ?"

ఇది గడ్డుప్రశ్నయే! ఏమని జవాబు చెప్పగలను? అందువలన మౌనము వహించుటయే యుచితమని తలచితిని. ఆ సమయముననే బాబాగారు భైరవిని ఉద్దేశించి "మహామాయా! అంతయు సిద్ధమేనా ?" అని ప్రశ్నించిరి. భైరవి "ఇదిగో ఇప్పుడే సిద్ధము చేసెదను" అని యామె లేచెను. ఆమె వెంట నా యిద్దరు సాధకులు లేచిరి. నేను మాత్రము బాబాగారి కడనుంటిని. బాబా మఱల "ఏమిరా! నా ప్రశ్నకు జవాబు చెప్పవేమి ?" అనిరి.

నేను చేతులు జోడించి "స్వామీ, ఆ కన్యయొక్క సేవకుడ నగుటయే భాగ్యము. ఆమె మేలుకై నేను ప్రాణములైనను నర్పించగలను" అని యంటిని.

బాబాగారు నవ్వుచు- "నేను నీ ప్రాణము లడుగలేదు. నీకు ఆమెపై మమత్వము కలదా; లేదా అని తెలిసికొన

గోరితిని. దానికి సరియైన జవాబు 'ఉన్నద'ని నీవేల చెప్పవు? మీ జాతియే వక్రమైనదికదా! ఆఁ! మఱి మహావరాహునిపై మమత్వ మున్నదా?"

"చిత్తము స్వామీ!"

"ఒకవేళ యెవరైన రాక్షసుడు నిన్ను కాలిక్రింద త్రొక్కిపెట్టి, యెడమచేత నీ స్వామినిని, కుడిచేత మహా వరాహుని విగ్రహమును పట్టుకొని, నీ ప్రాణాల నర్పించి యీ రెండింటిలో దేనిని రక్షింపగోరెదవో చెప్పుమని ప్రశ్నించిన నీ వెవరిని రక్షించుటకు నీ ప్రాణములను సమ ర్పింప కోరెదవు?"

బాబా విచిత్రమైన జీవి. ఇట్టి ప్రశ్న వేయవచ్చునా? నేను కొంచెమునే పాలోచించి "నేను ఇద్దఱిని రక్షింప గోర దను" అని అంటిని.

బాబా మండిపడుచు "పాపాత్ముడా! కర్మదరిద్రుడా! ప్రవంచకుడా! తిరిగి నీవు అసత్యమునే పలుకుచుంటివా? పోగరుబోతా! నీవు మహావరాహుని రక్షింపగలవా?"

నేను హతచేష్టుడనై, నిరుత్తరుడనై స్థంభించిపోతిని. బాబాగారికి నిజముగ కోపము రాలేదు. నన్ను పరీక్షించుటకై యతితీవ్రరూపము దాల్చియుండెను. నేను కంపించి పోతిని. అప్రయత్నముగ నా నోటనుండి "ప్రాణముల నర్పించి, నేను భట్టినినే రక్షించెదను" అను మాటలు వెడలినవి.

బాబా నవ్వుచుండెను. అతని అర్ధ నిమీలిత నయన ములు మిలమిల లాడినవి. నన్నుచూచి యాతడు "మంద భాగ్యుడా! జీవిత మంతటిలో ఈ ఒక మాటయే నీవు చెప్పిన

నిజము. సిగ్గుపడుచున్నావా ? ఛీ! పిచ్చివాడా ! ఆమాయావిని వలలో దగుల్కొనుచున్నావా ? త్రిపురసుందరి ఏ రూపమున నీ మనసును మఱపించుచున్నదో, దానిని సాహసముతో స్వీకరించరాదా ? నీవు జన్మాంతము దరిద్రుడవే! దరిద్రుడవై యుండెదవా, వెఱ్ఱివాడా! నీ మనసునందు మహావరాహునిపై కంటె నా యువతియెడ నెక్కువ గౌరవమున్నది. నిజమేనా ! దౌర్భాగ్యుడా ! మఱల అసత్యము చెప్పెదవా ?" అని యనెను.

నేను "లేదు స్వామీ! తెలిసి తెలిసి నేను అసత్యము చెప్పలేదు. ఎవరో నాచే చెప్పించుచున్నారు. భట్టినియెడ నాకు పూజ్యభావము కలదను మాట నిజమే" అని యంటిని.

"ఇప్పుడు నీవు నిజము పల్కుచున్నావు. భువన మోహిని దర్శనము లభించియు దారి తప్పి తిరుగుచున్నావోయీ పిచ్చివాడా ! చూడు. నీ శాస్త్రములు నిన్ను మోసగించుచున్నవి. అవి నీలోనున్న సత్యమును అణచివేయుమని ప్రోత్సహించుచున్నవి. నీలోనున్న ఆకర్షణశక్తిని మఱచిపొమ్మని చెప్పుచున్నవి. నీవు పూజించుచున్నదానిని వదలిపెట్టుమని నీకు సలహా యిచ్చుచున్నవి. నాయనా ! ఇది మాయావిని ! నీవు దీని వలలో చిక్కుకొన బోకుము. పురుషులందరిని భ్రమింపచేసి, స్త్రీలను కష్టపెట్టుచున్నది. తన మాయా దర్పణమును నలువైపుల నమర్చియున్నది. నీవు దానిని చూడలేకున్నావు; నేను చూచుచున్నాను. అది నిన్నుచూచి నవ్వుచున్నది." అని బాబా యనెను.

నేను ముగ్ధుడనై బాబాగారిని చూచుచుంటిని. అతని ప్రతి వాక్యము నా హృదయమునకు గొప్ప యాందోళనమును కలిగించుచు ఎన్నో సంవత్సరములనుండి కరుడుగట్టిపోయిన మైలను కడుగుచున్నదా యన్నట్లుండెను. బాబాగారిమాటలు చిత్రముగ కన్పట్టినను, హృదయవిదారకములై యుండెను. ఒక ముహూర్త కాలము సమ్మోహితుడనై యుండి నేను చేతులు మోడ్చి "స్వామీ! నేను చూచినదంతయు జరుగనున్నదా!" అని ప్రశ్నించితిని.

బాబాగారు నిర్భయముగ "జరుగనిమ్ము. మునుకొని పోయిన దేమున్నది? ఈ మాయలో నీ వెందుకు తగుల్కొనెదవు? జరుగనున్నది జరుగనిమ్ము! ఎంత ఆనందదాయక విషయము! పిచ్చివాడా! నిన్ను నీవు మఱచుచున్నావు. ఈ మాయాలీలలో నీ కానందము కలుగలేదా? సరే కాని, నీ వా యమ్మాయిని గుఱించి ఏ మనుకొనుచున్నావో చెప్పు."

"నేను—నేను—నేను."

"ఛీ మూర్ఖుడా! చెప్పవేమి? నీ మనస్సునకు మొదట తట్టినమాట చెప్పు."

"ఆర్యా, ఆమె పవిత్రమూర్తి."

"నీవు పశువువు కాదే!"

నాకేమియు అర్థము కాలేదు. ఈ సమయముననే భైరవి అచటికి వచ్చినది. ఆమె పేరు మహామాయ. బాబాగారు ఆమెను చూచి "మహామాయా! వీడు పశువుగా కనబడలేదు. కాని వీరుడుకూడ కాదు. అశుభమునకు వెఱచు

చున్నాడు. ఈనాడు వీనికి ప్రసాధమిమ్ము. అమంగళమును తలచుకొని వీని చిత్తము క్షోభ నొందుచున్నది” అనెను.

మహామాయ కొంతసే పూరక నిలుచుండినది. తర్వాత వినయముగ ఆమె “ఇతనికి అధికారము కలదా స్వామీ ?” అని ప్రశ్నించెను.

బాబాగారు నవ్వుచు “నీవుకూడ ఆ మాయాజాలము నుండి తప్పించుకొనలేదా మహామాయా ! వీడు పశువుకాదని చెప్పితినే ! అధికారము లేకున్నను నేమిచేయగలడు? ని న్నప కీర్తిపాలు చేయుచు తిరుగుచుండు ననియేనా ? భయపడు చుంటివా ? నీవుకూడ భయపడుచున్నావా ?” అనిరి.

మహామాయ “తమ యాజ్ఞానుసారమే చేసెదను స్వామీ” అనెను. బాబాగారు “అలాగైతే ఉండుము. నేను నీకు నమ్మకము కలిగించెదను” అని అతడు నన్ను తన దగ్గ ఱకు పిలిచెను. ఇంకను నేమి చూడవలసి వచ్చునో కదా యని యాలోచించుకొని భయపడుచూ నేను అతని దగ్గఱకు వెళ్ళితిని. అతడు నా యుత్తరీయమును తొలగించి నా వెన్నెముకను మెల్లమెల్లగ పరీక్షించెను. వెన్నెముకను సగమువరకు పరీక్షించిన తర్వాత అతడు తన చేతిని తీసివేసి “చూడు మహామాయా! నేను సరిగా చెప్పితిని. వీని కుంతలిని ప్రబుద్ధమై యున్నది” అనెను.

మహామాయకూడ ఆ స్థానమును తాకి చూచెను. అప్పుడామె కూఱట కల్గినది. ఆమె “మీ యాజ్ఞను పాలిం చెదను స్వామీ” అనెను.

బాబా "వీనిని ఆ బావివద్ద కూర్చుండబెట్టుము" అని ఆమెకు చెప్పి నా వైపునకు తిరిగి "అమంగళము తొలగిపో గలదు. కాని అమంగళమునే నీవు మంగళకరమని ఏల తలంచు కొనవు? నేడు పూర్ణిమ. చంద్రోదయము కాగనే వీరు తమ గోపనీయమగు సాధనలను చేయుదురు. తర్వాత మహామాయ నీకు ప్రసాద మొసగును. దానిని నీవు శ్రద్ధతో గ్రహిం చుము. చూడు నాయనా! నీవు భ్రిమ్మతిరుగవద్దు. ఈ బ్రహ్మాండమునందలి ప్రత్యణువు దేవతా రూపమే. దేవు డేరూపమున, నిన్నధికముగ నాకర్షించెనో దానినే నీవు పూజింపుము. నేను నీకొక మంత్ర ముపదేశించెను, ఇటు రమ్ము" అని అనెను. నేను అయస్కాంతముచే నాకర్షింప బడిన లోహపు ముక్కవలె బాబాగారిచెంత కరిగితిని. అతడు నాకొక మంత్ర ముపదేశించి. "నీ మనస్సునందు లోభ మోహ భయములు కలిగినపుడు నీవీ మంత్రమును జపిం చుము" అని యాదేశించెను.

నేను భక్తిపూర్వకముగ బాబాగారి మాటలను శిరసా వహించితిని. కొంతసేపటివరకు బాబాగారు నిశ్చలముగ నాసీనులై యుండిరి. అంతలో ఎవరి కాలి చప్పుడో విని, "ఎవరక్కడ?" అని అడిగిరి.

"విరతి వజ్రుడను స్వామీ"

"రమ్ము"

విరతి వజ్రుని వయస్సు ఇరువదియైదు సంవత్సరముల కంటె తక్కువగనే కనబడుచుండెను. అతడు బౌద్ధ భిక్షువు వలె చీవరమును ధరించి యుండెను. కాని ఆ చీవరము రంగు

పసుపు రంగు గాక ఎఱ్ఱగనుండెను. వెన్నెలలో ఆ రంగు మరింత ప్రకాశముగ నుండెను. అతని కంఠస్వరము బాల కోచితముగ కోమలమై యుండెను. అతడు బాబాగారికి సాగిల బడి మ్రొక్కి ఒక వైపు శాంతముగ కూర్చుండెను. బాబా గారు మునుపటి వలెనే తూగుచుండిరి. కొంచెము సేపటి తర్వాత వారు "విరతీ, నీవేమి నిశ్చయించుకొంటివి?" అని యడిగిరి.

"ఆర్యా! నాకేమియు గోచరము కాలేదు. నా యాది గురువగు అమోఘ వజ్రులు నన్నీవిధముగ చేయుమని యాదేశింపలేదు. నైరాత్మ్య భావమునందు స్థిరముగ నుండవలసిన దని వారు నాకుపదేశించిరి. ఒక పరి నామనస్సు చాల కలత చెందుట చూచి గురువుగారికి కూడ చాల విచారము కలిగి నది. నా మనసు కలత చెందుటకు కారణము నేను తమరికి విన్నవించు కొనియే యున్నాను. ఒకనాడు గురువుగారు నన్ను పిలిచి, 'వత్సా, నేనిక నెక్కువకాలము జీవింపను. నీవు కాలాచార్యులగు అఘోర భైరవుల వద్దకు పొమ్ము. అతడే నీకు తగిన వ్యవస్థ చేయగలడు అనిరి. నాటినుండి నేను తమకొరకు వెదుకుచుంటిని. కాని మా ఆది గురువులు తమ వద్ద కేల పంపిరో నాకు సరిగా తెలియదు" అనెను.

"నైరాత్మ్య భావము నీకు చక్కగా అర్థమయినదా?"

"లేదు స్వామీ!"

"నిన్నెవరైనను నమ్ముకొని యున్నవారిని వదలివేయ గల సాహసము నీకున్నదా?"

"లేదు స్వామీ!"

" 'నీవు' 'నేను' లోని భేదమును మరచిపోవుట నీ కిష్ట మేనా?"

"లేదు స్వామీ!"

" 'బుద్ధుఁడు' 'బద్ధుఁడు!' ఈ రెండింటిలో నుండు భేదము నీకు నచ్చునా? నచ్చదా?"

"ఆర్యా, నాకు అది నచ్చును"

"మంచిది నాయనా! నీవు సత్యవాదివి. అమోఘ వజ్రుడు వెనుకముందు లాలోచించియే నిన్ను నా వద్దకు పంపి నాడు. నీవు బౌద్ధుల తంత్రవిద్యను పొందుట కధికారివికాదు. వామమార్గమును నీవు గ్రహింపవచ్చు; కాని యీ మార్గ మున శక్తిలేనిదే సాధన జరుగదు. ఈ విషయమున నీవొక నిశ్చయమునకు రావలెను.

"స్వామీ! యిదే నాకర్థము కాలేదు."

"నీవు స్త్రీ పురుష భేదము మఱచిపోనంత వరకు నీవు అపరిపూర్ణుడవుగను ఆసక్తుడవుగను ఉందువు. అంత దనుక 'నీవు' 'నేను' అను భేదము నిన్నంటియే యుండును. నీలో నైరాత్మ్యభావ ప్రవృత్తి యున్న యెడల శక్తి లేకయే నీవు సాధన చేసియుండవచ్చును. నీలో ఆ ప్రవృత్తిలేదు. అందువలన ఈసాధన చేయవలయునని నిన్ను నేను బలవంత పెట్టజాలను. నీ కిష్టమున్నచో దీనిని గ్రహించుము. ప్రవృత్తులను దాచుట ఉచితము కాదు. వానినిగుఱించి భయపడుటయు తగదు. వానిని గుఱించి సిగ్గు పడుట యుక్తము కాదు. ఈ మాటలను గట్టిగా జ్ఞాపకముంచుకొని గురువుగారి యుపదేశముల ననుస

రించు చుండుము. 'నీవు నేడు, చక్రమునందు మాతో కూర్చుండ వచ్చును." అని పలికిరి.

విరతి వజ్రుడు సాష్టాంగ ప్రణామ మాచరించి యతని యాజ్ఞను శిరసావహించెను. అతని ముఖమును చూచిన వెంటనే యతనిలో నేదో యొక గొప్ప యాందోళనము కల దని స్పష్టముగా కనబడుచుండెను. కాని తాను తన శక్తి నంతయు వినియోగించి దానిని కప్పిపుచ్చుటకు ప్రయత్నించు చుండెను. గురువు గారికి నమస్కారము చేసిన తర్వాత అతడు నా వైపునకు తిరిగెను. ఈ మాఱు చంద్రకిరణములు అతని ముఖముపై బడుచుండెను. ఆహా! ఎంత కమనీయమగు ముఖమండలము! ఎఱ్ఱని చీవరము ధరించి యున్న విరతి వజ్రుని చూచినపుడు నాకు ధూర్జటి నయనాగ్ని కీలల చుట్టు కొన్న మన్మథుడు జ్ఞప్తికి వచ్చుచుండెను. ఆ స్థానమున వైరాగ్య ముదయించినట్లు విద్యుల్లతయందు చంద్రమండ లము చిక్కుకొన్న తెరగున, సంధ్యారాగమున పుండరీకము తగుల్కొన్నట్లు, ఉషఃకాలపు గగన మండలమున శుక్రనక్ష త్రము స్థిరముగా నిలిచినదా యన్నట్లు, మన్మథుని మరణ శోక మున వసంతుడు వైరాగ్యమును స్వీకరించెనా యన్నట్లు తోచుచుండెను. కాని ఇదెట్లు సంభవము అని నే నాలో చించు చుండ విరతి వజ్రుడు నా వైపు జిజ్ఞాసాభావముతో చూచెను. వారిమధ్య నా వేష మతనికి విచిత్రముగా తోచు చుండెను. నాకును అతని రూపముచట విచిత్రముగనే కనబడు చుండెను. బాబాగారు జోక్యము కలిగించుకొని "విరతీ! ఇతడు పరదేశ బ్రాహ్మణుడు. సాధనాగృహమునందు నిన్న

తల దాచుకొన్నందున మహామాయ ఇతనిపై కించ బూనినది. ఇంకను ఆమె మాయాజాలము నుండి తప్పించుకొన జాల కున్నది. ఆ మాయావిని మాయ భయంకరమైనది! పన్నుకడ దురతిక్రమము! మహామాయ యింకను ఆ మాయాజాలమున తగుల్కొని యున్నది. ఇత డశుభమునకు వెఱచుచున్నాడు. ఇంకను మోహము వదలలేదు. క్రమక్రమముగ అది తగ్గిపో గలదు. అసంఖ్యాక జన్మములనుండి కరుడు గట్టుకొనిపోయిన సంస్కార ప్రభావము తొలగిపోవుటకు కొన్ని సంవత్సరములు పట్టవచ్చును. పశుతుల్యుడు గాడు కనుక ఉపయోగపడగలడు. నేడు మహామాయ యితనికి ప్రసాదము నిచ్చును. అందువలన ఆమెకు సంతోషము కలుగును. ఇతని భయము తొలగి పోవును." అని పలికి యత డాకాశము వైపునకు దృష్టి మఱలించి "విరతీ! సమయ మాసన్నమైనది. అమృత కలశమును కొంచె మిటు తెమ్ము" అనెను. విరతి ఆ పాత్రను బాబాగారి కంద జేసెను. బాబాగారు ముఖము ఆకాశమువైపునకు త్రిప్పి- "మాయావినీ! మాయావినీ!" అని పలుకుచు ఆ పాత్రను ఖాళీ చేసివేసెను. తర్వాత కొంతసేపటి వఱకు అత డపరిమితమైన మత్తుతో తూలుచుండి పిమ్మట లేచినిలబడెను. మేమిఱువురము కూడ లేచినిలచితిమి. అతడు విరతిని వెంట నిడుకొని సాధనా గృహములోనికి వెళ్ళుచు నన్ను కొంతసేపైన తర్వాత రమ్మని యాజ్ఞాపించెను. వెళ్ళునపుడు నన్ను జూచి "ఎవరికి భయ పడవద్దు! గురువునకు గాని మంత్రమునకు గాని, ప్రపంచ మునకుగాని, వేదమునకుగాని దేనికిని భయపడవద్దు! నే నుపదే శించిన మంత్రము జ్ఞాపకమున్నదికదా!" అని హెచ్చరించెను.

"చిత్తము స్వామీ!"

"కొంతసేపటికి ఎవరును పిలువకయే నిర్భయముగా లోపలికి రమ్ము. తెలిసినదా?"

"చిత్తము"

బాబాగారు వెడలిపోయిన తర్వాత నాకాలోచించు కొనుటకు అవకాశము చిక్కినది. ఇదెక్కడి కర్మము! నేనిక్కడికి వచ్చి అనవసరముగ దీనిలో చిక్కుకొంటినే! బాబాగారి మాటల యభిప్రాయమేమి? మహామాయ స్వయముగ మాయలో చిక్కుకొని యున్న యెడల నేనామె ప్రసాదమును నిష్ఠతో నేల గ్రైకొనవలెను? మఱి బాబాగారా ప్రకారమే యాజ్ఞాపించి యున్నారే! బాబాగారి ప్రభావమువలన నేను చూచినదంతయు సత్యమేనా? భట్టిని కిప్పుడేమియు ఆపద లేదుకదా? నిపుణిక గతి యేమైనది? నేను భట్టినినే పూజించుట కర్హుడనా? ఏమి ఆశ్చర్యము! ఈ చిన్న విషయములు నా మనసు నేల కలవర పెట్టుచున్నవి? అని యాలోచించుకొను చుండ నా తల తిరిగిపోయినట్లుండెను. ఇప్పుడు నాకు బాబాగా రుపదేశించిన మంత్రమే శరణ్యమని తలంచి, నేను నిష్ఠతో ఆ మంత్రమును జపింప సాగితిని. ఒక ముహూర్త కాలము గడచినవెంటనే బాబాగారు నన్ను పిలచుచున్నట్లు అకారణముగ నాకు తోచినది. వశీకరణముచే నాకర్షింపబడిన వాని వలె నేను సాధనా గృహము వైపునకు వెడలితిని. ప్రాంగణ గృహద్వారము నుండియే అత్యంత శాంత మృదు స్వరముతో ఈ శ్లోకము పఠింపబడుటను నేను వినగలిగితిని.

ఆదాయ దక్షిణకరేణ సువర్ణ దర్వీం
దుగ్ధాన్నపూర్ణ మితరేణచ రత్నపాత్రమ్।
భిక్షాన్నదాన నిరతాం నవ హేమ వర్ణా
మంబామ్ భజే సకల భూషణ భూషితాంగీమ్॥

ఆ కంఠము మహామాయది. అన్నపూర్ణా ధ్యాన మంత్రము పఠింపబడు చున్నందున నిజముగ భోజనము జరుగు చుండ వచ్చునని యూహించితిని. కాని లోపలికి వెళ్ళి చూడగా నేననుకొన్న భోజనమునకు అక్కడ చూచిన దృశ్య మునకు సంబంధమేలేదు. ఒక వర్తులాకార మండలమున ఐదు గురు వ్యక్తులు కూర్చుండి యుండిరి. కౌలాచార్యులగు అఘోర భైరవుల ప్రక్కన అతని నానుకొని మహామాయ భైరవి కూర్చుండి యున్నది. ఇరువురు భైరవ సాధకు లీవిధము గనే కొంచెము ప్రక్కగ కూర్చుండి యుండిరి. విరతివజ్రుడు మాత్రము ఒక వైపు పద్మాసనము వేసికొని కూర్చుండి యుండెను. బావికడ నా కాదేశించబడిన స్థానమున నేను కూర్చుంటిని. అచ్చట నుండి బాబాగారు, మహామాయయు నాకు నెదురుగ నుండిరి. సాధకులందరివద్ద తలకొక పానపాత్ర యుండెను. వారు ఎర్రని వస్త్రములు కప్పుకొని యుండిరి. కాని వారు శరీరములపై ఏమియు వస్త్రములను ధరించి యుండలేదు. ఇంతకుముందు వారి మొలలపై నున్న చిన్న చింకి గుడ్డకూడ ఎప్పుడు జారిపోయినదో తెలియదు. ఆమండ లము మధ్య ఎర్రని వస్త్రముచే కప్పబడిన కారణముతో (మద్యము) నిండిన పాత్ర యుండెను. దానిపైన అష్టదళ కమ లమువంటి యొక పాత్ర యుండెను. సాధకులందఱును జపము

నందు మునిగి యుండిరి. బాబాగారేమియు చేయక యూర కుండిరి. అతడు అద్భుతమగు ఆత్మ విస్మృతిలో మునిగి యుండెను. అతని శరీరమంతయు నివాత నిష్కంప దీపశిఖ వోలె స్థిరముగను ప్రశాంతముగను ఉండెను. అతని ముఖ మండలముపై చంద్ర కిరణములు పడుచుండి సమాధి యలదున్న శివుని శిరస్సునందు విరాజిల్లుచున్న మందాకినీ ధవళ ప్రవాహము సహస్ర ధారల ప్రవహించు చున్నదా యన్నట్లు అగుపడుచుండెను. నేనిపుడు మహామాయను బాగుగ చూడగలిగితిని. ఆమె ముఖము కమల కోరకమువలె కోలగ నుండెను. లలాటము అష్టమి చంద్రునివలె విశాలమై స్వచ్ఛముగ శోభిల్లు చుండెను. పాల నురుగువంటి వెన్నెల యందు ఆమె ముఖము మఱింత స్నిగ్ధమై యలరారుచుండెను. మొదటిసారి చూచినపుడు నేనామెను సరిగా అర్థము చేసికొన లేదు. విప్పారిన ఆమె కన్నులు, ముడివడిన కనుబొమలను చూచి యామె యెడ నాకు గౌరవభావము కలుగలేదు. కాని యిప్పుడు పార్వతీ ప్రతిమవంటి నిశ్చలమగు గౌరవర్ణ ముఖ మును గాంచి నా తప్పును నేను తెలిసికొంటిని. అఘోరభైర వుని పార్శ్వ భాగమున శాంతమూర్తియై కూర్చున్న మహా మాయ శంకరుని పార్శ్వవర్తిని యగు ఉమాదేవివలె శాంత ముగను మనోహరముగను కనబడు చుండెను. అనుష్ఠాన విధులను నిర్వర్తించుభార మామెపై నుండెను. బాబాగారు కదలక మెదలక ప్రశాంతముగ కూర్చుండి యుండిరి. మహా మాయ కారణఘటమునుండి పాన పాత్రలను మద్యముతో నింపుచు అస్ఫుటస్వరమున నేవో మంత్రముల నుచ్చరించు

చుండెను. క్షణకాలములో సాధకులందఱి పాత్రలు మద్య ముతో నింపబడెను. మహామాయ మొదట అఘోరభైరవుని చేతికి పాత్ర నందించెను. పాత్ర నందించుటకు ముందు ఆమె కొన్ని మంత్రములు పఠించెను. ఒకవేళ నా మంత్రములు సుధాదేవి ధ్యానశ్లోకములై యుండనోపు. అటు తర్వాత చాలసార్లు రెండు చేతుల విశేషమగు ముద్రలచే ఆ పాత్రను ముద్రాయిత మొనర్చి తనచుట్టు చిటుకలువేసి యేదో యను ష్ఠానము చేసినది. అది దిగ్బంధనవిధి యని నేను తలచితిని. బాబాగారు పానపాత్రను తన చేతికి తీసికొనగనే మిగిలిన సాధకులు కూడ తమ తమ పాత్రలను తీసికొనిరి. అత్యంత మృదు మంద్రస్వరమున విరతి వజ్రుడు మొదట పాత్రను స్తుతించుచు ఈ శ్లోకమును పఠించెను.

శ్రీమద్భైరవ శేఖర ప్రవిచల చ్చంద్రామృతా ప్లావితమ్
క్షేత్రాధీశ్వర యోగినీ గణ మహాసిద్ధ్యై స్సమా సేవితమ్।
ఆనందార్ణవకం మహాత్మకమిదం సాక్షాత్రిఖండామృతమ్
వందే శ్రీప్రథమం కరాంబుజగతంపాత్రం విశుద్ధిప్రదమ్॥*

మంత్ర పఠనము సమాప్తము కాగనే బాబాగారు పానపాత్రను మహామాయ అధరములకు తాకించి మెల్లమెల్లగ నిశ్శబ్దముగ మధువును సేవించెను. సాధకులు కూడ ఆవిధము గనే చేసిరి. కారణ సౌరభము కరవీర పుష్పముల సుగంధ ముతోడను గుగ్గిలపు ధూపముతోను కలసి నా మనఃప్రాణ ములను కొంతసేపు చలింప జేసినది. సాధకులలో నెవ్వరును

---

* మా: కౌలావలి నిర్ణయమ్: అష్టమ యుల్లాసము.

చలింపక జపము చేయుచునే యుండిరి. కొందఱు మాత్రము మధువును సేవించునపుడు కుడిచేత ప్రత్యేకమైన ముద్రలు ధరించిరి. కాని బాబాగారు మునుపటివలెనే యుండిరి. అతడు మంత్రోచ్చారణము గాని, ముద్రాధారణము గాని, అనుష్ఠానము గాని ఆచరింపలేదు. అతడు కైలాసపర్వతమున సమాధి గతుడైన ముక్కంటి వలె శాంతముగను నిశ్చలముగను ఆసీనుడై యుండెను. సాధకులు క్రమముగ రెండవ మాఱు, మూడవమాఱు, మధుపాత్రల నావాహనముచేసిరి. ఏడు మాఱ్లు మధుపాన ముద్రా జపములు ఒకటివెంట నొకటి క్రమముగ నడచెను. ఇతర భైరవుల జంట మాత్రము కొంచెము కదలినట్లు కనబడినది. కాని మహామాయ విరతి వజ్రులు యథాప్రకారముగ అనుష్ఠాన నిమగ్నులై యుండిరి. నా తల పగిలిపోవుచున్నట్లు నా కనిపించినది. ఇంతలో బాబాగారు కన్నులు తెఱచిరి. అతని మనస్సున నేవిధమైన చాంచల్య మున్నట్లు కనబడలేదు. ఒకమాఱు నలువైపుల పరికించి తిరిగి యతడు సమాధియందు మునిగిపోయెను. ఈ భైరవుల జంట మాత్రము మఱింత చంచల చిత్తులైనట్లు కనబడు చుండిరి. వెంటనే అఘోరభైరవులు శాంతస్ఫుట స్వరమున "శాంతి-మంత్ర పఠనము గావింపుడు." అని యాజ్ఞాపించిరి. మహామాయా విరతివజ్రులు మధురకంఠముతో శాంతి మంత్రమును పఠించిరి. నా కన్ని మంత్రములును జ్ఞాపకము లేవుకాని వాని భావము మాత్రము చాల గొప్పగ నుండెను. ప్రతి మంత్రము పూర్తికాగానే విరతి వజ్రుడు ఒంటరిగ ఒక

శ్లోకము పఠించుచుండెను. ఎన్నో మారులు విన్నందున నా కా శ్లోకమిప్పటికిని జ్ఞాపకమున్నది:

శివమస్తు సర్వజగతః పరహితనిరతా భవంతు భూతగణాః
దోషాః ప్రయాన్తు శాంతిం సర్వోలోక స్సుఖీభవతు॥
సర్వలోక స్సుఖీభవతు॥ *

భైరవుల జంట కుదురు పాటునొందినది. అనుష్ఠానము తిరిగి సాగినది. పదునొకండవ పాత్ర పూర్తికాగానే సాధకుల చేతులయందు అసాధారణమగు నాకృతులు కనబడినవి. అప్పటికి వెన్నెల తగ్గిపోయినది. ప్రాంగణము గాఢాంధ కారము చేతను వాయుమండలము మధుసౌరభముతోడను నభోమండలము గుగ్గిలపు ధూపముతోడను నిండియుండెను. ఈ దృశ్యమంతయు నాకు దుస్సహమయ్యెను. భయంకరా కారులగు భూతభేతాళులు ఆకాశమునుండి దిగివచ్చి కారణ ఘటము చుట్టును నిలుచున్నట్లు తోచినది. వర్తులాకారముగ నున్న సాధకుల మండలి నా కన్నులకు ఛాయలవలె కన్పడు చుండెను. ఉండియుండి యానీడలలో సంక్షోభము, కలవర మును కలుగుచున్నట్లుండెను. నేనిక భరింపజాలక పోతిని. నా తల గిఱ్ఱున తిరిగినది. నేను స్మృతితప్పి క్రిందకెప్పు డొరిగితినో నాకే తెలియదు.

కొంతసేపటికి నాకు స్మృతి కలిగినది. నాతలవైపున నేదో చల్లదనమును నేననుభవించుచుంటిని. నాకన్నులింకను మూతపడి యున్నను నా ఎదుట ఆకాశమధ్యము నుండి యానందభైరవు డవతరించు చుండుట నేను కాంచితిని. ఆయన

---

* 'నాగానందము' లోని చివర శ్లోకము, పూర్తిగ నిదే విధముగ నున్నది.

శరీరము కోటి సూర్యప్రభాసమాన మయ్యును కోటిచంద్రుల శీతలత్వమును నేను అనుభవించు చుంటిని. ఆయన సుధా సాగరమునుండి యుద్భవించిన బ్రహ్మయొక్క నాభికమలము నుండి లేచి సుధాధవళ వృషభరాజము నధిరోహించెను. కర్పూరగిరిపై నుద్భవించిన నీలమణి యంకురమా యన్నట్లు ఆ శ్వేత పార్శ్వభాగముపై ఆయన కంఠపు నీల వర్ణము కన బడుచుండెను. ఆయన తన పదునెనిమిది హస్తముల గంట, డమరుకము, పాశము, అంకుశము, మొదలగు వివిధాయుధ ములను, ఒకచేత నభయముద్రను ధరించి యుండెను. ఆనంద భైరవునితో ఆనందభైరవియగు సురాదేవి కూడా వచ్చు చుండెను. ఆనందభైరవుని వలెనే ఆమెకును ఐదు ముఖములు, మూడు నేత్రములు, పదునెనిమిది చేతులుండెను. ఆమె శరీరము కుందేందు తుషారధవళమై యొప్పుచుండెను. ఆమె కన్నులు కాటుక పిట్టలవలె లీలాపరాయణములై యుండెను. ప్రవాళము వంటి యామె యెఱ్ఱని పెదవులపై చిరునగవు తొణికిసలాడు చుండెను. ఆమె ఆనందపు ప్రతిమవలెను, మత్తునకు పుట్టినిల్లు వలెను, సౌందర్యమునకు విహారభూమివలెను, శోభకు నిలయము వలెను, మూర్తీభవించిన యౌవనముపలెను కనబడుచుండెను. ఆనందభైరవుని యానతిపై నామె నాశరీరమును స్పృశించినది. ఆమె స్పర్శ అమృత తూలికచే నా శరీరమును తుడిచిన ట్లని పించినది. ఆనందభైరవి నా తలను మెల్లమెల్లగ తనయొడి లోనికి తీసుకొనినది. అప్పుడు నా జడత్వమంతయు నొక్క సారిగ నంతరించి పోయినది. ఆనందభైరవి మందహాసముతో నా కన్నులను నా కపోలములను తన అమృతార్ద్ర హస్తము

లతో తుడిచినది. నేను కన్నులు తెఱచితిని అప్పుడు నా తల భైరవి యొడిలో నుండెను. నేను వశీకరణము చేయబడిన వానివలె "తల్లీ నా యపరాధమును క్షమింపుము. నే నీ నాడు కృతార్థుడ నైతిని." అని యంటిని. భైరవి ముఖమున నానందము తాండవించినది. ఆమె మఱియొకమారు భైరవుని యు, సురాదేవియొక్కయు ధ్యాన శ్లోకములను పఠించెను. నా తల మహామాయ యొడిలో నున్నదని నా కిప్పుడు తెలిసినది. ఆమె కంఠస్వరము స్పష్టముగను మధురముగను కరుణారస భరితముగను నుండెను. ఆమె కన్నుల మాతృ ప్రేమ ఉప్పొంగుచుండెను. ఆమె ముఖమునుండి యొక విధమగు స్నిగ్ధకాంతులు వెలువడు చుండెను. ఆమెలో కొంతమార్పు నా కగుపడినది. కృతజ్ఞతను తెలుపుచు నేను, "తల్లీ! నే నీనాడు కృతార్థుడనైతిని. చిన్ననాట నేను నా తల్లిని పోగొట్టుకొంటిని. తండ్రిగారి సాన్నిధ్య సౌఖ్యము కూడ నాకు చాలకాల ముబ్బలేదు. మాతా పితృహీనుడైన బాణభట్టుడు వాత్స్యాయన వంశమునకే కళంకముగ నేర్పడి నాడు. ఆనందభైరవి అమృతమయ హస్తస్పర్శనుపొంది నేడు నా జన్మ తరించినది. మాతా! నా అపరాధములను క్షమింపుము. అమంగళము శాంతించుగాక!" అని పలికితిని. భైరవి వాత్సల్యముతో "వత్సా! నీకు శుభమగును. ఇదుగో మహామాయా ప్రసాదమును స్వీకరింపుము." అని యనెను ఇప్పటికి నా కన్నులు పూర్తిగా మెలకువ చెందినవి. ఈమె మహామాయయే కదా! ఏకధారగా వర్షించిన పిదప లోడిమె నుండి జారిన అశోక పుష్పముల వలె. ఆమె కన్ను

లెట్టగనుండినను ఆర్ద్రములై యుండెను. శేఫాలికా కుసుమ నాళమువలె ఆమె ముక్కు పింగల వర్ణముగ నున్నను మనో హరమై యుండెను. విద్యుల్లతా సంవలిత మేఘమండలముచే ఆచ్ఛాదితమైన చంద్రమండలమును బోలిన ఆమె కపిళ వర్ణపు దేహచ్ఛాయ, జీరాడుచున్న కేశసంపదచే కప్పబడు చున్నను అభిరామముగ నుండెను. గాలివానచే విదిలించ బడిన కుసుమిత కోవిదార వృక్షమువోలె ఆమె పరిధానీయ వస్త్రము జారి ముడుతలు పడియున్నను అందముగ నుండెను. కారణఘటముపై నుంచిన జపాపుష్పము వోలె ఆమె సింధూర తిలకము చెదరియుండినను పవిత్రముగ తోచు చుండెను. ఆమె యాజ్ఞానుసారము నేను లేచి కూర్చుంటిని. ప్రేమాదరణములతో నామె నాకు ప్రసాద మొసగినది. ప్రసాదమునందు తేనె,అల్లము, వేయించిన కంద, అపరాజితా కుసుమ దళము లుండినవి. నేను భక్తి పూర్వకముగ ప్రసాదమును స్వీకరించితిని. మహామాయభైరవి నావైపు జిజ్ఞాసా భావముతో చూచుచుండినది. నేను నలువైపుల కొక మాఱు దృష్టిప్రసరింపజేసితిని. మహామాయతప్ప నచట నెవ్వ రునులేరు. కారణపాత్ర గాని, ఒక కరవీరపుష్పదళమైన గాని యచటలేదు. నేను వినయముతో "అమ్మా! ఆర్యఅఘోర భైరవులేరీ! మఱి యా యిరువురు సాధకులు కనబడరేః వారెక్క డికి వెళ్ళిరి?" అని ప్రశ్నించితిని. మహామాయ సంక్షేపముగ "అందఱును తమ తమ ఆశ్రమములకు వెళ్ళినారు. నేనుకూడ వెళ్ళెదను. నీకు ప్రసాదమిమ్మని బాబాగా రాజ్ఞాపించినందున నేనింత వఱకు ఆగియుంటిని." అని జవాబు చెప్పెను.

"వారందఱు తిరిగి యిచటికి రారా?"

"వైశాఖ బహుళ అమావాస్య కంటె ముందురారు"

"బాబాగారు కూడనా?"

"బాబాగారు అవధూతులలో సిద్ధుడు. ఆయనను గుఱించి ఇదమిత్థమని చెప్పలేము. ఆయన రావచ్చును, లేక రాకపోవచ్చును. ఆయన ప్రసాదము నీకు లభించుట నీపుణ్య ఫలమే యనవలెను."

"నేనొకమాట తమరి నడుగవచ్చునా?"

"అడుగుము."

"నిన్న బాబాగారు నాకు చెప్పినదాని యభిప్రాయ మేమి?"

"బాబాగారకంటే నేనేమి యెక్కువ చెప్పగలను?"

"ప్రవృత్తులను గౌరవించుటలో ఏమి అభిప్రాయము?"

"బాబాగారేమని సెలవిచ్చిరి?"

"ప్రవృత్తులకు భయపడుట, వాని నణచివేయుట తప్ప నియు, వానిని కలిగియున్నందుకు సిగ్గుపడుట బాలభావమనియు ఆయన చెప్పెను. అంతేకాదు. త్రిభువన మోహిని యగు మాయ నిన్నేరూపమున ఆకర్షించెనో దానినే పూజించవల సినదనియు, ఆ రూపమే నీకు దేవత యనియుకూడ ఆయన సెలవిచ్చెను. తరువాత విరతి వజ్రునితో ఆయన ఈ మార్గ మున శక్తిలేనిదే సాధన జరుగజాలదనియు, నే నింతవఱకు విన నట్టి విషయముల నింకెన్నో చెప్పెను తల్లీ! స్త్రీనే శక్తి యనె దరా? త్రిభువన మోహిని స్త్రీ రూపమున ప్రకటిత మగు చుండునా?"

"చూడు అబ్బాయీ, నీవు అనవసరముగ తర్కించు చున్నావు. బాబాగారు చెప్పినది పురుషుని దృష్ట్యా అదే సత్య స్వరూపము. స్త్రీ దృష్టియందు సత్యస్వరూప మదేవిధ ముగ నుండదు."

"తల్లీ, అది పురుషుని సత్య స్వరూపమునకు వ్యతిరేకమా?"

"కాదు నాయనా! ఒకదాని కొకటి పూరకము. పూర్తి చేయునది విరుద్ధముగ నుండదు."

"నా కర్థము కాలేదు తల్లీ!"

"క్రమక్రమముగ తెలిసికొందువు. గురువుగారికి నీపై ననుగ్రహము కలదు. నీ కుండలిని ప్రబుద్ధమై యున్నది. నీకు కౌలావధూతుల ప్రసాదము లభించినది. తొందర పడకుము. కాని ఒకమాట మాత్రము జ్ఞాపకముంచుకొనుము. పురుషుడు వస్తు విచ్ఛిన్నమై భావ రూపమున నుండు సత్యమునందే యానందమును పొందుచున్నాడు. కాని స్త్రీ వస్తు పరిగృహీత మగు సత్యము నందు ఆనందమును పొందుచున్నది. పురుషుడు నిస్సంగుడు. కాని స్త్రీ ఆసక్తురాలు. పురుషుడు నిర్ద్వంద్వుడు. కాని స్త్రీ ద్వంద్వోన్ముఖురాలు. పురుషుడు ముక్తుడు, కాని స్త్రీ బద్ధురాలు. పురుషుడు స్త్రీ శక్తి నర్థము చేసికొనిపూర్ణత్వమునుపొందగలడు. కాని స్త్రీ స్త్రీశక్తి నర్థము చేకొనసిన్నందున అపూర్ణత్వమును పొందుచున్నది.

"అయితే స్త్రీ పూర్ణత్వమును పొందుటకు పురుషుని శక్తిని అర్థము చేసికొన నవసరము లేదా?"

"లేదు. అందువలన స్త్రీ కేమియు నుపకరించదు. పైపెచ్చు పురుషుని కపకారమే చేయగలదు. స్త్రీ ప్రకృతి

స్వరూపిణి. పురుషుని బంధించుటయే యామెకు విజయము. కాని యది యామె జన్మను సార్థకము చేయదు. జన్మ సార్థకత పురుషుని ముక్తియందున్నది."

ఆమె మాటలు నాకేమియు బోధపడ లేదు. నేను గుడ్లప్పగించి మహామాయను చూచుచుంటిని. నే నాదిలోనే తప్పటడుగు వేసితినని ఆమె గ్రహించినది. వెంటనే యామె "బోధపడలేదు కదూ? మొదటనే నీవు పప్పులో అడుగు వేసినావు అమాయకుడా! నిన్ను నీవు పురుషుడ వనియు నన్ను స్త్రీ యనియు ననుకొనుచున్నావా? అదే పొరబాటు. నాయందు పురుషతత్త్వము కంటే ప్రకృతి తత్త్వమెక్కువగ ప్రకట మగుచున్నందున నేను స్త్రీ ననియు నీలో ప్రకృతి తత్త్వము కన్న పురుషతత్త్వ మెక్కువగ వ్యక్తమగు చున్నందున నీవు పురుషుడవనియు లోకము యొక్క ప్రజ్ఞప్తి సిద్ధాంతము (తెలియకయు తెలియునని భావించుట) కాని అది సత్యము కాదు. అటువంటి స్త్రీ ప్రకృతిస్వరూపిణి కానేరదు. ప్రకృతికి సన్నిహితమైన ప్రతినిధి కావచ్చును. అట్టి పురుషుడు ప్రకృతి దూరస్థమగు ప్రతినిధి కావచ్చును. నీలో ప్రకృతి తత్త్వము కంటే పురుషతత్త్వమే యెక్కువ. అయినను నాలోని పురుషతత్త్వము కంటె అది యెక్కువకాదు. నేను నీ కంటె నెక్కువ నిస్సంగురాలను; నిర్ద్వంద్వురాలను; స్వతంత్రురాలను. నేను నాలో నెక్కువగనున్న ప్రకృతి తత్త్వమును నాలోని పురుషతత్త్వ వశము చేయజాల కున్నాను. అందువలన నాకు అఘోరభైరవులసాయ మవసరమైయున్నది.

'పురుష' ప్రజ్ఞప్తి కల ప్రతివాడు నా వికాసమునకు తోడ్పడ జాలడు."

"మఱి అఘోర భైరవులకు తమరి యవసరమేల కల్గినది?"

"నాలో నున్న ప్రకృతి రూపముననే, నా జన్మమును తఱింప చేయుటయే. వారు గురువులు, మహాత్ములు, ముక్తాత్ములు; సిద్ధులు, వారి మాటే వేఱు."

"అయితే, యీ కారణద్రవ్యము (మధువు) ఇందెట్లుపయోగించ గలదు?"

"అది నీవర్థము చేసికొనలేవు. మధువు ప్రకృతిని సువ్యక్తమొనర్చుటకు కారణభూతము. అది దానిని దాగియుండ నియ్యదు. ఇది గోప్యమగు రహస్యము!"

అది రహస్యమే కాబోలు! నేను మనస్సులో మహామాయ భైరవియొక్క యసమానమగు నాలోచనా శక్తిని జూచి యాశ్చర్య పడితిని. ఏదో జ్ఞాపకము తెచ్చుకొనుచున్న దాని వలె ఆమె కొంచెము సేపు నిలుచుండినది. ఆమె ఎఱ్ఱని కనులలో అశ్రువులు కదలుచుండి ఆమె వ్యాకులపడుచున్నట్లు అగపడు చుండెను. తర్వాత ఆమె "సరే వెళ్ళుము,- నీవెక్కడికి వెళ్ళవలెనో యక్కడికి వెళ్ళు. నేను చాలదూరము వెళ్ళవలెను." అని నా కొఱకై యెదురు చూడక వెళ్ళుట కుద్యమించినది. నేను త్రుళ్ళిపడి లేచి యామెకు ప్రణమిల్లి "అమ్మా, ఆ విరతివజ్రు డెవరు?" అని యడిగితిని.

"అతని యాశ్రమము హిమాలయపు కొండ చరియల ప్రదేశమున నెచటనో యున్నదట. అతడు బౌద్ధభిక్షువగు

అమోఘ వజ్రుని శిష్యుడు. కాని బౌద్ధ తంత్రవిద్యకు పనికి రాడని తెలిసికొని గురువు అతనిని మా. సంప్రదాయము లోకి పంపివేసెను."

"మాతా! అతడేల పనికిరాడయ్యెను?"

"అంతయు త్రిభువన మోహిని మాయ! అతడు శక్తి హీనుడు. అతని శక్తి యతని రాకకై ప్రతీక్షించు చున్నది. వారణాసీ జనపదమున నతడు జన్మించెను. అతని శక్తికూడ నిక్కడనే యెక్కడనో యున్నది."

మహామాయ భైరవి మాటలువిని నేను వారణాసీ జన పదమున ముందు జూచిన యా వృద్ధురాలు నాకు జ్ఞాపకము వచ్చినది. విరతి వజ్రుని ముఖము ఆమె ముఖమును పోలి యుండెను. ఆహా! ఆ వృద్ధురాలి ముద్దుల కుమారు డితడేనా? ఈ సాధకుని నే నింక దర్శింపలేనా? అని చింతా నిమగ్నతచే నిశ్చేష్టుడనైతిని. మహామాయ యిప్పటికే చాలదూరము వెడలిపోయి యుండినది. నేను వేగముగ బయటికి వచ్చితిని. అప్పటికి ఆకాశము వృద్ధ కపోత పక్షమువలె ధూమ్రవర్ణముగ నుండెను. చంద్రుడు తెగిన గాలిపటము వలె అస్తాద్రిపై వ్రాలుచుండెను. తరుణార్క-బింబ పీతకిరణములు స్వర్ణశలా కలచే చేయబడిన చీపురు వలె తూర్పు దిక్కున గగనము నందలి నక్షత్రముల నూడ్చుచుండెను. మహారుద్రుని పినా కము వలె ఇంద్ర ధనుస్సు ఆకాశమున పడమటిదిక్కున వంగి యుండెను. క్షీణభూయిష్ఠమైన రజని సన్న్యాసము గ్రహించు టకై తన నక్షత్రాభరణములను ఒకటొకటిగా నొలుచు చుండెను. చండికాలయ మంతయు మంచుచే తడిసియుండెను.

ఎదుట నున్న మైదానములోని దూర్వాంకురములు అలసభావ ముతో క్రిందకు వంగి యుండెను. నేను గంగాతీరము వైపు నకు సాగిపోతిని.

గంగాతీరము చేరుసరికి తెల్లవారెను. నా రాక ఆలస్య మైనందున భట్టినీ నిపుణికలు కంగారుపడి రాత్రంతయు నిద్దుర పోక యుందురని నేను తలంచనే లేదు. జాగరణముచేత వాడి పోయిన భట్టిని కన్నులు ఆషాఢమాసము నందలి తొలకరి చినుకులచే క్షీణించిపోయిన మంకెన పూవుల వలె జాలిని గొలుపు చుండెను. ఆ కన్నులను చూచి నా డెందము లజ్జా ఆనందభరిత మయ్యెను. దౌర్భాగ్యుడగు బాణుని గుఱించి యింతగా చింతిల్లువా రుందురని నేను తలపనేలేదు. నేను నా యానందమునకు సరియైన కారణము గుర్తింపకలుగు చున్నాననే నా నమ్మకము. వాడిపోయి యున్నను మనోహర ముగ నుండు భట్టిని కన్నులు నన్ను చూడగనే యశ్రుపూరి తము లేల అయినవో నాకు తెలియలేదు. భయపడుచు నన్ను చూచి మాటాడకయే ఆమె లోనికి వెళ్ళిపోయినది. ఆ నావ చాల పెద్దది. కృష్ణవర్ధన రాజకుమారు డవసరములగు నన్ని వస్తువులను అందు పెట్టించి యుండెను. నగరవాసుల వేష మున కొందరు సైనికులు మఱియొక నావపై నుండిరి. భట్టిని సంతోషము లేమికి కారణమేమో నాకు తెలియలేదు. నేనప రాధి వలె తలవంచి నిలుచుంటిని. నే నిట్టి దశలోనుండుట నిపుణిక కొంతసేపు చూచుచుండెను. నేనావిధముగ

దుఃఖించుట ఆమెకు బాగుండినదేమో! నా మనస్సున ఒకే మాటు ఎన్నో యాలోచనలు దొర్లసాగినవి. నేను నాజీవిత మంతయు బాధ్యతారహితముగ కాలము వెళ్ళబుచ్చి యుంటిని. కాని అపరాధినై నిలుచుండుట యిదే మొదటి సారి. స్వయముగ కోరి నేనే యీ బంధములో కట్టుబడితిని. నిన్నటి వరకు నేను స్వతంత్రుడనే. కాని నేడు పరాధీనుడను. రాత్రి నాది కాదు. పగలు నాది కాదు. నా నడక నాది కాదు. నా మనస్సే నాది కాదు. దీనికి కారణ మేమి? నీవు సేవకా వృత్తి చేయుచున్నావు. కనుక సేవకుని వలె నుండ వలెనని ఎవరనుచున్నారు? ఎవరును ఆవిధముగ ననలేదే! ఈ పరాధీనత్వము స్వయముగ నీవు తెచ్చిపెట్టుకొన్నదే! కాని యాశ్చర్యమేమన ఈ పరాధీనత్వమును నా మనసు ఒకసారి యయినా ధిక్కరించలేదు. కాని తా నపరాధము చేసితి ననియు, దోషిననియు, తనకు తగిన శిక్ష లభించవలె ననియు అనుకొనుట యందే మనసున కుల్లాసము కలుగుచుండెను. అప రాధ మేమిటి? ఏమో తెలియదు కాని యపరాధి యగు... వలన నాకు బహుమానము లభించుచున్నట్లు తోచుచుండెను. నిపుణిక నా విచారమును పెరుగనియ్యక "నీవు భట్టిని. నీవిధ ముగ విడచిపెట్టి వెళ్ళియుండ కూడదు భట్టూ!" అని అనెను. నా యపరాధ స్వరూపమప్పుడు కొంత నాకు బోధ పడినది. కాని నే నామె మేలుకొనకే యామెను వదిలిపెట్టి యుంటిని. రాత్రి జరిగిన సంగతులన్నియు నేను నిపుణికకు సంగ్రహముగా చెప్పితిని. నా మాటలువిన నిపుణికకు ఆశ్చర్యముగాని దుఃఖ ముగాని కలుగలేదు. ఆమె యొక్క నిట్టూర్పు విడచి కొంత

నేపటి వరకు కాలివేళ్లతో నావ పలకలను గీరుచు నాలోచించు చుండెను. పిమ్మట ఆమె తల ఎత్తినప్పుడు ఆమె కన్నులలో విషాద రేఖలను గమనించి నేను చింతిల్లి నీరసభావముతో "నిఉనియా, నీవుకూడ దుఃఖపడు చుంటివా!" అని యడిగితిని. అంతలో నిపుణిక తుదుటబడి ప్రసన్న వదనయై కనబడుటకు ప్రయత్నము చేసినదే కాని హృదయమున లేని భావమును ముఖము నందు కనబర్చుటకామె పడుచున్న మనఃక్లేశమును నేను గుర్తించక పోలేదు. ఆమె దానిని దాచుటకు ప్రయత్నించలేదు. నేను "నిఉనియా, నీవెందుకు చింతిల్లుచుంటివి!" అని గట్టిగా నిలదీసి అడిగితిని. నిపుణిక సహజముగానే "ఏమియు లేదు. ఆ మహామాయ చెప్పినది యెంత గంభీరమైన సత్యము. దానినే నేనాలోచించుచుంటిని. పురుషునికి సత్యస్వరూప మొకటి, స్త్రీకి మఱి యొకటి! నేనును నారీ శరీరమునే పొందియున్నాను. కాని అది సఫలము కాలేదు. సార్థకమును కాలేదు. సరేకాని భట్టు, నారీ జన్మమును సార్థకము చేయుట కామె యేదైన నుపాయము చెప్పినదా!" అని యడిగెను. నేను చింతనొందుచు "ఎక్కువ విషయముల నడిగి తెలిసి కొనుటకు ఆమె నాకవకాశమే యివ్వలేదు. కాని అవధూత పాదులు చెప్పిన మాటల యాధారమున నీ ప్రశ్నకు జవాబింతే యనుకొందును: ప్రవృత్తులను అణచిపెట్ట కూడదు. వానికి మనము భయపడకూడదు. ప్రతి వ్యక్తికిని దేవత వేరు వేరుగనే యుండును. మన ప్రవృత్తులే మన దేవత యెవరైనది మనకు తెలియ జేయగలవు. అనేక పర్యాయములు మనము మనస్సు నందు మన దేవతను పూజించుచునే యుందుము.

కాని మనకా సంగతి తెలియదు. నిఉనియూ, నేనీ విషయ ములను అర్థము చేసికొనజాలకున్నాను కాని ఈ మాట లలో సత్యమున్నదని నా మనస్సులో నేమూలనుండియో ధ్వని వినబడుచున్నది." అని యంటిని. ఈ మాటలను నిపు ణిక జాగ్రత్తగ వినెను. ఆమె నా మాటలలోని ప్రత్యక్షర మును అర్థము చేసికొన గోరుచున్నదని నాకు తోచినది. ఆమె మఱియొకసారి నిట్టూర్పు విడచి "భట్టూ, నీవు త్వరగా స్నానము చేయుము. ఆచార్య పాదులు నిన్న సాయంకాలము వచ్చి నిన్ను రాజకుమారుని వద్దకు పొమ్మని యాదేశించి పొయినారు." అని చెప్పి యామె భట్టిని వద్దకు వెళ్ళిపోయెను. ఇంతకు తప్ప ఆమె మఱేమియు చెప్పలేదు సరికదా, అడుగుట కవకాశము కూడ నీయలేదు. సరియైన సమయము నకై వేచి యుండుట మంచిదని యనిపించినది.

నేను స్నానాదికములను నిర్వర్తించుకొని కృష్ణ వర్ధన రాజకుమారుల భవనమునకు వెళ్లుటకై సిద్ధపడితిని. నౌకనుండి క్రిందికి దిగుచుండునపుడు నేను అడుగుల చప్పుడు విని వెనుకకు తిరిగి జూడ భట్టిని నిలువబడి యుండినది. ఆమె ముఖము మేఘాచ్ఛాదిత శరచ్చంద్రుని బోలి ప్రసన్న మనో హరమై యొప్పుచుండెను. ఆమె యప్పుడే స్నానము చేసి కుసుంభ పుష్పవర్ణము గల వస్త్రములను దాల్చి యుండెను. అప్పుడే స్నానము చేసి వచ్చియున్నందున ఆమె కుంకుమ గౌర వర్ణము మఱింత కాంతిమంతమై యుండెను. ఆమె చీర కొంగు పిల్లవాయువుల తాకిడి వలన అల్లనల్లన కదలు చుండెను. ఆమె యా నావయం దపుడే చిగిరించుచున్న

కిసలయములుగల మధుమాలతి లతవలె మనోజ్ఞముగ నగపడు చుండినది. జారిపోయిన యామె వేణి, విరియబోసిన యామె స్వర్ణాభ కేశములు, ఆమె వస్త్రముల కుసుమపువ్వు రంగుతో గలిసినపుడు మనోహరముగ నగపడు సువర్ణశిరీష కుసుమముల పీతపరాగ కేశములను జ్ఞాపకమునకు తెచ్చు చుండెను. ఆమె యానందముతో నిండియున్నట్లగపడుచుండెను. ప్రసన్నవదన యైన యామెను జూచి నా మనస్సు ఆనందముచే నుప్పొంగి పోయెను. నేనేమియు పలుకక ఆమె యాజ్ఞకై వేచియుంటిని. మందస్వరమున "భట్టూ, త్వరగా తిరిగి రమ్ము" అని యామె యనెను. నేను తలవంచి భయపడుచు, "అలాగే దేవీ, శీఘ్ర ముగనే వచ్చెదను." అని యంటిని. నా పదముల వాచ్యార్థ మేమైనను సరియే కాని నిజమైన యర్థము నా హృదయమే యెరుగును. 'దేవీ, నా యపరాధము క్షమింపుము. ఇక ముం దెన్నడిట్టి తప్పు చేయను. అనియే వాని యర్థము. నా మాటల వ్యంగ్యార్థమును తలచుకొనియే నేను సిగ్గు పడు చుంటిని. భట్టిని స్నేహస్నిగ్ధ స్వరమున "మంచిది" అని పలికి వెనుకకు మఱలెను. నేను నగరము వైపునకు సాగిపోతిని.

నేడు ఫాల్గుణ శుద్ధ పౌర్ణమి. ఈ నాడు కన్యాకుబ్జము నందు మదనోత్సవము జరుగును. నేడు నగరములో ప్రవేశిం చుట సాహసమైన విషయమని నేను మఱచియుంటిని. పౌరుల కరతాళ ధ్వనులతోడను మధుర సంగీత మృదంగ ధ్వనుల తోడను నగర మంతయు ప్రతిధ్వనించు చుండెను. మధుపాన మత్తలైన పురవిలాసినులు తమ యెదుటబడిన పురుషునిమీద చిమ్మనగ్రోవులతో రంగు నీటిని చిమ్ముచుండిరి. విశాలమగు

చతుష్పథము లన్నియు మద్దెల మృదు నాదములతోడను నృత్య ధ్వనులతోడను మారుమ్రోగు చుండెను. ఒండొగులు చల్లుకొనుటచే గంధపొడి దశదిశలందు వ్యాపించి దిశల నను రంజిత మొనర్చుచుండెను. కుంకుమపూవు కలిపిన గంధపొడి కప్పబడి రాచబాట లన్నియు ఉషఃకాలపు కెంజాయ లలము కొన్న ట్లగపడుచుండెను. పురవాసుల శరీరముల నలరారు చున్న అలంకారములు, శిరమున ధరించిన యెఱ్ఱని యశోక పుష్పము లీసౌందర్యమును మఱింత యెక్కువ జేయుచు పురవాసులందఱు పసిడి రంగున ముంచివేయబడిరా యన్న ట్లగుపడు చుండిరి. శ్రీమంతుల భవనముల ముంగిట ధారా యంత్రములు నుండి నీరు పైకి జుమ్మని చిమ్మబడు చుండెను. అందు తమ చిమ్మనగ్రోవుల నింపుకొనుటకై పోటీలు జరుగు చుండెను. ధారాయంత్రముల నుండి వెడలిన నీటిధారలచే దడిసి, పౌరవిలాసినుల నిరంతర సంచారము వలన నడుమనైె పడతుల సీమంతము నుండియు, కపోలముల నుండియు సింధూర గంధపొడులచే కలిసిన యెఱ్ఱని గంధపొడి బురదచే రాతికట్ట డపు నేలయంతయు సింధూరమయ మయ్యెను.* ఈ ప్రమత్త కామినీ జనుల రంగుదాడి నుండి తప్పించు కొనుటకు నేనెన్నియో యుక్తులను పన్నితిని. రాజమార్గములను వదలి సందుగొందులనుండి రాచబాటకు కొంతదూరమున చేరు కొంటిని. ఇచటి యుత్సవ కోలాహల మెంత మత్తును గొల్పు చుండెనో యంత మనోహరముగ గూడ నుండెను. అడు గడుగున వారాంగనల నృత్యము జరుగు చుండెను. గో

* చూ: రత్నావళి, మొదటి అంకము

పుచ్ఛాకారపు మద్దెల (ఆలింగ్యకము) మందమంద నినాదము తోడను, మధురముగ మ్రోగు మంజుల వేణునినాదము తోడను, గలగల లాడు కుంజర ధ్వనులతోడను, కాల కాంస్యమను నగారా మనోహర ధ్వని తోడను, వెనువెంట శీఘ్రముగ వేయుచుండిన కంచు తాళముల ధ్వనుల తోడను, తెఱపిలేక వాయించు చుండిన తంత్రీ పటహ నినాదము తోడను, మృదువుగ మ్రోయు తంబుర ధ్వనితోడను, ఆ నృత్యము లెంత చిత్తాకర్షణీయములుగ నుండెనో యంత అశ్లీల పరిహాసగీతముల వ్యక్తమగు తుచ్ఛ శృంగారముకతన వెగటుగ దోచుచుండినవి. కాని యీ యశ్లీల గీతములు విటుల కర్ణపుటముల కమృతము జిలకించి నట్లుండెను. ఒకే వస్తువు వేఱు వేఱు శ్రోతలపై వేఱు వేఱు ప్రభావములను ప్రసరింప జేయుటెంత యాశ్చర్యకరమైన సంగతి! ఆ సృష్టి కర్త సౌందర్యము నెట్టి నింద్యమగు చోట పాఱవేసినాడు! ఈపడతుల చెవులయందు కొండ గోగుపూ లూగుచుండినవి. నీలవేణియం దశోక పుష్పమంజరులు శోభిల్లు చుండినవి. కపోలపాళిపై వ్రేళ్లతో నందముగ నంకితము చేయబడిన కెంపించని మకరికా పత్రరేఖ లుండినవి. వారి లలాటములు కుంకుమ గౌరవర్ణముచే నొప్పు చున్నందున వారు కాశ్మీర యువతులవలె నగబడుచుండిరి. వివిధ నాట్యభంగిమముల జూపుచు వారు తమ బాహులతల నాకాశమువైపున కెత్తి నప్పుడు వారి కంకణములు పైకెగరి సూర్యబింబమును తమ కైదిగా నొనర్చుటకై యుత్సాహ పడుచున్నట్లుండెను. వారి బంగారపు టొడ్డాణపు చిరుగజ్జెలలో దగుల్కొన్న గోరింట దండ వారి నడుమును చుట్టుకొని యనురాగాగ్నియే ప్రదీప్తమై

వారిని చుట్టుకొన్నదా యన్నట్లు శోభిల్లుచుండెను. వారి ముఖముపై అభ్రకసింధూరపుకాంతి నలుదెసల ప్రసరించుటచే వానియెఱ్ఱని కాంతులచే నరుణోజ్జ్వల మగుచున్న కుండల పత్రములు, చందనవృక్షమును చుట్టుకొనియున్న సుకుమార లతల విలోల కిసలయమువలె శోభిల్లుచున్నవి. వారు ధరించిన నీల,వసంత, కుసుమ వర్ణోత్తరీయములు నృత్యవేగముచే తేలి యాడుచు శృంగార రస సాగర చటుల వీచికలవలె విలసిల్లు చుండినవి. వెనుక తప్పెటలు మ్రోగుచుండ, వారు నాట్యము చేయుచు, గగుర్పాటు చెందినపుడు సహృదయులకు మేఘా చ్ఛాదిత దినమున నుఱుముచున్న మేఘముల నీడల తమ పుష్పోడిని వెదజల్లు మొగలిపూవులు జ్ఞాపకము వచ్చుచుండెను. ఆ యాటకత్తెలు మధువునకే మత్తుగొల్పుచు, రాగమునే రంజింప జేయుచు, ఆనందమునే యానందింప జేయుచు, నృత్యమునే యాడించుచు, నుత్సవమునే యుత్సాహవంతముగ నొనర్చుచుండిరి. ♦ స్త్రీసహజమగు కోమలత్వము వారిలో మచ్చుకైనను లేదు. పాడుబడిన దేవాలయము వలెను, త్రోవలో పాఱవేయబడిన విగ్రహము వలెను బురదలోబడిన మాలతీ మాలవలెను వారు తమ మర్యాదను పోగొట్టుకొని, తమ గౌరవమును మఱచి, తమ పవిత్రతను మలిన మొనర్చు కొని యుండిరి. నేను స్త్రీ సౌందర్యమును ప్రపంచమునందు గొప్పప్రభావముగల శక్తులలో మిన్నయని భావించుచుంటిని. కాని అకటా ! నే నిట నేమి చూచుచున్నాను ? పురుషుని బంధించుటే స్త్రీకి విజయమనియు, వానిని ముక్తి నొందించుటచే

♦ చూ: హర్షచరితము నాల్గవ యుచ్ఛ్వాసము

స్త్రీ జీవితము సార్థకమగుననియు మహామాయ చెప్పుచుండెను కదా! మఱి నేను చూచుచున్నది స్త్రీ విజయమా? లేక స్త్రీ జీవితసార్థకమా? నారీ సౌందర్య మిచట గొడ్డువోయి నిష్ఫలమై చవిటి నేలవలె నిస్సారమైనదని నా మనస్సునకు తట్టుచున్నది. ఈవిధముగ నెందులకు జరిగినది? ఈమహత్తర మైన శక్తికంటె దీనిని ట్లవమానించు మఱియొక శక్తి కలదా యేమి? అట్టి శక్తి తప్పక యుండితీరవలెను. ఆశక్తి యైశ్వర్య మనియే నాయూహ.

ఎన్నియో సందులలో తిరిగి తిరిగి చివరకు నేను చిన్న రాజనగరును చేరితిని. ద్వారమువద్ద నాగు లేడు. నా గుండె దడదడ కొట్టుకొన సాగెను. ఆనాటిరాత్రి యేమరపాటున నున్న యపరాధమున కాతనిని కైదుచేసిరా? లేక వాని కురిశిక్షవిధించిరా? చిన్న రాజనగరున నేయుత్సవమును జరుగు చున్న జాడ కనపడలేదు. వెంటనే నాకా తెల్లగ నెరసిన వెండ్రుకలు కలిగిన వృద్ధవాభ్రవ్యుడు జ్ఞప్తికి వచ్చెను. పాప మతని గతియేమయ్యెనో కదా! భట్టిని తప్పించుకొన్న నేరమున కతడు సహాయపడి యుండుననియే యూహించి యుందురు. చిన్న మహారాజు అతని చర్మము నొలిపించి యుండును. ఈ సంగతిని తలచుకొన్నప్పుడు నాచిత్తము గ్లాని దుఃఖములచే నిండిపోయెను. పక్షి నగుటకు శక్తియే యున్నచో నేను పిట్టనై యంతఃపురమున ప్రవేశించి యక్కడి సంగతు లన్నియు తెలిసికొని వచ్చియుందును. రాజుగారి యుద్యాన వనము చివర నేను రాజమార్గమున ఉన్నట్లుండి యాగిపోతిని. అచటనే యొక గొప్ప పొగడచెట్టు కలదు. దాని కుసుమ

పరిమళము నాకు మత్తుగొల్పు చుండెను. రాజనగరులోని వార్తలు తెలిసికొనకుండ ముందుకు సాగిపోవుట పాపమని నా కనిపించినది. కాని యచటి వార్తలు తెలిసికొన్నుట యసంభవము. నేనొకింత సేపు నిలుచుంటిని. నా మనస్సు, గ్లాని లజ్జాఖేదముల వశమైయుండెను. అపుడే యొక గోరువంక మృదువైన స్పష్ట స్వరమున నేదో పలుకుచున్నట్లు వింటిని. గజిబిజిగ పలుకుచున్న దానివాక్యముల నర్థము చేసికొనుటకు నాకు క్షణమైనను పట్టలేదు. అది తన తియ్యని పలుకుల 'సమే స్వయం భూర్భగవాన్ ప్రసీదతు' అని పలుకుచుండెను. నా హృదయమున మెఱపుతీగ మెఱసినట్లయి నారక్తనాళము లందొక క్రొత్తశక్తి యావరించి నన్నుత్తేజితునిగ నొనరించినది. నేను 'ఈశారిక నిశ్చయముగ భట్టినిదై యుండనోపు' నని పలికితిని. తర్వాత నిటునటు చూచి నేను నా మూర్ఖత్వమును తలచుకొని పశ్చాత్తాపపడితిని. ఎవరైన నా మాటలు విని యుండిన నేమందురో కదా! శారిక కొంచెము సేపూరకుండి తిరిగి 'వెళ్ళవే పాపీ! ఈ పాప పంకిలమగు నంతఃపుర మునుండి వెడలిపో! నీ భట్టిని పాఱిపోయినది. నేను చావ సిద్ధముగ నున్నాను.' అని పలికినది. అయ్యో! ఇవి వాభ్రవ్యుని మాటలవలె నున్నవే! పాపమీ శారిక తన్నువిడచి పుచ్చునపుడు వ్యాభ్రవ్యుడు పలికినమాటలను కంఠస్థము చేసికొన్నదా యేమి? అని యాలోచించుచు ఇంకను ఈశారిక యేమిచెప్పునో విందమని యూపిరి బిగబట్టి నిలుచుంటిని. ఒకక్షణమూరకుండి శారిక "సమే స్వయం భూర్భగవాన్ ప్రసీదతు" అని మధురకంఠమున పలుకుచు

రాజాంతఃపుర వృక్షసంకులితమైన యుద్యానవనములోని కెగిరిపోయెను.* నాయునన్ను ఆరాటపడ సాగెను. శుకశారికల నోటి నుండియు శిశువుల నోటి నుండియు అంతఃపుర వృత్తాంతము వినుట భాగ్యవంతులకే చెల్లునని నేను సాహిత్య శాస్త్రమునందు జదివియుంటిని ♦ ఇదెట్టిపరిహాసము! అంతః పురవృత్తాంతము వినిపించి యీశారిక నాభాగ్యమునే పరిహ సించెనే! అయ్యో! నిర్దోషియగు వ్యాభ్రవ్యుడు మరణించి యుండ దోషియగు బాణుడింకను జీవించియున్నాడే! ఏమీ! పాపమీ నిరపరాధులను గుఱించి భట్టిని యాలోచించనేలేదా? అంతఃపుర పరిచారికులకు పితృతుల్యుడగు వాభ్రవ్యుడెట్లు పరితపించుచు ఈశారికను పంజరమునుండి వదలిపెట్టెనో భట్టిని విన్నయెడల నామె కుసుమ కోమల హృదయము వాడిపోదా?

నేడు చిన్న రాజాంతఃపుర మంతయు నిశ్శబ్దముగ నుండెను. అందున్న క్రీడాపర్వతముపై కామినీజనము తమ గాజుల గలగల ధ్వనులచే మత్తెక్కిన నెమళ్ళ నాడించు చుండరు. క్రీడా సరోవరమువద్ద మ్రోగు మద్దెల ధ్వనులు చక్రవాక మిథునములను అకారణముగ నుత్కంఠితము లొనర్చు చుండవు. నేడంతఃపురపు కుట్టిమభూమి యువతుల

---

* 'రత్నావళి' రెండవ అంకములోని ఘటనతో పోల్చుడు.

♦ దుర్వారాం కుసుమశర వ్యథాం వహన్త్యా,
కామిన్యా యదభిహితం పురఃసఖీనాం।
తద్భూయ శుక శిశు సారికాభిరుక్తం,
ధన్యానాం శ్రవణ పథాతిథిత్వమేతి॥

రత్నావళి 2-33.

చరణముల లాక్షారసముచే నెఱ్ఱబడి యుండదు. మిత్త్రియల నృత్యములు మదనోత్సవమును మంగళకలశముచే నలంకరించి నట్లు చేసియుండవు. వారి హరిణేక్షణముల కిరణకాంతులీనాడు దినమంతయు కృష్ణసారమృగమయ మయినట్లు చేయజాలవు. వారి బాహువల్లరుల విక్షేపము లీనాడు జీవలోకమునే తామరతూండ్లచే చుట్టివేసినట్లు కనబడవు. వారు చెవులయందు ధరించిన శిరీషపుష్ప గుచ్ఛములచే నంతఃపురములోని యెండ, చిలుకతోకరంగువలె మాఱిపోయి యుండదు. వారి ధమ్మిల్లములనుండి జారిపడు తమాలపత్త్రములు అంత రిక్షమును కాటుకరంగు వలె నల్లబఱచి యుండవు. ఆభరణముల గలగలలచే దిశలు మ్రోగింపబడవు - చిన్న రాజాంతఃపురము నేడెట్టి భయసందేహములకు గురియై యుండునో కదా! నానాదేశములనుండి యపహృతలై కలం కితలైనట్టి అంతఃపురస్త్రీలు ఈయొక్కనాడే ఆనందోత్స వమును జరుపుకొనుచుందురు. కాని పాపము! నేడాయుత్సవము కూడ జరగదు కదా! నేనొక భట్టిని నుద్ధరించిన మాట నిజమే కాని, యింకనెందఱు భట్టినులీయంతఃపురమున నున్నారో నాకేమియెఱుక? ఇట్టి అంతఃపురము లింకెన్ని యున్నవో కదా! ఇంతకుముందు నేను చూచివచ్చిన విశృంఖలనృత్యమునకును, ఈయంతఃపురమునందు పరివ్యాప్తమైన భీతికిని నెంతభేద మున్నది! కాని ఈ రెండు స్థానములందును అఖిలసృష్టిలో నమూల్యమగు వస్తువు అవమానింప బడుచున్న దనుట ముమ్మాటికి సత్యము. ఈ విధముగ జరుగుటకు కారణమేమి? అని నే నాలోచించు కొనుచుండ నేను పోవుచున్న త్రోవన

మదోన్మత్తుల గుంపొకటి యుత్సవము చేసికొనుచు వెడలి పోయినది. కాళిదాస మహాకవి ప్రాతఃకాలమున ఉజ్జయినిలో చూచిన దృశ్యమును నేను స్థానేశ్వరమున మధ్యాహ్నమున చూచుచున్నాను. సరిగా అవిధముగనే స్త్రీల గమనవేగముచే వారి వేణీ భరమునుండి జారి మందార పుష్పములు రాలి యుండెను. చెవులనుండి పసుపురంగు పద్మములుజారి భూమిపై దొరలుచుండెను. హృదయముపై మాటిమాటికి తాకుచున్నం దున గంధరాజ కుసుమముల దళములు రాలియుండెను ♦ అయినను నేను దీనిని ప్రేమాభిసారికా మార్గమనుకొనను. ఈ మార్గమున ఉల్లాసోన్మాదములు వెల్లి యుండవచ్చును. అనురా గౌత్సుక్యములు వెళ్ళి యుండలేదు. ఇదంతయు యేమిటి? ఇదెట్టి ధర్మము? ఎట్టి న్యాయము? మనుష్య సంఘ మెచటనో ఏదో తప్పుచేసినదనుట తథ్యము! ఈయున్మత్తోత్సవము, ఈరాస గానము, ఈ కొమ్ముల ధ్వని, ఈ కుంకుమ గందపొడులు, ఈ చర్చరీ ధ్వనులు, మనుష్యుని మనోదౌర్బల్యమును కప్పునట్టి పరదాలవంటివి. ఇవి యన్నియు కలిగి యుండుటయే మను ష్యుని మనస్సు రోగగ్రస్తమైనదనియు, వాని చింతనా పద్ధతి కలుషిత మైనదనియు, మానవుల యొండొరుల సంబంధము దుఃఖపూరితమైన దనియు రుజువుచేయుచున్నవి. ఈ దుర్వాహ

♦ కాళిదాసుని ఈ శ్లోకముతో పరిపోల్చ వచ్చును:

గత్యుత్కంపా దలక పతితైర్యత్ర మందార పుష్పైః
పత్రచ్ఛేద్యైః కనక కమలైః కర్ణవిభ్రంశిభిశ్చ ।
ముక్తా జాలైః స్తన పరిచితచ్ఛిన్నసూత్రైశ్చ హారైః
నైశో మార్గః సవితు రుదయే సూచ్యతే కామినీనాం ॥

[మేఘ సందేశము-68]

చింతా భారమును నేను భరింపలేకపోతిని. నిరంత రాలోచనా నిమగ్నుడనై అప్రయత్నగతి వేగముగ నున్ముందుకు సాగి పోవుచుంటిని.

నగరములోని బాచబాటలయం దుత్సవ కోలాహలము తగ్గియుండెను. సౌధ వాతాయనముల నుండి విషాదభరిత మగు గాలులు వీచుచుండెను. పురజనుల యిండ్లయందు పరి చారికలు కష్టముతో తమ పనులను చేయుచుండిరి. విశ్రామ గృహములం దుండు ఊదువత్తుల పరిమళము దిశల నన్నింటిని సువాసనచే నింపుచుండెను. నేను కృష్ణవర్ధన రాజకుమారుని భవనము చేరునప్పటికి మిట్ట మధ్యాహ్నమై యాకాశమండల మంతయు నలసిపోయి శిథిలగాత్రమై యుండెను. రాజకుమా రుడు నా రాకకై వేచియుండెను. నా రాక నెఱింగింపగ నే యతడు స్వయముగ వెలుపలి కేతెంచి నన్ను ప్రేమతో లోనికి గొంపోయెను.

రాజకుమారుని భవనము స్వచ్ఛమై రమణీయముగా నుండెను. గోడలు స్ఫటికముల వలె స్వచ్ఛముగ నుండెను. వాని పైభాగ ముత్తమమగు చిత్రములతో నలంకరింపబడి యుండెను. అందు వికసించిన తామర పువ్వులు వరుసగ చిత్రింపబడి యుండెను. హంసలు, చేపలు, ఏనుగులు, పులు లును ఆ తామర పరంపరల కభిముఖముగ దుముకుచున్నట్లు చిత్రితములై యుండెను. పైభాగమంతయు విడిపడియున్న తామర లతా సమూహామువలె నుండి ప్రతిదళమునందు నేదో యొక ప్రాణి యాకారము గోచరించు చుండెను. ద్వారమున కెదుట వెన్నంతర జాతకుని భావగర్భితమగు చిత్రముండెను.

అందొకవైపు రాజకుమారుని యొక్క పుత్రుని దానముగ యాచించు బ్రాహ్మణుని ముఖవైఖరి యందు భయము స్పష్టముగ కనబడుచుండ, మఱియొకవైపు రాజకుమారుని యొక్కయు, అతని కుమారుని యొక్కయు ముఖ ముద్రలందు దానవీరుని భావము స్పష్టముగా భాసిల్లుచు చూచుటకింపుగ నుండెను. చాలసేపటివఱకు నేనా చిత్రమును లిఖించిన చిత్రకారుని కళానైపుణిచే ముగ్ధుడనై యా చిత్రమునే చూచుచుంటిని. ఈనాడు గోడపై సున్నపుపూత చేసి, మహిషచర్మము నఱుగదీసి దానిపై లేపనము చేయు పద్ధతి నీ చిత్రమున పాటించినట్లులేదు. ఇట్టి కుడ్య ఫలకముపై వజ్రమును పూయుట అలవాటు. ఏలయన అది చల్లబడినపు డెండి పోగలదు. వెదురు వెళ్లు గలిగి రాగిగొట్టములయం దమరిన దూడల చెవి వెంద్రుకల తూలికలచే చిత్తరువులు వ్రాయుట కిట్టి ఫలకము లుపయోగించును.* ఈ చిత్ర రచన యందట్టి తూలిక లుపయోగింప బడియుండక పోయినను భావము లుట్టిపడునట్లు చిత్రరచనను గావించిన యీ చిత్రకారుని కళాప్రతిభ అద్భుతము! ఆ రాజకుమారుని పుత్రుని కోమలకాంత ముఖమండలమున ఆత్మదాన మొనర్చు దృఢ సంకల్పమెంత యద్భుతముగ కనబడుచున్నది! మైనము, అన్నము— ఈ రెండింటియందు కాటుకను నూఱి తయారు చేసిన రంగులతో నెట్టి యలౌకిక భావము స్ఫుటమగుచున్నదా యని నేనాలోచింపు చుంటిని. కాటుక, మైనము, అన్నము— ఈమూడును దివ్యభావములను పుట్టింప శక్తి గలిగినవా? కావు.

* చూ: అభిలషితార్థ చింతామణి, 3.

ఇట్టి మనోహరమగు దృశ్యమును చిత్రింపగల శక్తి నిజముగ మనుష్యుని భక్తిరసభరితమైన మనసునకు మాత్రమే గలదు. ఈచిత్రము దక్క మఱే చిత్రములు ఆభవనమున లేవు. రాజకుమారుడు కూర్చుండుటకు ఒక చిన్న స్ఫటికపీఠ ముండెను. దానిపై మెత్తని పఱుపు, దిండు అమర్చబడి యుండెను. మఱికొన్ని చందన పీఠములు కూడ నీవిధముగనే యమర్చబడియుండెను. ఈ పీఠములు పండితులు, గొప్పవారు కూర్చుండుటకై నిర్ణీతములై యుండెను. రాజకుమారు డాదరముతో నన్నొక చందనపీఠముపై నాసీనుని గావించెను. నేనాసీనుడనగు నంత వఱకు అతడు తన పీఠముపై కూర్చుండ లేదు.

కూర్చుండిన పిదప అతడు భట్టినిని గురించిన కుశల ప్రశ్నలను గావించెను. ఆమె సుఖముగ నున్నదని నేను ముక్తసరిగ జెప్పితిని. కాని రాజకుమారుడు వివరముగ వినగోరుచుండెను. నిన్నటినుండి నేటివరకు భట్టిని ముఖముపై ప్రకటమగుచుండిన ప్రతిమనోభావమును సవిస్తరముగ వినకుతూహల పడుచుండెను. నేను భట్టిని విషయమై యల్పజ్ఞుడనని పాపము తనికే మెఱుక! భట్టినిని గురించి తెలిసికొన దగిన విషయములన్నియు నేనెఱిగిన వాడనని వారు భావించుచుండుట గాంచి నేను గర్వపడు చుంటిని. రాజకుమారుడు మాకు కపటములేని మిత్రుడని నాకు విశ్వాసముండుటచే నేనెఱిగిన విషయమొక్క దానిని కూడ నతనివద్ద దాచలేదు. నిన్నటి దినము అతనిని దర్శించి నేను భట్టిని వద్దకు చేరినప్పటినుండి జరిగినదంతయు విపులముగ నేనతనికి చెప్పితిని. "నేను వెళ్ళునరికి భట్టిని నా

కొరకై చాల నౌత్సుక్యముతో వేచియుండి చాలవిచారము నొందుచుండెను. దేవపుత్ర నందిని తనసోదరుని ప్రార్థన నంగీకరించి పల్లకీయందు కూర్చుండి గంగానదీ తటమునకు చేరుకొమ్మని కృష్ణవర్ధనులు చెప్పినారని నేను భట్టినికి జెప్పి నపుడు నీలోత్పల తుల్యములగు నామె కంట మిక్కిలి నిర్మల ములగు గొప్ప యశ్రుబిందువులు జలజల రాలినవి. ఆ యశ్రు బిందువులనుజూడ నవి యీామె చిత్తనైర్మల్యమును వెంటనిడు కొని వచ్చుచున్నట్లును, ఇంద్రియ సమూహపు ప్రసాదమే యీరూపమున జలకరించబడినట్లును, తపోరసమే ప్రవహించు నట్లును, ఆమె కన్నుల స్వచ్ఛకాంతియే ద్రవించి పారుచున్న ట్లును, పవిత్రములగు మేఘపంక్తియే వర్షించుచున్నట్లును, కృతజ్ఞత యనెడు ముత్తెముల సరమే తెగి, దాని ముత్యము లీరూపమున వెదజల్లబడుచున్నట్లును తోచుచుండెను. చాల సేపటివర కామె తలవంచుకొనియే కూర్చుండి యుండెను. తరువాత నామాటలపై విశ్వాసము గలుగకున్న దానివలెను, నేను రాజకుమారుని మాటలుగాక, ఏ దేవత మాటలో చెప్పు చున్నట్లామె నావైపు కొంతసేపు చకితయై చూచుచుండి తర్వాత శాంతస్వరమున 'పల్లకీని తెప్పించుము' అని పలి కెను.''

నా మాటలను రాజకుమారుడు జాగ్రత్తగ వినెను. నిన్న నతని ముఖమునం దగుపడుచుండిన కూట చాతుర్య మీనాడుగోచరింపలేదు. నిన్నటి దినమతడు మహాసంధి విగ్రహ కుడు - నేడపరిచితయైన సోదరికి సహోదరుడు! ఈ నాడతని మనోభావము లన్నియు నతనిము ఖముపై స్పష్టముగ కనబడు

చున్నవి. కదలుచున్న ముత్యములను బోలు నతని నేత్రము లీనాడు అశ్రునీరముల నీడుచుండినవి. అతనికి చెప్పుటకు నావద్ద విషయము లెక్కువ లేవు. కాని యతడు నా నోట నెక్కువగ వినకుతూహల పడుచుండెను. "భట్టూ, దేవపుత్ర నందిని కనువగు వచనములనే యామె పలికినది. నా ప్రార్థన నామె యంగీకరించినది. అందులకు కృష్ణవర్ధనుడు ధన్యుడు. ఆమె హృదయ గాంభీర్యమును తలచుకొని నేను ముగ్ధుడనగు చున్నాను. కాని భట్టూ! నీవు నిజముగ నమాయికుడవు. దేవపుత్ర నందిని హృదయవేదనను నీవు గమనించ లేదు! నిపుణిక ఆమెను బాగుగ నెఱుగును. దానినడిగి నీవామె మనస్సును తెలిసికొన గలవు." అని యతడనెను. ఈ మాటలు నాకాశ్చర్యమును గలిగించినవి నేను చూడనట్టి, గమనించనట్టి, యే విషయముల నీ రాజకుమారుడు గ్రహించెనో తెలియలేదు! నిపుణిక నాకంటే నెక్కువ తెలిసికొన గలుగునను మాట నిజమే కాని, రాజకుమారుడు దేనినిచూచి నన్నమాయికునిగ భావించెను. పుట్టినప్పటినుండి 'అడ్డము ఆపు' లేక తిరుగుచుండిన బాణభట్టుడు నిన్నటినుండి నేటివరకు నమాయికుడనియే యని పించుకొను చున్నాడే! కొందఱితరులను అమాయికులని భావించుకొని సంతోషపడుచుందురు. కృష్ణవర్ధనుడు కూడ నట్టివాడేనా? అని ఖేద పడుచు వినయముతో "రాజకుమారుడు నాలో నేమి యమాయికత్వము చూచెనో తెలియకున్నది" అని యంటిని. రాజకుమారుడు నవ్వి "నీవు కవిత్వమెంత యల్లగలవో, యంత వస్తు స్థితినిగురించి తెలిసికొనవు. నీవెప్పుడైన భట్టినిని నామె మనసులోని విషయమునుగురించి

యడిగి యుంటివా? ఆమె మనోవేదన యంతయు తెలుపలేక రాత్రింబవళ్ళామె జిహ్వాగ్రముననుండునా? భట్టూ కవిత్వము చెడ్డదనిగాదు. కాని నీవు వహించుచున్న సేవాభారము గురుతరమైనది. అది యథార్థము నపేక్షించును. భట్టిని వాభ్రవ్యుని విషయమై యెంత వ్యాకుల పడుచున్నదో నీకు తెలియునా?" అని యడిగెను. అతని నోట వాభ్రవ్యునిపేరు విని నేను త్రుళ్ళి పడితిని. నాకుగూడ వాభ్రవ్యుని గురించి చాల విచారముగా నుండెను. కాని భట్టిని యాతనిని గురించి నాకేమియు చెప్ప లేదు. అట్టితరి నా వృద్ధ బ్రాహ్మణునికై భట్టిని పరితపించు చున్నదని రాజకుమారుని కెట్లు తెలియును? రాజకుమారుడు మఱల నవ్వుచు "నిన్న భట్టిని ఆచార్యపాదుల కీవిషయము చెప్పినది. వారే నాకు చెప్పిరి" అని యనెను. రహస్యము నెఱిగిన తరువాత నా ముఖమ్ము వాడిపోయెను. కణతవఱకున్న రక్తనాళములన్నియు రక్త ప్రవాహ వేగముచే పటపట కొట్టు కొన సాగినవి. కాళ్ళక్రిందనున్న భూమి జరుగుచున్నట్టును, దిఙ్మండల మంతయు కుమ్మరివాని చక్రమువలె గిర్రున తిరుగు చున్నట్లు తోచినది. నేనెంత మూర్ఖుడను! భట్టినికి నాపై నమ్మకములేదు. ఆమె నాతో నీమాట యెందుకు చెప్పలేదు? ఆమె సైగ చేసినంత మాత్రముననే నేను నా ప్రాణముల నైన నర్పించుమనని నేనామె యెదుట ప్రతిజ్ఞచేసియుండలేదా? నాపై నామెకు విశ్వాసముండవచ్చును కాని నాపై నామె యాధారపడలేదు. దరిద్రుడగు బాణుడు నేడుకూడ దౌర్భాగ్యుడే. నేనిట్లు తలపోయుచుండ రాజకుమారుడు నాయమాయి కత్వమును చూచి యానందించు చుండెను! అతని క్రీడా

సక్తములగు చపలనేత్రములు నాలో రేకెత్తుచు సమసిపోవు చుండు మనోభావములను భేదించుటకు ప్రయత్నించుచు చుండెను. మందహాసము జిలుకుచున్న యూతని మోము మధ్యాహ్న కాలమున వికసించిన నవమల్లికా కుసుమమువలె స్థిరమై యొప్పుచుండెను. ఓరచూపుల జూచుచుండుట వలన నించుక కుంచితమైన గండస్థలములు వికసించిన పద్మపు మొగ్గల ప్రక్కన దళములవలె శోభిల్లుచుండెను. నా మనః క్లేశమును జూచి యతఁ డానందించుచుండెను. రాజకుమారుని మనోభావములను నేను గ్రహించి యెక్కువకాల మచట కూర్చుండుట యనుచితమని తలంచితిని.

నేఁడావిషయముల నన్నింటిని జ్ఞప్తికి దెచ్చుకొన్నపుడు ఆ నాటి నా మనోభావములను గుఱించి నాకే యాశ్చర్యము కలుగుచున్నది. రాజకుమారు డన్న మాటల కంత సిగ్గు, దుఃఖము పడనవసరములేదు. వెళ్ళుట కనుజ్ఞ వేడగనే రాజ కుమారుడు నవ్వి - "కూర్చో భట్టూ! నీవు నిజముగనే విషయము నర్థము చేసికొనలేదు. దేవపుత్రనందిని నీకృతజ్ఞతా భారముచే తబ్బిబ్బు లగుచున్నది. నీ యుపకార ఋణమును కొంతమైనను తీర్చుకొనుటకు సరిపడు ధన మీ ప్రపంచమునందెచ్చట వెతకినను నామెకు లభించలేదు. అట్టి తఱి నీచే అనుక్షణము క్రొత్తక్రొత్త యాజ్ఞలనెట్లు పాలింప జేయగలదు ? నీవే యామె మనోవ్యథను చులుకుదనముతో గుర్తించుచుండిన ఆమె సేవ చేయుటకు నీకవకాశము లభించ గలదు. ఆమె హిమాలయమువంటి మహీయసి; సముద్రము వంటి గాంభీర్యముగలదు. అట్టిసోదరికి సోదరుడగు భాగ్యమును

పొంది కృష్ణవర్ధనుడు గౌరవింప బడినాడు." అని పలికెను. ఈమాటలను విని నాచిత్తము శాంతించినది, కాని యీ మాటలవలన నాకు గలిగిన గర్వమునుండి తప్పించుకొనుటకు చాలకాలము పట్టినది. భట్టిని గొప్పదనము. ఆమె గాంభీర్యమును గుఱించి నా కితరు లుపదేశించుట నా కసహ్యముగ తోచెను. నేను వెళ్ళుట కనుజ్ఞ వేడితిని.

రాజకుమారుడించుక చింతిల్లుచు "భట్టూ – ఈనాటి సాయంకాలమే నీవిచ్చటనుండి వెళ్ళిపోవలయును. రాజనీతి భుజంగము కంటె నెక్కువ కుటిలమైనది. అసిధారకంటె నెక్కువ వాడియైనది. విద్యుల్లత కంటె నెక్కువ వేగము గలది. ఇక్కడ పరిస్థితులు చక్కబడనంత వఱకు నీవు, భట్టినియు నిచటనుండుట ప్రమాదకరము: నిన్న నీవు దేవపుత్రనందిని సంరక్షకుడనని చెప్పియుంటివికదా! నిశ్చయముగ నీవీబాధ్యతను నిర్వహించగల సమర్థుడవే. కాని యీభారము వహించుచున్నందున నీవెట్టిరాజనీతి సుడిగుండపుటలలయందు పడనుంటివో నీకు తెలియదు. నీమనోవికారములు స్వచ్ఛముగా నుండుట సహజమే; యేలయన, అపవిత్రమగు కూటనీతి నీయందు కొంచమైనను లేదు. కాని నిన్న నీవు దేవపుత్రనందిని యొక్క ఉత్తమ సంరక్షకుడవని నిరూపించుకొనవలసి యున్నది. నీ వసత్యము చెప్పుట కేవగించుకొనుచుందువు. నేనుకూడా నేవగించుకొందును. కాని యసత్యమునకే యాశ్రయ మొసగుట కేర్పాటు చేయబడిన సంఘనియమమును పాటించుచు నీవేదైన మంచికార్యము చేయదలచుకొన్నచో నసత్యము నాశ్రయింపవలసియే యుండును. ఈ

సంఘ నియమములందు సత్యము ప్రచ్ఛన్నముగ వసించు చున్నది. నీవు దానిని గుర్తించుట యందు పొరపడకూడదు. చూచినదానిని, విన్నదానిని ఉన్నదున్నట్లు చెప్పుటకాని‑యొప్పుకొనుటకాని సత్యముకాదని చరిత్ర చాటుచున్నది. ప్రపంచమునకు దేనివలన నెక్కువమేలు కలుగునో యదియే సత్యము. పైకి యసత్యముగ కనబడినను నదియే సత్యము. ♦ దేవపుత్రనందిని నీకుపూజ్యురాలైన మాత్రముననే నీవామెను సేవించకూడదు. కాని యామెకు సేవ చేయుటవలన లోకమున కెక్కువ యుపకారమొనర్చ గల్గుదువు. గనుకనే నీవామెకు సేవచేయువలయును. అవసరము కలిగినప్పుడు అసత్యము సేవగించు కొనవనియు, మానవజాతికతంటికి మేలుకల్గునెడల నసత్యము పలుకుటకు వెనుకాడవనియు నేనాశించుచున్నాను" అని దీర్ఘోపదేశము గావించి యొకమారు దగ్గి గొంతు సవరించు కొనెను. తానెవరో గొప్పజ్ఞానివలె నాకుపదేశము గావించి నందుల కతడే సిగ్గుపడుచున్నట్లుండెను. తన సిగ్గును పోగొట్టు కొనుట కతడు తిరిగి "నేనుచెప్పుచున్న దానిని సరిగాఅర్థముచేసి కొనుచున్నావా భట్టూ? లోకోపకారమే ప్రధానమగు విషయము. అది దేనివలన సిద్ధించునో యదియే సత్యము. ఆచార్య ఆర్య దేవులన్నిటికంటె మహత్తరమైన సత్యము నెల్లచోట్లను చెప్ప కూడదని నిషేధించి యున్నారు. ఔషధమువలె అనను కూలమైన స్థలములందు ప్రయోగించినపుడు సత్యమే విషము

---

♦ సత్యస్యవచనంశ్రేయః సత్యాదపి హితం వదేత్ ।
యద్భూతహిత మత్యంత మేతత్సత్యం మతం మమ ।
(శాంతి-2-9-15)

వలె పరిణమించును; * మన సంఘవ్యవస్థయే యీవిధముగ నున్నది. అందు కొన్నిచోట్ల సత్యమే విషమై పోవును" అని యనెను. నేను 'సరే' యని కాని 'సరికాదు' అనికాని చెప్ప లేదు. ఆశ్చర్యములో మునిగి నేనతనివైపు చూచుచుంటిని. తన మాటలు నాకు బాగుగా అర్థమగునటుల చెప్పలేదనిరాజ కుమారునికి కొంత విచారము గలిగినది. అతని ముఖము గ్రహణము పట్టిన చంద్రబింబము వలె కాంతిహీనమయ్యెను. అతని దుఃఖమును చూచి నాకు విచారముకలిగెను. నేను కడు వినయముతో "నేను తమ యాజ్ఞను పాలించుటకు ప్రయ త్నించెదను." అని యంటిని.

తర్వాత రాజకుమారుడు లేచి "నీవీ రెండుకానుకలు భట్టిని కిమ్ము" అని మూలనుండు పెద్ద చందనపు పెట్టెనుండి యొక విగ్రహమును బయటికి తీసెను. అది నల్లరాతితో చెక్కిన బుద్ధుని విగ్రహము. జానెడు పొడవు గల యీ విగ్రహము నందు శిల్పి యొక యపూర్వ సౌందర్యమును పోతపోసి యుండెను. శకవంశపు రాజులు బుద్ధునియెడ తమకున్న యపార భక్తికి లోనై భారతీయ యవన శిల్పకళలను మేళ వించి తయారుచేయించిన బుద్ధవిగ్రహములు నాకు బొత్తిగా నచ్చవు. ఆ విగ్రహము లర్థవంతముగా నుండవు. వాని యందొకవైపు యవన శిల్పము వలె అంగముల ప్రమాణమున కెక్కువ శ్రద్ధ చూపబడి యుండ మఱియొకవైపు హస్త పాద

---

* శూన్యతా పుణ్యకామేన వక్తవ్యానైవ సర్వదా||
ఔషధం యుక్తమ స్థానే గరలం సముజాయతే||

(చతుః శతకము. 8-18)

ముద్రలయందు వాచ్యార్థమున కంటె వ్యంగ్యమునకే ప్రాధాన్యమొసగబడి యుండును. రాజకుమారుని చేతనుండిన యా చిన్న విగ్రహములలోని కాంతి యపూర్వముగా నుండి నది. అట్టి పద్మాసనము నేనిదే మొదటిసారి చూచితిని. అందు చరణతలములు వాస్తవముగ నుండునటులనే చెక్కబడి యున్నవి. భారతీయ శిల్పుల ననుకరించి కుషాణ నరపతులు ఊర్ధ్వముఖ చరణములు గల పద్మాసనములను చెక్కించి యుండిరి. ప్రామాణికమగు యవన శిల్పములం దిట్టి పద్మాస నములు గొత్తిబొచ్చు దారముతో కుట్టిన చీనాంశుకములవలె సౌందర్య విహీనముగ నుండెను. ఈ విగ్రహమునందు బుద్ధుని తల క్షౌరము చేయబడి యుండెను. కాని శకనరపతుల విగ్ర హము లందు కుడివైపునకు వంకరగ తిరిగిన కేశములుండి యేమియు రాణించుచుండవు. విగ్రహమును చెక్కిన శిల్పి నిపుణుడు వలె తోచెడిని. ఏలయన విగ్రహమును జూడ మున్మూర్తుల బుద్ధభగవానుడే కూర్చుండియుండెనా యని యనిపించుచుండును. అతని యర్ధనిమీలిత నేత్రములపై నుండి భ్రూలతలు, ధారాయంత్రముల నుండి యూర్ధ్వమునకు వంకరగా జిమ్ముచుండు నీటి ధారలవలె గాక, ముక్కుదూల మునకు గొడుగువలె వ్యాపించి యుండినవి. చేతియంగుళులు సహజముగ నుండినవి. గుప్తరాజుల శిల్పకళకు, వానికి నెట్టి సంబంధము లేదు. సమాధి, నిద్ర యీ రెండింటికిని భేదము కలదు. కుషాణరాజుల నాటి శిల్పములలో నీ భేదమున్నదని తెలియనే తెలియదు. కాని యీ మూర్తి ఓజస్వంతమై రోమరోమమున మెలకువ గలిగి యున్నట్లగపడుచుండెను.

కృష్ణవర్ధనుడా విగ్రహమును నాచేతికిచ్చి "భట్టూ, దీనిని భట్టినికందజేసి యిది యామె సహోదరుని భక్తిపూరితమగు కానుకయని చెప్పుము" అని యతడింకొక విగ్రహమును బయటికి దీసెను. దానిని చూడగనే నేనాశ్చర్య హర్షోల్లాపములతో కొంతసేపు నిశ్చేష్టుడ నైతిని. ఇది భట్టిని యుపాస్య దైవమగు మహావరాహుని విగ్రహము. విగ్రహమును చేత నిడుకొని ధ్యానముతో దానిని జూచుచు నతడు "దీనిని నీవు నీ పక్షమున నామెకు కానుకగా నొసగుము" అనెను. పిమ్మట నతడొక చిన్న చందనపు మంచమును బయటికి దీసెను. దానికి నలువైపులందు నాలుగు తెల్లని యేనుగు లుండినవి. వాని వీపులమీదనే మంచ మమర్చి యుండెను. ఆ రెండు విగ్రహముల నామంచముపై నెదురు ముఖమున కూర్చుండ జేసి నాతో "దీనిని తీసికొని యిరువురు సేవకులు నీవెంట వచ్చెదరు. వారిని గట్టునుండే వెనుకకు పంపి నీవే దీనిని నావ లోనికి చేర్చుము. వాభ్రవ్యుడు నా చెంత నున్నాడనియు నతని కేయాపదయు సంభవింపదని నీవు దేవపుత్రనందినికి విన్నవింపుము" అని పలికెను. నేను రాకుమారుని అత్యాశ్చర్యముతో చూచితిని. వాభ్రవ్యుడెట్లు తప్పించుకొనెను? అతడెచ్చట నున్నాడు? మిగిలిన యంతఃపుర పరిచారికలగతి యేమైనది? నాగు డేమైనాడు? అను ప్రశ్నలెన్నియో నా మనస్సున కలిగినవి. రాజకుమారుడీ సంగతిని గ్రహించి "భట్టూ! తగిన సమయము వచ్చినపు డన్ని విషయములు నీవెఱుగ గలవు. అసత్యము చెప్పుట కొన్ని వేళలయందు నను చితము కాదను విషయము మాత్రము నీవు జ్ఞాపకముంచు

కొనుము." అని చెప్పెను. నేను కృతజ్ఞతా పూర్వకముగ తల వంచి సెలవు గైకొంటిని.

అప్పటికి సూర్యభగవానుడు ప్రకృతి సుందరి యలసి యున్నందున ఆమె సీమంతమణి పట్టుదప్పి తన స్థానమునుండి తొలగిపోయెనా యన్నట్లు పశ్చిమ దిశకు దిగజారి యుండెను. తూర్పుభాగముననున్న ఉదయాద్రి కేదో సందేశము గొంపోవు దానివలె నీడ గబగబ తూర్పుదెస కెగబ్రాకుచుండెను. ఇరువురి సేవకుల వెంట వారు తీసికొనిపోవు మార్గమున నే సాగి పోవుచుంటిని. త్రోవలో నొక దేవాలయ పురోభాగమున పలువిధములగు తోరణములు కలశములు మొదలగునవి కట్టి యుండుట గాంచి యిచట నేమి జరుగనున్నదని నావెంట వచ్చుచున్న వారినడిగితిని. వారు "ఇది సరస్వతీ దేవాలయము. ప్రతి సంవత్సరము మదనోత్సవ సందర్భమున నిచట 'సమాజము' కూడును. అందుకే యేర్పాట్లన్నియు చేయబడుచున్నవి. సమాజము నందు ఈ నగరమునకు లక్ష్మి, శోభకు గని, కళాస్రోతస్విని, పరమ సుశీలయగు వేశ్య, చారుస్మిత యొక్క మయూరపద్మ నృత్యములు జరుగును. ఈ సమాజమున కేర్పాట్లన్నియు చిన్నమహారాజు గారే చేయించుచుందురు. దేశదేశాంతరముల నుండి కవులు, కళారాధకులు, వేశ్యలువచ్చి నృత్య గీతముల పోటీలలో పాల్గొనుచుండిరి. పలురకములగు కావ్యసమస్యాపూరణము, మానసికమగు కావ్యక్రియలు, పుస్తక పఠనము, దుర్వాచకయోగము, అక్షరముష్టి, పద్మవిందుమతి మొదలుగాగల కళాప్రదర్శనముల వలన పురజనులకు మనోవినోదము కలుగుచుండెను.

కాని యెందుకో నిన్న చిన్నమహారాజులు సమాజమును ఆపి వేసినారు. ఎందరో కళారాధకులు వెనుకకు మరలిపోవ నుద్యమించుచుండ స్థానేశ్వరపు కీర్తికి కళంకము వచ్చునని తలంచి కృష్ణవర్ధనులు స్వయముగ నీ సమాజమున కేర్పాటు గావించి నారు. అందువలననే నేడు చాల త్వరత్వరగా నేర్పాట్లు జరుగుచున్నవి. ప్రదోషకాలమున చారుస్మిత యొక్క మయూర పద్మనృత్యములు జరుగును. నేటివరకు కావు యీ నృత్యము రాజాధికారులకుదక్క మరెవ్వరి యెదుట ప్రదర్శించి యుండలేదు. కాని ఆరోజు మొట్టమొదట పురజనులీ దుర్లభ నృత్యమును జూడగలరు. ఆ కారణముననే నగరమెల్లెడలను గొప్ప సంరంభముగ నున్నది. కన్యాకుబ్జమందంతటి శ్రేష్ఠ గౌరవము నందుకొను వేశ్యయొక్క యపూర్వ నాట్య కౌశలమును జూచుట కీనాడు నగరజన ప్రవాహము వెల్లువలై పారును" సరస్వతీ దేవాలయము నెదుట కట్టియున్న విశాల మగు ప్రేక్షక భవనమును నేను తిలకించితిని. గొప్ప డేరా యొకటి పదునారు ఎత్తయిన స్తంభములపై వేయబడి యుండెను. అది క్రమక్రమముగా వంగి భూమినానియుండెను. సభాధ్యక్షుని యాసనము వికసించిన పద్మములచే నలంకృతమై యుండెను. ఆ యాసనమునకు కుడివైపున సంస్కృత కవులకును, నెడమవైపున ప్రాకృతాపభ్రంశ కవులకును, వెనుకప్రక్క రాజోద్యోగులకును, కుడివైపున నొకప్రక్క నవరోధ జనమునకును వేఱువేఱు స్థానము లేర్పఱుప బడి యుండెను. సభాధ్యక్షుని యెదుట నెడమ వైపున నొకప్రక్క నగర వాసులకు స్థానము లమర్చ బడియుండెను. రంగస్థలము

నట్టనడుమ నుండెను. అం దభ్రకము కలిపిన పిష్టాతకచూర్ణము చల్లబడి యుండెను. నేను దాని అభిప్రాయము తెలిసికొంటిని. అదియే మయూర పద్మనృత్యముల కాధారము. కన్యాకుబ్జ జనులు సంప్రదాయ ప్రియులు, చిత్రప్రియులు; వారు మయూర పద్మనృత్యముల వంటి కళల నింకను నారాధించుటే కాక వానిని ప్రోత్సహించి పోషించు చుందురు. మగధలో మయూర పద్మనృత్యములను జూచుటకు జనులింత యుత్సాహ మునుజూపరు. మగధ వీనినన్నింటి నెన్నడో విడిచిపెట్టినది. మయూర నృత్యము ఒక తక్కువ రకపు తాండవమని నా యభిప్రాయము. అందు తాళమే ప్రధానము. తాళము నను సరించుచు చప్పటల్లో. చల్లబడిన యభ్రకపు పొడిపై ఆటకత్తె తన యడుగుల కదలికనే పద్మములేక నెమలివంటి యాకారము చిత్రమగునట్లు నాట్యము చేయును. అందు రససిద్ధి యెట్లు సంభవమో నాకర్థము కాలేదు. నాట్యమునకు రసమే ప్రధాన మని నా భావము. కాని యీ కన్యాకుబ్జపు జనులే విచిత్ర మైనవారు. వారు లాస్యము కంటే తాండవమునే యెక్కువగా కోరు చుందురు. వారు మనుష్యుని మనోభావముల కన్న కార్యకుశలతకే యెక్కువ ప్రాధాన్య మిత్తురు. నేను వారి యభిప్రాయమును చక్కగా తెలిసికొన లేకుంటిని. నాకవ కాశముండి యుండిన తప్పక నేనీనృత్యమునుచూచియుందును. నేను చారుస్మిత కీర్తిని, ఆమె యభిరామమగు పదసంచార నైపుణిని గుఱించిన కథలనెన్నిటినో విని యుంటిని. ఆ నృత్యములలో నభ్రకపు పొడిపై నేర్పడు పద్మమయూర చిత్రములను గుఱించి నాకంతయుత్సాహము లేదు. కాని తాళ

లయాన్వితమగుయామె పదసంచార వైఖరిని చూచుటకు నేను సతూహలపడితిని, కాని నేనిచటనాగ జాలను. నేను వెళ్ళవలసి యున్నది. పొగరు పట్టిన గుఱ్ఱము కళ్ళెమును లెక్కచేయక దౌడు తీయునట్లు విశృంఖలమగు నా మనస్సు నా యదుపును లెక్కచేయ కుండెను. ప్రేక్షకగృహ మింకను పూర్తి కాలేదు. పనివాండ్రందఱు చుఱుకుగ పనియందు నిమగ్నులై యుండిరి. వెలుపల దివ్యగాయకుల స్రోతస్విని నొకదానిని కమలములచే నిర్మించు చుండిరి. ఈ శిల్పుల శిల్పకళా ప్రావీణ్యము ఆశ్చర్యమును గొల్పు చుండినది. చాల కష్టము మీద నేను నా మనస్సు నీ శిల్పజాలమునుండి తప్పించి వేగముగ గంగా నది యొద్దునకు బయలు దేరితిని.

నదీతీరమును చేరిన తర్వాత నాకద్భుతమగు శాంతి లభించినది. దూరము నుండియే నీటి తుంపరలచే దడిసిన పిల్లవాయువులు నా చిత్తమును సంతోషపెట్టు చుండెను. శ్వేత పంకజ పంక్తినిబోలి దూరదూరము వరకు వ్యాపించి యుండిన భాగీరథీధార కన్నుల పండువుగ నుండెను. గంగానది, కైలాస పర్వతముయొక్క తెల్లదనము నంతటిని మూర్తిమంత మొనర్చిన ధార; శివుని జటాజూటము నుండి కారుచుండిన చంద్రుని యమృతధార; బ్రహ్మ కమండలము నుండి దొఱలి ప్రవహించుచున్న వేదవిద్యల ప్రవాహము, ఆర్యావర్తములో నున్న జనులందఱికిని తల్లివంటి శాశ్వతాధారము. నాయెదుట తరంగముల నూగుచున్న స్ఫటికమువలె స్వచ్ఛమైన యీ జలరాశి యెంతపవిత్రమైనది! ఎంత శీతలమైనది! ఎంత మనోహరమైనది! ఆహా! గగనతలమే జలరూపమున భూమి

పై నవతరించెనా, లేక మంచు కొండయే కఱగి యీరూపమున వచ్చెనా, లేక చంద్రుని వెన్నెలయే రసరూపమును దాల్చినదా లేక శివుని పవిత్రమగు మందహాసమే జలరూపమును ధరించెనా లేక పార్వతీదేవి యపాంగ వీక్షణమే తరళిత మగుచున్నదా! లేక త్రిభువన మందంతటనున్న పుణ్యమే కఱగిపోయినదా శరత్కాలమేఘ పంక్తియే యాగియున్నదా ? లేక సరస్వతీదేవి యొక్క కర్పూరధవళమగు దేహకాంతియే ద్రవరూపమును దాల్చెనా ! ఏమి యీ యపూర్వ దృశ్యము ! ఈ గంగానది సౌందర్యమున కాశ్రయము, పవిత్రతా ప్రవాహము మహిమకు మూలము ! నదీతీరమునుండి క్రౌంచపక్షులయు హంసలయు కలస్వనము వినబడుచుండెను. గట్టున నుండు చెట్లయందలి కుసుమ సౌరభము నభోమండల మంతయు వ్యాపించి యుండెను. సారసముల కేకరింతలతో నదీతీర మంతయు ముఖరిత మగుచుండెను. సూర్యకిరణములు నిర్మలమగు నదీ తోయములపై బడి వాని నుండెన్నియో రంగులను వెదజల్లు చుండినవి. నేను నావ వద్దకు రాగానే చందనపు మంచమును సేవకులనుండి తీసుకొని వారిని ప్రేమపూర్వకముగ వెనుకకు పంపివేసితిని.

# ఎనిమిదవ అధ్యాయము

గోధూళి వేళ మా నావ బయలుదేరినది. అంతకు కొంతసేపుముందే ఆచార్య సుగత భద్రులు భట్టినిని వాత్సల్య పూర్వకముగ నాశీర్వదించి యామె నామె తండ్రికడ కేవిధమున నైనను చేర్చెదమని యూరడించి వెడలిపోయి యుండిరి. భట్టిని చాలసేపటి వఱకు ఆచార్యపాదులు వెళ్ళిన వైపునకే ఖిన్నవదనయై చూచుచుండెను. నీలమై దట్టముగ నున్న ఆమె చికుర కలాపము వదులై యూడిపోయి ముఖము నావరించి శైవలమున దగుల్కొన్న పద్మమా యని భ్రమ గొల్పుచుండెను. క్రమక్రమముగ గంగానదీ ధారయందు చంద్రబింబము ప్రకటమై చూచు చుండగనే, దినమంతయు వసంతములాడి తన శరీరముపై యంటుకొనిన బుక్కాయమును కడిగికొనుటకై స్నానముచేయునట్లు, శతవిధముల గంగానదీ పుణ్యసలిలముల జలకము లాడు చుండెను. ఒకవైపంధకారము దట్టమగు చుండ మఱియొకవైపు క్రమక్రమముగ పాలవెన్నెల వృద్ధినొందుచు గంగానదీ తీరమునంతయు ధౌత మొనర్చు చుండెను. గంగానదీ చంచల వీచికలపై చంద్రబింబము, నక్షత్రములు నృత్యము చేయసాగినవి. కాని భట్టిని విచార సాగరమున మునిగి కూర్చుండి యుండెను. నేనింకెక్కువసేపు దీనిని సహించ లేకపోతిని. దుఃఖముతో నేను "దేవీ, చిత్తిల్ల కుడు. బాణభట్టునిపై విశ్వాస ముంచుడు. ఆచార్య పాదుల యాశీర్వచన మమోఘము. అది తప్పక ఫలించి తీరును. ఏ విధముగనైనను నేను మిమ్ములను తమ పితృపాదులు, విషమ

సమర విజయులు, వాహ్లీక విమర్దనులు, దేవపుత్రులునగు తువర మిళిందుల చెంతకు జేర్చెదను.. ఆచార్యులవారి యాజ్ఞను మన్నించుటకై మగధకు వెళ్లుచున్నాను. తమను మగధకు గొనిపొమ్మని నన్ను వారేల యాదేశించిరో నేను సరిగా చెప్పలేను. కొంచ మాలస్యమైనను నేను నా ప్రతిజ్ఞను నిలబెట్టుకొందును" అని యంటిని.

భట్టిని నా ప్రార్థన నాలకించినది. తన మృణాల కోమలములగు నంగుళులతో చెదరిపోయిన ముంగురులను సవరించుకొని చిఱునవ్వు ముఖమునచిందులు ద్రొక్క నన్ను జూచినది. ఒక క్షణములో నావ యందంతటను స్వచ్ఛ కాంతులు ప్రసరించినవి. నేనా దృశ్యమునుజూచి యసమాన ప్రతిభా సంపన్నుడగు కాళిదాస మహాకవిని స్మరించితిని. ఆహా! ఉదయించుచున్న చంద్రుని కిరణముల వలన నంధ కారము తొలగు చుండుటను జూచి, తన ముంగురులను సవరించు కొనుచు దృష్టిని హరించు ప్రాగ్దిశా కాంతను ♦ భావనచేసియున్న కాళిదాస మహాకవి తాను భావనచేసిన దృశ్యమువంటిదే రెండువందల సంవత్సరముల తర్వాత గంగానదీపవిత్రప్రవాహముపై నొకేమారు భూమ్యాకాశము లందగపడునని యనుకొనియుండడు. ఒకా నొక దినము చంద్రుడు బాహ్యజగత్తునంతయు నమృతధారల తడుపు చున్నపుడు, అనవరతము స్రవించుచుండు చందన రస ప్రవా

---

♦ ఉదయగూఢ శశాంక మరీచిభి స్తమసి దూరతరే ప్రతిసారితే।
అళకసంయమనాదివ లోచనే హరతి మే హరివాహన దిఙ్ముఖమ్॥
(విక్రమోర్వశీయము)

హాముచే దానిని రసవంత మొనర్చుచున్నపుడు, నమ్మృత సారపు పొంగుచే భువనాంతరాళమును ముంచివేయు చున్నపుడు, శ్వేత గంగానదీ సహస్ర ధారలను దొలలించు చున్నపుడు, మహావరాహుని దంష్ట్రిల శోభను ఎంజల్లుచున్నపుడు గంగానదీ ప్రవాహమ్ముపై, మందాకినివోలె పవిత్రురాలు, జ్యోత్స్నవంటి రూపసియగు నొక రాజకుమారి తన చిఱు నగవుతో అంతర్జగత్తును కూడ శుచిమంతముగను, నిర్మల ముగను, వికాసవంతముగను చేయగలదని యీ మహాకవి కేమియెఱుక! భట్టిని ప్రసన్న చిత్తయై యుండుట గాంచి నా హృదయము ఆనందభరితమయ్యెను. నేను కడు నుత్సాహమున, "దేవీ, మహావరాహుడే మనకు సహాయకారి. తమరీ సేవకునిపై నమ్మకముంచుడు. సింహపు జూలును కాలరాచ ప్రయత్నించినవారు దాని ఫలము తప్పక యనుభవింతురు. అకించనుడైన యీ బాణభట్టు ఉపేక్షాపాత్రుడని యెంచవలదు. ఆర్యావర్తమునందు కృతజ్ఞత యింకను పూర్తిగా లోపించి యుండలేదు. వాహ్లీకమునుండియు సరిహద్దు ప్రాంతమునుండియు క్రూరులగు హూణులను సమూలోచ్ఛేదనము గావించిన పరమ భాగవతులు, బౌద్ధులు అగు దేవపుత్రునియెడ శ్రద్ధాభక్తు లింకను నంతరించియుండలేదు. మీ రెచ్చట నున్నది దేవపుత్రులకు తెలిసిననాడు యముడు కూడ నతని మార్గము నడ్డలేడు. దుర్విధి పరిహసించుచుండ, దిక్కు తోచక దేవపుత్రు లెచ్చట పరితపించుచు పడి యున్నారో కదా! కాని బ్రాహ్మణ, శ్రవణుల రక్షకుడు, దేవాలయముల దేవతా విగ్రహముల పాలిటి సంరక్షకుడు,

యువతుల యొక్కయు వృద్ధ స్త్రీల యొక్కయు మానరక్షకు డగు దేవపుత్రుల కొకనాడు మీ సమాచారము తప్పక తెలియగలదు. ఆనా డతని మార్గము నరికట్టు నంతరాయము లన్నియు పుట్టగొడుగుల కాండములవలె విచ్ఛిన్నములై పోగలవు. భయంకర వ్యూహము లన్నియు పచ్చికుండ వలె విచ్చిపోగలవు. ఆనాడు దేవపుత్రుని కలకలముతో భూమ్యా కాశములు దద్దరిల్లగలవు. ఈనాడు చోరునివలె పారిపోవు చున్న బాణభట్టు డానాడు ప్రళయము నరికట్టు నానకట్ట కాగలడు. దేవీ! బాణభట్టుడు తన కర్తవ్యము నెన్నటికి తప్పిపోడు! మీ రూఱడిల్లుడు!" అని యంటిని.

భట్టిని కళ్ళలో గిఱ్ఱున నీరు తిరిగినది. వానిని దాచుట కామె తన ముఖమును మఱియొక వైపునకు త్రిప్పి చీరకొంగుతో కన్నీటిని తుడుచుకొని నావైపు చూడసాగెను. ఆమె ముఖ ముపై నప్పటికి ఆర్ద్రస్మితము నాట్యమాడుచుండెను. ఆ నవ్వును నే నర్థము చేసికొంటిని. అందు కృతజ్ఞత యుండినది కాని నమ్మకములేదు. 'ఆశ్వాసమిచ్చుచున్నందుకు నేనుకృతజ్ఞ రాలను. కాని, నీవుచేసిన ప్రతిజ్ఞను పూర్తిచేయుట సాధ్యము కాని పని' అని. ఆమె నవ్వు ఆమె మనోభావములను వ్యక్త పఱచుచున్నట్లగపడినది. నేనొక క్షణముసేపు దిక్కుతోచక కరుణారసభరితమై గంభీరముగా నొప్పుచుండు నామె ముఖ మండలమును చూచుచుంటిని. నే నామె హృదయావేదన తెలిసికొన గోరుచుంటిని గాని యామె ముఖముపై నొక విధ మగు మాహాత్మ్య మావరించి యుండినందున దానిని దాటి యామె హృదయములోని యావేదనను తెలిసికొనుటకుగాని

దానిని గుఱించి ప్రశ్నించుటకుగాని నాకు సాహసము చాల లేదు. అట్టి సమయమున నిపుణిక నాకు సహాయపడినది. ఆమె యూవేదనతో కూడిన భయముతో "భట్టూ! నీవామె హృదయావేదనను తెలిసికొనజాలక యవస్థ పడుచున్నావు. భట్టిని యాంతరంగిక వ్యధ చాల గంభీరమైనది. నీవు కవితా ధోరణి విడచిపెట్టుము. ఆమె కిదివఱకెందఱో సేవకులుండిరి. కాని యొకరుకూడ నామెను రక్షింపజాలకపోయిరి. దేవ పుత్రుని యపారసేన యింతకుముందు కూడ నుండినదే. కాని యది యామెను రక్షింపజాలకపోయెను. నీ వొంటరిగ నేమిచేయగలవు? ఆలోచించి ప్రతిజ్ఞ చేయుము" అని యనెను.

నిపుణిక మఱియొకమాఱు నా యభిమానమును కాల దన్నినది; నేనీవిధముగ జరుగునని తలచియుండలేదు. దుఃఖములో మునిగియున్నవాని నూఱడించుట కెవరైనను కొంచె మెక్కువగ మాటలాడుట సహజమే. కాని నేను మితిమీఱి యుంటిని కాబోలు. ఐనను, నిపుణిక నన్నీవిధముగ తూల నాడి యుండకూడదు. నేనొక క్షణకాలము గ్లానినొందితిని. నాపై నాకే యసహ్యము కలుగజొచ్చెను. సాయంకాలపు శిరీష పత్రములవలె నా కన్నులు తమంతట తామె వాలి పోయినవి. దెబ్బతిన్న నత్తగుల్లవలె నా ముఖము ముడుచు కొని పోయెను. కాని నేనా విధముగ చాలసే పుండలేదు. దెబ్బతిన్న నా యభిమానము నన్నుద్ధతునిగా జేసెను. నేను కొంచెము కోపముతో మాటలాడబోవు సమయముననే భట్టిని గ్లానిచే వాడిపోయిన నా ముఖమును చూచి నిపుణి కను మృదువుగ మందలించుచు, "ఛీ, నిడునియా! నీవే మట్లు

మాట్లాడుచుంటివి ? భట్టుపై నాకు సంపూర్ణమగు విశ్వాసము కలదు. కవిత్వమున కెట్టి శక్తిగలదో నీ వెఱుగవు. భట్టు కవి. అతని కెంత శక్తి యున్నదియు నతనికే తెలియదు. అంత మాత్రమున మనముకూడ నతని మహత్త్వమును మఱువ వచ్చునా? నా కింతకు మునుపు సేవకులున్నమాట నిజమే కాని యిట్టి దేవతుల్యుడగు సంరక్షకుడు నా కింతవఱకు లభించ లేదు. అతని ప్రతిజ్ఞ సఫలమగుట గొప్ప విషయమని నీవు తలచుచున్నావు. కాబోలు. కాదు చెలీ, ప్రతిజ్ఞ చేయుటయే గొప్పవిషయము. చూడు భట్టూ! మహావరాహుని పైననే నా యాశలన్నియు లగ్నమై యున్నవి. మహావరాహుడే నిన్ను నాకడ కంపెను. మహావరాహుడు కోరినచో నతడే నన్ను నా తండ్రికడకు చేర్చగలడు. అతని యిచ్ఛయే ప్రధానము. నేను, నీవు నిమిత్తమాత్రులము. అతని యభి మతిమే జరుగగలదు. దుఃఖము, సంతోషము, ఏడుపు, నవ్వు, ఇవన్నియు నతని ప్రసాదములే. ఇంతకు మనుష్యు డేమి చేయగలడు ?"

కొంచెమునే పూరకుండి తిరిగి భట్టిని "భట్టూ, నేను చాలా కాలమునకు ముందే చనిపోయి యుండవలసినది. నగరహార మార్గమున సరిహద్దు దొంగలు నాపై బడినపుడు నాపల్లకి వెంట రెండువందల మంది ధృఢకాయులు, విశ్వాస పాత్రులునగు నా సేవకులుండిరి. తాతగారి వంటి పూజ్యులు, పరాక్రమ వంతులునగు ఆదిత్యసేనుని విశ్వాసము చూరగొన్న సేవకుడగు ధీరనాపతి నావెంట నుండెను. దొంగలు అకస్మాత్తుగ మాపై బడిరి. ధీరనాపతి చివరవఱకు ఛత్రము

వలె నన్ను కాపాడుచునే యుండెను. వీరులగు నా రెండు వందలమంది సైనికులు దేవపుత్రుని పేరు తలచుకొనుచు మరణించిరి. ఒక జాము సేపాయుద్ధము జరుగుచుండెను. తమ శరీరమున నొక నెత్తురుచుక్క మిగిలియున్నంత దనుక వారు దొంగలను నా పల్లకి వద్దకు చేరనీయ లేదు. ధీరనాపతి యింతవఱకు నెలుగెత్తి దేవపుత్రుని జయనాదము చేయుచునే యుండెను. వణకుచున్నగుండెను హాయి చేసికొని 'రక్షింపుడు రక్షింపు'డని మొఱలిడుచున్న నా నమ్మకపు బంట్లంతటించు చుండుటను నేను చూచుచునే యుంటిని. ధీరనాపతి యింకను గొంతు చించుకొని దేవపుత్రుని జయనినాదము చేయు చుండెను. ప్రాణము పోవు వఱకు నతడు నన్ను జూచి "అమ్మా, యీపాపులు నీ నీడను కూడ నంటలేరు." అని యనుచుండెనే కాని పాపమతనిని ఏబది మంది దొంగలు చీమల వలె చుట్టు కొనిరి. అతని వస్త్రములను, కేశములను వారొలిచి వైచిరి. కాని యతడు మాత్రము పల్లకి నుండి దిగలేదు. అతని రక్తముచే నాపల్లకి తడిసి పోయెను. నేనా దృశ్యమును సహించలేక పోయితిని. పల్లకినుండి దిగి నేనా వృద్ధుని పల్లకిలోనికీడ్చు కొందమని ప్రయత్నించితిని. కాని యప్పటికే యతని శరీరము మూడు ముక్కలై యుండెను. దరిద్రురాల నగు నాచేతి కతని పాదములే చిక్కినవి. మొదలు నఱికిన వృక్షమువలె నేను కూలబడితిని. భట్టా, నేనా సమయమున నేల చావనైతినో తెలియకున్నది."

కొంతసేపూరకుండి భట్టిని నిపుణిక వైపునకు తిరిగెను. ఆమె కన్నుల నుండి కన్నీరు జొటజొట కారుచుండెను. ఆమెను

జూచి భట్టిని "ని ఉనియా, ఏడువవలదు. నా జీవితములో నేనెక్కువగ నేడ్చితిని. 'నగరహారము' నుండి 'పురుషపురము', అచటినుండి 'జాలంధరము' నేను దస్యులవెంట తిరుగవలసి వచ్చెను. చివరకు స్థానేశ్వరపు చిన్నరాజాంతఃపురమున నా కాశ్రయము లభించెను. నగరహారపు మార్గమున దొంగలు నా దౌర్భాగ్యపు శరీరమును తాకునంతవఱకు దేవపుత్రుని కుమార్తెనను గర్వము నాకుండినది. నే నొక మాసమువఱకు మా తండ్రిగారిని తలచుకొని యేడ్చుచుంటిని. తరువాత నా గర్వ మడుగంటిపోయినది. భగవంతుడు సృష్టించిన లక్షలాది కన్యలవలె నేనుకూడ నొక మానవ కన్యకనే. వారివలెనే నేనుకూడ సుఖ దుఃఖములకు పాత్రురాలనే. వారివలెనే, నా జన్మముకూడ సార్థకము నొందుటకై యుద్దేశింపబడియుండలేదు. నా యహంకారము చచ్చిపోయినది. నా యభిమానము నశించినది. కులీనురాలనను నా గర్వము మాయమైనది. అగౌరవింపబడి, యవమానింపబడి, కళంకితము చేయబడిన వందలాది స్త్రీలవలె నేను కూడ నొక సామాన్య స్త్రీనే. జగత్తునందలి దుఃఖ ప్రవాహమునం దుద్భవించు ఫేన బుద్బుదమువలె నేనుకూడ నశిం చెదను. కాని యీ ప్రవాహము తన గంభీరమును సాగించుచునే యుండును. తల్లివద్ద నేను బుద్ధుని దుఃఖవాదమును గుఱించి నేర్చుకొంటిని. తండ్రివద్ద భాగవత యనుకంపమును గుఱించి నేర్చుకొంటిని. నాపై మహావరాహుని కృపాకటాక్షమున్నది. ఇదియే నా కేకైక సుఖసాధనము. అతని దయ వలననే నాకు నీవును భట్టును దొరికితిరి. నిఉనియా,

యేడ్చుటవలన నేమి ప్రయోజనము ? నే నీనాడుకూడ నా యేడ్పు నాపజాలకున్నాను కాని యదియొక క్షణికమగు దౌర్బల్యము మాత్రమే. గతము నంతటిని విస్మరించుటకు నేను ప్రయత్నించుచున్నాను. నా తండ్రిని తిరిగి కలసికొనుట సంభవమా ? ఏమో ! మహావరాహునికే యెఱుక ! మన మెందుకు చింతిల్లవలెను ?" అని యనెను.

నేనిం కెక్కువ వినజాలకపోతిని. ఆవేశముతో నేను "దేవీ, మీరు కళంకిత స్త్రీలని యెవరనగలరు ? పార్వతిని పోలిన నిర్మలమగు మనస్సు, గంగవంటి పూత మొనర్చు విచారధార, కైలాసమువంటి స్వచ్ఛమగు సౌశీల్యము, మానస సరోవరమువంటి కరుణారస భరితహృదయము గలిగి లోక మునకు పూజనీయురాండ్రగు మిమ్ముల్ను కళంకితురాలని తలచునట్టి పాపి నరకము నొందగలడు. దేవీ, అగ్ని నెపుడు నేకళంకమును స్పృశింపదు. దీపశిఖకు చీకటి నలుపంటదు. చంద్రుని ఆకాశపు నీలిరంగు కళంకిత మొనర్చజాలదు. జాహ్నవీ తోయములను ధరిత్రీ పంకిలము స్పృశింపజాలదు. దుఃఖభరితమైన యీ మాటలు మీకు శోభించవు. దేవీ ! నక్కలు తాకినంతనే సింహకిశోరి కలుషితమగునా ? అసు రుల గృహమున నున్నంత మాత్రముననే లక్ష్మి కపకీర్తి కలుగునా ? చీమలు తాకినందువలన కామధేనువున కవ మానము కలుగునా ? దుశ్శీలురమధ్య నివసించినంతనే సర స్వతి కళంకితురా లగునా ? ఎన్నటికిని కాజాలదు ! దేవీ, యూఱటజెందుడు ! మీరు పవిత్ర మూర్తులు. శుభమునకు గనివంటివారు. ఆర్యావర్తమంతటను బ్రాహ్మణులు, శ్రమ

ణులు, దేవాలయములు, పంటభూములు, అనాథులు, స్త్రీలు, నగరములు, జనపదములు—ఇవన్నియు నేనాడు తమ రక్షకుడు దేవపుత్రుడు తువరమిళిందుని కుమార్తెను గుర్తించునో యానాడు వారు దేవాలయములలో మీ విగ్రహమును నెలకొల్పి పూజించెదరు. మదించిన యీ దేశమునందు కొనయూపిరి యున్న యెడల సరిహద్దు దొంగలు తాముచేసిన దుష్కార్యమునకు ప్రాయశ్చిత్తము చేసికొనవలసి యుండును. దేవీ! నేను కవినని నాకు తెలియదు. ఒక్కొక్క శ్లోకము నల్లుటకు గంటలతరబడి నేను తల పగులగొట్టుకొనుచుందును. నేనే కవినై యుండిన నేమిచేసియుందునో మీకు తెలియునా? దేవపుత్రుని ప్రియపుత్రికయొక్క కీర్తిని ఆర్యావర్తపు నలుమూలల వ్యాపింపజేయునట్టి గీతము రచించి యుందును. ఎన్నియో యుగములవఱకు నార్యుల పుణ్యభూమి యందంతట నారీ సౌందర్యమును పూజించుటకు ప్రేరేపణము కలుగజేయు కావ్యమును రచించియుందును. అటు తర్వాత నిట్టి దేవప్రతిమ నవమానించుట కెవరు సాహసింపజాలరు. కాని నేను కవిని కాను."

భట్టిని ముఖము ప్రభాతకాలపు నవమల్లికా కుసుమము వలె వికసించెను. మందహాసము ముఖముపై నాట్యమాడ నామె కపోలపాలి విప్పారెను. ఆమె కన్నులలో మెఱుపుతీవ వంటి యానందరేఖ మెఱసిపోయెను. నుదుటిపై బడియున్న ముడుతలు మాసిపోయి అయ్యాది యష్టమి చంద్రునిబోలి మనోహరముగ కన్పట్టుచుండెను. అశోక కిసలయములవంటి యెఱ్ఱని పెదవులు కదలినవి. ధీరప్రసన్న భావము లుట్టిపడ

నామె "భట్టూ! నీవు కవివి కావని యెవరనగలరు? నిరంతరము మననము చేయుచుండుటచే నీ మనస్సు కల్మషరహిత మైనది; సౌశీల్యముచే పూత మొనర్చబడిన నీ హృదయము సరస్వతీదేవికి నివాసస్థానమై యున్నది. నీ పెదవులనుండి విమలవాణీధార నిరంతమురము ప్రవహించుచుండును. నీవుకవివి కావనియెవరనగలరు? ఏనాడు శక్తిసంపన్నమగు నీ వాగ్ధారలీ పృథ్వియొక్క కల్మషమును ప్రక్షాళన మొనర్చగలవో యానాడే అందఱికి శాంతి లభించగలదు. శ్లోకమే కవిత్వ మనిపించుకొనదు. మా యవన సాహిత్యమునందు గద్యమును 'కావ్యనికష' యందురు. ఛందోలంకారములు కావ్యమునకు ప్రాణములు కావు. కావ్యమునకు ప్రాణము రసము; విశుద్ధమగు సాత్విక రసమే కావ్యమునకు జీవము. నీవు నిజమైన కవివి. నీవీ యార్యావర్తమున కపరకాళిదాసువని మాత్రము నీ వెన్నటికిని మఱువకుము" అని చెప్పి తాను మాటలాడవలసిన దానికంటె నెక్కువగ మాటలాడిన దానివలె తటాలున తన మాటలను ముగించివేసెను. ఆమె ముఖము కొంచె మెఱ్ఱబడెను. కాటుక పిట్టలవంటి చంచల నేత్రములు వాలిపోయెను. పెదవులపైని చిఱునవ్వు దాగు కొనుటకు ప్రయత్నించుచుండెను. కాని యామె యానందము దాగలేదు. క్షణ క్షణమునకు నామె కపోలములు వికసించుచు కన్నులు విశాలము లగుచుండెను. భట్టిని ముఖము ఆనందము, వ్రీడ, మందహాసములచే మనోహరముగ కనబడు చుండెను.

నేను కొంచెముసే పలసభావముతో నాలోచించుకొనుచుంటిని. నే నపరకాళిదాసునని భట్టిని చెప్పుచున్నది. కాళిదాసు ఆర్యావర్తమునం దంతట గౌరవింపదగినవాడుకదా! నాకు నతనికి నెక్కడి పోలిక! ఒక్కమాఱు మాలినీ తటమున విలసిల్లుచుండిన యాశ్రమము, హోమ ధూమములచే నల్లబడిన చెట్ల యాకులు, ఇసుక తిన్నెలయందు దాగుకొనునట్టి హంస జంటలు నా తలపునకు వచ్చెను. ఆశ్రమవాసులు జలాశయమునుండి స్నానముచేసి తడి బట్టలతో వచ్చుచున్నపుడు మార్గము లన్నియు వారి నారబట్టలనుండి కారుచుండిన నీటితో తడుపబడుచుండెను. అట్టి శాంతమగు తపో వనమున నివసించు లేళ్ళు, వింటినారి శబ్దము నెఱుగనే యెఱుగవు. అచట చంచలమగు క్రీగంటిచూపులు మచ్చుకైనను నెవరును చూడలేరు. అచటి ఋషికన్యకలు ఆశ్రమ వటువుల గృహకార్యములకు సహాయపడుచుండెడివారు. అట్టి ప్రశాంతమైన వాతావరణమునందు, ఆ సౌందర్యమూర్తి, సౌకుమార్యపు గని, శైవాలముతో కప్పబడిన కమలము, వల్కలములను ధరించినట్టి శకుంతల నాకు జ్ఞాపకము వచ్చెను. అంతేకాదు. ఒకమాఱు నాకు నవోన్మేషశాలిని యగు నా వసంతలక్ష్మి, నగపతియగు హిమాలయముయొక్క శోభా సంపద, పరమశివుని యమరధ్యానము, జ్ఞాపకమునకు వచ్చినవి. ఆనాడు కైలాస పర్వతమునందు దేవదారు వృక్షము క్రిందనున్న యరుగుపై నివాత నిష్కంప దీప కళికవలె ధ్యానమునందు స్థిరముగ నిమగ్నుడైయున్న మహాదేవు నెదుట తన యౌవన భారముచే కృంగి, వసంత కుసుమములచే

సింగారించుకొని, పుష్పగుచ్ఛముల భారముచే వంగి, యిటు నటు సంచరింపగల పల్లవములతో నిండిన లతవోలె, పార్వతీ దేవి వచ్చెను. ఆమె వేణీభరమునందు శోభించుచున్న గన్నేరు పువ్వులు చెవులయందున్న నవకిసలయములు ధ్యాన నిమగ్ను డైన యీ శివుని చరణములపైకి వ్రాలినపు డాయోగికూడ చలించిపోయెను. అతడు తన కన్నులను పార్వతీ ముఖము పైకి కష్టముమీద ప్రసరింప జేసెను. ఒక క్షణకాలము ప్రపంచ మంతయు మధుమయమైన ట్లతనికి గన్పట్టెను. అశోక కుసుమము అతని భుజముపైనుండి క్రిందికి జారెను. పొగడపూవు నిక్కబొడుచుకొనెను. అశోకవృక్షము నూపుర సంయుతమగు దోహదక్రియ నపేక్షింపలేదు. పొగడచెట్టు పుక్కిలింత పాత్రజలము నాశింపలేదు. కాని మఱుక్షణ ముననే యోగి తన మనస్సును కుదుటపఱచుకొనెను. మన్మథుని యనధికారప్రవర్తన శివునికే నచ్చలేదు. అప్పటికే యాకాశమునందు దేవతలందఱు కోపము నుపసంహరింపుమని పరమశివునికి మొఱలిడుకొనుచుండిరి. కాని వారి ప్రార్థన చెవిబడక మున్నే మన్మథుడు తెల్లని బూదియైపోయెను. కిశోరయగు పార్వతియొక్క సుకుమారమైన మనస్సునకు తన సౌందర్యమువలన కలిగిన యీ యనర్థమును దలచుకొని విసుగు కలిగెను. ఆమె తపస్సుచే తన రూపముయొక్క గొప్పదనమును సాధింపదలచెను. ప్రథమ దర్శనమునందే కలుగు ప్రేమ, భౌతిక శరీర లావణ్యమును గుఱించిన యీ శక్తి యీ రెండింటిపై పిడుగును పడవేసి హిమాలయ పర్వతముళందలి సమస్త సౌందర్యమును తృణీకృత మొనర్చి

కాళిదాస మహాకవి త్యాగము తపస్సు, ఈ రెండింటి కల యికకు ప్రాధాన్య మొసంగెను. కాని యిట్టి సమ్మేళనము చేయునపుడు కూడ కవి నిర్లిప్తునివలె నుండెను. కుమారసం భవములోని మొదటి మూడుసర్గలయందంతటను నీమాయా సామ్రాజ్యమే వర్ణింపబడెను. కాని కవికి దానిని గురించిన మోహము లేదు. ఏల యన కాళిదాసు మానవుని, అతని యీ ప్రపంచమును శాశ్వతమని తలంపలేదు. మన కగపడు సౌందర్యమును దాటి మనకు గోచరించు జగత్తుయొక్క యంతరాళమున నొక శాశ్వతమగు శక్తియున్నది. ఆశక్తియే యీ ప్రపంచమును శుభప్రదమగు త్రోవలో నడుపుటకు నిశ్చయించుకొని యున్నది.

కాళిదాసు, భువనమోహిని గౌరవమును చక్కగా అర్థము చేసికొని యుండెను. అతడు పురుషుని దురంత దురాశనుకూడ తెలిసికొని యుండెను. రాజ్యముల నేర్పఱ చుట, సైన్యసంచాలనము, మఠముల స్థాపన, నిర్జననివాసము- ఇవన్నియు పురుషుని హద్దులేని క్రమరహితమగు పేరాస యొక్క ఫలితము. పురుషుని కట్టుబాట్లలో నుంచగల శక్తి స్త్రీయే. కాళిదాస మహాకవి యీ రహస్యమును గుర్తిం చెను. ఇట్టి మహిమా సమన్వితమగు శక్తిని తిరస్కరించిన సామ్రాజ్యము మంటగలియును. మఠములు ధ్వంసములగును. జ్ఞానవైరాగ్యములనెడి సమస్యలు ఫేన బుద్బుదమువలె నొక క్షణములో నశించిపోవును. ఇందుకు చరిత్రయే తార్కా ణము. కాళిదాసెక్కడ? అదృష్ట విహీనుడగు బాణుడెక్కడ? నన్నూఱడించుటకై భట్టిని తెలిసి తెలిసి యీ మాటలనినట్లు

మాటాడి యుండవచ్చు. లేక కాళిదాసును గురించి యామె కంతగా తెలిసియుండక పోవచ్చు. కాళిదాసు తాను దర్శించిన సత్యమును ప్రకటించగల మేధావి. సరస్వతియే స్వయముగ నతని కంఠమునందు స్థిరనివాస మేర్పఱచుకొని యుండినది. అతడా వాగ్దేవికి ముద్దుల బిడ్డడు. పరమభ్రష్టుడనై సత్కర్మానుష్ఠానములేని నే నతనికెట్లు సరితూగగలను? కాని భట్టినికి నాయెడ నాదరాభిమానములు కలవు. ఒక క్షణకాల మేమియు నాలోచింపక భట్టిని మనోహర ముఖార విందమును చూచుచుంటిని. ఆమె ముఖము పాటల కుసుమము వలె నెఱ్ఱబడెను. కాని యా యెఱ్ఱదన మామె సౌందర్యమును నూఱురెట్లధికమొనర్చు చుండెను. భట్టిని నావైపునుండి తన ముఖమును త్రిప్పి నిపుణిక వైపునకు చూడసాగెను. నిపుణిక ముఖము తెల్లబడియుండెను. ఏదో భయమువలన నామె చాల వ్యాకులముగ నుండెనని తెలియుచుండెను. వేసవికాలపు టెండలకు వాడిపోయిన రేలపూవు వలె నామె పచ్చని ముఖము కాంతిహీనమై యుండెను. ఆమె కన్నులక్రింద నీలిరంగు మఱింత గాఢమై యామె మనస్సునందలి భయమును తెల్పుచుండెను. నేను భయముతో "నిఉనియా, నీ వెందుకట్లున్నావు?" అని యడిగితిని. నిపుణిక మారుపల్కలేదు. భట్టిని మాటిమాటికి నొత్తిడి చేసినను బదులు చెప్పక ఆమె మెల్ల మెల్లగ లోపలికి వెళ్ళిపోయెను. భట్టినికూడ యామె ననుసరించెను. నేను నావపై భాగమునకు వెళ్ళితిని.

గంగానదియొక్క స్వచ్ఛమగు సైకతపుగట్టు, పాల వెన్నెలయందు తళ తళ మెఱయుచుండెను. ఆ గట్లమధ్య ప్రవహించుచున్న గంగానదీ ప్రవాహము రజతచూర్ణము మధ్య పారుచున్న పాదరస ప్రవాహమా యని తోఁచు చుండెను. ఒక దిక్కున నీ నదీ ప్రవాహ మొక సన్నని నీలిరేఖవలె ప్రారంభమై రెండవ దిక్కున నావిధముగనే యొక సన్నని నీలిరేఖవలె విలీనమైయుండెను. ఈ మధ్య ఆ నదీప్రవాహపు చంచల వీచికలొక సోపాన పరంపర వలె నమర్పబడి యున్నట్లుండెను. చంద్రుని ప్రతిబింబ మా తరంగములపై బడి మాటి మాటికి విచ్ఛిన్న మగుచుండెను. దిఙ్మండలమంతయు శాంతమై, స్నిగ్ధమై, మనోహరమై యలరారుచుండెను. ఆకాశమునందు నక్షత్రములమధ్య చంద్రుఁడు రాజువలె విరాజిల్లుచుండి గంగానదీ ప్రవాహమున నేర్పుగల మల్లునివలె పలురకములైన వ్యాయామముల నభ్యసించుచుండెను. నా యెదుటనుండు ప్రశాంతమగు నీప్రకృతిఅంతరాళమున కోలాహలభరితమగుయుద్ధము జరుగుచుండెను. మేలుకొనియే నే నొక స్వప్నమును గాంచుచుంటిని. భట్టిని పల్లకిలో కూర్చుండి పోవుచుండగా అకస్మాత్తుగ సరిహద్దుదారి దొంగల గుంపొకటి దానిని చుట్టుకొనెను. రెండువందలమంది విశ్వాసపాత్రులగు సైనికులొక్కరొక్కరుగా తమ ప్రాణముల నర్పించుచుండిరి. శ్రమ బిందువులచే తడిసిపోయిన వారి లలాటమునందు దుర్దమనీయమగు నిశ్చయము ప్రకటిత మగుచుండెను. వారి చేత నొఱనుండి తీయబడిన కత్తులు తళ తళ మెఱయు

చుండెను. వారి భుజములపై వాడియగు నీలి లమఱియుండెను. వారి హృదయములందు చనిపోవుటకుగూడ సిద్ధమైన గట్టి నిశ్చయము, మనస్సునందు భట్టినిని కాపాడజాలనందుకు పశ్చాత్తాప మున్నట్లగపడుచుండెను. వారి రక్తనాళములనుండి రక్త మేకధారగా పైకెగయుచుండెను. శరీరమునందలి మాంసము శత్రువుల కత్తిదెబ్బలకు తెగి వ్రేలాడుచున్నప్పటికి వారు చట్రాళ్ళవలె తమ స్థానములనుండి తొలగక నిలుచుండియుండిరి. ధీరనాపతి నిరాశతో కూడిన స్వరమున భట్టినిని నిర్భయముగ నుండుమని హెచ్చరించుచుండెను. అతని గొంతు బొంగురుపోయి బుద్ధి కళవళపడుచుండెను. అతని చేతులు శత్రు సంహారమునందు ప్రవృత్తములై యుండెను. అతని స్వరమునందు భయమగపడుచున్నను భట్టినిని కాపాడగలనను నమ్మక మందు స్పష్టమగుచుండెను. పల్లకిలోనున్న భట్టిని ముఖారవిందము భయముచే నల్లబడియుండెను. భట్టిని కన్ను లీ భయంకర దృశ్యమును చూచి కొయ్యవారి యుండెను. చెవులు తమ కర్తవ్యమునే మఱచియుండెను. ఉన్నట్లుండి యామె మూర్ఛిల్లెను! ఈ దృశ్యమును చూచి నా రక్తము ఉడుకెత్తి పరువ ళ్ళిడసాగెను. నా రక్తనాళమునందేదో ప్రతీకారము చేసివేయవలె నను నుత్సాహము తీవ్రముగ నుండెను. కాని యేమి చేయవలెనో తెలియలేదు. ఇట్టి నింద్యమగు దృశ్యము ప్రపంచమునం దగపడుట యిది మొదటిసారికాదు. కాగా నిట్టిదృశ్య మిం కగపడదని చెప్పజాలము. బాణభట్టు డెంత చింతించినను ఆవేశముచే పొంగిపోయినను, నిట్టి దృశ్యము

ప్రపంచమం దింక నెన్నిరోజాల్లు కలబడుచునే యుండును. మహాపురుషులు కరుణామైత్రులను గురించి యెన్నియో యుపదేశములు గావించి యున్నారు. సోదరభావమును భ్రాతృదయను గురించి యెన్నియో గ్రంథములు వ్రాసియున్నారు. కాని వానివలన నేమియు ప్రయోజనము కలుగలేదు. నిరాశతో నే నొకసారి కంపించిపోతిని. ఇట్టి దుండగము ప్రపంచమునం దెప్పటికి నిలిచిపోవును! ప్రపంచమునందలి యమూల్యమగు వస్తువు నీవిధముగ నవమానింప వలసినదేనా! ప్రపంచములో రాజ్యములు, సైన్యము, పురుషుని దర్పము ఇవి యున్నంతవఱకు నిట్టి యన్యాయములు జరుగుచునేయుండుననినాకు స్ఫురించెను. మానవ సంఘములో రాజ్యనిర్మాణము, సైనిక సంఘటనము, సంపదపై నాశలేకుండుట – ఇవి యసంభవములు. నాకీ సమస్యకు సరియైన జవాబు దొరకలేదు. ఆ సమయముననే నిపుణిక వచ్చి నావెనుక నిలచియుండెను. ఆమె మనస్సు కుదురుపాటందిన ట్లగపడుచుండెను. "భట్టూ, నేనొకమాట చెప్పనా! ఉజ్జయినినుండి నేను పాఱిపోయిన నాలుగవనాడే నే నాపట్టణమందే నిన్ను చూచితి" ననియామె నవ్వుచు పలికెను.

ఉపోద్ఘాతములేని నిపుణిక మాటల యభిప్రాయము నా కర్థము కాలేదు. కాని ఉజ్జయినిలోనే నన్నామె చూచినదని విన్నపుడు నాకాశ్చర్యము కలిగినది. కుతూహలముతో నేను "ఏమంటివి నిఉనియా! ఉజ్జయినిలోనే నీవు నన్ను చూచితివా!" అని యంటిని.

"అవును. ఉజ్జయిని యందే! నీవా సమయమున శార్విలక పెట్టనద్ద నాకొఱకై వెదకుచుంటివి."

'శార్విలక' పేరు వినగనే ఉజ్జయిని పట్టణపు జనాకీర్ణ మగు నా నగరభాగము, అందున్న పానశాలయు నాకు జ్ఞప్తికి వచ్చెను. ఆప్రదేశము త్రాగుబోతులకు, జూదగాండ్రకు, దొంగలకు నివాసస్థానము. అచ్చట నిరంతరము స్త్రీల క్రయ విక్రయములు జరుగుచుండుట సహజము. నగరమునందుండు నీచశ్రేణికి చెందిన విటులు, విదూషకులు, లంపటులకు నది యాటపట్టు. నిపుణిక వీరిచేత జిక్కనదేమోయని సందేహపడి నేను దండధరులను కొందఱిని వెంటనిడుకొని యాప్రదేశమున గాలించుటకై వెళ్ళియుంటిని. అబ్బబ్బ ! ఆ ప్రదేశ మెంత నింద్యమైనది ! ఆ పురప్రాంతము దుర్గంధమునకు, దురా చారమునకు, వ్యభిచారమునకు నాటపట్టు. ఆ ప్రదేశమున నన్ను నిపుణిక చూచినదా? ఆశ్చర్యముతో నేను "నిఉనియా, నీ వచటికెందుకు వెళ్ళితివి ?" యని అడిగితిని.

"నేను త్రాగుబోతులకు మద్యమును నింపి యిచ్చు చుంటిని."

"ఈ వేషమున నేనా ?"

"కాదు. నేనొక బాలకునివలె వేషమును ధరించి యుంటిని."

"నీవు స్వయముగనే యచటికి వెళ్ళితివా?"

"అవును భట్టూ! నేనొకదిన మచట పనిచేసెదనని పానశాలయందు చేరితిని. మఱునా డాయొకరోజ కూలికూడ తీసికొనకయే నేను పాఱిపోతిని."

నిపుణికమాటలు విని యాశ్చర్యముతో నేనామెను జూచుచుంటిని. ఆమె నవ్వుచు "నీ కర్థము కాజాలదు భట్టూ! నేను జరిగిన దంతయు నీకు సవిస్తరముగ తెలియజేసెద నని యామె యిట్లు చెప్పదొడగెను "నీ నాటకమండలి యందున్న ఆటకత్తెలు అవరోధ జనమువలె నుండిరి. నీవు వారిని కులస్త్రీలవలె గౌరవించుచుంటివి. అయితే పాపము, నీకు వారి నిజ వృత్తాంతము తెలియకుండెను. వారందఱు శౌర్వికలక పానశాలనుగూర్చి చక్కగా నెఱిగినవారే యన్నచో నీవాశ్చర్య చకితుడవు కావచ్చును. నీ యాశ్రయమును విడిచి పాఱిపోయిన యారాత్రి ఆపానశాల మూసివేయబడియుండెను. అచటి వారందఱు నీచే ప్రదర్శింపబడుచున్న నాటకమును చూచుటకై పోయియుండిరి. నేపథ్యమునుండియే నటీవేషమున నేను పాఱిపోయి యుంటిని. చాలసేపటివఱకు నేనుజ్జయినీపట్టణపు సందు గొందులలో తెగ దిరిగితిని. ఆ రాత్రి ఉజ్జయినిలోని స్త్రీ పురుషులందఱు బాణభట్టుని నాటకమును చూచుటకు వెళ్ళియుండిరి. గవాక్షకవాటములు మూసియుండెను. వసారాలన్నియు నిర్మానుష్యములై యుండెను. వీథులలో నచ్చటచ్చట ప్రభుత్వమువారి దీపస్తంభము లంధకారమును తొలగించుటకు విఫలప్రయత్నము చేయుచుండినవి. ఒకటి రెండు గడియలవఱకును నే నచటికి వెళ్ళవలయునో యని నిశ్చయించుకొన లేకుంటిని. నా మనస్సు బాగుగ గాయపడియుండెను. లజ్జానిరాశలచే నాకు పిచ్చిపట్టి నట్లుండెను. నే డావిషయమును తలంచుకొనిన నేనెంత మూర్ఖురాలివలె ప్రవర్తించితినో నాకు తెలియుచున్నది. నలువైపుల

తిరిగినందున నేను బాగుగ నలసిపోయి యుంటిని. తిరిగి నీయండ జేరుదమను తలపుకూడ నాకు వచ్చినది. నీవు నన్ను క్షమించెదవని నాకు సంపూర్ణమగు విశ్వాసముండినది. కాని నాదుర్విధి నన్ను సరియైనమార్గము నాలోచింపనీయలేదు. ఎక్కడికి వెళ్ళుచున్నదియు తెలియకయే నేను ముందుకు సాగిపోవుచుంటిని. అట్లు వెళ్ళుచు నొక గొప్పభవనము నెదుట జేరితిని. అది పరమ భట్టారకుని యున్నతోద్యోగులలో నొకరి భవనమై యుండవచ్చునని తలచితిని. ఆ ప్రాసాదము నందు దీపములు ధగ ధగ లాడుచుండెను. లోపల నొక రిద్దఱు దాసీలుండి యుండవచ్చును. కాని బయట నొకరు కూడ లేరు. నే నాచీకటిలో నొకవైపు నిలుచుండి యీ రాత్రి కిచట నెవరైన నాకాశ్రయమొసగగలరా యని యాలోచించుచుంటిని. ఇంతలో నేను నిలుచున్న చోటు వద్దనే కొంత కలకలము వినబడెను. భూతములవంటి యిద్దరు నల్లని మనుష్యులు ఆప్రక్కనున్న నొక బిలమునుండి బయ టికి వచ్చిరి. వారి శరీరములపై నూనె పూయబడి యుండెను. ఒక నల్లనిగోచి తప్ప వా రింకేమియు ధరించి యుండలేదు. బయటికి రాగానే వారు దేనినో సర్దుకొనుచుండిరి. వారిని చూడగనే భయముచే నేను గట్టిగ నఱచి మూర్ఛిల్లితిని. నాయఱపు విని వారు తమయొద్ద నున్న సామాను నంతయు విడచిపెట్టి పాఱిపోయిరి. అప్పటికి నీ నాటక ప్రదర్శనము సమాప్తమై యుండవచ్చును.

నేను పడిపోయిన కొన్ని క్షణముల తర్వాత నగరములో ప్రసిద్ధిచెందిన వేశ్యయగు మదనశ్రీ తనబండిపై

నచటికి వచ్చిచేరెను. కాగడాల వెలుతురునం దొక దాసి నన్ను చూచి భయముతో కేకవేసెను. మదనశ్రీ బండినుండి దిగి నన్ను లేవనెత్తెను. అప్పటికి నాకు తెలివి వచ్చియుండెను. కాని నా నరములన్నియు పట్టు తప్పి యుండెను. నేను లజ్జా భయములతో స్తంభించిపోయి నిలబడి యుంటిని. నా వేషమును జూచి మదనశ్రీ నన్ను గుర్తించెను. సంభ్రమాశ్చర్యములతో కూడుకొని యామె యస్ఫుటస్వరమున "ఈమె బాణభట్టుని ఆటకత్తెయే!" అని నా శరీరమును తలను నిమురుచు కడు వాత్సల్యమున "అమ్మాయీ! ఎక్కడికి వెళ్ళుచుంటివి! ఈ వేషముననే అభిసరణమునకై బయలుదేరితివా! ఇట్టి గాఢాంధకారమున నీ వే భాగ్యశాలికొఱకై వెళ్ళుచుంటివి. సఖీ! నీ ప్రియుడు చాల నిర్దయుడు సుమా!" అని యనెను. నేను మదనశ్రీని గుర్తించితిని. నవ్వుచు నేను "అమ్మా నాప్రియుడు యముడు" అని యంటిని. మదనశ్రీ నా బుగ్గలపై మెల్లగా దెబ్బకొట్టి "ఛీ! పిచ్చిదానా! అట్లు మాటాడ దగునా! పోదము లెమ్మా!" అని యనెను. నేను లేవగనే నా వస్త్రములనుండి యొక చిన్న మూట క్రింద బడెను. అందున్న సామానంతయు త్రోవమీద వెదజల్లబడెను. పాఱిపోవుచున్నపుడు దొంగలామూటను నాపై పడవేసి యుండవచ్చును. ఆ మూటలో లత్తుకపిండి, మణిశిల, హరిదళము, ఇంగిలీకము, రాజావర్తక చూర్ణము మొదలగు వస్తువు లుండెను. ఆ వస్తువులు మదనశ్రీ చిత్రలేఖనమున కుపయోగించునట్టివి. చిత్రలేఖనమునందు మదనశ్రీ కడు నిపుణురాలని నాకు తర్వాత తెలిసినది. మహాకాలుని యాలయ

మున మనుష్యుని ప్రమాణమున నున్న పార్వతీ పరమేశ్వ
రుల చిత్రము నీవు చూచియే యుందువు. అది యీ మణి
శిలయు, రాజావర్తకచూర్ణమును కలిపి వ్రాయబడిన చిత్రము.
మదనశ్రీ కీప్రయోగము బాగుగ తెలియును. మైనమువంటి
యేదో వస్తువు నామె రంగునందు కలుపుచుండును. అందు
వలన మణిశిలరంగు చాల అందముగ ప్రకాశించుచుండును.
ఆ మాటను చూచి యీ వేశ్యకు కలిగిన యాశ్చర్యమునకు
మేరయే లేదు. నేను భయపడుచుండుట చూచి యామె తన
రథమును చూచియే నేను భయపడితినని యనుకొనెను. కాని
నేను దొంగలను గుఱించి చెప్పిన తర్వాత నామె సందేహ
ముతో నా కన్నమువైపునకు చూచెను. ఆ మాటయే కాక
ఆమె శృంగార పేటికయు బయటపడియుండెను. భయముతో
నామె "అయ్యో! కొంప మునిగినదే" యని మొఱపెట్టెను.
కాని యీ పేటిక నొకసారి తెఱచి చూచినమీదట నందలి
వస్తువులేమియు పోలేదని యామె యూఱడిల్లెను. కృతజ్ఞతా
పూర్వకముగ ఆమె నన్నాలింగనము చేసికొని "చెలీ! నీవే
రాకుండినచో నేను నా సర్వస్వమును గోల్పోయియుందు"
నని చెప్పి కొంతసేపూరకుండి 'సఖి! మీరు బాణభట్టుని
కులస్త్రీలుకదా! ఒకరాత్రి మాయింట నుండకూడదా?'
యని ప్రశ్నించెను. భట్టూ! నేనేమని చెప్పను? ఆమె నీపే
రుచ్చరించిన వైఖరిని చూచి నాముఖము క్రోధ రోషము
లచే నెఱ్ఱబడెను. ఆమె మాటలోని యర్థము నీవు గ్రహింప
లేవు. అదియొక అసూయాకల్పితమైన నిందావాక్యమని
వేఱుగ చెప్పనవసరము లేదుగదా! నాపై నాకే కోపము

వచ్చుచుండెను. ఏలయన, ఆ వేశ్య నన్నింకను నభిసారిక యనియే తలచుచు నన్ను రెచ్చగొట్టుట కిట్టి యెత్తిపొడుపు మాటలని యుండెను. ప్రశాంతముగ నేను 'సఖీ, నావంటి దరిద్రురాండ్రను చూచి బాణభట్టుని నీవు తక్కువవాడని యనుకొనవలదు. నే నింక నచటికి వెళ్ళను' అని యంటిని. నిశ్చేష్టయై యా వేశ్య నావైపు చూచుచుండెను. తర్వాత నాచేయి పట్టుకొని 'పద లోనికి వెళ్ళుదము' అని యనెను. నేను మదనశ్రీ వెంట ఆమె విశాలసౌధములోనికి ప్రవేశించి తిని. ఒక క్షణము ముందు 'బాణభట్టుని కులస్త్రీ'యని నన్ను దెప్పిపొడిచిన వేశ్యయింట ప్రవేశించుటకంటె ముందే నేను చనిపోయి యుండవలసినది. భట్టూ! నేను నీ పవిత్రమైన పేరునకు కళంక మాపాదించి నిజముగ నపరాధము గావించి తిని" అని యనెను.

ఈ విధముగ బలికి నిపుణిక మోకాళ్ళుమోడ్చి నాకు ప్రణమిల్లెను. నేను చివుక్కున లేచి నిలబడితిని. నిపుణిక మాటలలోని రహస్య మేమియు నాకు గోచరము కాలేదు. ఆమె శాంతముగ "కూర్చో భట్టూ! ఇంకను కొంచెము సేపు కూర్చుందుము" అనెను. నేను కూర్చుంటిని. ఇప్పుడు నిపుణిక ముఖము ప్రఫుల్లమై యుండినది. ఒక క్షణకాలము లోనే యామె ముఖారవిందము మేఘములు తొలగిపోయిన చంద్రబింబము వలెను, శైవాలరహితమగు కమలమువలెను, పాచిని తొలగించిన పుష్కరిణివలెను, పొగమంచులేని దిఙ్మం డలము వలెను ప్రసన్నమై, నిర్మలమై, ఆమె హృదయమున గ్రుచ్చుకొని యున్న శల్యము తీసివేయబడినట్లును, మనస్సున

నాటుకొనియున్న మల్లికి తొలగిపోయినట్లును కనబడుచుం డెను. ఆమె మరల "మదనశ్రీ భవనము కడువిశాలమైనది. ఆ భవనద్వారమున వివిధములగు పూలమాలలు మనోహరముగ నమర్పబడి యుండినవి. వేరు వేరు ప్రకోష్ఠములందు, శుక, శారిక, శిఖి, తిత్తిరి, హంసకారండవ, మయూర సారసములకు నివాసము లేర్పఱుపబడి యుండినవి. గుఱ్ఱములకును, మేకలకును వేరు వేరు సాలలుండినవి. పురవాసులు విశ్రమించుటకును, సంగీత నృత్యములను దర్శించుటకును వేరు వేరు ప్రకోష్ఠము లుండెను. ఆమె ప్రమదోద్యానమున, పచ్చికచే కప్పబడిన యెత్తైన దిబ్బలపై ఆ గణిక కూర్చుండుట కానగరపు శ్రేష్ఠి కుమారులు తఱచుగ కుసుమములను పఱచుచుందురు. ఆమె క్రీడాసరోవరమునందు విహరించుచుండు హంసలకును, చక్ర వాకములకును తామరతూండ్లను తినిపించుట తమమహాభాగ్య మని నగరవాసు లనుకొందురు. మదనశ్రీ తన గర్వాతిరేక ముచే నిన్నట్లు తూలనాడినదే కాని యది యామె దోషము కాదు. నిజముగ నామె సరియైన పురుషుని జూచి యుండలేదు. ఆమె నాశ్రయించు బంధువులు, విటులు, లంపటులు మొద లగు స్త్రీలోలుర సమూహమున సరియగు పురుషుడు మృగ్యమై యుండెను. ఆమె 'నీ బాణభట్టువంటివారు వందలకొలది నా యడుగులకు మడుగులొగ్గు చుందుర'ని యామె గర్వ ముతో బలికినపుడు నా కామెపై కోపము రాలేదు. ఆమె మాటవిని నే నుపేక్షతో నవ్వితిని. మఱునాడామె చీనాంశుక ములను ధరించుకొని, రత్నహారమును కంఠమున దాల్చి, లోధ్రరజముచే తన కపోలములను సింగారించుకొని, లాక్షా

రసముచే నలంకరింపబడిన పాదములందు కుసుమ స్తబకముల పాదరక్షల దొడగి నిన్ను కలిసికొనుటకు బయలుదేరినపుడు నేనొకక్షణము చిత్రాకులితనైతిని." అని నిపుణిక కొంచెము సిగ్గుపడినది. వెంటనే తన్ను తాను సర్దుకొని "ఆమె మఱు నాడు నీ యొద్దకు వచ్చిన విషయము నీకు జ్ఞాపకమున్నదా భట్టూ?" అని యడిగెను.

నే నా సంగతినే మఱచియుంటిని. నేడు నిపుణిక జ్ఞాపకము చేసినపుడు తిరిగి మదనశ్రీ రూపలావణ్యా మొకసారి స్మృతిపటముపై చిత్రితమయ్యెను. నాడు నిపుణిక జాడ తెలియమి నేను చాలచింతతో నుంటిని. ఆ సమయముననే నా సేవకు డొకడు వచ్చి "అయ్యా, ఈ నగరపు సుప్రసిద్ధ గణిక యగు మదనశ్రీ నిన్న నాటక ప్రదర్శనమున మీరు కృతకృత్యులైనందులకు మిమ్ముల నభినందించుటకై విచ్చేసి యున్నది" అని యనెను. నేను వెళ్ళి యామెకు స్వాగత మొసగితిని. ఆమె యందు కులవధువున కుండు సౌశీల్యము, కవికుండునట్టి ప్రతిభ యీ రెండు నుండెను. ఆమె పాదములకు లాక్షారసము పూసికొని యున్నమాట నాకు బాగుగ జ్ఞాపక మున్నది. ఏలయన రాతినేలపై ఆమె పాదము లుంచి నపుడు, ప్రవాళమణి, ధారలై ప్రవహించుచున్నట్లు నేనాశ్చర్యముతో చూచు చుంటిని. పద్మరాగమణినుండి వెడలు లావణ్యమగు ప్రవాహముచే రాతినేలయంతయు నిండిపోయినదా యన్నట్లు నాకనిపించినది. ఆమె చీనాంశుకముల యంచులపై నొక సన్నని యెఱ్ఱని తరంగము తేలియాడు చున్నట్లనిపించినది. నూపురక్వాణనముచే నలలు వెడలుచున్న

యా లావణ్యరసపు శోభ, మఱింత కాంతిమంత మగుచుండెను. నే నామె ధరించిన రత్నహారమును గమనించలేదు. కాని యామె కొంగులనుండి బయటికి వచ్చిన బాహుయుగ్మమును జూచి నాకు తామరతూండ్లని భ్రమకలిగెను. ఆమె పలుచని చురుకైన యంగుళుల నఖజ్యోతిచే నామె బాహువు లావరించి యున్నట్లగుపడు చుండెను. మదనశ్రీ యా నగరపు ప్రధాన వేశ్య కాదగినదే! పగడములవంటి యామె యెఱ్ఱని యధరము లనురాగసాగర తరంగములవలె మోహనాకారమును దాల్చియుండెను. ఆమె గండస్థలపు రక్తవర్ణమును చూచినపుడు మధువుతో నిండిన మాణిక్యపు ముత్తెపు చిప్పలు తలపునకు వచ్చుచుండెను. ఆమె నల్లని విశాల నయనములు తామరపువ్వులయందు బంధింపబడిన భ్రమరముల వలె మనోజ్ఞములై యుండెను. ఆమె భ్రూలతలు ఎలప్రాయపు మత్తగజ మదమువోలె తరంగితమగుచుండ, నామె నుదుట నొప్పుమణిశిలచే దిద్దిన యెఱ్ఱని బొట్టు అనురాగ దీపశిఖవలె ప్రకాశించుచుండెను. లోధ్రరజముచే నామె తన యంస స్థలము నలంకరించి యుండనోపును. ఏలయన ఆమె పద్మరాగమణి కుండలముల కా లోధ్రరజ మంటుకొనియుండి కర్ణోత్పలమునుండి స్రవించుచున్న మధుధారయందు పద్మకింజల్క-చూర్ణముకలిసి పారుచున్నదా యని తోచుచుండెను. సీమంత మణినుండి వికీర్ణమగుచుండు నెఱ్ఱని కిరణము లామె నల్లని కేశములపై బడుచుండుటచే నవి సంధ్యాసమయపు మేఘములవలె చూచువారి నాకర్షించుచు, నొక యద్భుత మగు మధుధారయే ప్రవహించు చున్నదా యన్నట్లు కన్నులకు

భ్రమ గొల్పుచుండెను. ఆమె మందహాసమున బాలకుని సారళ్య మగుపడుచుండి నందువలన నేను క్షణకాలము పద్మ రాగమణి నిర్మిత ప్రతిమను బోలిన యామె రూపలావణ్య మును తిలకించుచు నా హృదయమును కొంత శాంతపఱచు కొంటిని. ఆమెతో నే నెక్కువసేపు మాటలాడలేను కాని మాటలాడినంతసేపు ఏదో విధముగ పాఱిపోయిన నిపుణిక ప్రసక్తియే వచ్చుచుండినది. ఆమె మాత్రము కళాశిల్పము లను గుఱించి మాటాడ నభిలషించు చుండెను. కాని దాని కవకాశము చిక్కనేలేదు. ఆమె వెడలిపోయిన తర్వాత ఎవరో వచ్చి పోయిరను సంగతియే నేను మఱచితిని. ఆమె ప్రభా వము నా హృదయముపై ముద్రితమైనది. అయితే, యది విద్యుత్ప్రభావమువంటిది. అందుచేతనే అది మఱుక్షణముననే విస్మృతమైనది. ఆమె నా నైపుణ్యము నాదరించుచున్నట్లు నా కగపడలేదు. కాని నాకు దాని యక్కఱయు లేకుండినది. ఏలయన నేను నా నైపుణ్యముననే యంత్యక్రియలు గావింప నెంచియుంటిని.

తరువాత నిపుణిక యిట్లు చెప్పదొడగినది "భట్టూ, ఆమె యింటికి తిరిగి వచ్చుసరికి ఆమె ముఖము కాంతి విహీ నమై యుండెను. ఆమె తన జీవితములో మొట్టమొదట, స్త్రీ నాదరించియు స్త్రీల పాదములొత్తని పురుషుని గాంచి నది. శుష్కమగు మందహాసముతో నామె, 'చెలీ, బాణ భట్టుడు మానవ మాత్రుడు గాడు సుమా?' యని యనెను. నేను గర్వముతో 'సఖి, అతడు దేవతుల్యుడు!' అని యంటిని. భట్టూ, నేను నీపేరునకు కళంకము తెచ్చితిని! కాని నీవు నాగౌరవము కాపాడితివి. నేనామె యెదుట సగౌరవ

ముగ తలమెత్తి తిరుగ గలిగితిని. ఆపాడురాత్రి మనోవేద నము నంతయు నేను కడిగివేసితిని. ఆనాటినుండి నాలోకూడ కొంత వ్యక్తిత్వమున్నదని గ్రహించితిని. భట్టూ! నీవు నాకు ముక్తిని ప్రసాదించితివి !"

నే నాశ్చర్యముతో నిపుణిక మాటలు వినుచుంటిని. కాని యెక్కువసేపు నే నామె మాటలు వినజాలక పోతిని. నేను దేవతుల్యుడనని యిప్పుడు తెలిసికొన నవసరమే మున్నది ? "నిఉనియా ! అసలు సంగతేదో చెప్పుము. ఈ గొడవంతయు ఇప్పుడెందుకు ?" అని యడిగితిని. గాయపడిన దానివలె నిపుణిక "నీకీ వృత్తాంతము విలువైనది కాకపోవ చ్చును; నాకదియే సర్వస్వము. గొంతువఱకు పాప పంకిల మున నిమగ్నమైన నిఉనియ వద్ద మఱి ధనమేమి కలదు ?" అని యనెను. నేను ప్రేమతో "ఛీ ? నిఉనియా, అదేమి మాట: నీ జీవితమునందు విలువైనది లేకేమి ? నేను నీ జీవి తపు గాథ వినగోరుచున్నాను. నాలో నీవు చూచిన గొప్ప దనమును నేను స్వయముగ చూడనులేదు, అర్థము చేసి కొననులేదు. నీ జీవితము నం దమూల్యమైనది లేకకాదు, దాని ప్రమేయ మిప్పుడేమి కలదు ?" అని యంటిని.

కాని నిపుణిక తన కడుపులోనున్న దానినంతయు వెళ్ళగ్రక్క దలచుకొని యుండినది! కాన దాని నాపిన నామె చిత్తమునకు మఱింత యశాంతి గలుగక తప్పదు. ఒకమా ఱామె మనసునకు క్షోభ గలిగించి నేనెంతగా పరి తపించితినో నాకే యెఱుక ! అందువలన నామె తనవృత్తాం తమును చెప్పుచుండ నేను సావధానుడనై వినుచుంటిని.

చిఱునగవుతో నామె "భట్టూ, మదనశ్రీ యెంతగా పరాజితురాలయినదో నేను చెప్పిన నీవు నమ్మజాలవు." అని యనుచుండ నామె కన్నులు వాలిపోయినవి. ఆగియాగి యామె నవ్వుచు "చెప్పనా భట్టూ! నేనొకనాడు మదనశ్రీ ప్రమదోద్యానమున విహరించు చుంటిని. ఆవనపు తూర్పు దిక్కున అశోక వకుళ వృక్షముల మధ్య మాధవీ లతా మండప మొకటి కలదు. దానికి నలువైపుల గోరింట పొదల కంచెగలదు. అట్టి ఏకాంతస్థానమునందు నే నుజ్జయినీ పట్టణపు ప్రధాన వేశ్యయగు మదనశ్రీని ఏకాగ్ర చిత్తముతో నొక చిత్రమును చిత్రించుచుండ గాంచితిని. ఆమె హృదయము గంభీరమగు ననురాగముచే నిండియుండినదని యెట్టి యమాయికుడైనను చెప్పగలడు. ఆమె దుకూలము జారి యొకవైపు బడియుండెను. కంచుకబంధ మూడిపోయి యుండెను. కంటి రెప్పలు స్థిరములై చింతాకులితములై యుండెను. కాని అంగుళులు మాత్రము చురుకుగ తమ పనిని చేయుచునే యుండెను. చెట్లపై పక్షుల కలవరము బొత్తిగా లేకుండెను. లతా కిసలయములు గూడ నత్యాశ్చర్యముచే నిస్తబ్ధమై యున్నవా యనిపించుచుండెను. నేను చప్పుడు కాకుండ నామె వెనుకకుపోయి నిలుచుండి యూపిరి బిగబట్టి యామె కళానైపుణిని తిలకించుచుంటిని. ఆమె చిత్తరువు నంతను నీలపు గుడ్డతో కప్పియుంచెను. కాలిగ్రేళ్ళ రచన మాత్రము మిగిలియుండెను. ఆమె వానిపై చాల తన్మయతతో రంగు దిద్దుచుండినది. చిత్తరువు పూర్తి కాగనే విలాసముగ నామె యా నల్లని ముసుగును తొలగించెను. నే

నాశ్చర్యముతో స్తబ్ధురాలి నైతిని. భట్టూ ! అది నీ చిత్రమే సుమా!"

నేను నవ్వుచు "నిఉనియా, చండికాలయపు పూజారి తర్వాత నపహాసముచేయుటకు నీ కింతవఱకు నెవ్వరును దొరకలేదు. నేడు నేను నీకు దొరకినాను." అని యంటిని. నిపుణిక తల పైకెత్తినది. ఆమె నవ్వుచుండినది. ఆమె కన్నులు మాటి మాటికి వాలిపోవుచుండ వాని నామె మాటి మాటికి తెరచుటకు ప్రయత్నించుచుండెను. హాస్యపు రుచి కన్నులను విస్ఫారిత మొనర్చుచుండ సరసము వానిని వాల్చివేయుచుండెను. క్రీగంట నన్ను సిగిడ్చి చూచుచు నామె "కాని, అసలు సంగతి నే నింకను నీకు చెప్పనేలేదు." అని యామె తలవంచుకొని చాలసేపు నవ్వుచునే యుండినది. తర్వాత కుదురుబాటు చెంది "భట్టూ! ఆమె యఱచేతులు చమర్చినవి. చిత్తరువుపై నొకటి రెండు అశ్రుబిందువులు కూడ పడియుండినవి" అని యనెను. ఈమాట కల్పించినదని యామె కన్నులే చెప్పుచుండినవి. నేను "సాత్త్వికానుభావపుటశ్రు బిందువులా?" యని ప్రశ్నించితిని. ఈమాట విని నిపుణిక బిగ్గరగా నవ్వినది. ఆమె కన్నులు వాలియే యుండినవి. నవ్వు నాపుకొనుటకై యామె తన చీరకొంగుచే నోటిని కప్పుకొనెను. కొంత సేపైన తర్వాత నిపుణిక "నేను వెనుకనుండియే సీత్కారము గావించితిని. నన్ను చూచి ఆ వేశ్య సిగ్గు పడినది. భట్టూ! సిగ్గుతో గూడిన యామె ముఖమెంతయో మనోహరముగా నుండినది! నీవే చూచి యుండిన కవనముచేసి యుందువు. నేను నవ్వుచు ఆమెను

'చెలీ! ఏ భాగ్యవంతుని చిత్తరువు వ్రాయుచున్నావమ్మా?' యని యడిగితిని. లజ్జానురాగములు వేశ్యలను మౌనమొనర్పక మఱింత వాచాలురగ నొనర్చును. అందుచే నామె నవ్వుచు 'నీ దేవత చిత్రమే సుమా!' అని యాచిత్ర ఫలకమును నా చేతికిచ్చినది. మఱునాడే నేను దానిని తీసికొని పాఱిపోతిని" అని చెప్పెను.

కొంచెముసేపాగి నిపుణిక మరల "భట్టూ! నేనెక్కువ కాలము జీవించను. ఇంక కొన్నిదినములవఱకే నాకీపుడమిపై బ్రతుకు గలదు. నాప్రార్థన యొకటి నీవు తప్పక అంగీకరింప వలెను"అని చెప్పెను. నిపుణిక కథాపర్యవసానపు వాక్యముల నాలకించి నేను కంపించిపోతిని. నేను "ఛీ,ఛీ! నిడునియా, నీవట్లు మాటలాడతగదు" అని యంటినిగాని యామె నామాట లాలకించుటకు సిద్ధముగ లేదు. ఆమె "నేను పాఱిపోవునపుడు బాలకునివేషము ధరించియుంటిని. నేనా గణిక యింటినుండి నీ నివాసమున కేగితిని గాని నీవు నన్ను వెదకుటకై వెళ్ళి యుంటివని నాకక్కడ తెలిసెను. దండధరులవెంట శార్విలక మధుశాలయందు నన్ను వెదకుటకై పోయెదవనికూడ నా కచట తెలిసినది. నే నొకమాఱు నిన్ను దర్శించుకొని ఉజ్జయిని విడువదలచి యుంటిని. నేను తిన్నగ శార్విలక మధు శాల వైపునకు వెళ్లుచుండ త్రోవలో శకద్వీపమునకు చెందిన బ్రాహ్మణజ్యోతిషు డొకడు నాకెదురయ్యెను. అతడు నన్ను చూడగనే "రా బాబూ! నేను నీ భాగ్యమును గుఱించి చెప్పెదును రా!" యని యనెను. నేనొక దీనారము ఆ జ్యోతిషుని కిచ్చితిని. అప్పటికి నాయొద్ద చాల దీనారము లుండెను.

అతడు వివిధములగు చక్రములను గీచి 'నీ భవిష్యత్తు చాల గొప్పగా నున్నది.. కాని నీవు దుఃఖమనుభవించి తీరవలెను' అని యనెను. నేనతనిని 'నే నెవరిని కలిసికొనుటకై వెళ్లు చున్నానో అతనినిగుఱించి యేదైన చెప్పగలరా?' అని యడిగితిని. అతడు కొంత తడవాలోచించి 'అతడు మంచి యశోవంతుడగు కవి కాగలడు. కాని అత డేరచనను పూర్తి చేయజాలడు. అత డేనాటినుండి కవనము చేయ నారంభించునో యానాటినుండియే యతని యాయువు క్షీణింప సాగును. అటుతర్వాత నతడొక సహస్రదినములు మాత్రమే జీవింపగలడు' అని యనెను. జ్యోతిషుని మాటలచే శంకితురాలనై నేను కేలుమోడ్చి 'ఆర్యా, ఈ యాపదనుండి తప్పుకొనుట కేదైన మార్గము కలదా?' అని యడిగితిని. జ్యోతిషుడు తలయూపి 'లేకేమి? ఉన్నది' అని కొంతసే పూరకుండి 'జీవించియున్నవ్యక్తిని గుఱించి కావ్యము వ్రాయవలదని యతనికి చెప్పుము' అని సెలవిచ్చెను. నే నీ మాటలు విని వెంటనే శార్విలక మధుశాలత్రోవన బడితిని. మధుశాల పెత్తనదారు డాసమయమున ప్రసన్నుడై యుండుట జేసి వెంటనే నన్ను మధువునందించు కార్యమున నియోగించెను. నీవు దండధరుల వెంట నచటికి వచ్చినప్పుడు నేను నిన్ను తనివితీఱ చూచితిని. ఏవగించుకొనుచుండుటచే నీవు నావైపు చూడనైనను చూడలేదు. కొంతసేపటికి నగరపు ప్రతీహారు డచటికి వచ్చినపుడు నీ వతనితో మాటలాడుచు నీవు వ్రాసిన ప్రకరణమును (నాటికను) సిప్రానదీ జలములలో పాఱవేసితిననియు, నిపుణిక దొఱకనంతవరకు నాటకరచనగాని,

ప్రదర్శనముగాని జరుపననియు నీవు చెప్పుచుండగా నేను వింటిని. ఆ మాటలు విన్నందుననే నా మనసునకు కొంత యూఱట గలిగెను. నేను నీ కంటబడగూడదను దృఢ సంకల్పము చేసికొని యచ్చటినుండి పాఱిపోయి వచ్చితిని. కాని నేడు నీవు 'భట్టినిని గుఱించి కవిత్వము చెప్పెదను' అను మాటయన్నపుడు నా చిత్తము కంపించిపోయినది. నీవు భట్టినిని గుఱించి గాని జీవించియున్న మఱి యే వ్యక్తిని గుఱించిగాని కవిత్వము చెప్పవద్దని నిన్ను ప్రార్థించుటకే నేను నీ చెంతకు వచ్చితిని, ఈ యకించనురాలు ప్రార్థించుట కన్న వేఱేమి చేయగలదు. నా ప్రార్థన నంగీకరించుము" అని యనెను.

ఇట్లు పలికి నిపుణిక మోకాళ్ళ భూమి నానించి ప్రణమిల్లెను. నేనామె కాశ్వాసము నిచ్చుచు "నిపుణికా, నేను తప్పక నీ ప్రార్థనను మన్నింతును. కాని నేను జ్యోతిషుని మాటను విశ్వసింపను" అని యంటిని. నిపుణిక నావైపు ఆశ్చర్యముతో చూచుచుండినది. జ్యోతిషుని మాట నమ్మకుండుటామె కర్థముగాని సంగతి. నేనింకెక్కువగ మాటాడక ఆకాశమువైపు జూచి దీర్ఘముగ నిట్టూర్పు విడిచితిని. ఈ మధ్య యవనులు హోరాశాస్త్రము, ప్రశ్న శాస్త్రమనెడు జ్యోతిష విద్యను ప్రచారములోనికి తెచ్చియుండిరి. అది యవనుల పురాణగాథల నాధారముగా రచించిన యొక కల్పనాపద్ధతి. భారతీయ శాస్త్రములందు గల కర్మఫలమ్ము, పునర్జన్మ సిద్ధాంతములకును దీనికిని సంబంధమే లేదు. అంతే

గాదు, మన పురాణములయందు నిర్దేశింపబడిన గ్రహముల జాతి స్వభావలింగములు సయితము వీరి గ్రహములతో సరిపోలవు. మన పురాణములలో ప్రసిద్ధులగు శుక్రచంద్రులు వారి జ్యోతిశ్శాస్త్రమునందు స్త్రీ గ్రహములుగ భావింపబడుచున్నారు. ఏలయన యవనగాథలలోని వీనస్, డియోనా స్త్రీలు. వారే యీ గ్రహముల అధిష్ఠాత్రీదేవతలని యెన్నబడియున్నారు. మరి వారి గ్రహమైత్రి యన్ననో విచిత్రమైనది. ఆర్యుల పురాణగ్రంథములలో ఈ మైత్రీబంధము సమర్థించుచున్న దేదియు కానరాదు. కాని యీ విద్య యజ్ఞానులగు జనులపై తన ప్రభావమును ప్రసరింపజేయుచు రాజులలోను పండితులలోను కుసంస్కారము వలె వ్యాపించుచున్నది. అన్నిటికంటె నాశ్చర్యమేమన బుద్ధదేవునిచే ప్రచారము చేయబడిన సౌగతమార్గమున కూడ దానికి ప్రాధాన్యము లభించుచున్నది. దీని రహస్యము నే నెఱుగుదును; కాని నిపుణికకు తెలియదు. అయినను ఆమె నూఱడించుటకై "నేను జీవించియున్న వ్యక్తిని గుఱించి యైనను కవిత్వము వ్రాయకుండుటకు ప్రయత్నింతునని" ప్రతిజ్ఞ చేసితిని. చివరివఱకు నా యీ ప్రతిజ్ఞ నిలువలేదు. కాని ఆ ప్రతిజ్ఞా భంగము జరిగిననాటికి నిపుణిక యీ లోకమును వీడియుండినది.

మేము ఉపరము కొంతసేపూరక కూర్చుండియుంటిమి నౌకయందలి క్రిందభాగమునుండి యానందముతోడి గద్గద స్వరమున యీ ప్రార్థన వినవచ్చుచుండెను.

జలౌఘమగ్నా, సచరాచరా ధరా,
విషాణకోట్యాఖిల మూర్తి ధారిణా,
సముద్ధృతా, యేనవరాహ రూపిణా,
సమేస్వయం భూర్భగవాన్ ప్రసీదతు॥

ఆకంఠస్వరము భట్టినిది. నిపుణిక తత్తరపాటుతో లేచి "భట్టిని పూజ సమాప్తమైనది. ప్రసాదము తీసికొందము పద" అని యనెను.

# తొమ్మిదవ అధ్యాయము

త్రివేణిని దాటిన తర్వాత మా నావలు తాడు లాగ కయే వేగముగ పోసాగెను. అంతకుముందెన్నోచోట్ల నావికులు నౌకలను లాగుచు త్రోయుచునుండిరి. కాని ప్రయాగ దాటిన తర్వాత నదిలో నీరెక్కువగ నుండుటచే నావలను లాగవలసిన యవసరమే లేకపోయెను. కాని గంగానది యిప్పుడు చిన్న చిన్న కొండచరియలను రాచుకొనుచు ప్రవహించుచుండుటను గాంచి నాయుద్ధత చిత్తము చంచలమగుచుండెను. వింధ్యాటవీ ఆకర్షణమును నేను నా జీవితములో మఱువజాలను. తూర్పు సముద్రమునుండి పశ్చిమ సముద్రము వఱకు పృథ్వికి మేఖలా సమానమై వ్యాపించియుండి మధ్యదేశమున కలంకార ప్రాయమైయొప్పు పరమ రమణీయమగు వింధ్యావళి బాల్యావస్థనుండియు దుడుకుగల యశ్వము వంటి నా చిత్తమునకు కళ్ళెమువంటిదై, వైరాగ్యమనెడు గజమున కంకుశమై, భ్రమణోన్మాదముగల నా మానసమునకు కవచమై యొప్పుచుండెను. నేను చుట్టుతిరిగి మఱల నీ వింధ్యాటవి యొద్దకే వచ్చితిని. వనగజముల మదజలములతో తడిసి పెరుగుచు తమ శిరములపై నున్న శ్వేతకుసుమములను చెట్లలో తగుల్కొన్న నక్షత్రములాయని భ్రమింపజేయుచు, తమ నీడలచే శాంతి సంభ్రమములను గొల్పు వృక్షరాజి నాపై పఱపిన ప్రభావమును నే నెన్నడును మఱువజాలను. బాల్యమునందు నే నీ విశాలమగు వింధ్యాటవిలో నొక యంశమునందుండి దాని చవిచూచియుంటిని

కాని దేశదేశాంతరములు తిరిగిన తర్వాత యీనాడు నే నీ యడవి ప్రతి భాగమునందలి రసము నాస్వాదించితిని. ఇందొకచో మధుపానముచే మత్తిల్లిన కురరీపక్షులు తమ చంచువులతో మరీచపల్లవములను కొఱుకుచుండుట చూడ వచ్చును. మఱియొకచో ఏనుగు పిల్లలు తమ దురదను పోగొట్టుకొనుటకై తమాల వృక్షములకు తమ తొండము లను రాచుటచే వాని కిసలయములు క్రిందికి జారుచు వన ప్రాంతము నంతయు శోభాయమాన మొనర్చుచుండును. ఇంకొకచో మధుపానముచే నెట్టబడిన కేరళకాంతల కపోల కాంతిని తిరస్కరించు బాలతరువుల అరుణపల్లవములు, వన దేవతల చరణ లాక్షారసముచే నెట్టబడినవా యని తోచు చుండును. ఇంకొకచోట శుకములచే కొఱుకబడి దానిమ్మ పండ్లరసముచే తడసిన యెన్నో లతామండపములును వాని లోపల వానరములచే రాల్చబడిన నారింజపండ్లు, పల్లవములు పడియుండెను. సిరతము లతామండపములనుండి పుష్పధూళి రాలుచుండుటచే నవి కుసుమ పరాగ ధూసరితములై యుండును. అట్టి లతామండపములందే పాంథులు లవంగ పల్లవముల శయ్యగా నమర్చుకొని విశ్రమించుచుందురు.

మా నావ గంగానది కిఱుప్రక్కలనుండు కొండచరియల నానుకొని పోవుచున్నప్పుడు నా చిత్తము పగ్గము తెగిన వృష భమువలె చంచలమై పరువెత్తు ద్రొక్కుచు, మదజలమును గార్చుచున్న గజయూథముల వెంటను, నిర్ఝరధ్వని ముఖరి తములగు కొండగుహాలయందును నీరంధ్రనీలనిచుల వృక్షపు గుబురులయందును, ఏలక, లవంగ, తమాల వృక్షముల పొద

రిండ్లయందును లగ్నమగుచుండెను. చరణాద్రి దుర్గమును (చునార్) వింధ్యాటవీ పరివేష్టితమగు గంగానది మూడు వైపుల చుట్టియుండెను. ఇచ్చటినుండి దూరము వఱకు వ్యాపించిన రేగుచెట్ల పొదలను, అడవిపనసచెట్లను, సీతాఫలపుచెట్లను చూచితిని. వనదేవతల లీలాస్థలియు, ఉన్మత్త మయూర విహారభూమియు, కరీంద్రముల నివాసము, నిర్ఝరీ ముఖరితమునైన యావింధ్యాటవిలోని కళంకవలెనని నాకనిపించెను. దుర్గమునకు పడమటివైపున ఓడరేవుండెను. అచట నే నావికులు నావనాపివేసిరి. వింధ్యాటవీ ప్రవేశమునకు స్వాతంత్ర్యము లేనందులకై విచారించుచు, తత్సౌందర్యమును దూరమునుండియే తిలకించుచుంటిని.

ఆ సమయమునసే మా నావవెంటవచ్చు మఱియొక నావలోని యువకసైనికు డొకడు నా యెదుట మోకరిల్లి "ఆర్యా, తమ రనుమతించినచో అవసరమైనపనిని గురించి తమతో విన్నవించుకొందును." అని వినయముగ పలికెను. నే నాయువకుని తేఱిపాఱ జూచితిని. వాని పలుచని శరీరము, విశాలమైన రొమ్ము, పెద్దపెద్ద కన్నులు, సంతోషముతో కలకలలాడు ముఖమును జూచి నిర్హేతుకముగ నా కానందము కలిగెను. నేను "భద్రా! ఏమిసంగతి? అవధానుడనే, చెప్పుము" అని యంటిని. యువకుడు వినయముతో "ఆర్యా! ఇది చరణాద్రి దుర్గము. ఇదియే కన్యాకుబ్జేశ్వరుని తూర్పు సరిహద్దు దుర్గము. ఇటు తర్వాతగల దేశమునం దిపు డరాజకత్వము ప్రబలియున్నది. ఉత్తరమున నుండు కాశీ, దక్షిణముననుండు కరూశ జనపదములును మగధదేశపు గుప్తరాజుల యధీన

మునగాని, మన యధీనమునగాని లేవు. మహారాజాధిరాజుల యన్నగారు కడు చతురతతో నిచట తమ రాజనీతిని చూపినారు. ఉత్తరమున నుండు కొందఱు బ్రాహ్మణులకు వారు అగ్రహారముల నొసగి వారిని తమవైపునకు త్రిప్పుకొన్నారు. ఈయగ్రహారముల ననుభవించు బ్రాహ్మణులే యీ జనపదములలో ప్రధానులై యున్నారు. వారే యిక్కడి సామంతులు. వారిలో వైదిక కార్యకలాపము లడుగంటిపోవుచున్నవి. వారిపుడు బహిరంగముగ బౌద్ధరాజునే సమర్థించుచున్నారు. కాని దక్షిణదిశలోనున్న వ్యాఘ్రసరోవరమున ఆభీరసామంతుడగు ఈశ్వరసేనుని ప్రాబల్య మెక్కువగ నున్నది. అతడు గుప్తసమ్రాట్టులకు విశ్వాసపాత్రుడు. అందువలన రాజకుమారులు నౌకను ఉత్తర తీరమునకే గొనిపొమ్మనియు, నిచ్చటివారు మేము కన్యాకుబ్జీయులమని యెఱుగకుండునట్లుండవలెననియు మాకాజ్ఞాపించియున్నారు. అందువలన నిచ్చోట తమరు కూడ జాగరూకులై యుండవలెను" అని పలికెను.

ఈ సమాచారము నన్ను నిద్రనుండి మేల్కొలిపినట్లనిపించెను. అసత్యము వచించుట సర్వావస్థలయందును చితము కాదని, నాడు రాజకుమారు లుపదేశపూర్వకముగ హెచ్చరించిన మాట నాకిపుడు జ్ఞాపకమునకు వచ్చినది. ఆ యుపదేశ మీనాటికేనా యేమి! ఈసమయమున కుపకరించుటకే యీ యుపదేశ మభిమతమైనచో నిజముగ మేము భయోత్పాతమగు స్థానమునకే వచ్చి చేరితిమి. యువకుని

మాటలు విని నే నేమియు మాటాడలేదు. నా ముఖముపై నుద్వేగ చిహ్నములు తప్పక కనపడియుండవచ్చును. ఏలయన ప్రసన్న మనోహరరూపసంపదగల యాయువకుని దీప్తమగు లలాటమున గాంభీర్యము లక్షితమగు చుండెను. అతని గండ స్థలము ధౌత కేసర కదంబపుష్పము వలె వాడిపోయి, యతని యొట్టిని పెదవు లేదో చెప్పుటకై యాతురపడుచున్నట్లు కదలు చుండెను. కాని యతడు మాటాడలేదు. అతడు మెల్లగ ప్రణామ మాచరించి యచటినుండి పోయి తిరిగి మఱియొక వృద్ధసైనికుని వెంటనిడుకొని వచ్చెను. నే నపుడు చింతా కులితుఁడనై యుంటిని. నేను భట్టినిని వెంటనిడుకొని భయ ముతో గూడుకొన్నచోటికే వెళ్ళుచున్నానా! నేను కన్యా కుబ్జేశ్వరుని రాజ్యమునుండి వెడలిపోవుటకే బయలుదేరితిని కదా! మఱి భయమెందులకు?—అని తలపోయుచుంటిని.

ఆ సమయమున వృద్ధసైనికుడు ప్రణామపూర్వకముగ "ఆర్యా, ఈ బాలకుడు తమతో విన్నవించుకొన్న దంతయు సత్యమే. కాని తమరు చింతారహితులై యుండుడు. ఉద్వేగ పడనవసరము లేదు. మీ నావవెంట నుండు మఱియొక నావలో పదుగురు క్షత్రియ యువకులు తమరక్షణార్థమై సిద్ధముగ నున్నారు. ఆర్యా! మా నాడులలో మౌఖరీ వంశపు టుడుకు రక్తము ప్రవహించుచున్నది. నేను ప్రతాపశాలి యగు యశోవర్మ సేవకుడను. మదపుటేనుగుల మదజలధారల పక్షమునందే నాజీవితము గడచినది. శస్త్రముల ఝుంకార ధ్వనియందే నేను జీవితపు సంగీతస్వరము నాలకించితిని. అశ్వముల వీపుపైననే విశ్రమించితిని. నేడుమౌఖరీవంశీయుల

ప్రతాపాగ్ని చల్లారిపోయినను ఆజాతిలో నింకను జీవమున్నది. ఈనాడీ పవిత్ర జాహ్నవీనదీ ప్రవాహమున బ్రాహ్మణదంపతుల మానరక్షణము గావించు గురుతరభార మీభుజములపై పడినది. కాని ఆర్యా! తమ రుద్విగ్నులు కానవసరములేదు. నేటివరకు విగ్రహవర్మ పరాజయమన నేమో యెఱుగడు. మృత్యుముఖమున నున్న యాతడెన్నటికిని తన జీవితపు యశశ్చంద్రికలకు కళంకము రానియ్యడు." అని పలికెను.

వృద్ధుని దర్పోద్ధతములగు గర్వోక్తులు స్వాభావికముగనే కానవచ్చెను. అతని ప్రతిరోమమునందును ఆత్మవిశ్వాసము వ్యక్తమగుచుండెను. కాని యత డుపయోగించిన 'మాఖరి' పదమును విని నేను త్రుళ్ళిపడితిని. భట్టిని కీవిషయము తెలియగూడదు. కాని తెలిసియు రాజకుమారుడు మాఖరీవంశపు వీరులనే మమ్ములను రక్షించుట కేల నియోగించెను! అదికాక ఈక్షత్రియ వృద్ధు డెవరిని 'బ్రాహ్మణ దంపతులు' అని యనెను! నేను లోలోపల కుమిలి పోవుచుంటిని. కొంపదీసి యీరెండింటిలో నేదైన నొకటి భట్టిని చెవినబడిన నింకేమైన నున్నదా! ఛీ, ఛీ! ఇది యెంతసిగ్గుమాలిన మాట! నేనా విషయమునే మార్చివేసి దానిని మఱచి పోవుటకు ప్రయత్నించి "భద్రా! నా కాసంగతి తెలియును. యశోవర్మ విమలకీర్తి నాకు విదితమే. ఎవనిదృఢముష్టియందున్న కరవాలము మదపుటేనుగుల కుంభస్థలముపై పడినపుడు వానినుండి పెద్దపెద్ద ముత్యములు, పిడికిలిబిగించి పట్టినందున కరవాలపు తేజమే బిందువుల రూపమున వర్షించుచున్నదా యన్నట్లు క్రిందబడుచుండునో, అట్టి దుర్ధర్షపరా

క్రమవంతుడగు యశోవర్మ నెఱుగని వారెవ్వరు! ఈ ముక్తా లగ్నదంతుర కృపాణధారి యగు యశోవర్మ యొందఱి శత్రు రాజ్యలక్ష్మ లనపహరించెనో గదా! భద్రా, నే నాతనిని లెస్సగా నెఱుగుదును. వీరుల వక్షఃస్థలముల బిగించియున్న లోహకవచములనుండి చీకటిపడిన తర్వాత, గజముల మద ధారా దుర్దినమందు తడియుచు నెందఱో రాజ్యలక్ష్ములను లభిసారికలవలె నెవని చెంతకే తెంచు చుండురో అట్టి యతుల పరాక్రమశాలియు మౌఖరీవంశ వీరుడు నగు యశోవర్మను నేను బాగుగ నెఱుగుదును. నీ ప్రతాపవంతమైన బాహు దండములపై నాకు విశ్వాసము గలదు నాయనా! నా కెట్టి చింతయును లేదు. కాని నేనొకమాట మాత్రము విన్నదుగ నాతురపడు చున్నాను. నీవు చిన్నమహారాజుగారి సైని కుడవా!" అనియంటిని.

వృద్ధుని నేత్రము లున్నట్లుండి యెఱ్ఱబారెను. వాని నుండి విస్ఫులింగములు వెలువడుచుండెను. రోషరుద్ధకంఠ స్వరమున నతడు "కాదు. ఆర్యా, చిన్నమహారాజు విలాస పురుషుడు. అతడు మౌఖరీవంశమునకే కళంకమువంటివాడు. అతనికాశ్రయమిచ్చి నీతి నిపుణులగు మహారాజాధిరాజులు శ్రీ హర్ష దేవులు, దేశమంతటను మౌఖరీవంశీయులనే ప్రజ లేవగించు కొనునట్లు చేసియున్నారు. పట్టపుదేవియగు రాజ్యశ్రీయాజ్ఞ ననుసరించి నేను బౌద్ధనరపతికి సేవచేయు చున్నాను. శివుని జటాజూటమునుండి ప్రవహించు జాహ్నవి వలె పట్టపుదేవి పవిత్రురాలు. అద్వితీయ సహధర్మచారిణి; పృథ్విపై నవతరించిన సాక్షాత్తు అరుంధతీ దేవియే. ఈపుడమిపై

పొరబాటున జన్మించిన కల్పలత. పార్వతీ దేవియొక్క తరళ మందహాసమే యీరూపమున నవతరించినది. సరస్వతీదేవి కర్పూరగౌర కాంతియే యీమెయందు మూర్తిభవించినది. ఆమె మౌఖరివంశీయులకు నాయకురాలు. ఆమెయే వారికి సర్వస్వము. ఆమెరూపముననే నేడు మౌఖరిరాజ్యలక్ష్మి జీవించి యున్నది. ఆమె కనుసన్న మాత్రమున మౌఖరివంశపేరు లీ ధరిత్రినంతయు నూపివేయగలరు. ఆమెకోరిక ననుసరించియే, మే మీనాడు మహారాజాధిరాజులకు విశ్వాసపాత్రులమైన యనుచరులమైతిమి. ఆమోదయువలననే చిన్నమహారాజింకను జీవించియున్నాడు. లేకున్న మౌఖరివంశమునకు కళంకము, రాజనామధారియు, యత్యాచారియు నగు ఈతోడే లెప్పుడో నరకమునకుపోయి యుండవలసినదే!” అని చెప్పెను. వృద్ధుని మాటలు నాకు కొంత మనశ్శాంతిని చేకూర్చి నందున కడు నుత్సాహమున నే నాతని నభినందించితిని. ప్రసన్నమగు నాముఖమును జూచి యీవృద్ధుని కేదో గొప్పబహుమానము లభించినట్లు కనబడుచుండెను. అతడు నాకు నమస్కారము చేసి వెడలిపోయెను. కొంతసేపైన తర్వాత నావలు బయలు దేరెను.

ఆభీరసామంతుడగు ఈశ్వరసేనుని సైనికులకు మాపై సందేహము కలిగెను. అందుచే వారు మానావను బంధింప ప్రయత్నించిరి. అట్టితఱి యుద్ధమవసరమని తోచెను. సరిగా అర్ధరాత్రి సమయమున యుద్ధము ప్రారంభమయ్యెను. మా నావలు తమశక్తినంతయు వినియోగించి పాఱిపోవ ప్రయత్నించినవి కాని యొకచోట నవి చుట్టివేయుబడెను. మేము

తమసానదీ సంగమమును గూడ దాటియుంటిమి. మఱియొక నదీసంగమమునుగూడ మేము దాటిపోయియుంటిమి. మేము మాశక్తినంతయు వినియోగించి మగధరాజ్యపు సరిహద్దుల లోనికి చొచ్చుకొనిపోవుటకు ప్రయత్నించుచుంటిమి. కాని జరుగవలసినదే జరిగినది. విగ్రహవర్మయు నతనిసైనికులును అద్భుతపరాక్రమముతో ప్రతిపక్ష సైనికులపై కురికిరి. మా సైనికుల సంఖ్య మాపై దాడిచేయువారి సంఖ్యలో సగమైనను లేదు. అందువలన పారిపోవుటయు అసంభవముగనే కనబడెను. చూచుచుండగనే సైనికుల హుంకారములతో దిఙ్మండలమంతయు, ధనుష్టంకారములచే నాకాశమండలమంతయు, బాణములచే గంగానదీ ధారయంతయు నిండిపోయెను. వీరుల కవచములనుండి విస్ఫులింగములు వెడలుచు నంధకారమును ఛిన్నాభిన్నము గావించుచుండెను. మా నావలు వేగముగ తూర్పుదిక్కునకు వెడలిపోవుటకు ప్రయత్నించుచుండ, మా శత్రువులు మఱింత వేగమున వాని నడ్డగించుటకు ప్రయత్నించుచుండిరి క్రమక్రమముగ శత్రువులు మానావలకు చాలసమీపమున కేతెంచినందున బాణయుద్ధమసంభవ మయ్యెను. విగ్రహవర్మ మౌఖరీవంశ లక్ష్మియగు రాజ్యశ్రీ పేరున జయనినాదము చేయుచు తనసైనికుల నస్త్రములను ధరింపుడని యాదేశించెను. నేనింతవఱకు హతచేష్టుడనై యీయుద్ధమును చూచుచుంటిని. ఈ యాపద యేదోవిధముగ తొలగిపోవునని యే నేనాశించుచుంటిని. కాని యీ యాపద యిప్పు డాసన్నమైనది. నగరహార ప్రాంత మార్గమధ్యమున దస్యులచే

చుట్టుకొన్నపుడు భీతిల్లిన భట్టిని ముఖచిత్రము నా స్మృతికి వచ్చినది. ఆ ఘటనయే మరల జరుగుచున్నట్లు నాకుతోచెను. నేనిక నూరకుండజాలక పోతిని. నాశరీరముపై కవచములేదు; చేతులలో ఆయుధములులేవు, హృదయమున నమ్మకము గూడలేదు. ధీరనాపతివలె నేను గూడ భట్టినీ జయనినాదము చేయుచు ముక్కలు ముక్కలుగనై పోదునని నాకుస్పష్టమగు చుండెను. ఇంకెక్కువ యాలోచించుట యనవసరము. నేను కూడ విగ్రహవర్మ నావపైపునకు వెళ్ళుట కుద్యమించితిని. వెడలుటకు ముందు నేనొకమారు భట్టినిని, ఆమె యుపాస్య దేవుని ధ్యానించితిని. నా మనసునం దెక్కడను నమ్మక మనునది లేనప్పటికిని నేను మహావరాహునిపై నమ్మకముంచి యూఱట జెంద సంకల్పించితిని. బలహీనుల కాధారమీశ్వరుడే కదా! ఎవని క్రోధారుణ నేత్రదృష్టి హిరణ్యకశిపుని వక్షఃస్థలమును చీల్చివేసెనో ఆ నృసింహరూపమును దాల్చిన మహావిష్ణువునకు జయమగుగాక! ఎవని చంద్రకిరణాంకురముల వంటి కోరలు రాక్షస వంశమున కంధకారమును కల్పించెనో, యట్టిమహిమాశాలియగు వరాహమూర్తికి జయమగుగాక!" యని పలుకుచు నేను బయలుదేరితిని. ఇట్టితఱి విగ్రహవర్మ తనసైనికులను "వీరులారా! మృత్యువును పొందుట కిట్టి శుభ సమయమింక మనకు లభింపదు! శత్రువులు బ్రాహ్మణదంపతుల నీడనుకూడ స్పృశింపకుండ చూడుడు! జాగ్రత్త! మౌఖరీ వంశ రాజ్యలక్ష్మియు మహారాజ్ఞియునైన రాజ్యశ్రీకి జయమగుగాక! మౌఖరీ వంశమునకు జయమగుగాక!" అని హెచ్చరించుచుండెను. సైనికులందఱు నొక్కుమ్మడి జయనినాదము

గావించి వాడి ఫలకములు గల కత్తులను దీసికొని శత్రువుల నెదుర్కొనిరి. నావలొకదానికొకటి చేరువగనే వచ్చిచేరి యుండెను. నావికులుకూడ భయంకరముగ జయనినాదము గావించిరి. చూచుచుండగనే గంగా నదీ ప్రవాహము రక్తధారలచే నెట్టబడసాగెను.

సరిగా నిట్టి సమయముననే 'ధం' అను శబ్దము వినబడెను. "భట్టూ! రక్షించుము! రక్షించుము!" అని నిపుణిక గట్టిగా కేకవేసెను. నేను చూచునంతలో నిపుణిక కూడ నదిలోనికి దుమికినది. నాకేమియు అర్థము కాలేదు. నావ క్రింది భాగమునకు వచ్చి చూడగ భట్టినీ నిపుణికలు నీట మునుగుచుండుట నేను చూచితిని. ఒక్క క్షణములో నేను నా కర్తవ్యమును నిర్ణయించుకొని నీటిలోనికి దుమికితిని. నిపుణిక "నన్ను విడిపెట్టుము. భట్టినిని రక్షింపుము. అదిగో, చూడు! అటువైపు!" అని యఱచెను. నేను భట్టినివైపునకు సాగిపోతిని. ఒక్క క్షణ మాలస్యమైయుండినచో భట్టిని గంగా నదీ గర్భమున విలీనమైపోయి యుండవలసినదే! నాకంతటి యద్భుత శక్తి యెచ్చటనుండి వచ్చినదో నాకే తెలియ లేదు. నేను భట్టినిని పట్టుకొని ఆమెను నా వీపుపై వేసికొంటిని. ఆమె యప్పటికే చాల నీరు త్రాగినట్లు నాకనిపించెను. స్పృహతప్పి ఆమె చాల బరువుగ నున్నట్లు తోచెను. అయినను నే నామెను తీసికొని నావ వైపునకు తిరిగి రావలెనని ప్రయత్నించితినిగాని నావ యింకను వెనుక నెక్కడనో యుండెను. నావికులు, సైనికులును కలసి శత్రువుల నెదుర్కొను

చుండిరి. అందువలన నావలను చూచు నవకాశ మెవ్వరికి లేకుండెను. నీటి కెదురుగ నీదుకొని యచ్చటికి చేరుటకు నాకు శక్తి చాలకుండెను. అందువలన వివశుడనై నేను నదీ ప్రవాహము వైపునకే ఈదుచుంటిని. ఒక్కొక్కపుడు భట్టినిని నేనిక మోయజాలనేమో అని తోచెను. క్రమ క్రమముగ నా శరీర మలసిపోవుచుండెను. అంగములు పట్లు తప్పిన భట్టిని నా వీపుపైనుండి క్రిందికి జారిపోవునేమో అను భయముచే నేనామె శరీరమును నావీపునకు నా యుత్తరీయముతో గట్టిగా కట్టివేయదలచితిని. నేనామె చేతులకు ఉత్తరీయమును బిగించుచుండ నొక గట్టివస్తువేదో నా చేతికి తగిలెను. దానిని బయటికి లాగిచూడ నది మహావరాహుని విగ్రహము! అయ్యో! "జలౌఘమగ్నా సచరాచరా" ధరిత్రి నుద్ధరించినట్టివాడీ నాడు తన భర్తృరాలినే ముంచుచున్నాడే! ఇదేమి వైపరీత్యము! ఈ విగ్రహ మామె శరీరముపై నుండుటవలననే యామె యెక్కువ బరువుగ కనబడుచుండి మాటిమాటికి మునిగిపోవుచుండెను. ఆనా డవధూత స్వామి వేసిన ప్రశ్న నేడు నా యెదుట ప్రత్యక్షమయ్యెను. నే నెవరిని రక్షింపను! భట్టినినా లేక వరాహుని విగ్రహమునా? అవధూతస్వామి యొక్క ఆనాటి క్రోధముద్ర తిరిగి యీనాడు నన్ను 'మూర్ఖుడా! నీవు మహా వరాహుని రక్షింపగలవా?' యని హెచ్చరించుచున్నట్లనిపించెను. నిజముగ ఈ మహామహిమాశాలియగు నుద్ధారకుని రక్షించుటకు సంకల్పించుట స్పర్ధ కాదా? జలప్రళయమునుండి సచరాచర పృథ్వి నుద్ధరించిన ఓ స్వామీ! నిన్నుద్ధరించుటకంటే నీ భర్తృరాలి నుద్ధరించు

చింతయే నా కధికమ్ముగ నున్నది. నా యవినీతిని క్షమింపుము. నేను నిన్ను గంగానదీ పవిత్రతోయముల విసర్జించుచున్నాను" అని యంటిని. నా యెదుట నవధూతస్వామి యగు అఘోరభైరవుని ప్రసన్నమగు మూర్తి యొకమాఱు కనబడి అదృశ్యమయ్యెను. 'మరల అసత్యము చెప్పుచున్నావా ! పాపాత్ముడా, కర్మదరిద్రుడా, అసత్యవాదీ, పాషండుడా ! మహావరాహుని నీవు ఉద్ధరింపగలవా ! డాంబికుడా !' యని ప్రేమతో న న్నాతడు మందలించు చున్నట్లగపడెను. నేను కొంచెము సిగ్గుపడితిని. తర్వాత అతడు నన్ను చూచి ప్రేమతో 'చూడు బాబూ ! ఈ ప్రపంచమునందలి ప్రత్యణువు దేవతాస్వరూపమే. త్రిపురసుందరిని నిన్నేరూపమున నాకర్షించినదో ఆ రూపమునే నీవు పూజింపు' మని యన్న ట్లనిపించినది. అటుపిమ్మట మహావరాహునిమూర్తి నా చేతిలోనుండి జారిపోయెను. అఘోరభైరవుని ఛాయామూర్తి ఆకాశము పైకెగసిపోవుచున్న ట్లగపడెను. నా నాడులలోని రక్తప్రవాహము మందగించి నా చేతులు పట్లు తప్పెను. కన్నులు చీకట్లుక్రమ్ముచుండెను ఎక్కడో దూరము నుండి యంతరిక్షమును చీల్చుకొని నా చెవులకు 'ఎవరికిని భయపడవద్దు; గురువునకుగాని, మంత్రమునకుగాని, లోకమునకుగాని, వేదమునకుగాని భయపడవద్దు.' అను ధ్వని వినవచ్చెను. నా శక్తులన్నియు ఉడిగిపోయెను. కేవల మా ధ్వని ఆకాశమునందు క్రమక్రమముగా విలీనమై పోవుచు నా బుద్ధిపై లీలగ తన ప్రభావమును పఱపుచుండినది. అవధూత

స్వామి ఛాయామూర్తి మాత్రము మీది మీది కెగసిపోవు చుండెను. నక్షత్రమండలముకంటె పైకి, మఱియు పైకి...

నా కాళ్ళు ఇసుకను తాకెను. నా యంగములన్నియు సడలినప్పటికిని భట్టినిమాట తలపునకు రాగనే నాలో నొక యద్భుతమగు శక్తి యంకురించినది. నే నెటులనో భట్టిని నొక యిసుక తిన్నెపైకి లాగుకొని వచ్చితిని. ఆమె స్మృతి తప్పి పడియుండెను. కాని యామె ముఖమున గ్లాని చిహ్నము లెంతమాత్రము కనబడలేదు. తడిసిన కేశములు మఱింత నల్లనై యుండెను. వక్రమగు భ్రూయుగము మఱింత వంగి యుండెను. తడిబట్టలచే కప్పబడిన యామె సౌందర్యశ్రీ అత్యంత మనోహరముగ నుండెను. ఏదో మధురస్వప్నమునం దున్నట్లామె యగపడుచుండెను నీటిముసుగు నందుండి ప్రకాశించుచున్న దీపజ్యోతివలె ఆమె శరీరము తన స్నిగ్ధ కాంతులచే కన్నులను ప్రసన్నమొనర్చుచుండెను. భట్టినికి తగిన ఆశ్రయమును వెదకుటకు చాలినంత శక్తి నాలో లేదు. అవశుడనై నేనుకూడ ఆ దిబ్బపై పడియుంటిని. క్రమక్రమముగ తెల్లవారెను. సూర్యభగవానుని అరుణ కిరణము లంధకారమును తొలగించినవి. కొంత ప్రొద్దెక్కిన తర్వాత నా శరీరమునకు కొంత వేడిమి తగిలెను. నేను లేచి కూర్చుంటిని. అయ్యో! ఏ దేవిని రక్షించెదనని నేను మాటి మాటికి ప్రతిజ్ఞ చేసితినో ఆమెకిట్టిగతి పట్టినదా! ఆమె వస్త్రము లస్తవ్యస్తములై యుండెను. తామరతూండ్లవంటి ఆమె భుజలతలు శిథిలములై యుండెను. తామరాకులను నిందించు నామె చరణములు రక్తహీనములై యుండెను. పద్మరాగ

కాంతులను వెళ్ళగ్రక్కు నామె నఖములు పాలిపోయి యుండెను. ఈ లావణ్యమూర్తికి యిసుకతిన్నె యోగ్యమైన యాసనమా ! బాణుడా, నీ భాగ్యమునకే ధిక్కారము !

సూర్యకిరణము లిసుక కణములపై ప్రకాశింప దొడగెను. సూర్యభగవానుని కుఱ్ఱముల గిట్టలచే నక్షత్రము లన్నియు పొడిపొడియై భూమిపై రాలిపోయి నట్లును, ఈ యనర్థముచే మూర్ఛిల్లి చంద్రునివెన్నెల ఆ నక్షత్రపు పొడిని కప్పుటకు భూలోకమున నవతరించినదా యన్నట్లును కనబడుచుండెను. అయ్యో ! ఎంత వైపరీత్యము ! విషమసమర విజయుడు, ప్రత్యంత బాడవుడు, అవిజ్ఞాత ప్రతిస్పర్థియునగు తువర మిళిందుని కన్యక యీ దుస్థితినికూడ ననుభవింపవలసి యున్నదా ! కాని యిట్టితఱి, శోకించుట అవివేకమగును. ఇంక కొంతసేపటి కిసుక అగ్నివలె మండుచుండును. అందువలన నాకును భట్టినికిని మఱింత కష్టము కలుగును. కాని నేనేమి చేయుగలను. ఏదిత్రోవ ? ఇట్టి దశలో భట్టిని నొంటరిగ నెట్లు విడచివెళ్ళుదును ? అయ్యో ! ఈ సమయమున నిపుణిక యభావమెంత దుఃఖకరముగ నున్నది ! ఇంకను నిపుణిక బ్రతికియున్నదా ? నా గతియే యిట్లుండ నిపుణిక గతి యేవిధముగనుండును ? ఆమె తప్పక నీటమునిగి చచ్చి పోయి యుండును. ఓ నిఉనియా ! నీ వెక్కడనున్నావు ? చూడుము ! నీ భట్టిన కేమిగతి పట్టియున్నదో చూడుము. అయ్యో ! భట్టిని వస్త్రములను సరిచేయుటకు గూడ నెవరును కానరారే ? నిఉనియా ! నీ వెక్కడున్నను సరియే, పరుగెత్తుకొని రమ్ము ! నాకు సహాయ మొనర్చు వారెవరు

అయ్యో ! యేది దారి ! అని నేను విలపించుచుండ నవధూత స్వామి ఛాయామూర్తి యాకాశమునుండి దిగుచున్నట్లు నాకగపడెను. నా బాష్పపూరిత నయనములకు స్పష్టముగ అఘోరభైరవుకు దిగంతమునుండి నా వైపునకు వేగముగ వచ్చుచున్నట్లు తోచెను. 'ఎవరికిని భయపడవద్దు. గురువునకుగాని, మంత్రమునకుగాని, లోకమునకు గాని, వేదమునకు గాని భయపడవద్దు' అని యాకాశమునుండి అఘోరభైరవుడు గట్టిగా హెచ్చరించుచుండినట్లు నాకు తోచినది. నే నా మాటలు విని లేచి భట్టిని వస్త్రములను సరిచేసి ఆమె నాడిని పరీక్షించితిని. నాడి చక్కగానుండెను. నేను మెల మెల్లగా ఆమె లలాటమును, అఱకాళ్ళను అఱచేతులను చేతితో రుద్దితిని. ఆమె చేతులను మృదువుగ నొక్కి మఱల ఆమె నుదుటిని చేతితో నిమురుచుంటిని. కొంత సేపటికి భట్టినికి తెలివివచ్చుచున్నట్లుండెను. రక్తోత్పలములవంటి కంటిరెప్పలలో కొంచము సంచలనము కల్గి ఆమె కన్నులు తెఱచెను. ఆ కన్నులు వేసవికాలపు వేడిమికి కుమిలిపోయిన జపాపుష్పములవలె నెట్టబడినను వాడియుండెను. ఝంఝూమారుతముచే నూపివేయబడిన కోవిదారపుష్పములవలె వికసించియున్నను మలినములై యుండెను. అశోక కుసుములవలె మనోహరముగ నుండినను ధూళిధూసరితములైయుండెను. భట్టిని నన్ను చూచి గుర్తించెను. ఆమె దృష్టియందు వివశత్వముతో కూడుకొన్న లజ్జాభావమును నేనుగమనించితిని. కాని యామె మాటలాడ లేదు. కొంతసేపూరక చూచుచుండి మరల కన్నులు మూసికొనెను. వ్యాకులపడుచున్న నా హృద

యము సహస్రధారల కరిగి ప్రవహించుచున్నట్లుండినది! కాని నేను ధైర్యమూనితిని. మరల ఆమె తలను మెల మెల్లగా నొత్తుచుంటిని. కొంతసేపీవిధముగ గడిచినది. తరువాత నేనామె తల నెత్తుటకు ప్రయత్నింపగా ఆమె కనురెప్పలు చలించినవి. భట్టిని కన్నులు తెఱచి లేచి కూర్చుండుటకు ప్రయత్నపడుచుండ నేనామెకు చేయూత నొసగితిని.

భట్టిని లేచి కూర్చుండెను. ఒకమాఱామె నావైపునకు చూచెను. ఆమె దృష్టియందు జిజ్ఞాసగాని, భావము కాని, విభావముకాని, రాగ విరాగములుగాని, మఱేవియు గాని గోచరింపలేదు. అది కేవలమొక శూన్యదృష్టి. ఎదుట గంగానది కలకలమని ధ్వనిచేయుచు ప్రవహించుచుండ అపూర్వ శోభామూర్తియగు భట్టిని తన్ను తాను మఱచి, భ్రమించియున్నట్లు కూర్చుండినది. స్వభావముచే నుద్ధతులగు ప్రమథ గణములు దక్షుని యజ్ఞ క్రియను కేశములను బట్టి లాగినపుడు ఆమె యీ విధముగనే గంగను శరణుజొచ్చియుండవచ్చును. ముక్కంటి కంటినుండి స్ఫులింగములు కురియుచున్నపుడు భయభీతయై చంద్రకళ యీ విధముగనే యొడలు తెలియక గంగాతీరమును చేరి యుండవచ్చును. రాక్షసులచే పీడింపబడిన స్వర్గలక్ష్మి యీ విధముగనే స్వర్గంగా తీరమును పొందియుండవచ్చును. ఆహా! ఉచిత స్థానముననే భస్మావృతయగు రతీదేవి యావిర్భవించినది. వరాహమూర్తి దంతముపై ధరిత్రి చక్కగా కూర్చున్నది. రాహువుచే భీతిల్లిన జ్యోత్స్నాపుంజము కేంద్రీభూతమైయున్నది. అసురులకు భయపడిన అమృతమిచట నవతరించినది. పండితమ్మన్యుల ధాటికి భయపడి సరస్వతి యిచట

వెలసినది. పిసినిగొట్టు భయమునకు వెఱచి లక్ష్మీదేవి యిచటికి వచ్చినది. ఇట్టి దీనావస్థయందుకూడ ఖిన్నురాలైన భట్టినియొక్క మనోహరమగు ముఖమండలము చాల ప్రభావవంతమై యలరారుచుండినది. కొంతసేపటివఱకు నామె గంగానదీ ప్రవాహమును రెప్పవాల్చక చూచుచుండెను. అట్టి పవిత్రమైన నిర్మలమహిమా సమన్వితమగు దృష్టి, గంగానది యింతకుముందెన్నడైనను చూచెనేమో తానే చెప్పజాలదు. నేను చాలసేపటివఱకు నేమియు మాటలాడకుంటిని. కాని ప్రొద్దెక్కుకొలది యిసుక మఱింత వేడియగుచుండుటచే నచట కూర్చుండుటకు శక్యముగాకుండెను నేను వినయముతో "దేవీ, తమ శరీర మలసిపోయియున్నది. ఎండ యధికమగుటవలన నిసుక కూడ కాలుచున్నది. తమ యాజ్ఞయైనచో వేరొక స్థానము నేర్పాటు చేసెదను" అనియంటిని.

భట్టిని కాతరభావముతో నన్నొకసారి చూచెను. ఆ దృష్టియందు కూడ జిజ్ఞాసలేదు. ఆమె పూర్వజీవితమంతయు గంగలో కడిగివేయబడినట్లును అందంకేమియు కడుగవలసినది లేనట్లును కనబడెను. 'ఓరీ! దరిద్రుడగు బాణభట్టుడా! భట్టినిని నీ వెట్టిదశలో పడవేసినావు!' అని నన్ను నేను నిందించుకొంటిని. భట్టిని యేమియు మాటలాడలేదు. ఆమె మఱియొకసారి గంగవైపునకు చూచుచుండెను. గంగానదీ తరంగములు సోపానములవలె నొకదానిపై నొకటి కట్టబడియున్నట్లుండ వానిపై బడుచున్న భట్టినియొక్క స్నిగ్ధదృష్టి చేపవలె జారుచు పోవుచుండెను. నేను "దేవీ, మఱి నాకేమియాజ్ఞ" అని యడిగితిని. ఆమె క్షీణస్వరమున "పోదము పద" అనెను.

# పదియవ అధ్యాయము

నేను భట్టినినొక విశాలమగు శాల్మలీ వృక్షచ్ఛాయలోనికి గొని పోయితిని. దాని తొఱ్ఱలో నొకచిన్న ఎఱ్ఱని పతాకము, కొన్ని సిందూరపు ముద్రలు, రెండుమూడు ఎండినపుష్పములు నుండెను. అది గ్రామదేవతావాసమైయుండ వచ్చునను కొంటిని. ఏలయన చుట్టుప్రక్కల మిట్ట పల్లముల భూమికంటె చెట్టుమొదలు సమతలముగను నెత్తుగనుండెను. ఇచట గ్రామ దేవతయే యున్న పరిసరముల గ్రామములుండ వలయును కదా? కాని కనుచూపుమేఱకు కాకివెదురు, వాకుడు, మొదలగుపొదలు తప్ప నాకేమియు కనబడలేదు. అప్పుడప్పుడు గంగానదీ ప్రవాహము వైపున కెగురుచుండు మిడుతల దండు అచ్చటి నిర్జనత్వమును వఱపించుచుండుట తప్ప ఆచట ఏ పక్షియు కనపడలేదు. విశాలమగు ఆ కాకి వెదుళ్ళ యడవియందు మధ్యాహ్న సమయమున వేడిగాలి 'భంయ్'మని వీచుచుండెను. భట్టిని అవశయై దుఃఖముచే మూర్ఛిల్లినట్లు పడియుండెను. నే నేమి చేయువలెనో దిక్కు తోచక రిత్తవోయి ఆకాశమువైపు శూన్యదృష్టులను జఱపుచుంటిని. ప్రపంచమునందున్న దుఃఖమంతయు నచ్చోటనే కేంద్రీభూతమై యున్నట్లుండెను. ఇటుల కొంతసేపు గడచెను. అటు పిమ్మట భట్టినియే మౌనమున కంతరాయము కలిగించెను. ఆ చిన్నవాక్యమును పలుకుట కామె యెంత సంకోచపడెనో తెలిసికొనుటకు నాకెక్కువ కాలము పట్టలేదు. కులీనతభారముచే నడగి, సిగ్గుచే వంగి, శోభాతిరేక

ముచే నాచ్ఛాదింపబడి భావతరంగములలో చిక్కుకొన్న దానివలె నామె మెడ యించుక వంగి, నేత్రములు భూమి లోనికి చొచ్చుకొనిపోయి పెదవులు కదలెను. ఆమె "భట్టూ! నిఉనియకూడ నిచ్చట నెక్కడనో యొకచోట దాగి చేరి యుండవచ్చును" అని యన్నది. నేను వినయముతో "అవును దేవి! నేనును నిఉనియను వెదకుటకై కుతూహల పడుచున్నాను. కాని తమ నేదో యొక సురక్షితమగు స్థానమును చేర్చునంతవరకు —" అని నేను చెప్పు చుండగనే యామె నా మాటల యభిప్రాయము నర్థము చేసికొని "నా రక్షణ విషయమటులుండనిమ్ము. నీవు నన్ను రక్షింపజాలవు. ఎవరును నన్ను రక్షింపలేరు. నే నెవరి వెంట నుందునో వారినే నేను ముంచివేయుచుందును. నేను నాశన మునే వెంటబెట్టుకొని జన్మించితిని. నే నావిధముగనే బ్రతుకు దును. నన్ను గుఱించిన యాలోచన వీడుము. నిఉనియ చుట్టుప్రక్కల నెక్కడైన పడియుండును. చూచిరమ్ము" అని చెప్పెను. నా నోట మాటరాలేదు. భట్టిని ముఖమింత నిరాశతో గూడియుండుట నే నెన్నడును చూచియుండలేదు. దుఃఖములో కూడ భక్తివిశ్వాసము లామెను విడనాడలేదు. ఏమి యీ విచిత్రమగు మార్పు! భయముతో నే నామె వైపునకు జూచితిని. నా కంట నీరు తిరిగెను ఉన్నట్లుండి భట్టిని కన్నులు నా కన్నులలో కలిసెను. నా ముఖమును చూడగనే యామె దయార్ద్రహృదయము పొంగిపోయెను. ఒక ముహూర్తకాల మామె కుపిక్కించిన పెదవులపై

మందహాసరేఖ ప్రకటమై మఱుక్షణమున కన్నులనుండి జొటజొట నీరు కారసాగెను. 'అయ్యో! మహాకవీ! నీ వెప్పుడును ఆనంద వినోదములతోనే జీవితము గడపితివి గదా! ఇట్టి కరుణా మోహన స్మితమును చూచి యుండిన నదెట్లుండునో నీవు ప్రపంచమునకు చాటియుందువు కదా! పార్వతీదేవి మందహాసమును నీవు నీ యమర కృతి యందు శాశ్వత మొనర్చినావు. ఆమె మందహాసమున నున్న కిసలయ గర్భస్థమగు పవిత్రతయు, నిర్మలమగు పగడపు చిప్ప యందున్న ముత్యపుటాభిజాత్యమును నీవు గుర్తించితివి.* కాని అవి స్వర్గంగాధారయందు మునుగుచు తేలుచుండుట నీవు చూచియుండలేదు. వికసించిన తత్క్షణమే యేకధారగా పడుచున్న వర్షములో తడియుచున్న పుష్పమిది. ఉదయించిన వెంటనే కుహారావృతమైన దిగంతముగల నక్షత్ర మిది. నిర్మింపబడిన వెంటనే యాకాశమంతయు ధూళిచే గప్పబడిన యింద్ర ధనుస్సిది.' భట్టిని తలవంచుకొని విలపించుచుండెను. నేను దిక్కుతోచక గ్రుడ్లప్పగించి యామెను చూచుచుంటిని.

శాల్మలీ వృక్షమునకు మఱియొక వైపునుండి యెవరో వచ్చుచున్నట్లు యలికిడి కలిగెను. భట్టిని తలవంచుకొని యింకను యేడ్చుచునే యుండెను. నేను కొంచెము జాగరూకుడ నైతిని. తలఎత్తి చూడగనే నా యెదుట రక్తాంబరధారిణియు త్రిశూల పాణియునైన మహామాయ నిలబడి యుండెను. ఒక్కక్షణము నేను నా కన్నులను నమ్మజాలక

---

* కాళిదాసుని (కుమారసంభవము 1-44) శ్లోకముతో పరిపోల్చవచ్చును.
పుష్పం ప్రవాలోపహితం యదిస్యా। న్ముక్తాఫలం వా స్ఫుట విద్రుమస్థమ్।
తతోఽను కుర్యాద్విశదస్య తస్యా। స్తామ్రౌష్ఠ పర్యస్త రుచిః స్మితస్య ॥

పోతిని. కాని ఆమె నిక్కముగ మహా మాయయే. ఆపింగల వర్ణపు కేశములు, కోవిదార కుసుమములవంటి యెఱ్ఱని కన్నులు, సంకీర్ణ వలయమువంటి యెఱ్ఱని ఊర్ధ్వ పుండ్రము, అష్టమీ చంద్రునిపోలిన ప్రదీప్తమగు లలాటము, అగ్ని శిఖచే చుట్టబడిన దమనకయష్టివంటి రక్తాంబరములచే నావరింపబడిన తనూలత - అన్నియును ఆమెవే! నన్నీ దశలో చూడగా ఆమె కాశ్చర్య సంకోచములు కలిగెను. ఆమె నన్నేమియు నడుగజాలక పోయెను. సరిగదా, వెనుకకు తిరిగి పోజాలకుండెను. శైలాధి రాజతనయవలె నామె దశయు "న యయౌ న తస్థౌ"గా నుండెను. నేను ససంభ్రమముగా లేచి నిలబడితిని. సాష్టాంగ ప్రణామ మాచరించి నేను భట్టినిని చూచి "దేవీ! లెండు. పార్వతీదేవి వంటి ప్రభావశాలిని, సాక్షాత్తు మహామాయ స్వరూపిణియగు మహామాయ మన యదృష్ట వశమున నిచటికి దయచేసినది. ఈనాడు మనకు శుభదినము. గ్రహవీక్షణము మనపై ప్రసన్నముగ నున్నది. ఈనాడు సూర్యోదయము మనకానందము చేకూర్చునదై యున్నది. మన కర్మఫలము నేడు బలవత్తరముగ నున్నది. దేవీ! లేచి మహామాయకు ప్రణమిల్లి ధన్యత చెందుడు" అని యంటిని. కుదుట బడుటకు భట్టినికి కొంత యాలస్యమైనది. ఆమె కమలమువంటి కన్నులు వాచి యెఱ్ఱనై యుండెను. ముఖము వేసవికాలపు టెండకు కంది పోయిన మొగలి పూవువలె వాడియుండెను. నేను చెప్పిన తర్వాత నామె లేచి మహామాయకు ప్రణామ మాచరించి తలవంచుకొని నిలబడెను మహామాయ తానేదో గొప్ప యపరాధమును గావించిన దానివలె నిశ్చలముగ నుండెను.

ఆమె యొకమాఱు భట్టినిని మఱియొకమాఱు నన్నును చూచుచుండెను. లజ్జ, జిజ్ఞాస, ప్రేమ యీ మూడు భావములామె ముఖముపై వచ్చిపోవుచుండెను. ఆమె మన స్సంశయమును దీర్చుటకై నేను "భగవతీ! మహాత్ములగు అఘోర భైరవులకు నేనవరి విషయము నివేదించుకొని యుంటినో యా భట్టినియే యీమె. నేనీమె కకించనుడగు సేవకుడను" అని పలికి నిన్నటినుండి జరిగిన వృత్తాంత మంతయు నే నామెకు సంగ్రహముగా చెప్పితిని. మహా మాయ తదేక ధ్యానముతో నేను చెప్పినదంతయు వినెను. ఆమె ముఖమున కనబడుచుండిన సంకోచభావము తొలి గెను. చిఱునగవుతో నామె భట్టిని తలనిమురుచు నావైపు చూచి కొంచెము విచారముతో "మంచిది నాయనా! నీ కుండలిని ప్రబుద్ధమై యున్నది నీకవఘూత గురువుల ప్రసా దము లభించినది. నీ స్వామినిపై బడిన యాపద తొలగినది. కాని నీ కాపదయింకను తొలగలేదు!" అని యించుక సెపాలోచించి "నేడు మహానవమి. త్రిపుర సుందరీవృ బలీయము!" అనెను. ఆమెలో నేదో ద్వంద్వయుద్ధము జరుగుచున్నట్లామె ముఖాకృతి కొంత కఠోరమైనది. నా మనస్సునకు కూడ కొంచెము భయము కలిగెను. కాని మహామాయ గంభీరముగ నుండెను. ఇదంతయు చూచు చున్న భట్టిని మనస్సు శంకాకులితమైనను ఆమె తన మనో

భావముల నణచుకొని యుండెను. అప్పటి భట్టిని ఆకారము దర్శన యోగ్యముగ నుండెను, కారుమబ్బులవంటి కేశము లామె ముఖమండలముపై చెదరి పడియుండెను. వాచిన పెద్దపెద్ద కన్నులు వాలిపోయి యుండెను. పగడలకంటి యధర యుగ్మము దృఢముగ మూసియుండినది. పాలి పోయిన కపోలములపై రోమరాజి పులకరించియుండెను. ఎఱ్ఱని చిబుక మదరుచుండెను. ఎడమచేయి సోమలతవలె వ్రేలాడుచుండ కుడిచేయి పావురపు రంగుగల పైటకొంగున దాగియుండెను. ఆమె తల పాదాంగుష్ఠముచే నేలను గీరుచు చింతయే మూర్తీభవించి నట్లగు పడుచుండెను. మహామాయ మఱియొకసారి భట్టినిని చూచి తన నలువైపుల ధ్యాన ముతో తిలకించి ఆవలించి చిటికలు వేయుచు "త్రిపుర భైరవీ! త్రిపురభైరవీ!" యని యనెను. తర్వాత నామె ప్రేమతో భట్టినిని తన యొద్దకు లాగుకొని యామె గడ్డ మును పట్టుకొని ముఖమును పైకెత్తి "భట్టు చెప్పుచుండిన స్వామినివి నీవేయన్నమాట! నిజముగా నీవు స్వామిని కాద గినదానవే! ఆహా. అమృతము వర్షించునందమైన ముఖము! రా అమ్మాయీ! మన మఠతలకి వెళ్ళియుందుము రమ్ము" అని నన్నుజూచి "వెళ్ళు బాబూ! నీవు నిపుణియును వెదకి పిలుచుకొని రమ్ము. నీ స్వామిని ఇచ్చటనేయుండును. చింతిల్ల కుము. నీపై అవధూతుల యనుగ్రహము కలదు. నీ కుండలిని ప్రబుద్ధమై యున్నది. భయపడకుము" అని యనెను. నే

నా మెకు నమస్కారముచేసి మెల్లమెల్లగా గంగానదీ తీర మున సాగిపోవు చుంటిని.

నేను చాలదూరమట్లే నడచిపోయితిని. కాని నిపుణిక జాడ కాన రాదయ్యెను. ఈవిధముగ నిపుణికకై వెదకుచు పోవుట బాల్యచాపల్య మేమోనని యొక్కొక్కసారి యని పించు చుండెను. మునిగిపోయినవాడు లభించుట సంభవమా! కాని నిపుణిక జీవించియే యున్నదనియు ఆమె తప్పక దొరకు ననియు నాకు గట్టినమ్మక ముండెను. కొంతదూరము వెళ్ళిన తర్వాత భట్టిని విషయమై నా మనస్సు సంక్షుభితమగు చుండెను. ఇంతవఱకామె యేమియు భుజించియుండలేదు. నేను కూడ భోజనము చేయలేదు. కాని నాకీ విధముగ నుండుట యలవాటే. నా దేశదిమ్మరి జీవితమున నేను సాధిం చిన దిదియే - "కరతలభిక్షా, తరుతలవాసః" ఇదియే నేను పొందిన సిద్ధి. కాని భట్టిని మాట తలపునకు రాగానే హృద యము వ్రయ్యలు కాసాగెను. ఆహారము నేదో విధముగ నేను సంపాదింప గలిగినను, మహా వరాహుడేడీ! ఇప్పుడు భట్టిని తప్పక తన యుపాస్యదేవుని మాట యాలోచించు చుండును. నేను నా చేతులార నామె పరమోపాస్య దేవ తను నీట జారవిడిచితి నని యామెకు తెలిసిన ఆమె నన్ను తప్పక ఏవగించుకొనును. "అయ్యో! దౌర్భాగ్యపు బాణుడా! భట్టిని విశ్వాసమే నీకు పరమ సంపదకదా! అట్టి విశ్వాస మునే నీవు పోగొట్టుకొన దలచితివా! అని తలపోసి ముందుకు సాగిపోవుట నిష్ప్రయోజన మనుకొంటిని. కనుచూపు మేర వరకునల్లని నీటిధార మెఱయుచుండెను. విశాలమగు కాశీ

పెదుళ్ళు, యడవి భంయ్, భంయ్యని శబ్దము చేయు చుండెను. మానవ సంచారము నెఱుగని యిసుక తిన్నెలు మిలమిలలాడు చుండెను. భట్టినిని విడచి యింతదూరము వచ్చియే యుండకూడదని నేను వెనుకకు మఱలితిని. నేను వారియొద్దకు చేరునప్పటికి ప్రొద్దుతిరిగి యుండెను.

భట్టినీ మహామాయలు శాల్మలీ వృక్షమునకు తూర్పు దిక్కున కూర్చుండి మాటలాడుచుండిరి. వారు నా రాకను గమనించలేదు. ఈ కొలది సేపటిలోనే భట్టిని మహామాయ యొక్క సంపూర్ణ వాత్సల్యమును చూరగొని యుండెను. ఎన్నో దినములనుండి వేఱుగానుండిన కన్య తనతల్లి యొడిలో కూర్చుండినట్లామె మహామాయ యొడిలో కూర్చుండి యుండెను. మహామాయ యేదియో ప్రశ్నించుచుండ భట్టిని దానికి ప్రత్యుత్తర మొసగుచుండెను. వారిమాటల ధోరణిని బట్టి నేను వారికి తెలియకుండ వారి వెనుకనే నక్కి యుండి వారిమాటలను వినుచుంటిని. ఇది యనుచితమే యయినను అస్వాభావికము మాత్రము కాదు. భట్టినీ మహామాయల మధ్య ఈ విధముగా సంభాషణము నడుచు చుండెను. "అయితే నీవు భట్టునేమను కొనుచున్నావమ్మా!" "భగవతీ, నేనేమను కొనుచున్నానో నాకే తెలియదు. అతడు దేవతయని నిఉనియ యనుచుండెను; కాని నేను దేవతయని యెట్లనగలను!"

"నీ మనసులో మొదట తోచినమాట చెప్పుము; ఆలోచించి చెప్పిన మాట అన్ని సమయము లందును సత్యము కానేరదు"

"అమ్మా, నే నేమని విన్నవింతును. భట్టు నాతో మొట్టమొదట మాటలాడిననాడే నేను క్రొత్తజన్మమును పొందితిని. ఆనాడే సూర్యుడుదయాద్రి తటముపై సూంగల్య వర్షముతో నుదయించెను. ఆనాటి యుషస్సు నా సంపూర్ణ జీవితమును పరమ సౌభాగ్యవంతముగ నొనర్చెను. ప్రప్రథమమున నే నానాడే నా జీవిత సార్థకతను గుర్తించితిని."

"సార్థకతయా! అదెట్లు తల్లీ?"

"మాతా, ఏదో క్రొత్తవెలుగును ఒక నవీన జ్యోతిని చూచినట్లు, నాడు భట్టు చకితమృగ శాబకమువలె నావైపునకు చూచెను. అతని దీప్తలలాటము నందు శుచిమంత మగు భక్తి కిరణము విరాజిల్లు చుండెను. అతని విమల విశాల నయనముల నుండి యుజ్జ్వల ప్రకాశము శుక్రగ్రహము మెఱయు చున్నట్లు వెలువడు చుండెను. అతని కోమల మధుర కంఠస్వరమున నొక యద్భుతమగు మాధుర్య ముండెను. భట్టు మాటలాడిన నాలుగైదు వాక్యములు స్పష్టములై సంశయ రహితములై అర్థవంతములై యుండి సామగానమువలె పవిత్రముగా నుండెను. కాని యతని మాహాత్మ్యము దానికంటె గొప్పది. రాజభవనమున నేను నా సౌందర్యమును గుఱించిన ముఖస్తుతులను చాల విని యున్నాను. కాని నిజమగు వాణిని నేనదే తొలిసారి వింటిని. నాలోనొక దేవత యున్నదనియు ఆరాధకుడు లేకపోవుటచే నతడు సాక్షి దాగియున్నాడనియు నేను మొదటిసారి గుర్తించితిని. భగవంతుడు నాకు నారీ జన్మ మొసగి నన్ను కృతార్థురాలినిగా జేసి యున్నాడు. నేను నా సార్థకతను గుర్తించితిని"

"ఇదేమి క్రొత్తసంగతి కాదు, తల్లీ" ... ...

"అవును మాతా! నిజముగ క్రొత్త సంగతియే. ఈ నీలాకాశము ఈ చంచల పవనము, నిర్మలమగు నీజాహ్నవీ జలధార ఇవన్నియు నే ననుచున్న మాటలకు సాక్షి! భూత ము లే. నారీ జీవిత మీభువన మండలమున ప్రథమముగ నింత యర్థవంతమైనది."

"అయితే నీవు దేనిని సార్థకత్వ మనుకొను చున్నా వమ్మా?"

"అమ్మా! నేనజ్ఞురాలను. ఏ పదము నెట్లుపయోగింప వలసినదియు నాకు తెలియదు. కాని బాణభట్టుని మాటలు వినిన తర్వాత నా యీ శరీరము భారస్వరూపము గాదనియు, మట్టి బొమ్మగాదనియు నంతకంటె అది కడు గొప్పదనియు మొదటిమారు గ్రహించితిని విధాత దానిని సృష్టించినపు డతని యభిప్రాయము నన్ను శిక్షింపవలెనని కాదు. ఆయన నన్ను స్త్రీగా పుట్టించి నా కుపకారమే చేసియున్నాడు. అమ్మా. భట్టు ఈ పుడమిపైని పారిజాతము; ఈ భవసాగర మున పుండరీకము; ఈ కంటకమయ భువనమున మనోహర కుసుమము"

మహామాయ కొంతసేపూరకుండి దీర్ఘమగు నిట్టూర్పు విడిచెను. ఒక్క క్షణకాలము ప్రశాంతిముగ నుండెను. తర్వాత నున్నట్లుండి మహామాయ పరాజితవలె "అసలు సంగతేమిటో యెవరికెఱుక తల్లీ. నారీజీవితము పురుషుని బంధించుటవలన సఫలమగుననియు, అతనిని ముక్తినొందించుట ఆమె జీవిత సార్థకతయనియు గురువుగారు సెలవిచ్చియుండిరి.

జీవితమంతయు నేనీ విశ్వాసముపైననే గడుపుచుంటిని; జప తప సాధన భజనలకన్నిటికిని ఈ సార్థకతయే యేకైక లక్ష్యము! త్రిపురభైరవి సాక్షాత్కారమింకను లభింపలేదు. కాని తల్లీ! ముందేమి జరుగునో గురుదేవునికే యెఱుక. కాని నీవు సత్యమును దర్శించియున్నావు. నీ మాట నిజము కూడ కావచ్చును" అని చెప్పి కొంతసేపటికి మఱచినమాట జ్ఞప్తికి తెచ్చుకొను చందమున ఆమె "నారీ జీవితపు సార్థకత!" అని యూరకుండెను.

నేనింకను చాల సేపచట దాగియుండుట సరికాదని తలచితిని. నేను విన్నదే యెక్కువ! ఎక్కువ వినుటవలన నభిమానము వృద్ధిచెందును. మోహము ముద్రితమగును. తర్వాత మమత్వము పోగొట్టుకొనుట కష్టమగును. ఇంతవఱకు కాగిపోవుటయే మేలు. బాణభట్టునికి లభించిన పురస్కారము లభింపవలసిన దానికంటె లక్షరెట్లధికముగ లభించెను! ఇంతకంటె నెక్కువ-యాశించుట పేరాసయగును. నేను దగ్గి మెల్ల మెల్లగ భట్టినీ మహామాయలు కూర్చుండిన వైపునకు సాగిపోతిని. నా యలికిడి విని వారు మాటలు చాలించిరి. భట్టినిమాత్ర మొక అవిలోల యపాంగమున నన్ను చూచెను. వారి మాట లనేమైనను నేను విన్నానేమో యని యామె తెలిసికొనదలచుచుండెను. కాని బాణుడంత యనుభవహీనుడు కాడు! సత్యాసత్యముల నభినయించుచునే యతడు తన జీవితమునంతయు గడపియున్నాడుగదా! ఓ స్వర్గలోక దేవకన్యకా! నీవు మర్త్యలోకపు నటనల నర్థము

చేసికొనుటయందు పొరబడితివి. కాని యీ ప్రమాదము వలన కీడు కలుగదు.

మహామాయ నన్నుజూచి ప్రసన్నురాలైనది. తన జోలెనుండి కొన్ని కందమూలఫలములు తీసి నా కిచ్చుచు నేను భుజింపకుండ నుండినందువలన భట్టినికూడ నింతవఱకుపవాసమున్నదని తెలిపెను. వానిని భుజించిన తర్వాత నేను మఱియొకవైపు నిపుణికను వెదకుటకై వెళ్ళవలసి వచ్చెను. నిపుణికను వెదకుటకై వెళ్ళుట యప్రధానమైనది. భట్టిని కవకాశము నిచ్చుటయే ప్రధానమగు కర్తవ్యము. ఈమారు తూర్పువైపునకు వెళ్ళితిని. ప్రొద్దదివఱకే దిగజారియుండెను. దాదాపొక క్రోసుదూరము వెళ్ళిన తర్వాత ఒక గుంపు నృత్యగానములు సలుపుచు వచ్చుచుండుట నేను చూచితిని. మర్దళ, మృదంగ వేణువులను వాయించు నిద్దఱు ముగ్గురు కిశోరవయస్కులు తప్ప ఆ గుంపునందు మఱెవ్వరు పురుషులు లేరు. స్త్రీలు కుచ్చెళ్ళుగల యెఱ్ఱని పావడలు, నీలిరంగు రవికలపై పచ్చని యుత్తరీయములు ధరించియుండిరి. వారున్మత్తలై నాట్యముచేయుచుండిరి. వారు వేగముగ కదము ద్రొక్కుచున్నపుడు వారి పావడల కుచ్చెళ్ళు అనురాగ సముద్రమున సుడిగుండములు తిరుగుచున్నట్లు గిఱ్ఱున తిరుగుచుండినవి. వారి పదసంచారము తాళము ననుసరించలేకుండినను పదసంచలన వేగమున వారి పచ్చని యుత్తరీయములు నీలిరంగుగల కంచుకముల కలసి గిరగిర తిరుగుచున్న యొక చక్రవాళమువలె నుండెను. వారి పొడవైన జడలు వేగముగ నూగుచుండుటచే భూమ్యాకాశములను కలుషు నల్లని పట్టు

కెరటములవలె తోచుచుండెను. మాటిమాటికి క్రిందికి పైకి నూగుచున్న వారి యెఱ్ఱని కరతలములు ఆకాశమనెడు నీల సరోవరమునుండి అధోముఖముగ వ్రేలాడుచున్న కెందామర లను బోలియుండెను. వారి క్షీణమగు కటిప్రదేశము మాటి మాటికి వంగుచు శతావరీలతను బోలి, చూచువారికి వలిగి పోవునేమోయను భయము కల్పించుచుండెను. నేను ముగ్ధు డనై యీ నృత్యమును జూచుచుంటిని. ఒకసారి నృత్య వేగము కొంత తగ్గినపుడు నేను మద్దెల వాయించుచున్న యువకుని వారిని గుఱించి యడిగితిని. వారు గంగా మహా సరయూనదీ సంగమమునందు వజ్రతీర్థమున వెలసియున్న దేవీపూజకై పోయి వచ్చుచుండిరనియు, నాడు మహానవమి యయినందున, వజ్రతీర్థవాసినియగు దేవీపూజ చాల మహా త్మ్యముగలదనియు వారి గ్రామము సరయూనది యావలి గట్టున నున్నదనియు అతడు చెప్పెను. నేను నాకు కావలసిన విషయమును గుఱించి యడుగగా ఆ యువకుడు వారి నాయ కుడు ప్రతిష్ఠగు లోరికదేవవల్లుడనియు, అతనికి దేవ బ్రాహ్మణులయందు పరిమితమగు శ్రద్ధగలదనియు, నావంటి విద్వాంసుల నతడు శిరముపై నిడుకొని పూజించుననియు, నతడు నాకు చెప్పి, వెంటనే నాతనియొద్దకు గొనిపోయెదను, రమ్మని నన్ను పిలిచెను. కాని నేను దేవీదర్శనము చేసికొన వలెనను వంకబెట్టి యతని బాఱినుండి తప్పించుకొంటిని. పాపమా యువకుడు వజ్రతీర్థమున రాత్రులందు దేవీదర్శ నము నిషిద్ధమనియు, రాత్రులందచటికి సాధకులు వచ్చు చుందురనియు అచటికి రాత్రులందు గృహస్థులు వెళ్ళుట

సరికాదనియు చెప్పెనుగాని వాని యమాయకత్వమును లోలోన ప్రశంసించుకొనుచు వాని మాటను త్రోసిపుచ్చితిని. అప్పటికి సాయంకాలమై యుండెను. నేను భట్టిని కడకు తిరిగి వెళ్ళియుండవలసినదే కాని యేకో నాకు తెలియని యద్భుత శక్తియొకటి నన్ను వజ్రతీర్థమువైపునకు త్రోసికొనిపోవు చుండెను. నేను నా యిచ్ఛకు విరుద్ధముగ వెళ్ళుచుంటిననిన నెవ్వరును నమ్మరు. కాని నిజ మదియే. అట్టి తఱి నా ప్రక్క నుండి ఒకానొక అజ్ఞాతవనిత తుపానువలె పరుగెత్తుచు వెడలి పోయినది. ఆమె మెడలో కపాలమాల వ్రేలాడుచుండెను. నడుమున నెముకల గజ్జెలు గలగల లాడుచుండెను. చేత పుఱ్ఱెతో చేసిన కంజీరయొకటి కణకణమని మ్రోగుచుండెను. ఆమె జటలు మఱ్ఱియూడలవలె కర్కశములై కటియందున్న జేగంటకు తగుల్కొని కఠోరమగు నినాదము చేయుచు కపోలములపై వ్రేలాడుచున్న గవ్వలదండయందు మాటిమాటికి తగుల్కొనుచుండెను. నా ప్రక్కనుండి నన్ను త్రోసి కొనుచు నెగిరిపోవుచున్నదా యన్నట్లామె వెడలిపోయినది. నేను త్రాటిచే కట్టి లాగబడుచున్న మర్కటమువలె ఆమెను వెంబడించితిని.

వజ్రతీర్థమొక గొప్ప శ్మశానము. నలువైపుల వేప నూనెయందు వేయించబడుచున్న వెల్లుల్లిపాయల కంపువలె కాలుచున్న శవముల దుర్గంధము వ్యాపించియుండెను. శ్మశానవాటిక యంతయు గద్దలయు నక్కలయు పదచిహ్నములచే నిండియుండెను. ఎముకలమీదను మాంసఖండములమీదను సాయంకాలపు నీరెండపడుచు మఱింత భయావహ

మొనర్చుచుండెను. మండుచున్న చితులవద్ద కొద్దిగ కాంతి కనబడుచుండెను. కాని మిగత ప్రదేశమంతటను గాఢమగు చీకటి వ్యాపించియుండెను. ఉండియుండి గుడ్లగూబల కూతలచేతను, నక్కల కూతలచేతను శ్మశానవాతావరణ మంతయు కంపించిపోవుచుండెను. ఈ భయంకరమగు స్థలమునందు నట్టనడుమ కాళికాదేవి యాలయముండెను. అది పేరునకు మాత్రమే యాలయము ఒక వేదిక, హవన కుండము యూపకాష్ఠము తప్ప నచట మఱేమియు లేవు. కాళికాదేవి ప్రతిమ నిజముగ భయమును గొల్పుచునే యుండెను. వ్రేలాడుచున్నయామె నాలుక విశ్వమునంతయు నొక్కసారిగ మ్రింగి మరల దానిని రక్షించుచున్నదా యన్నట్లుతోచెను. ఆమె మెడయందొక గొప్ప పుఱ్ఱెలమాల పిక్కలవఱకు వ్రేలాడుచుండెను కాళికాదేవి యెదుట నే నింతకుముందు చెప్పిన ఆ యజ్ఞాత వనిత మోకాళ్ళపై నిలబడియుండెను. ఆమె ప్రక్క యామెకంటె నశుభవేష మును దాల్చిన పురుషుడొకడు, అప్పుడే తీసిన క్రొవ్వుతో హోమము చేయుచుండెను. ఆహుతిపడుటయే తడవుగ అగ్ని హోత్రుని లోలపింగళ శిఖలు భయంకరాకృతిని దాల్చి ప్రజ్వ రిల్లుచుండి వాయుమండలమును దుర్గంధముచేతను పింగళ వర్ణముతోడను వ్యాప్తమొనర్చుచుండెను. యజ్ఞకుండమునకు నలువైపుల పుఱ్ఱెలలో వివిధములగు ఆహవనీయ సామగ్రి యుంచబడియుండెను. నా మనస్సు జుగుప్స, అసహ్యాము లతో నిండిపోయెను. కాని యాశ్చర్యమేమన నేను ముందుకు సాగిపోవుచునే యుంటిని. కడపట నేను యూపకాష్ఠము

నానుకొని నిలువబడితిని. సాధకుడు భయంకరస్వరమున సంకల్పము పఠించెను. నేను చిత్తరువువోలె నిలుచున్నవానిని నిలుచున్నట్లేయుండి కుతూహలముతో చూచుచుంటిని. సంకల్పములో పల్కిన వాక్యములనుబట్టి చూడ నా సాధకుని పేరు అఘోరఘంటుడనియు, యీసాధకురాలి పేరు చండమండనయనియు తెలిసెను. సాధకురాలు కొన్ని హస్త ముద్రలను ప్రదర్శించి యొక కొండగోగు పూలమాల నా మెడలో వేసెను. తర్వాత నామె మధురమగు కంఠమున ధ్యానశ్లోక మిా విధముగ పఠించెను:

శ్లో॥ చండోచ్చండ నిశుంభమాన మథనాత్యుష్ణోష్ణ రక్తప్రియా
ఉత్తాలోద్ధత తాండవాహ తనధో విధ్యస్తతారాగణా।
పిండేషోడశనాడి కుంచితపదా, షట్చక్ర వక్రాసనా,
ముండ స్రక్పరివేష్టితాంబరపటా సిద్ధ్యై కరాల్యాస్తువః

దుర్గంధముచే నా తల పగిలిపోవుచున్నట్లుండెను. నరములుబిగిపోయి ఆ పొడుపొగచే నా కన్నులు మండిపోవుచుండెను. కాని ఆ విచిత్ర సాధనక్రమము నిరాటంకముగ సాగుచునేయుండెను. క్రమక్రమముగా నాకు తెలివి తప్పుచుండెను. కాని యాశ్చర్యమేమన నేను క్రిందబడిపోక సంవేదనా శూన్యుడనై యచట జరుగుచున్న దానిని సంపూర్ణముగ చూచుచుంటిని ఆకాశమునుండి భయంకరాకారముగల కట పూతనలు, వామమార్గ సాధకురాండ్రును దిగివచ్చి విచిత్రమగు రీతిని ప్రణమిల్లి మంగళహారతులిచ్చుచుండిరి. నక్కల ప్రచండగవమును బోలిన జయ నినాదములచే దిఙ్మండల

మంతయు దద్దరిల్లిపోవుచుండెను. వికరాల వదనములుగల పిశాచుల యస్థి కరతల ధ్వనులచే అంధకారమంతయు తొలగి పోవుచున్నట్లుండెను. నేను సంజ్ఞాశూన్యుడనై నిలుచుండి యుంటిని. చండమండన తిరిగి యిట్లు స్తోత్రము చేసెను.

శ్లో ॥ యద్బ్రహ్మాండ కటాహసంపుట తటోల్లాసి, ప్రచండం,మహః
యత్తద్గర్భ విభాండమండన మహాజ్జ్యోతిః, పరంజ్యోతిషామ్
ధ్యానావస్థిత తద్గతేన మనసా యద్యోగిభి ర్ధార్యతే
తత్తే ధామ నిరస్త విశ్వకుహకం భార్గం పరం ధీమహి ॥

వివిధములగు అంగన్యాసములతో శివుని యస్త్రము పూజింపబడెను. అఘోరఘంటుడు నన్నుజూచి "నీకు ప్రియమైనదానిని నీవు స్మరించుకొనుము" అని యాదేశించెను. ఒకక్షణములో భట్టిని కోమలమగు ముఖము నా తలపునకు వచ్చినది. నేనామెను నిర్జన శరకాంతారమున విడచి యిచట బలియగుచున్నానను విషయము తలపునకురాగానే నా శిరస్సు తిరిగిపోయినది. నేనఘోర భైరవుని స్మరించితిని. నా కన్నులు తమకు తామే మూతపడినవి. కటపూతనలు హారతులిచ్చుచుండిరి. నక్కల ప్రచండరవము నలుదెసల మారు మ్రోగుచుండెను. గుడ్లగూబల కూతలు దిక్కులనే చీల్చుచుండెను. అఘోరఘంట, చండమండనల భయంకర మంత్రోచ్చారణముచే వాయు మండల మంతయు దద్దరిల్లుచుండెను. భీకరాకారవతులగు భైరవినులు ఘీంకారములు చేసిరి. కటపూతనలు నన్ను నలువైపుల చుట్టుకొనినిలబడిరి. చండమండన విచిత్రమగు నావేశముతో తలపై కొట్టుకొను

చుండెను. అఘోరఘంటుడు గొప్ప. యాహుతులచే, క్రమక్రమముగా వృద్ధినొందు హుంకారములచే హవనకుండమును ప్రజ్వలింపజేయుచుండెను. నేను కన్నులు తెరచితిని. నాయెదుట మహామాయ, భట్టిని, నిపుణిక వారివెనుక విచ్చుకత్తి ధరించిన విగ్రహవర్మ, పదిమంది మౌఖరీవంశపు వీరులతో రాతిబొమ్మలవలె నిలుచుండుట నేను చూచితిని. భట్టిని భయభీతయై నన్ను చూచుచుండెను. నేను కన్నులు తెరచితిని. నే నామెనువివశత్వమున గలిగిన తత్తరపాటుతో చూచుచుంటిని. వేగముచే ఉరుగెత్తుచున్న రక్తధారను నా శిరస్సు భరింపలేక నా కణతలవద్ద రక్తనాళము పగిలి రక్తము వెలుపలికి ప్రవహించుచున్నట్లనిపించెను. రక్తముచూచి అఘోరఘంటుడు చలించెను. అతడు చండమండనను త్వరపడుమని యాజ్ఞాపించెను. అచ్చట భట్టిని మూర్ఛిల్లి క్రిందబడెను. భట్టిని మూర్ఛిల్లుటజూచి నా వ్యాకుల చిత్తము మఱింత వ్యాకులపడెను. నిపుణిక యున్మత్తురాలివలె వేదికవైపునకు పరుగెత్తెను. ఆమె కాళ్ళకెవరో తుపానును కట్టినట్లుండెను. మహామాయ శిలాప్రతిమవలె నిశ్చలముగ నిలిచియుండెను. ఆమె కన్నులనుండి యొక యద్భుతజ్వాలామయమగు జ్యోతి వెలువడుచుండెను. నిపుణిక తుపానువలె వచ్చినది. ఒక త్రోపుత్రోసి యామె చండమండనను క్రిందపడవేసి యామె చేతనున్న కత్తి నిలాగుకొనెను. ఆ కత్తిని తీసికొని నిపుణిక భయంకరమగు నృత్యము చేయసాగెను. ఆమె యుద్ధత నృత్యమువలన హవనకుండము ధ్వంసమైనది. ఎఱ్ఱపతాకము ఛిన్నాభిన్న మయ్యెను. యూపకాష్ఠము ధ్వంస మయ్యెను.

ఓహో! ఎట్టికరాల నృత్యమది! ఒక్కొక్క పదాఘాతముచే ధరిత్రి తగ్గుచున్నట్లును, నక్షత్రమండల మూగుచున్నట్లును కనబడ కాళికాదేవి కపాలమాల, గలగల లాడుచుండెను. నేను మహామాయ వైపునకు చూచితిని. ఆమె దృష్టినిపు ణికపై నిలిచియుండెను. కొంతసేపైన తర్వాత నున్నట్లుండి యామె నన్ను చూచినపుడు కోటిసూర్యులు నావైపున కుజికి నట్లును విచిత్రమగు ధూమకేతువొకటి నాపైకి దుమికినట్లును నాకుతోచెను. నేను తొట్రుపాటు చెందితిని. ఇంతలో నిపుణిక ప్రహతిప్రక్రిందబడెను. ఇప్పుడు నా వంతు వచ్చి నది. నేను అఘోరఘంటుని భుజములపై కెత్తికొంటిని. నే నెట్లు తాండవనృత్యము జేసితినో నాకు జ్ఞాపకములేదు కాని శ్మశానములోని యేభాగముకూడ నా నృత్యముచే స్పృశింపబడక యుండ లేదని మాత్రము నాకు గట్టిగా జ్ఞాపక మున్నది. కడపట నే నఘోరఘంటుని గంగలో పాఱవేసితిని. మహామాయ వాయువేగమున నా వైపునకు పరుగెత్తుకొని వచ్చి నన్ను తూర్పుదిక్కునకు లాగుకొనుచు వడివడిగా పరుగెత్తెను.

గంగామహాసరయూ సంగమస్థలమున అఘోరభైరవ స్వామి యొక్క శవముపై ఆసనము వేసికొని ధ్యానసిమగ్నుడై కూర్చుండియుండెను. వేగముగ పరుగెత్తినందువలన నే నెగ రొజుచుంటిని. నన్ను వెనుకకు త్రోసి మహామాయ "రక్షిం పుము, గురుదేవా! రక్షింపుము" అని గట్టిగా నఱచెను. అఘోరభైరవులు కన్నులు తెరచి "మహామాయా! మహా మాయా! మహామాయా!" యని వా రాశ్చర్యముతో పిలి

చిరి కాని మహామాయ నిశ్చేష్టురాలై నిలబడి మారు మాటాడలేదు. నే నెగరోజుచు భూమిపై సాగిలబడి, "గురు దేవా! రక్షింపుము!" అని యంటిని. అఘోరభైరవులు శవముపైకి నన్ను లాగికొని నా లలాటమును నిమురుచు— "అయితే నీ వింకను బ్రతికియున్నావన్నమాట! అంతయు త్రిపురభైరవి మాయ!" అని యనిరి. నేను వారి యాజ్ఞాను సారము జరిగిన వృత్తాంతమంతయు విన్పించితిని. కాని వారు చలించలేదు. ఒకసారినా తము మహామాయను చూచి నవ్వి యామెను మందలించుచు "పిచ్చిదానా! భయపడు చున్నావా?" అని కొంచెము నీరు తీసుకొని మహామాయ ముఖముపై చల్లిరి. అప్పు డామెకు కొంత స్పృహవచ్చెను. కొంచెముసేపాగి వారు మహామాయ కేదియో చెప్పిరి. మహామాయ యచటనుండి కాళికా దేవాలయము వైపునకు వెడలిపోయెను.

అవధూతపాదులు కొంతసేపు ధ్యాన నిమగ్నులై కూర్చుండియుండిరి. గవ్వలవంటి వారి కన్నులు నిశ్చలములై యుండెను. కొన్ని క్షణములు గడచిన పిదప వారు నా వీపు నిమురుచు "నీవు కవివి కాదూ, నాయనా?" అని యడిగిరి. ఇది గడ్డు ప్రశ్నయే? ఇప్పుడు కవిత్వమున కేమి యవసరము వచ్చినది? నేను మాఱుపలుకక కుతూహలముతో వారిని చూచుచుంటిని. క్షణముసేపూరకుండి ఆయన నన్ను "అవు నని యేల చెప్పవు, దరిద్రుడా!" అని కోపగించుకొనిరి. మంత్రముగ్ధునివలె నేను "అవును స్వామీ!" అని యంటిని. బాబాగారించుక యాసక్తి జూపుచు "ధూర్తుడా! మొద

టనే యేలచెప్పవై తివి!" అనెను. నేను సంశయముతో "ఆర్యా! నా కాసంగతి తెలియదు. భట్టిని నన్ను కవి యనెను"

"నీవు భట్టినిని స్తుతింప గలవా?"

"స్తుతింపలేను, స్వామీ!"

"ఎందుచేత!"

నేను నిపుణికకు మాట యిచ్చితినని వారికి విన్నవించు కొంటిని.

"మంచిది! అయితే నీవు కాళికాదేవీ స్తోత్రము చేయ గలవా?"

నేను తలవంచుకొని "చేయగలను స్వామీ?" యని యంటిని. "దౌర్భాగ్యుడా! నీవు కాళికాదేవికి బలియగు చుంటివి. దేవాంగనలు నీకు హారతి పట్టి యుండిరి. ప్రమథ గణములు మంగళ వాద్యములను వాయించి యుండిరి. కాని నీవు మందభాగ్యుడవు. నీవు దేవీ పిపాసను శాంతి పరచలేవు. ఆమె యసంతృప్తి నిపుడు తొలగించుము. చూడు! దేవి యొక్క వ్యాయామ మనోహర శరీరమును వర్ణించు నాయనా!"

నాకు గత్యంతరము లేక పోయినది. కొంచెము సేపాలోచించి నే నీ విధముగ స్తుతించితిని:-

శ్లో:- బాహూ త్క్షేపసముల్లసత్కుచతటం ప్రాంతస్ఫుటత్కంచుకమ్
గంభీరోదర నాభిమండల గల త్కాంచీధృతా ర్ధాంశుకమ్ ।
పార్వత్యా మహిషాసుర వ్యతికరే వ్యాయామ రమ్యంవపుః
పర్యస్తావధి బంధబంధుర లసత్కేశోచ్చయం పాతువః॥1 *

* 1. చూ. చండీశతకము — 78

అవధూత స్వామి నన్ను మందలించుచు "నీవు పశువు వురా! దరిద్రుడా! దీనినే 'వ్యాయామ రమ్యావపు, వంధురా! ఇంకొకటి వినిపించుము" అని యాదేశించిరి. నే నింకొక శ్లోకమును వినిపించితిని:

శ్లో. చక్షుర్దిక్షు క్షిపంత్యాశ్చలితకమలినీ చారు కోశాభితామ్రమ్
భద్రం ధ్యానానుయాతం, ఘుటితవలయినో,
ముక్తబాణస్య పాణేః।
చండ్యాః సవ్యాపసవ్యం, సురరిపు షుశరాన్ ప్రేర
యంత్యా జయంతి
త్రుట్యంతః పీన భాగే స్తనవలనభరాత్ సంధయః కంచుకస్య॥*

అవధూతలు నవ్వి "నీవల్ల కాదు పో! ఇచటినుండి వెళ్లిపో" అని నుడివిరి.

2. చూ. చండీశతకము — 71

# పదునొకండవ అధ్యాయము

నా శరీరమంతయు నొక విధమగు స్మృతిలేని జడత్వముచే భారాక్రాంత మగుచుండెను. మూడహోరాత్రములు నేను తెలివి తప్పి పడియుంటిని. తెలివి వచ్చిన తర్వాత కూడ స్వప్నావశిష్టమగు మాయ నన్నావరించియే యుండెను. నేనొక మిలమిల లాడుచున్న యెడారియందు తొడిమ నుండి జారిన దూది తునకవలె దిగుచున్నట్లుంటిని. ఆ యెడారికి ఆద్యంతములు లేవు. అది యొక దిక్కునుండి మఱియొక దిక్కువఱకు పెద్ద కొండచిలువవలె కదలక మెదలక పడియుండెను. దిఙ్మండలమ్ము దానిని తాకుటకే శంకించుచుండెను. వాయు తరంగములు దానికి విక్షోభము కలిగింపజాలకుండెను. అప్పుడప్పుడు సుదూరమున నున్న ఆకాశమునందలి యొకమూల చంద్ర మండలపు క్షీణకాంతి కనబడి అచట నుండియే వికసించిన శతదళముపై వజ్రాసనాసీనురాలై, కర్పూర గౌరవర్ణములు కలిగిన ఆనంద భైరవి మెల్లమెల్లన దిగుచునట్లు గోచరించుచుండెను. ఆమె పదునెనిమిది హస్తములలో, వివిధములగు ఆయుధములు చంద్రుని పింగళ కాంతియందు తళతళ మెఱయుచుండెను. ఆమె యొడిలోనున్న రజత కలశము గైరిక వస్త్ర కాంతిచే సిందూరపు రంగును ధరించి మనోహరముగ నుండెను ఆమె మూడు కన్నుల నుండియు నమృత ప్రవాహము స్రవించుచుండ, ఆమె పగడపు చిగుళ్ళవంటి యంగుళులు నా కేశములను

సవరించుచుండెను. చిగురు టాకునుకూడ నిందించునట్టి యామె యఱచేయి నా నుదుటిని నిమురుచున్నపుడు నా జన్మాంతరము లెన్నియో తరించి పోవుచున్నట్లు తోచు చుండెను. గాలిలో తేలియాడుచున్న నన్ను మధ్యమధ్య భూమి తనవైపునకు లాగుటకు ప్రయత్నించు చుండెను. కాని దాని కా శక్తి యున్నట్లే యగుపడుటలేదు. ఏ నాదా యాకర్షణము ప్రబలమైనట్లు నాకు తోచెనో, యానాడు దిగంతము వఱకు వ్యాపించిన యా యెడారి మాయమయ్యెను. స్వప్నము భంగమయ్యెను. జడత్వ మంతరించుటచే నా కన్నులు తెరువబడెను. నా యెదుట భట్టిని కూర్చుండి యుండెను. ఆమె విశాల నేత్రములు గుంటలు పడెను. యామె ముఖము పాలిపోయెను. నిజముగ నామె యెన్నో దిన ములనుండి నిద్రపోలేదు. జాగరణముచే నెఱ్ఱబాఱిన యామె కన్నులు ధూళిలో పొరలిన పలాశకుసుమములవలెను, ఎండకు వాడిన మంతెన పూవులవలెను, గూటిలో బంధింపబడిన కాటుక పిట్టల పిల్లలవలెను చూచు వారికి ఖేదమును, బాధను గలిగించుచుండెను. ఇరుకైన చెట్ల సమూహముల నడుమనుండి వెడలివచ్చుటచే విచ్చిపోయిన మయూర పుచ్ఛములవలె, నామె కేశములస్తవ్యస్తములై యుండెను. కైలాసపర్వతపు నీలవనరాజి మధ్య ప్రవహించు స్వచ్ఛమగు గంగానదీ ధారవలె నామె సీమంతరేఖ చెదరియున్న యామె కేశములచే నాచ్ఛాదితమై యుండెను. ఎల్లప్పుడు నవగుంఠము నాశ్రయించియున్న కేశములే నా దది తొలగి పోయి యున్నందున శంకించుచున్నట్లు కనబడుచుండెను.

భట్టిని నా పాదముల వైపు కూర్చుండి నిర్నిమేష నయనములతో నా వైపునకు చూచుచుండెను. ఆమె దృష్టి యందు కారుణ్యధార తొణకు చుండెను. నేను కన్నులు తెరచినంతనే శోభా సముద్రమున తటాలున ఆటు పోటు కలిగినట్లు ఆమె రోమము లుల్లాసముచే గగుర్పాటుచెందెను.

కాని భట్టిని యిందుకు సిద్ధముగలేదు. నా కింత తర్వగా స్పృహ కలుగునని యామె యాశించి యుండ లేదు. పారిజాత పల్లవములను బోలిన యామె సుకుమార మనోహర హస్తములు శీఘ్రముగా నుత్తరీయమును వెదకుట కుద్యమించెను. ఒక నిమిషము గడువకమున్నే విద్యుల్లత చంద్రునిపై నల్లని మేఘపు టావరణమును వేసినట్లును, తామరతూడు కమలమును తామరాకుచే కప్పివేసినట్లును, విద్రుమలత తరంగములచే జలదేవతను దాచుకొన్నట్లు, భట్టిని యొక్క కపోత కర్బురమగు యంశుక మామె సీమాంతరేఖను గప్పివేసెను. ఇటుల భట్టిని కూర్చుండి యుండుటను చూచి నా ప్రాణములు పైకెగిరి పోవసాగెను. దర్శివార సంభ్రమము నన్ను ముందుకు త్రోసి, లేపుట కుద్యమించెను గాని భట్టిని నన్ను వారించెను. ఆమె స్నేహార్ద్ర నయనముల నశ్రు బిందువులు నిండి యుండెను. ఆమె వాడిన ముఖ మెఱ్ఱబారెను. ఆమె శక్తి యంతయు నన్ను లేవవలదని కాతర భావమున ప్రార్థించు చున్న ట్లుండెను. నన్ను వారించుటకై యామె తన కోమల హస్తము లచే సన్నదమి, "వలదు" అని మాత్ర మనగలిగెను. ఆమె గొంతు బొంగురు బోయి యుండెను. కన్నులయందు

భయము తాండవ మాడుచుండెను. నా హస్తములు స్వేదబిందువులచే నార్ద్రములై యుండెను. నా కింకను లేచుటకు శక్తి రాలేదు. నేను కన్నులు మూసికొని భట్టిని ప్రేమార్ద్ర వదనార విందమును ధ్యానించు చుంటిని. వాచాలురగు నీ మర్త్యలోకపు కవులందఱు నేమైరి! లక్ష్మీదేవి స్వర్గముననే యుండునా యేమి! ఈ పుడమిపై ఆమె యవతరించి యున్నదే! భట్టినిని మించి మఱి యే శోభాశాలినిని కవులు భావింప గలిగిరి? ఈమె పాణి పల్లవముల యెదుట స్వర్గలోకపు పారిజాత పల్లవముల కల్పన యెంత తుచ్ఛమైనది! ఈమె కరతలముల స్రవించు స్వేదబిందువుల కన్న భావనాలోకపు టమృత మెక్కువ శాంతిని చేకూర్ప గలదా! * అని తల పోయుచుండగా నా యాత్మ, మనస్సు ప్రాణములు నన్నియు నానంద సాగరమున మునకలు వేయుచున్నట్లనిపించెను. నా కన్నులు మూతబడియే యుండెను. ఒక్క క్షణకాలము నేను ముగ్ధుడనై యుంటిని.

ఈ మధ్య మహామాయ వచ్చి నా తలవైపున కూర్చుండి వాత్సల్యముతో నా కనుబొమల మధ్య భాగమును మెల మెల్లగ నిమురసాగెను. నా కీ మాతృవాత్సల్యపు టనుభవము స్వప్నదశయందు ఆనందభైరవి చేతులలో కలిగి యుండెను. నే నర్ధచేతనావస్థయందు పడియుంటిని. భట్టిని కన్నులలో నీటినిచూచి మహామాయ యామెను ప్రేమతో

* శ్లో॥ శ్రీరేషా పాణిరప్యస్యాః పారిజాతస్య పల్లవః
కుతో ఽన్యథా స్రవత్యస్మా త్స్వేదచ్ఛద్మామృతద్రవః ॥
చూ. రత్నావళి. 2-42

మందలించుచు, "అమ్మాయీ! మరల ఏడ్చుచుంటివా! నీవు చాల అమాయకురాలవు. నాపై నీకు విశ్వాసములేదు కదా! భట్టున కేమయ్యెనోయని నీ వింతగా నేడ్చుచుంటివా? నేడు వీనికి తప్పక తెలివివచ్చును. తల్లీ, యిది సమ్మోహపు ప్రభావము. డెబ్బది రెండు నాడులలో నుండియు, రోమ కూపములలో నుండియు, ప్రవేశించి సమ్మోహన ప్రయోగము మనస్సును వశపఱచు కొనును. నాగ కూర్మ ప్రాణముల నది యడ్డగించి, కృకరమును, నాభి కూపమునందు నాటి, దేవదత్త ధనంజయములను త్వగింద్రియమునందు అడ్డగించు కొనును. దీనివలన భయంకరమగు నలసట కలుగును. నీవు చింతింప వలదమ్మా! నేడు భట్టు యొక్క నాడు లన్నియు నెమ్మదిగ నున్నవి. కళలు మేల్కొని యున్నవి. ఇటుచూడుము, అలంబుసా పయస్వినులెంత ఆరోగ్యముగానున్నవో! ఇక త్వరలోనే అతనికి తెలివి వచ్చును. నిపుణికకు తెలివివచ్చుటకు మఱికొంత యాలస్యము కావచ్చును. 'ప్రతి ప్రసవము' యొక్క యలసట మఱింత కష్టమైనది. ఇక భయపడవుకదా! ఛీ, ఛీ! ఇట్లు భయపడవచ్చునా!"

డగ్గుత్తికతో భట్టిని "లేదమ్మా" అనెను.

మహామాయ నా నుదుటిని చేతితో నిమురుచు, "భట్టు ఏ విధమున సమ్మోహమునకు గుఱియయ్యెనో నాకు ఆశ్చర్యముగ నున్నది. ఇతని కుండలిని ప్రబుద్ధమై యున్నది. అవధూత గురువుల కృప యితనిపై పూర్ణముగ నున్నది. చూడు తల్లీ! భట్టుయొక్క మనోగమ పంచనాడు

లిప్పుడు పూర్ణముగ కుదుట బడినవి. ఇటుచూడుము, ఇది కల్పిక; దీని వలన సంకల్పము కలుగును. ఇది వికల్పిక; దీని వలన మనస్సునందు వికల్పము కలుగు చుండును. ఇది స్థీవ; దీని వలన జడత్వము వ్యాపించును. ఇది మూర్ఛన; దీనివలన మూర్ఛ కల్గును. ఇది మన్య; దీనివలన మననశక్తి లభించును. భట్టుయొక్క స్థీవ బలహీనముగ నున్నది. అది కొంత సేప టికి కుదుట బడును. కాని నిపుణిక నాడులలో నద్భుతమగు శక్తి కలదు. నేను నీ కొకమాట చెప్పుదునా తల్లీ! నిపుణి కను సామాన్యమగు స్త్రీ యని భావింప వలదు. ఆమె మహా మాయయే! సమ్మోహనము యొక్క ప్రతి ప్రసవము చాల కష్టమైనది. మొదటిసారి నేను పది క్షణములు కూడ దానిని సహింపలేక పోతిని. అబ్బబ్బ!" అని మహామాయ మఱచిన సంగతులను జ్ఞాపకము చేసుకొని తిరిగి, "అమ్మా! నేడే నేను వెళ్లవలెను. అక్షయ తృతీయ నేటికి ఇంకెంతో కాలము లేదు. నీ కిచట నే విధమగు భయమును లేదు. లోరిక దేవుడు ధర్మ చింతగల సామంతుడు. నీ కే విధమగు కష్టము కలుగదు. నేను వెళ్లనా తల్లీ!" అని యడిగెను.

భట్టిని దృఢముగా "వలదు" అని సంగ్రహముగా జవా బిచ్చెను.

మహామాయ తనలో తానేదో గొణుగు కొనుచు "అయ్యో! నేను మరల నీ మాయా పాశమున తగుల్కొను చున్నానే! తల్లీ త్రిపుర భైరవీ! నీ లీల యపారము! కాలము, నియతి, అనురాగము, విద్య, కళ ఇవి యున్నియు మాయ

నా కన్నులు మూతలుబడి యుండెను. వానిని తెరచుటకు నాకు సాహసము చాలలేదు. కాని నేను నా భావనా నేత్రములతో భట్టిని విశాల నయనములు ఆకర్ణ విస్ఫారితములగుట నే నాశ్చర్యముతో గాంచితిని. భట్టిని కొంచెము వంగి "మీరు చెప్పినది నా కర్థము కాలేదు" అని యనెను.

మహామాయ దీర్ఘమగు నిట్టూర్పు విడిచెను. కొంత సేపూరకుండి యామె "పరమశివునినుండి శివుడు, శక్తి అను రెండు తత్త్వములు వెలువడెను. శివుడు విధిరూపము. శక్తి నిషేధరూపము. ఈ రెండు తత్త్వముల ప్రస్పంద విస్పందములచే నీ జగత్తు ఆభాసించుచున్నది. పిండమునందు శివతత్త్వ ప్రాధాన్యము పురుషుడు, శక్తితత్త్వ ప్రాధాన్యము స్త్రీ. నీ వీమాంసపిండమునే స్త్రీయనియు, పురుషుడనియు భావించుచుంటివా? కాదమ్మా! జడరూపముననున్న యీ మాంసపిండము స్త్రీయును కాదు, పురుషుడును కాదు. ఆ నిషేధరూప తత్త్వమే స్త్రీ నిషేధరూప తత్త్వమను మాటను జ్ఞాపకముంచుకొనుము తన సర్వస్వమును త్యాగముచేసి యాత్మ సమర్పణము గావించు భావమెచట ప్రధానముగ నుండునో యదియే నారీతత్త్వము. సుఖదుఃఖముల సహస్ర ధారలలో తన్ను తాను పడవేసికొని ద్రాక్షవలె తన సర్వస్వమును పిండి యితరులను సంతృప్తిపఱచు భావమెచట ప్రబలముగనుండునో యదియే నారీతత్త్వము. దానినే సాంకేతిక భాషలో చెప్పబడియున్న 'శక్తితత్త్వము' అని యందురు. ఆ! నారి 'నిషేధరూప' యంటినిగదా. అది యానందభోగముల ననుభవించుటకు జన్మింపదు. ఆనందము విరివిగ పంచు

టకై జన్మించును. ఈనాటి ధర్మకర్మముల యేర్పాట్లు, సేనానిర్మాణము, రాజ్యవిస్తరణము-ఇవన్నియు విధరూపములు. అందు ఇతరులకై యాత్మనాశ మొనర్చుకొను భావము లేదు. అందువలననే యవి స్త్రీ కటాక్షమున కూలిపోవుచున్నవి. కామినీ మందహాసమున కమ్ముకు పోవుచున్నవి. అవి ఫేనబుద్బుదములవలె ననిత్యములు. ఇసుకతో కట్టబడిన కట్టలవలె అస్థిరములు. నీటిలోని గీతలవలె నశ్వరములు. వాని యందు తమ్ము తామితరులకొఱకై యర్పించు భావమెంత దనుక రాకుండునో, యంతవఱకు నవియట్లే యుండును. పూజలులేని పల్లి సేవలులేని రాత్రులు. వాని ననుతాపములుపనంతవఱకు, నిష్ఫలమగు నర్ఘ్యదానములు వానిని కలతపఱుపనంతవఱకు. వానియందు నారీభావముండుటకు వీలు లేదు. ఆ నారీభావము వానియందు రానంతవఱకు నవి యితరులకు దుఃఖము కలిగించుచునే యుండును." అని పలికి మహామాయ కొంతసేపు మౌనము వహించెను. ఆమెను భావావేశ మావహించి యుండెను కొంత విశ్రాంతి కలిగిన మీదట ఆమెకు స్థిమితము చిక్కెను. రోగి తలవైపున గూర్చుండి చాలసేపటివరకీవిధముగ మాటలాడుటచే నామెకే కొంచెము గ్లాని కలిగెను. నా కన్నులను తన వ్రేళ్ళతో తుడుచుచు ఆమె "భట్టు ఆరోగ్యముగ నున్నాడు. ఇక క్షణములో మేల్కొనును" అనెను

భట్టిని మాటలాడలేదు. నేను కన్నులు తెరచితిని ఈ నూఱు భట్టిని కుదురుపాటు చెందియుండెను. ఆమె విశాల నయనములలో మహామాయ యుపన్యాసమువలన కలిగిన

యాశ్చర్యమింకను ప్రతిబింబించుచునే యుండెను. ఆమె కన్నులు ఎగిరిపోవుటకు సిద్ధముగనున్న కాటుకపిట్ట పిల్లలవలె నాశ్చర్యముతో పైకెత్తబడిన యామె భ్రూలతలయందూగు చుండెను. మహామాయ నన్ను గుఱించి "ఎట్లున్నాడు?" అని యామెను ప్రశ్నించినపు డామె విధిలేక నా వైపునకు వంగిచూచినది. నే నారోగ్యముగ నున్నానని సంజ్ఞాపూర్వకముగ తెలియ చెప్పితిని. ఇంకను మాటలాడుటకు వలసినంత శక్తి నాలో లేకుండెను. భట్టిని మహామాయ సంభాషణ వలన, నేను లోరికదేవుడను పేరుగల ఆభీర సామంతు నింటనే యున్నాననియు, నిపుణిక కూడనిచ్చటనే శయ్యాగతయై పడియున్నదనియు నాకు తెలియవచ్చెను. అందువలన కడప్రయాసతో నేను, "నిపుణిక యెట్లున్న"దని ప్రశ్నించితిని. నన్నుమాటలాడవలదని మహామాయ వారించుచు "బాగుగనే యున్నది" అని జవాబు చెప్పెను.

మూడు నాళ్ళకు నేను పూర్ణముగ స్వస్థుడనైతిని. ఆభీర సామంతుడు మమ్ములను ఘృతక్షీరమునందు ముంచి వేసెను. అతిథి సత్కారము నందింతటి ఆసక్తిని ఇది వఱకు నే నెచటను చూచి యుండలేదు. ఈ మధ్య మహామాయ వింధ్యాచల మధ్య ప్రదేశమున నున్న యేదో యొక శక్తి పీఠమునకు పోయి యుండెను. నిపుణికకు తెలివి వచ్చెను. కాని యామె చాల బలహీనముగ నుండెను. భట్టిని ముఖము నందామె సహజమగు తేజస్సు విరాజిల్లు చుండెను. విగ్రహవర్మ తన సైనికులతో వజ్రతీర్థము వద్దనే తన నావల నాపి నిలిచి యుండెను. ఆయన ప్రతి దినము మా యొద్దకువచ్చి

మా యోగ క్షేమముల నరయు చుండెను. మొత్తము మీద నేను కూడ సుఖముగనే యుంటిని. నిపుణికకు స్వస్థత చేకూరిన పిమ్మట మగధకు శీఘ్రముగ బయలు దేర వలయు నని నే నభిలషించితిని. కాని అంతలో నొక సంఘటన జరుగుటచే నా యభిలాష నెరవేరలేదు.

నేను భద్రేశ్వర దుర్గపు పడమటి గోడపై నిలబడి సూర్యాస్తమయ శోభను తిలకించు చుంటిని. సూర్యుడు తన కిరణ జాలమును తన వైపునకు ముడుచు కొనుచుండెను. దివాలక్ష్మి ఆకాశపు పడమటి దిక్కునుండి క్రిందికి దిగిపోవు చున్నట్లును ఆమె ద్రుతగతిని వెడలుచున్నపుడు ఆమె పద్మరాగమణి నూపురము జారి వెనుకకు పడినట్లు నగపడుచుండెను. సూర్యుడు దినమంతయు తన కిరణములచే సంగ్రహించిన పద్మపరాగ మంతయు తటాలున జారిపోయి యాకాశ మంతయు పద్మరాగ రంజితమైనట్లు కానవచ్చెను. క్రమ క్రమముగ పశ్చిమ దిగ్వధువు కర్ణము నలంకరించుచున్న రక్తోత్పలమువంటి మనోహరమగు సూర్యబింబము మునిగి పోయెను. గగనసరోవరమున సంధ్యారూపిణియగు పద్మిని వికసించెను. నల్లని అగరుచే రచింపబడిన మకరికా పత్రము వలె తిమిరము దిఙ్ముఖముల వ్యాపింపదొడగి సంజకెంజాయలను, భ్రమరములచే పరివేష్టింపబడిన నీలోత్పలములను ముట్టని కమలములతో నిండిన సరోవరము నాచ్ఛాదించినట్లగపడుచుండెను. మెలమెల్లగ నిశాసుందరి యువతింప పల్లవము వలె శోభిల్లుచుండు సాంధ్యరాగము లోపింపసాగెను. పాపురములు భవనముల పైభాగములనున్న తమగూళ్ళకు తిరిగి

వచ్చుచుండి భవనలక్ష్మి నిశావిహారమునకై వెడలుచు, తన చెవులయందు నీలకమలమును ధరించినదా యన్నట్లుండెను నీరుతెచ్చు యువతుల సంచారమాగిపోయి, వారి నూపుర ఝుంకారములతోపాటు దిగుడుభావులయందుండు సారసపక్షుల క్రేంకారములు గూడ శాంతించియుండెను. ఏనుగులు నిద్రచే తూలుచుండుటవలన వానిగండస్థలములనుండి మదజలము స్రవించుట నిలిచిపోయెను. వాయుమండలమంతయు కొంచెము తేలికగానుండ యెండచే దినమంతయు నలసిపోయిన పిల్లవాయువులు మెల్లమెల్లన వీచుచు అలసటను పోగొట్టుచుండెను. నే నచటనుండి వెడలిపోదలచుకొన్న సమయమున అభీరసైనికుడొకడు నా ఎదుట నిలబడి నమస్కరించెను. నేను వాని నాశీర్వదించి "ఏమి సమాచారము భద్రా?" అని యడిగితిని. సైనికుడత్యంత భయముతో క్షమాపణ వేడుకొనుచు, "అపరాధమును మన్నింతురుగాక! బ్రాహ్మణుని యానతి మైనందున తమకు శ్రమ కలిగించుచున్నాను." అని చెప్పి నాచేత నొకపత్రముపుంచి నమస్కరించి వెడలిపోయెను. అప్పటికి నలుదెసల గాఢాంధకారము వ్యాపించి యుండుటచే ఆజాబు నచట చదువుటకు వీలు కాలేదు. కాని సైనికుడాజాబు నొసగిన చందమును చూచి, జాబును వెంటనే చదువవలెనను కుతుహలము నన్ను విహ్వలుని గావించెను.

నేను నా నివాసమునకు తిరిగి రాగానే భట్టిని నా కొఱకై కడు నౌత్సుక్యమున వేచి యుండుట గాంచితిని. నన్నామె మృదు స్వరమున మందలించుచు, "ఇంత అల

స్యము చేయుట మంచిదికాదు" అనెను. ఆమె కన్నులు వాలిపోయి, యధరములు కుంచితములై. చిబుకము • బరువుతో నిండి నల్లబడెను. నిజముగ నేనాలస్యముగ వచ్చినందుకు భట్టినికి తత్తరపాటు కలిగెను. సహజమైన యాభిజాత్య గౌరవముచే ఆ కోపము మఱింత యుబికి యుండెను. ఆమె వాక్కున శాసనపు టోజము, అధికార స్వరము, స్నేహమార్దవము సమ్మిశ్రములై యుండెను. నేను సంభ్రమముతో "కోట యందే యుంటి"నని ప్రత్యుత్తర మొసగితిని. ఒక్కక్షణ కాలము నేను చింతిల్లితిని కూడ ! ఇదంతయు నేను సహింప గలనా ? యని యను కొంటిని. కాని జాబును చదువ వలయునని కుతూహల మెక్కువగ నుండెను. అందుచే నేను తిన్నగ నా శయనాగారము లోనికి వెళ్ళితిని. అచట నొక దీపమువద్ద కూర్చుండి నేను జాబు చదువ దొడగితిని. ఆ లేఖ అపరిశుద్ధమగు సంస్కృతమున వ్రాయబడి యుండెను. ఎవడో తెలియని వాడు మూలము నుండి ప్రతిలిపి వ్రాసి యుండవచ్చును. కాని యా లేఖయందలి భావము నవగాహన చేసికొనుటలో నా కెట్టి యిబ్బందియు లేకుండెను. లేఖ యందలి ప్రతి పంక్తియు నా రక్తము నుదుకెత్తింప సాగెను. నా రక్త నాళములలో నొక విచిత్రమగు చైతన్యము కలుగ సాగెను. మరల మూర్ఛపోయి శయ్యాగతుడనగుదునాయను సంశయము కూడ కలుగసాగెను. నే నా లేఖనెన్నియో మారులు చదివితిని. ఒక జాము వఱకు నేను స్థిమిత పడలేక పోతిని. ఆ లేఖ యందీ విధముగ వ్రాయబడి యుండెను ;

"స్వస్తి. పురుషపుర నివాసి, సామవేద కౌథుమీ శాఖాధ్యాయి, జైమిని గోత్రజుఁడునగు కన్యాకుబ్జ భర్వశర్మ ఆర్యావర్తము నందున్న యెల్లరకు బ్రాహ్మణుల పరముగను, శ్రమణుల పరముగను దేవాలయ విహారముల పరముగను, స్త్రీ బాలకుల పరముగను ఈ విధముగ నివేదించు కొను చున్నాడు :

"అన్నలారా! మరల సరిహద్దు దస్యులు వచ్చు చున్నారు. దేవతలుకూడ నే యార్యభూమియందు నివసింప గోరుచుందురో అట్టి పవిత్రమగు నార్యభూమిలో నున్న భవనము లన్నియు భస్మీభూతములు కానున్నవి. దినసావ సాన సమయమున చెలరేగు ప్రచండ ఝంఝా మారుత ముచే ఛిన్నాభిన్నములగు మేఘ పంక్తివోలె భవనము లన్నియు శ్రీహీనములు కాగలవు. శంఖములయు, గంటలయు నినాదములచే ప్రతిధ్వనించు రాజ మార్గము లన్నియు నక్కల భయంకరమగు కూతలచే భీతి గొల్పు చుండగలవు. అంతఃపుర విలాస పుష్కరిణులు అడవి దున్నలు పొరలాడుట వలన మురికి కాగలవు. బంగారపు టూచలపై విహరించు క్రీడా మయూర పింఛములు దావా గ్నిచే మరల మాడిపోగలవు. దేవాలయము యు, విహారము లయు మెట్లపై మరల నడవి తోడేళ్ల పరువులు సాగగలవు. సస్యశ్యామలమగు ఆర్య భూమి మరల రక్తము చేతను, బూడిద చేతను నిండి భయంకరము కాగలదు! అన్నలారా, సరిహద్దు దస్యులు వచ్చుచున్నారు!

"ఇంత కాలము ఈ దస్యులు నెవరు ఆపగలిగిరి ? విషమ సమర విజయుడు, వాహ్లీక విమర్దనుడు, ప్రత్యంత బాడవుడు, అజ్ఞాత ప్రతిస్పర్థి, దేవపుత్రుడునగు తువర మిళిందుడే ! దేవాలయ విహారముల రక్షకుడు, స్త్రీ బాలకుల మాన ప్రాణ రక్షకుడు, బ్రాహ్మణ శ్రమణుల కాశ్రయ దాతయు నగు దేవపుత్రు డీ నాడు విషమమగు శోక సాగరమున మునిగి యున్నాడు. అతని ప్రాణాధిక యగు పుత్రికను దస్యులపహరించి యజ్ఞాత స్థలమునకు గొంపోయి యున్నారు. నేడు దేవపుత్రుడు మంత్రౌషధులచే నవరుద్ధ వీర్యమగు కాల సర్పము వోలె తన విషమున తానే మాడిపోవు చున్నాడు. అతనిని శోక సాగరము నుండి యుద్ధరింపగల సమర్థు లెవరు? సరిహద్దు దస్యులను నిర్మూలించుటకు నిమిత్త మాత్రు డెవడు కా గలడు ? సోదరులారా ! దస్యులు మరల దాడి చేయు నున్నారు. జాగ్రత్త !

"దేవపుత్రుని ప్రాణాధికయగు పుత్రిక జాడ తెలుపు వారెవరైన నున్నారా ? సోదరులారా ! ఆమె జాడ నరయుటకు ప్రయత్నింపుడు. జీర్ణ శకటపు టడుగు భాగము వలె దేవపుత్రుని విశాలసేనా సమ్మర్దముచే భువన మండల మంతయు మఱి యొకమారు ధూళి ధూసరిత మగుగాక ! పర్వత మార్గములందు దౌడు తీయుచున్న యశ్వముల గిట్టల యొరపిడిచే కొండ గుహాలన్నియు ఒంటెల జూలు వలె కపిశ వర్ణము లగు గాక ! మదపు టేనుగుల వాహిని ప్రత్యంత దేశమును, నల్లని మదజలము స్రవించుటచే నల్లబడిన కంబళి మృగపు రోమములవలె, నల్లబఱచు గాక ! మహీతల

మంతయు నశ్వమయముగను, దిఙ్మండల మంతయు గజ మయముగను, అంతరిక్ష మంతయు నాతపత్ర మయముగను అంబరతల మంతయు ధ్వజమంతయు వనమయముగను, వాయు మండలో మదగంధ మయముగను, త్రిభువన మంతయు జయ ధ్వని మయముగను అగుగాక! సోదరులారా! ప్రత్యంత దస్యులు మరల వచ్చుచున్నారు. జాగ్రత్త!

"నే డార్యావర్తమును దస్యుల కరాల దంష్ట్రముల నుండి తప్పింపగల సమర్థు డెవడు! ఎవని ధనుష్టంకారము యౌధేయుల దర్పము నణచి, మ్లేచ్ఛుల గర్వము నణగ ద్రొక్కెనో, దేవాలయములు, మఠములను విధ్వంస మొన ర్చిన వారి ప్రాణముల నెవడు హరించునో యట్టి స్కందుని యపరావ తారుడగు సముద్ర గుప్తుడు నేడు లేడు కదా! ఎవడు చతు స్సముద్రములను తన కీర్తి సౌరభములచే సుగంధ మయములుగ నొనర్చెనో, యెవ్వని హుంకార మాత్రమున ప్రత్యంత దేశపు సామంతులు గత్యాంతరము లేక తల లొగ్గవలసి వచ్చుచుండెనో, విద్యలకు, కళలకు నాధారముగ నెవడుండెనో, స్త్రీ బాలకుల కభయము నొసగెనో, దేవాలయములకును బౌద్ధ విహారములకు నెవడాశ్రయ మొసగుచుండెనో, యట్టి నృసింహ పరాక్రమ చంద్రగుప్తుడు నేడు లేడు కదా! శత్రువులకు యముని వలెను, దీనులకు కల్పవృక్షమువలె నుండిన ప్రచండ పరాక్రమ మౌఖరీ వంశ నిగుడగు గ్రహవర్మ కూడ నేడు లేడు కదా! మిడుతల దండుకంటె నెక్కువై, తోడేళ్ళ కంటె క్రూరమై, గ్రద్దల కంటె నీచమై, నక్కలకంటె హేయమై, తొండల కంటె

బహు రూపములను దాల్చి హూణ దస్యుల నుండి యీ పవిత్ర భారతావనిని రక్షింపగల సమర్థు లెవ్వరు? దేవ పుత్రుడగు తువరమిళిందు డొక్కడే! అతడే ఈ కార్య భారమును వహింప గలడు. సోదరులారా! సరిహద్దు దస్యులు మరల దాడి వెడలు చున్నారు జాగ్రత్త!

"అజ్ఞాత ప్రతిస్పర్థి, భయంకర ప్రతాపశాలి దేవ పుత్రుడగు తువర మిళిందునికి జయమగుగాక! ఈ యార్య భూమికి జయమగుగాక! సోదరులారా, దేవపుత్రుని, నయన తారయు అతని ప్రాణాధికయునగు పుత్రికను వెదకుడు. ఇది యొకటే మనలను రక్షించు నుపాయము. బ్రాహ్మణ శ్రమ ణుల పరముగ, దేవాలయ విహారముల పరముగ, స్త్రీ బాల కుల పరముగ, విద్వాంసులు తపస్వులు మున్నగువారి పరము గను నే నీదేశపు ప్రజలను ప్రార్థించుచున్నాను. సోదరు లారా! సరిహద్దు దస్యులు మరల దాడివెడలు చున్నారు. జాగ్రత!

"నే నెనుబది సంవత్సరముల వయసుమీరిన వృద్ధు డను. సామవేదాధ్యాయియగు కన్యాకుబ్జ బ్రాహ్మణుడను. మౌఖరీవంశస్థుల గురువును. ఈలేఖను చదివిన ప్రతియొకడు దీని పదిప్రతులు వ్రాసి యితరులకు పంచవలెనని నాయాన నిడి చెప్పుచున్నాను. దేవపుత్రుని ప్రాణాధికయగు పుత్రిక దొరకినంతవఱకు నీ క్రమము జరుగుచుండవలసినదే! శుభమస్తు"

ఈలేఖ నన్నోసార్లు జదివిన తర్వాతకూడ నా యావేశము శాంతించలేదు. ఈ విషయమున నే నెవరితో నాలోచింతును. భట్టినికీ విషయము తెలుపగూడదు. నిపుణిక చాల బలహీనముగ నున్నది. అయ్యో! ఇట్టి సమయమున బాణుడొంటరిగ నున్నాడే! నే నెగురగలిగి యుండినచో వెంటనే దేవపుత్రుని చెంతకరిగి అతనికీ సమాచారమంద జేసి యుందును కాని నేనెగిరి పోజాలను కదా! ఆ లేఖను గుఱించిన విషయమై నే నాలోచనా నిమగ్నుడనై యుండునప్పుడు నాకు భట్టిని కంఠస్వరము వినబడెను. ఆమె చాలసేపటినుండి నేను పడుచున్న యవస్థ చూచుచుండెను కాబోలు. ఆమె ముఖముపై సహజమగు భావముల ప్రకటమగుచుండ నామె శరీరము నొక యపూర్వమగు మధుర భావ మావరించి యున్నట్లు తోచెను. సీమంతముపై విరాజిల్లుచుండిన యువకుంసముత పవడముల యొఱ్ఱదనమువంటి నఖజ్యోతులచే నలంకృత మొనర్చుచు నామె దానిని మఱింత ముందుకు లాగికొని యాజ్ఞాపించు స్వరమున "భట్టూ, లేఖను జదువుట చాలింపుము. ప్రసాదము గ్రహించు వేళయైనది." అని యనెను. ప్రసాద గ్రహణమనగా భోజనము. భట్టిని నన్నొకమాఱుకూడ మహావరాహుని విగ్రహము విషయమై యడుగనేలేదు. నే నా ప్రతిమను గంగానదీ ప్రవాహమందు విడచిపెట్టి యుందునని యామె యనుకొనెను. దానినిగురించి యామెకెంత దుఃఖము కలిగియుండునో నేను లెస్సగ నూహింపగలను. కుసుమకోమలమగు నీ శరీరమున నెంతటి

గంభీరమగు హృదయము కలదు! ఈ చిన్న శరీరమునందెట్టి కాలీన తేజము విరాజిల్లుచున్నది! ఇంత చిన్న వయస్సుననే యెంతటి లోకానుభవ మిమిడి యున్నది! ఆ ప్రతిమను గుఱించి నన్నడిగిన నాకు మనః క్లేశము కలుగునని భట్టినికి భయము. అందువలన నామె నన్ని విషయమును గుఱించి యడుగనేలేదు. కాని మహావరాహుని పూజ యొకనాడైనను ఆగలేదు. "జలౌఘ మగ్నా సచరాచరాధరా"ధరుని మోహన స్తవమొకనాడైనను నిలిచిపోలేదు. మహాప్రసాద గ్రహణభాగ్యమున కొకనాడును అంతరాయము కలుగలేదు. భట్టిని పిలుపువిని "ఇదిగో ఇప్పుడే వచ్చుచున్నా"నని నేను సవినయముగ చెప్పితిని.

భట్టిని వెనుకకు మఱలి వెళ్ళుచు తటాలున నావైపునకు తిరిగెను. ఈమాఱు ఆమె యించుక నవ్వుటకు ప్రయత్నించెను. వందలకొలది దీపములచే ప్రకాశించుచున్నట్లొక పవిత్ర ప్రకాశ పుంజముచే గృహమంతయు ధగధగ మెఱయను జొచ్చెను. ఎన్నోనాళ్ల తర్వాత ఈనాడు భట్టిని ముఖముపై మందహాసము కనబడెను. ఉద్విగ్నమై వ్యాకుల పడుచున్న నా మనసునకీ మందహాసము శాంతిని చేకూర్చెను. సంభ్రమోత్సాహములతో నేను "దేవీ! యేమి యాజ్ఞ!"యని అనవసరముగ నడిగితిని. భట్టిని మఱింత ప్రసన్నవదనయై "ఈ లేఖను గుఱించి ఇంత ఆవేశపడుచుంటి వేల, భట్టా!" అని యడిగెను. నా మనస్సు తెలియరాని భయముచే నిండిపోయెను. భట్టిని ఈ లేఖను చదువుకొనినదా యేమి! అని తలపోసికొనుచు నేను సందేహముగ "దేవీ, లేఖలోని విష

యము విచారకరమైనదే! కాని నా యపరాధము తమరు మన్నించినచో ఈ లేఖలోని విషయమును మాత్రము తమ నుండి దాచుట కనుజ్ఞ వేడుచున్నాను" అని యంటిని. భట్టిని నా మనోభావములను గుఱించి యాసక్తిచూపుచు "చాల రహస్యమైన విషయమా?" అని కిలకిలమని నవ్వెను. భట్టిని వినోదమును నేను సహింపగలను. కాని నా మన స్సెంత యారాటపడుచుండెనో భట్టినికేమి యెరుక? నేను "అవును దేవీ! కొన్ని దినములవఱకీ విషయము మీకు తెలియకుండ నుండుటయే శ్రేయస్కరమని భావించు చున్నాను." అని గంభీరముగ పలికితిని. కాని భట్టిని నిర్దయు రాలివలె నా ప్రసంగము నంతటితో నాపక "నేను విఘ్నముగ నగుదుననియేనా?" అని ప్రశ్నించెను. నేను నిశ్చేష్టుడనై యుంటిని.

కొంతసేపటివఱకు భట్టిని మృదుమందస్మితము నా వివశత్వమును ద్విగుణీకృతము గావించుచుండెను. తర్వాత ఆమె "అభీర సామంతుని రాణి నాకుగూడ నీ లేఖ ప్రతి నొకదానిని పంపినది. నేను దానిని చదివితిని. దీనినిగుఱించి యింతగా నాఱాటపడవలసిన దేమున్నది?" అని సహజముగ పలికెను. నే నాశ్చర్యసాగరమున మునిగిపోతిని. చాల సేపటివఱకు నేను నిరుత్తరుడనై భట్టిని వినోదప్రఫుల్లమగు ముఖశ్రీని చూచుచుంటిని. తర్వాత నేను "దేవీ, మీరు ధన్యులు! దేవపుత్రునికి తగిన కన్యారత్నము మీరు. మీరు తప్ప మఱెవ్వరింత నిబ్బరముతో నుండగలరు? సముద్రము నుండియేకదా కౌస్తుభమణి పుట్టగలదు! ధరిత్రియే సీతను

తన గర్భమున ధరింప గలదు. హిమాలయము నుండియే పార్వతీదేవీ పుట్టుక సంభవము! విష్ణు చరణము నుండియే గంగ యుద్భవింప గలదు! బ్రహ్మ నుండి యే త్రయీ వేదములు ప్రాదుర్భవింప గలవు. ఇట్టి సమయమున మానసికోద్వేగముల నణచి పెట్టుకొనుట దేవపుత్రుని కుమార్తెకే చెల్లును. దేవీ ఆశ్వాసితుడ నైతిని. ఆర్యావర్త మీ నాడు కృతార్థత నొందగలదు. దేవాలయములును బౌద్ధ విహారములు నింక సురక్షితముగ నుండ గలవు. బ్రాహ్మణ శ్రమణుల కింక నెట్టి యాటంకములును కలుగవు. యువతులు బాలకులు నిక నిశ్చింతగ నుండగలరు ఈనాడు ధరిత్రి ప్రసన్నతను చెందినది. దిక్కులు నిర్మలము లైనవి. వాయువు శుచి నొందినది. సీమాంత సముద్రమున మఱి యొకమారు బడబానలము ప్రజ్వరిల్ల గలదు. దేవపుత్రుని బాహువు లనెడి యగ్ని శిఖలయందు మఱి యొకమారు పాపులగు దస్యు లాహుతి కాగలరు. దేవీ! నేను ధన్యుడ నైతిని" అని యంటిని.

భట్టిని యవిచలితమగు చిత్తముతో నేను చేయుచున్న స్తుతిని వినుచుండెను. ఆమె యందొక దివ్యజ్యోతి ప్రత్యక్షముగ కనబడు చుండెను. పార్వతియే తన భక్తుని స్తుతిని వినవలె ననెడి యాశచే నిలిచి యున్నట్లు నాకు దృగ్గోచరమగు చుండెను. నేను మఱింత భక్తి శ్రద్ధలతో నింకను చెప్ప నుద్యమించుచుండ భట్టిని వనదలించుచు "భట్టూ! బాలకునివలె ఏమిటీ చంచలత్వము! నేను దేవతను కాను గదా! నే నొక సాధారణమగు మహిళను. అస్థి మాంసములచే

నిర్మితనగు స్త్రీవే! నేను విఘ్న స్వరూపిణిని. నే నా రూపమున నుండుటయే విశ్వపరిత్రాణమునకు సాధనము నీవే నాకీ జ్ఞానమును కలిగించి నీవే దానిని మఱచుటకై నన్నుత్సాహపఱచు చున్నావా? నేను చంద్ర దీధితిని. వందలాది కన్యలలో నే నొక సాధారణమగు కన్యను! నేను నీ భట్టినిని......!" అని యనుచు తటాలున నామె యాగి పోయెను. ఇంకను మాటలాడ వలెనని యామె యభిలషించెను; కాని మాటాడ లేక పోయెను. గద్గద స్వరమున నామె తుది పలుకులు పలుకుచు "నేను దేవతను గాను. ప్రసాదమును గ్రహించుటకు వేళయయినది రమ్ము" అనెను.

భట్టిని వెడలి పోయెను. నాపై నేను విసుగు కొనుచు నే నామె ననుసరించి వెళ్ళితిని; నాలో నేను "నేను దేవతను గానని మీరన వచ్చును కాని మీ దర్శనము లభించిన నాటినుండి నా హృదయము తనను తాను విశ్వాసము గలిగించుకొని మీ సేవకై నియోగింపబడ నభిలషించుచున్నది. నా యస్తిత్వ మంతయు పండిపోయిన యెఱ్ఱని దానిమ్మపండు వలె మీ కొఱకై జారి పడిపోవ సిద్ధగించు చున్నది. నా వగ్ధార యంతయు సముద్రమువలె నుప్పొంగి, మీశక్తి నంతయు నందు ముంచివేయ కుతూహల పడుచున్నది. ఇది బాలకుని చాంచల్యమా? నే నకించనుడను; పదభ్రష్టుడను; సాధన విహీనుడను; మీ సేవ చేయుటకు నా కడ నేమి కలదు? మీరు నిశ్చయముగ దేవతలే! వందసార్లు మీరు నా మాట కాదన్నను మీరు మాత్రము దేవతలే! ఈ కలుష పంకిల సంసార సాగరమున

వికసించిన్న పద్మిని వంటివారు! ధూళీధూసర వన ప్రాంతము నందలి మాధవీ లత వంటివారు. ఆర్యావర్తము నీనాడు సర్వ నాశనము నుండి సంరక్షించుటకు వందలాది సామాన్య కన్యలు సమర్థులు కాజాలరు. మీరందురు సమర్థులు" అని తల వూయుచుంటిని. నా మనః క్షోభము నా ముఖముపై తప్పక ప్రతి బింబితమై యుండవచ్చును. ఏల యన భట్టిని నా ముఖము నైపున కెన్నో మార్లు చూచినది. ప్రసాదము నిచ్చుచు నా మెః మురిపెముతో, "భట్టూ! నా మాటల నపార్థము చేసికొన్నావా?" అని ప్రశ్నించెను. జాలిగొల్పు భావమున నే నామెను చూచితిని. నేడు భట్టిని చిత్తమొకింత ప్రసన్నముగ నుండెను. ఆమె మనసు నూతన మగు నుత్సాహముతో నిండి యుండెను. ఇట్టి తఱి నామె మనసునకు బాధ కలిగించుట యపరాధము. కాని భట్టిని నా ప్రత్యుత్తరము నాశింపకయే "నే నన్న మాటలకు కించ పడ నవసరము. నేను దేవతనని తలచుటచే నీ కానందము కలుగు చున్నచో అట్లుండనే కానిమ్ము. దేవత వర ప్రసాద మును స్వీకరించుము" అని నా కంచముతో తాను స్వయముగా చేసిన మిఠాయిని ఉంచెను. నేను నవ్వితిని. భట్టిని ముఖముపై చిఱు నగవు నాట్య మాడెను.

స్థానేశ్వరమునకు వెడలుట నిశ్చయముకాగానే నేను కడసారి భట్టిని సెలవు గైకొందమని యనుకొంటిని. అప్పటికి సూర్యుడస్తమింపనుండెను. పశ్చిమ సముద్రతీరమున పవడపు

# పంద్రెండవ అధ్యాయము

భద్రేశ్వరము స్వస్తికాకారమగు దుర్గము. లోపల దేవుని, రాజభవన మింద్రు నట్టనడుమ నున్నది. మే ముండుట కేర్పఱచిన స్థలము తూర్పు ద్వారము నానుకొని యుండెను. అచటి నుండి యగడ్త వఱకు తాబేటి మూపు వంటి ఎత్తైన రాజమార్గము గలదు. ఆ రాచబాట కొంత వఱకు ముందుకు సాగి వంకరగ కోటలో చుట్టుకొని పోయి యుండెను. రాజ మార్గమున నిరుప్రక్కల సంపన్నులగు పుర జనుల పెద్దపెద్దభవనము లుండెను. రాత్రులందీ భవనముల కిటికీల నుండి క్షీణమగు దీపకాంతులు వెలుపలికి కనబడు చుండెను. రాచ బాట యంతయు గొప్ప కొండ చిలువ వలె కదలక మెదలక పడియుండెను భట్టిని వలన ప్ర మను పొంది నేను వెలుపలికి వచ్చి చిన్న పీఠముపై కూర్చుండి తూర్పు దిక్కునకు పోవు రాజ మార్గమును చూచుచుంటిని ఆకాశ మొక వికసించిన కమల సరోవరము వలె నగపడు చుండెను. నిశ్శబ్దముగ నున్న నిశీథమున నీ నగర దర్గ మత్యంత మనోహరముగ నగపడు చుండెను. భర్వశర్మ లేఖ నా మనస్సున దు మెదలుచునే యుండెను. భట్టిని ప్రసన్న ముఖార విందమును గాంచి నే నేనూఱట జెంది యుండినను, నా కర్తవ్య భారమింకను తగ్గియుండ లేదు. ఈ విషయమున నిపుణిక సహాయ పడ గలదని నాకు నమ్మక ముండెను. నిపుణికతో నే నేజంకు లేక మాటలాడ గలను. కాని భట్టిని యెదుట సమ్మోహనము నొందించు

జడత్వము ననుసరించు చుండును. అందుచే నుదయమున నే నిపుణికతో ఈ విషయమై యాలోచింప దలచుకొంటిని. ఏలయన ఆమె భట్టినిని నా కంటె నెక్కువగ నెఱుగును. నే నింకను భట్టినిని సరిగ నర్థము చేసికొన లేదని యనుకొను చుంటిని.

క్రమక్రమముగ ప్రాచీగగనమందు చంద్రు డుద యించుచుండెను. భువనమండల మంతయు ప్రథమమున సిందూరరాగముచే నెఱ్ఱబడి తరువాత ధవళచందన రస ధారచే నాప్లావిత మొనర్పబడినదా యన్నట్లు తెల్లబడెను. భవనముల పై కప్పుయొద్ద నుండు గూళ్ళలోని పావురము లలో గూడ కొంచెము సంచలనము కలిగెను. వాని బూడిద రంగు రెక్క లుండియుండి పటపట మని శబ్దము చేయుచు తమ రెక్కలచప్పుడుచే నంధకారమును విదలించి వేయుచున్నవా యన్నట్లుండెను. గబ్బిలములు నీడ నాపై అప్పుడప్పుడు పడి పోవుచుండెను. వానిని చూచి, అంధకారమనెడి సేనాధిపతి సైనికు లొకరిద్దరు సమయముచూచి తప్పించుకొని పాఱి పోవ ప్రయత్నించుచున్నారా యని తోచుచుండెను. దిశ లన్నియు శాంతములై, మనోహరములై యొప్పుచుండెను. చంద్రుని స్నిగ్ధచంద్రికలందు జలకమాడుచు భద్రేశ్వర దుర్గము మఱింత అందముగ గన్పట్టుచుండెను. కర్పూర ధవళమగు దేహకాంతిగల మహాదేవుని జటాజూటమునుండి గంగ నది శతశతధారల హిమాద్రిపై బడినపుడా శోభ యీ విధముగనే యుండి యుండవచ్చునని నే ననుకొంటిని. భద్రేశ్వర పట్టణపు సౌధశిఖరమువలె నాడుకూడ ఆకాశమును

తాకుచుండు హిమాద్రి శిఖరము లచంచలములై తమ తమ స్థానముల నిలిచియుండి యుండవచ్చును. ఈ దుర్గమునందుండు భవనముల గవాక్షములనుండి ప్రకాశించు దీపముల వలె నాడు నిరంతరము ప్రకాశించుచుండు హిమాలయ పర్వతపు ఓషధీమణులు లాచంద్రకాంతులయందు ప్రకాశించుచుండి యుండవచ్చును. ఈ దుర్గహర్మ్యములందలి పరదాలెట్లు నేడు ముడుచుకొనిపోయి యున్నవో నాడు భువనమేఖలమును చుట్టుకొనియుండు మేఘములు కుంచితములై యుండి యుండవచ్చును. ఈ దుర్గమునందలి నారీమణు లే విధముగ శీతలమంద సుగంధ పవనముల నానందించుచున్నారో, నాడు కొండ గుహలయందు శయనించు సిద్ధుల భార్యలు మందాకినీ ప్రవాహపు నీటితుంపరలచే తడిసిన పిల్లవాయువుల నా విధముగనే యలసభావమున నానందించుచుండి యుండవచ్చునని నే ననుకొంటిని.

నాటి రాత్రి నాకు నిదురపట్టలేదు. నేను భట్టినిని సరిగా నర్థము చేసికొనలేకున్నాను. చిన్న రాజుగారి విశాలమగు నంతఃపురమున బంధింపబడి చిక్కి పాలిపోయియున్న భట్టిని సుందర ముఖారవిందమును నేను జూచియుంటిని. చండికాలయమున కృష్ణవర్ధన రాజకుమారుల యాశ్రయమును స్వీకరించుటకు తిరస్కరించిన తర్వాత బాణముచే గాయపడిన లేడివంటి కరుణారసభరితమైన యామె ముఖము మఱచిపోదమన్నను నాకు మఱపునకు రాకున్నది. గంగానదీ ప్రవాహముపై ప్రయాణము చేయుచున్నపుడు తనను దస్యులపహరించిన వృత్తాంతమును తెల్పుచు నిరాశచెందిన

యాడుసింహమును బోలి స్ఫులింగములను వర్షించుచుండిన యామె కన్నులు నామనఃపటమును చీల్చుకొనిపోయెను. కడపటిసారి గంగానదినుండి వెలుపలికి తీయబడిన తర్వాత కాంతిహీనమైన యామె మనోహరశోభ, నామనఃపటముపై చిత్రితమై మహావరాహుని దంష్ట్రములపై నాసీనురాలైన భూదేవి గాంభీర్యమును, ఓర్పును తలదన్నుచున్నట్లుండెను. కాని నేనీనాడు చూచిన భట్టిని స్వరూపము వీని యన్నిటి కంటె భిన్నముగ నున్నది. నేని స్వరూపముల నన్నిటిని కలుపుచున్న సూత్రమును వెదకుటకై యత్నించుచున్నను నాకది లభింపలేదు. కొన్ని దినములనుండి నా బుద్ధియే లోపించినట్లును, నా కార్యశక్తి క్షీణించినట్లును నా వాగ్ధార యింకిపోయినట్లును నాకు తోచుచున్నది. నేనయాయకుడ నగు బ్రాహ్మణవటువునుగాను ప్రపంచములోని హెచ్చుతగ్గు లను చూచినవాడనే. ప్రపంచము దేనిని కర్తవ్యమనియు దేనిని అకర్తవ్యమనియు నేర్పఱచుకొన్నదో దానిని నేను అంగీకరింపకున్నను లోకమర్యాద తెలియనివాడనుగాను. అయినను నా చిత్తము జడమగుచు, బుద్ధి పరవశతనొందుచు, వెదడు శూన్యమగుచున్నట్లు స్ఫురించుచున్నది. నా చిత్తి మును జడమొనర్చి నా బుద్ధిని మోహగ్రస్త మొనర్చుచున్న యీ మనోవికార మెట్టిది! దీనికి ప్రత్యుత్తరము లభ్య మగుట నాకు కష్టమగుచున్నది. నేనే నెడోక సమస్యగా రూపొందుచుంటిని.

ఒక విషయము మాత్రము స్పష్టము భట్టిని నిపుణికల వెంటనుండుటచే నాలో గొప్ప మార్పు కలిగినది, నేను

వారిని రక్షించుటకై వారివెంట నుంటిననుట పేరునకు మాత్రమే. కాని నేనే వారికి పరమాశ్రితుడనై యున్నాను. నే నీ స్థితినుండి తప్పుకొనవలసి యున్నది.. నేటి నా పరాధీనత యపూర్వమైనది. కాని భట్టినిని నొంటరిగ విడచి నేను వెళ్ళవలెననుకొన్నను నేవిధముగ వెళ్ళగలను? ఇది గట్టి చిక్కే! నా శరీరమునందలి ప్రతి రోమము కదంబకేసరముల వలె గగుర్పాటుజెంది యీ పరాధీనతకు స్వాగత మొసగుచున్న ట్లుండెను. నా హృదయమంతేయు కరగిన వెన్నవలె నా పరాధీనము నెదుట ప్రవహించుటకై యాతుర పడుచుండెను. నాలోనుండి యొక తీవ్రమగు నభిలాష వికసించిన యెఱ్ఱని కమలమువలె తన ముసుగును చీల్చుకొని బహిర్గతమగుటకై యుత్సాహపడుచుండెను. అరెరే! నాకేమిగతి పట్టినది. నా మనసునందెపుడే ద్వంద్వము పుట్టియుండకూడదో అప్పుడే యీ ద్వంద్వము ప్రారంభమగుటయు నాశ్చర్యకరమే! నేనీనాడు భట్టిని మందహాసభరిత ముఖారవిందమును గాంచితిని. ఆమె యధరములపై విలాసము తరంగిత మగుచుండెను. సల్రభమముచే నామె కపోలములు చలించినవి. శరీరావయవము లన్నియు కాంతికిరణములచే నాచ్ఛాదితములై ముత్యముల శోభాస్రోతస్విని యే యలలుగొట్టుచున్నదా యన్నట్లుండెను. నేను కృతకృత్యుడనగుట కిదియే యదనుగదా! నేను నా జీవితము సార్థకమైనట్లు స్ఫురించియుండవలసినది. కాని నేడే నేనీవిధముగ ఎందుకు నిశ్చేష్టితుడనైతినో? నిజముగ నే నెందులకీవిధముగ నైతినో!

ఒక్కొక్కటిగ నా కన్నివిషయములు జ్ఞప్తికి వచ్చుచుండెను. భట్టిని యీ నాడన్నమాటల కర్థమేమి! వందలాది కన్యలలో తానుకూడ నొకదాని ననుటలో భావమేమి! ఆమెకూడ నస్థిమాంసములచే నిర్మింపబడిన స్త్రీయేనట్లు — కానిచో నీ బాణుడా పవిత్ర దేవతాప్రతిమ యెదుట తన సర్వస్వమును సమర్పించుటచే తన జీవితము సార్థకమగునని యేల తలచును! అయ్యో! లోకమీ యస్థిమాంస నిర్మితమగు దేవతల మందిరమును పూజింపనేలేదే! అది వైరాగ్యము, శక్తియనెడి భావనాలోకపువిషయముల నూహించుటయందే మునిగియున్నదే! తనకు పరమారాధ్యమగు విషయమెద్దియో లోక మెఱుగనేలేదే! కాని యీ మాటలతో ఏమిపని! నేని లోకమున చూడనిదేమున్నది! సౌందర్యము, శోభ, యీ రెండిటిని విభ్రమ విచ్ఛిత్తుల కధీనమగుచుండుట జూచి ప్రప్రథమమున నేనే నాడు చలించితినో యీ నాటిని తలచుకొన్నంత మాత్రముననే నా శక్తియంతయు నొక్కమాఱు తిరుగుబాటు చేయ నుద్యమింపుచుండును. మాధుర్య లావణ్యములకన్న హేలా బిబ్బోకములకే ప్రపంచమున నెక్కువ మర్యాద కలదను విషయము నాకు బాగుగ తెలియును. కాని పరస్పర విరోధములుగ కనబడు నడవడులలో నొక సామరస్యముండుననియు నే నెఱుగుదును. నిరంతరము మార్పుజెందుచున్న బాహ్యాచారముల యంతరాళమున నొక మంగళకరుడగు దేవత స్తబ్ధుడై విరాజిల్లుచున్నాడు. ఆ దేవత నెఱుగనివారే యౌవనమును మదగజమనియు, అనురాగమును మానసికాంధకారమనియు, సహజ భావము

లను నిలాసమనియా చెప్పుచుందును. మాధవీలతను చుట్టు కొని తుమ్మెదలు ఝుమ్మని రొదచేయుచున్నపుడు నేను పుష్పాంతరాళమున సౌరభరూపమున విలసిల్లు నా దేవతను స్పష్టముగ జూచుచున్నాను. ఉన్మత్తవేగమున, అది తన సర్వస్వమును నలువైపుల వెదజల్లుచు సముద్రమువై పునకు పరుగిడుచున్నపుడు నేనా మహారాగమయునగు దేవతను దర్శించుచున్నాను. మేఘముల శ్యామల వక్షఃస్థలమున కనురెప్ప పాటు కన్నులు మిరుమిట్లుగొల్పు మెఱపుతీగ ప్రకాశించి దాగుకొనుచుండుట గాంచినపుడు కూడ వ్యాకులపడుచున్న యా దేవతాసందర్శనమును నేను విస్మరింపజాలను.

తటాలున నా వెనుకనుండి "భట్టూ! బలహీనముగ నుండియు నంతసేపు చలిగాలిలో కూర్చుండుట మంచిది కాదు" అని యనుచున్న భట్టిని కంఠస్వరము నాకు విన బడెను. మొదటిసారి మేఘగర్జనను వినిన జింకపిల్లవలె నే నులికిపడి వెనుకకు జూచితిని. వెనుక భట్టినియే నిలుచుండి యుండెను. పిక్కలవఱకు కప్పుకొని యున్న నల్లని ముసుగున నామె ముఖము జ్యోత్స్నయనెడి నిర్మల మందాకినీ ప్రవా హమునందు పారుచు శైవాలమున జిక్కుకొన్న వికసిత పద్మమా యన్నట్లును, క్షీరసాగరమును దాటించుచున్న నీలాంబరధారిణియగు లక్ష్మీదేవియా యన్నట్లును, కైలాస పర్వతమున పుష్పించిన దమనక యష్టియా యన్నట్లును, నల్లని మేఘపంక్తుల మధ్య ప్రకాశించుచున్న మెఱపు తీగయా యన్నట్లును, మునుపటికంటె నూఱురెట్లధికముగ మనోహరముగనుండెను. ఆమె విశాలనేత్రముల శోభకు

సాక్షి యామె నేత్రములే. భట్టిని తత్త్వాలున నన్నీవిధముగ పలుకరించుచుండే నే నొక క్షణకాలము స్తబ్ధుడనైతిని. నాకు బదులుచెప్పుట కేమియు తోచలేదు. ఇందీవరమాల వలె నన్ను బంధించుచు, కస్తూరిలేపనమువలె నన్ను స్నిగ్ధముచేయుచు, మందారపుష్పహారమువలె నా హృదయమునేకాక నా శరీరమునుగూడ నానందమున ముంచి తేల్చుచున్నట్టి యామె మృదుమనోహర దృష్టి నొక క్షణముసేపు ముగ్ధుడనై చూచుచుంటిని. ముహూర్తకాలము భట్టిని యచట నిలిచి యాజ్ఞాపించునట్టి స్వరమున "లోపలికి వెళ్ళి పడుకొనుము." అని పలికి వెడలిపోయెను.

మాలో ఎవరు ఎవరికి సంరక్షకులనెడు విషయము నా కర్థముకాలేదు. నేను భట్టినికి సంరక్షకుడనా! లేక భట్టినియే నా సంరక్షకురాలా? ఓ నక్షత్రములారా! మీరే సాక్షీభూతులుగ నుండుడు! బాణభట్టు కర్తవ్యపథమును వీడునట్టి పోకిరి కాడు. పగ్గము తెంపుకొనిపోయిన యాబోతువలె విచ్చలవిడిగ తిరుగునట్టివాడు కాడు. పాదునుండి పెల్లగించి విసరివేయబడిన దుర్వాంకురమువలె మందభాగ్యుడును కాడు. అడవియందు వికసించి యెండిపోవునట్టి యడవిపూవువలె నితని జన్మము నిష్ఫలముకాలేదు. గిట్టల తాకిడికి లేచిన ధూళికణమువలె నతడు ఆశ్రయహీనుడు కాడు. ఎడారియందెండిపోవు నదివలె వ్యర్థజీవి కాడు. కళాహీనముగు నిశానాథుడా! నీ వీ సమస్త భూతలమునందలి అనురాగ వైరాగ్యములకు కపటములేని సాక్షీభూతుడవు. బాణభట్టుని జీవితము వ్యర్థముకాలేదని నీవు భువన, కాల, దిశాంతరములకు

సందేశ మందజేయుము. నే నీ సౌభాగ్యమును స్వయముగ నా చేతులార మఱపనెడి పాతాళ గహ్వరమున ముంచివేసె దను. నీ వీ విషయమును జ్ఞాపకముంచుకొనుము" అని వల వల పోవుచు నేను మెల్లమెల్లగ పోయి నా శయనాగారమున శయనించితిని.

మెలకువ వచ్చుసరికి బాగుగ ప్రొద్దెక్కియుండెను. అప్పటికే నిఉణియ బయట కూర్చుండి నా కొఱకై వేచి యుండెను. ఇంత త్వరగ నిపుణిక నచట చూచిన నా యాశ్చర్యమునకు మేఱలేదు. ఆమె ముఖము వాడిపోయి, కన్నులు గుంటలుపడి శరీరము తెల్లబడియుండెను. కడు ప్రయాసతో నామె నాకు నమస్కరించెను. నే నామె రాకకు కారణ మడుగుట కుద్యమించునంతటిలో నామె, "భట్టా, నేను క్రమక్రమముగ ఆరోగ్యమును పొందుదును. నీవు నన్ను గుఱించి చింతిల్లకుము. మిక్కిలి యవసరమగు కార్యమున నీ సలహా అడుగుటకై నేను వచ్చితిని. నా యపరాధము క్షమింప దవన్న నేను చెప్పెదను" అని యనెను. అప్రియమగు విషయ మేదో విందునన్న భయముచే నేను గడగడలాడుచు ఆశ్చర్యముతో నామెవైపు చూచితిని. నిఉణియు మోక రిల్లి మఱియొకమారు నమస్కరించి కొంతసేపూరక యుండి "నిన్నరాత్రి నీవు భట్టినితో ననుచితమైన మాటలాడితివా? భట్టా.?" అని నన్ను ప్రశ్నించెను. నేను నిరుత్తరుడ నైతిని. నేను భట్టిని ననుచితముగ మాట లాడుదునా! ఇదెక్కడి వింత! అని నే ననుకొనుచుండ నిపుణిక నన్నె క్కువసేపాలోచింప నియ్యక నా కుతూహలము నధికము

గావించుచు "భట్టూ! తెలిసి తెలిసి నీ వెన్నటికి ననుచితముగ మాటలాడవని నాకు తెలియదా? నా యీ పాపపంకిల మగు శరీరమున నీ వెట్టి కమలమును వికసింప జేసితివో నీకే తెలియదు. నీవు నా కొక దేవతవు. నేను నీ పేరు జపించు చుండునట్టి యధమురాలనగు స్త్రీని. ఇట్టి పాప భూయిష్ఠమగు మనసు కలిగియు జీవించుచుండుటకు కారణమేమన జీవించుటకు నే నర్హురాలనని నీవు తలంచుటయే. తూర్పు దిక్కున నుదయించు సూర్యుడు పశ్చిమమున నుదయించినను నీవు భట్టిని ననుచితముగ మాటలాడవని నేను బాగుగ నెఱుగుదును. కాని భట్టినిని కలవర పఱచునట్టి సంగతి యేదో తప్పక జరిగినది. రాత్రి యంతయు నామె యేడ్చుచుండుటచే నామె కన్నులు వాచి యున్నవి. ఆమె ముఖముపై నుద్రేకము స్పష్టముగ కనబడుచున్నది. ఆమె తనలో తాను లేదు. ఆమెకు తీవ్రమగు జ్వరము వచ్చినదని నా యనుమానము. ఆమె వాడిపోయిన యెఱ్ఱని పెదవులను నీవు చూచినచో నీ కంట నీరు కారక మానదు. అసలు సంగ తేమిటి భట్టూ?" అని యనెను. నిపుణిక మాటలు విని నేను నివ్వెఱపాటు నొందితిని. హృదయాంతరాళము శరత్కాలపు మొగలి పూవువలె కాంతి విహీన మయ్యెను. నే నున్మత్తునివలె "నిపుణికా! ఇంకెక్కువ మాట లాడకుము. నాపై నీవెట్టి పిడుగును పడవేయుచున్నావో నీకు తెలియదు." అని గట్టిగా అఱచితిని.

నిపుణిక చాల సేపటివఱకు మాఱు పలుకక నన్ను చూచుచుండెను. నేను మెలమెల్లగ రాత్రి జరిగిన సమా

చారము నంతయు నామెకు తెలియ జెప్పితిని. శుష్కించిన నిపుణిక ముఖముపై నానంద రేఖ మెఱసెను. పాలిపోయిన ఆమె ముఖము కర్పూరపు బిళ్ళవలె ప్రజ్వరిల్లెను. పుట్ట మొదట నున్న మాణిక్యమువలె నామె గుంటలు బడిన కన్నుల నుండి దివ్యజ్యోతి వెలువడు చుండెను. క్షణకాల మామె నలుదెసలు నుండి వచ్చుచున్న భావ పరంపరలచే కొట్టుకొని చేష్టలుడిగిన దానివలె కదలక మెదలక కూర్చుండి యుండెను. పిమ్మట ఆమె నన్ను కన్నెత్తి యొక మారు చూచెను. ముత్యములచే నిండియున్న ముత్తెపు చిప్పవలె, మంచు బిందువులచే నిండిన పద్మ పత్రమువలె, మంచుతో తడిసిన పారిజాత పుష్పమువలె, సగము వికసించిన సిందువార పుష్పమువలె, అశ్రు పూరితములగు నామె కన్నులు, నా మనస్సును కరుణ రసమున ముంచి సానుభూతిని చిలుకుచు కరుణారస ధారలచే ధౌత మొనర్చుచుండెను. చాల సేపటి వఱకు నిపుణిక తన్ను తానే మఱచి భ్రమ నొందినట్లుండి పిదప తటాలున భూమిపై చేతులు మోడ్చి నమస్కారము చేసి "భట్టూ! ఇపుడు నా కర్థ మయినది. నాయపరాధమును మన్నింపుము. నీవు నా తప్పుల నర్థము చేసికొన జాలవు. కాని నీవు నీ తప్పులనైన తెలిసికొన వలెను. నన్ను గుఱించి నేను సిగ్గుపడ నవసరము లేదు. నిఉనియ మాటనుమఱచిపొమ్ము. అది డెబ్బదిరెండు చెఱువుల నీరు త్రాగిన దిట్ట. అది మంచిచెడ్డల నరయ గలదు. ఆ విషయమున తన నేర్పరి తనమును చూచి యామె గర్వ

పడుచుండును కూడ. తన పాప భరితమైన మనసులోని వికారముల నితరుల తలపై రుద్దగల జాణ. కాని భట్టిని బాలిక. ప్రపంచ మెంత కఠోరమైనదో యామెకు తెలియదు. ఆమె నిస్సర్థము చేసికొన జాలదు. ఛీ, భట్టూ ! నీవు పురుషుడవు, సహజముగ నీలో పౌరుష ముండవలెను గదా ! నేను మాట వరుస కడిగెదను. భట్టిని గంగ యందేల దుముక లేదని నీ వామె నెప్పుడైన నడిగితివా ! ఆమె యస్వాభావిక చాంచల్యమును జూచి నిన్న నీ వామె నెందుకు దండించి యుండ లేదు ?" అని ప్రశ్నించెను. నేనీ నాటి వఱకు నిపుణిక పలికిన యీ మాటల నర్థము చేసికొన లేకున్నాను. కాని నా యవస్థ నర్థము చేసికొనుట కీ మాట లద్భుతముగ దోహద మొసగెను. మేఘ రహితమగు ఆకాశమువలె, పొగమంచు వీడిన దిఙ్మండలము వలె, పాచిలేని సరోవరము వలె, నా మనస్సు ప్రసన్న మయ్యెను. నేను నిపుణిక నభినందించుచు 'నేను భట్టిని సేవకుడనై గౌరవింప బడితిని. ఆమె సంతుష్టుడనవలె నన్నాశ నాకు లేదు. ఆమెను నే నాము తండ్రిగారి కడ జేర్చి సెలవు గైకొందును. ఇంత కంటె నెక్కుడుగ మమత్వమునందు చిక్కుకొనుట నాకు నచ్చలేదు. గొప్ప భవిష్యత్తును నిర్మించుట యందు బాణభట్టుడు నిమిత్త మాత్రుడగుటకు సంకల్పించుకొని యున్నాడని నీవు భట్టినికి చెప్పుము. నేను రేపే స్థానేశ్వరమునకు వెడలుచున్నాను." అని యంటిని. నిపుణిక లేచి వెడలసాగెను. కాని గొప్ప లాభము సంపాదింప వలెనని వచ్చి

మూల ధనమునే. పోగొట్టు కొనిన వణిజునివలె నా మొ మిక్కిలి ఖిన్నురాలై యుండెను.

నేను చాలసేపు నా యాసనముపై కూర్చుండి యుంటిని. క్రమ క్రమముగ సూర్యుని వేడి యధికము కా జొచ్చెను. కొండ చిలువ బుసవలె పడమటి గాలి బుస్సు బుస్సు మని వీచుచు దిఙ్మండలమును మాడ్చి వేయ సాగెను. ఎండకు తొండలు క్షణక్షణము తమ రంగును మార్చుచుండ విచ్చుక జలట లలసభావమున పార్శ్వపు గూళ్ళయందు దాగు కొనుచుండెను. అడివి గోరువంకలు బహుభంగుల తమ దుఃఖ వృత్తాంతమును చెప్ప దొడగినవి. ఇండ్ల యందుండి నెమరు వేయుచున్న ఆవుల దౌడలలో కూడ కొంత సోమరి తనము కనబడ జొచ్చెను. నేను చాల సేపటి వఱకు స్వస్తికాకారమున నున్న రాజమార్గ భాగమును రెప్ప వాల్చక చూచుచుంటిని. అట్టి సమయమున నే విగ్రహ వర్మ నా చెంతకు వచ్చి నమస్కారము చేసి. కృష్ణవర్ధన రాజ కుమారులు పంపిన దూతను నాకు పరిచయము చేసెను. 'నేను మహారాజాధి రాజులగు హర్షదేవులతో శత్రుత్వమును వీడి వారిని కలిసి కొమ్మని రాజకుమారుల పరముగ నా దూత నాతో విన్నవించు కొన్నపుడు నాకు కలిగిన యాశ్చర్యమునకు అంతులేదు!

తీగవంటి సాంధ్యరాగ మల్లుకొనియుండెను. విశాలమగు సూర్యబింబము పశ్చిమ సముద్రమున పడిపోయినందున పైకి చిమ్మబడిన నీటితుంపరలచే నక్షత్రములవలె నాకాశమున వ్యాపించియున్నవా యన్నట్లును, పిదప పశ్చిమ సముద్రము నుండి పై కెగసిన జలతరంగములే పడమటిదిక్కున నలము కొన్న సంజకెంజాయలను కడిగివేసినవా యన్నట్లగపడు చుండెను. భట్టిని స్నానముచేసి పూజావేదికపై నాసీనురాలై యుండెను. నేను కొన్ని క్షణములు వెలుపలనే వేచియుంటిని. భగవద్ధ్యానము సలుపుచున్న భట్టిని కంఠస్వరము నేడు కరుణార్ద్రమై యుండెను. ఆకాశము తన లక్షలాది నక్షత్ర నయనములను విశాలములుగ నొనర్చి ఆశ్చర్యముతో ఆ మోహన గీతమును వినుచుండెను. పూజ సమాప్తము కాగానే భట్టిని ప్రదక్షిణము గావించి యదృశ్యుడగు మహా వరాహునికి నమస్కరించెను. ఆమె ప్రత్యంగము నుండియు శీతలస్నిగ్ధములగు భక్తితరంగములు వెలువడుచుండెను. ఆమె ధరించియుండిన కుసుమపుఠంగు వస్త్రములను చీల్చుకొని యామె యంగసౌష్ఠవపు లావణ్యకాంతులు నిర్గతములగుచు నదృశ్య సౌభాగ్యచంద్రుని సూచన లభించినంతనే శోభా సాగరమున ఆటు - పోటు గల్గినట్లగపడుచుండెను. కొంత సేపటివఱకు భట్టిని యభిభూతయై దిగ్భ్రమనొందినదానివలె మోకాళ్ళపై కూర్చుండియుండెను. తర్వాత మెలమెల్లన లేచి, ద్వారమువద్ద నే నుండుట గమనించి నా వైపునకు

మరలెను. ఆమె కన్నుల యందు స్వాభావికమగు గాంభీర్య మున్నదెను. కాని నన్ను చూడగానే యవి వాలిపోయెను. ఆమె నా కొరకు యాసనము నిర్దేశించి తానొకయాసనముపై కూర్చుండెను. నేను కూర్చుంటిని కాని చాలసేపటి వఱకు భట్టిని నోటనుండి యొకమాటకూడ వెలువడలేదు. నే నే విధముగ సంభాషణమును ప్రారంభింపవలెనను విషయము నా కర్థముకాలేదు. ఇంతలో భట్టిని "నిపుణిక యేదైన ననుచితముగ మాటలాడియుండిన దానిని మనసునందుంచుకొనకుము. ఆమె నన్ను ప్రాణములకన్న నెక్కువ ప్రేమించుచున్నది. ఆమెకు నీ యెడ గల శ్రద్ధా భక్తు లిదివఱకే చాటబడినవికదా! చాల దినములనుండి యామె మనస్సు స్థిమితముగ నున్నట్లగపడుటలేదు. తాంత్రికుల యభిచారమువలన నామె మనస్సునందు కొంత మార్పు కలిగినది. నే నీ దినమంతయు నామెను గుఱించియే యోచించుచుంటిని. వైశాఖ శుద్ధ పౌర్ణమినాటికి తాను స్థానేశ్వరము చేరుకొందుననియు అవధూతసిద్ధులుకూడ నచటికి వచ్చెదరనియు నిపుణికలో నేదైన మార్పు కనబడిన నిన్నచటికి పంపుమనియు, మహామాయ చెప్పి వెళ్ళినది. రేపు నీ వచటికి వెళ్ళిన బాగుగ నుండునేమో యాలోచించుము భట్టూ!" అని ఆర్ద్రముగ పలికెను. నే నాశ్చర్యముతో భట్టినిని చూచితిని. భట్టిని యాదేశము, నిపుణిక సలహా, కృష్ణవర్ధనుల సందేశము ఇవన్నియు నీ విధముగ కలిసివచ్చుటను గూర్చి తలచుకొని నే నాశ్చర్యచకితుడ

నైతిని. ఎట్టి విచిత్ర సంయోగమిది! కాని నిపుణికకు నిజముగ పిచ్చిపట్టినదా? నేటి యుదయమున తాను వచ్చి యసంబద్ధముగ మాటలాడుట యున్మాదమువలన నేనా? అని నేనాలోచించుచుండగనే భట్టిని నా కవకాశము నొసగక "లోరికదేవుని రాజ్ఞి మా యిద్దరికిని అంతఃపురముననే యుండుట కేర్పాట్లు చేయనెంచినది! కాని నిపుణిక స్థితి యిట్టులుండ నే నచట నుండుటకు సమ్మతింపలేదు. అందువలన నామె యిచ్చటనే మాకు తగిన వసతులు చేయించెదనని చెప్పినది. విగ్రహవర్మగారు కూడ నిచటనే యుండుమని చెప్పెను. అతడిచట నున్నంతవఱకు నేనే కొరతయుండదు. మహావరాహునిపై విశ్వాసముంచి నీవు రేపే బయలుదేరుము" అని యనెను.

నేను మాఱుమాటాడక యామె యాజ్ఞకు తలయొగ్గితిని. కాని నా హృదయమున నెచ్చటినుండియో వచ్చి శల్యము గ్రుచ్చుకొన్నట్లుండెను. తుదకు భట్టినిని వదలిపెట్టి వెళ్ళవలసివచ్చునుగదా! నా మనస్సు మోహమును వీడినదని నే ననుకొనుట భ్రమ మాత్రమే! నేను వెడలుటకు భట్టిని అనుమతింపకున్న నేను నిర్వికారుడనై యుండి యుందును. కొంతసేపైన తర్వాత భట్టిని నా వైపునకు చూచెను. వానచినుకులకు తడిసిన కాటుకపిట్టలవలె నామె కన్నులు మూతలుపడుచుండెను. కడు ప్రయాసతో నవి యొకసారి నన్ను చూచి క్రిందికి వాలిపోయెను. భట్టిని యాగి యాగి "భట్టూ! నేను దరిద్రురాలను. జీవించుట వలన సార్థకమేమి యనునది నీవే నాకు నేర్పితివి. ఏ పూర్వ

పుణ్యమున మహావరాహుఁడు నిన్ను నా కడకంపెనో నాకు తెలియకున్నది. నీ వెంట నుండుటవలన నేను భాగ్యహీనురాలను నేను మఱచిపోయి యుంటిని. నేను నిన్ను చాల కష్టములపాలొనర్చితిని. ఇంకను కష్టములపాలు చేయుచున్నాను. నే నజ్ఞానురాలను. నేడు నిపుణిక యున్మత్త ప్రలాపమువలన నా స్వస్వరూపమును నేను గాంచితిని. నిన్ను గంగలో ముంచుటకై నేను గంగానదిలో దుమికితి నని యామె యన్నమాటలే సత్యమేమో యెవరికెఱుక! నేను చెప్పలేను. మౌఖరీవంశీయుఁడగు ఆ సిగ్గులేని మహారాజు నన్ను తిరిగి ఖైదుచేయ నున్నాఁడేమో యని నాకు తోచినది. విగ్రహవర్మ తాను మౌఖరీవంశీయుఁడనని నీకు చెప్పుచున్నపుడు నాకా సందేహము కలిగెను. భట్టూ! బుద్ధిలేని యీ బాలికను నీవు మన్నింపుము. 'భట్టు లేకున్నచో నీవు గంగానదిలో దుమికి యుండవని' నిపుణిక నాతో అనెను. నేడు నే నన్ని విషయములను పరిశీలించి చూడగా నా మనసునందొక మూల నీవు నన్ను నిటమునుగనీయవనియు, నన్ను రక్షించెదవనియు గట్టి నమ్మక ముండినట్లు నాకు తోచుచున్నది. నీవు నా శరీరమునే కాదు, నా మనస్సును, నా మానమును కాపాడి యున్నావు. నేను నాహితము నపేక్షించు వానినే యాపదలో ముంచి యపరాధము గావించిన భాగ్యహీనురాలను. భట్టూ! నా యపరాధములను క్షమింపుము" అని పలుకుచు భట్టిని చేతులు జోడించి భూమిపై తలనిడి ప్రణమిల్లెను. నేను రాతిబొమ్మవలె నిశ్చేష్టుడనైతిని. నేను చూచుచుండగనే యింత గొప్ప విష

యము నా కన్నుల యెదుట జరుగుట గాంచి నేను నిశ్చేష్టుడనై కూర్చుండి యుంటిని. భట్టిని మోకాళ్ళపై కూర్చుండి యున్నప్పుడు నాకు స్మృతి కలిగెను. నేను సంభ్రమముతో లేచి నిలబడి "దేవీ! తమరేమి సెల విచ్చుచుంటిరి! నిపుణిక యున్నాదా వస్త్రయందు పలికిన పలుకులనే ప్రామాణికములుగ భావించి మిమ్ములను మీరు రపరాధులని భావించుచున్నారే! ఇదెక్కడి విపరీతము?" అని యంటిని. భట్టిని మౌనముద్ర వహించెను. చాలసేపటి కామె నివ్వంద దీపశిఖవోలె, చలింపని మెఱపు తీగవలె, సృష్టించిన దమనకయష్టివలె కూర్చుండి యుండెను. తర్వాత మెలమెల్లగా "అచటి నుండి త్వరగ మరలి రావలెను సుమా! ఇక వెళ్ళుము." అనెను. నేను వెడలుచుండ నామె మఱల నన్ను పిలిచెను. ఇపుడామె కంఠస్వరము స్పష్టముగ నుండెను. ఆమె "నిపుణికను కలిసికొనవద్దు. నీ కవకాశ ముండిన నిపుణిక స్నేహితురాలగు సుచరితను గుఱించిన సమాచారము తెలిసికొని రమ్ము. ఆమె నిపుణిక మకానము వద్దనే యెచటనో యున్నది. ఆమెకూడ కడు మంద భాగ్యురాలు నేనామె నొకసారి చూచి యుంటిని. ఆమెను గుఱించి మఱి వర తెలిసికొని రమ్ము" అని యనెను.

మఱునా డుదయముననే నేను స్థానేశ్వరమునకు బయలు దేరితిని. పది దినముల వఱకు నిరంతరము గుఱ్ఱముపై సవారిచేసిన తర్వాత నేను స్థానేశ్వర దుర్గ ద్వారమును చేరితిని. దుర్గమును ప్రవేశింపగనే నాకు సుచరిత జ్ఞాపకమునకు వచ్చెను. నిపుణిక యొకసారి మాత్ర మామెను గుఱించి

నాతో చెప్పి యుండెను. నే నామె విషయమై సవిస్తరముగ చెప్పుమని నిపుణిక నడిగితిని. కాని యామె మౌనము వహించి నందున నే నావిషయము తెలిసికొనలేక పోతిని. భట్టినికికూడ నా మెను గుఱించి నిపుణిక యేచెప్పి యుండవచ్చును. ఆమె యేమి పని చేయుచున్నదో కదా! ఆమె చేయుపని మంచిది కాదనుట స్పష్టమే! కాని బాణభట్టు తప్పక ఆమె యొద్దకు వెళ్ళును. స్త్రీ దేహము పవిత్రమగు దేవప్రతిమ యనియే యతడు తన జీవిత మంతయు భావించెను గదా! అది యెచ్చట నున్నను సరియే, యే స్థితి యందున్నను సరియే, స్త్రీ శరీరము ఆదరాభిమానములకు పాత్రమే! నే నీ దినము మహా రాజాధి రాజులను దర్శించు కొనవలసి యున్నది. ఆచార్య సుగత భద్రులను దర్శించి క్షణమిల్లి, అవధూత సిద్ధుడగు అఘోర భైరవుని సందర్శింప వలసి యున్నది. కాని నేను సుచరితను మాత్రము మఱువ జాలను. దేవతా ప్రతిమ బురద గుంటలో చిక్కుకొని యుండ ఏ మహా రాజునో మహా సంధి నిగ్రహికునో కలిసి కొనవలెనని, దానిని బాణుడు వదలి వెళ్ళగలడా! అసంభవము! కాని నే నొనర్చు కార్య మేదియు భట్టిని శుభోదయమునకు విఘ్న కారి కా గూడదు. అందువలన నే మైననుసరియే, రాజ కుమారులను, మహా రాజులను ఆచార్య పాదులను కలిసి కొనని దే నేనేమియు చేయకూడ దని నిశ్చయించు కొంటిని

నాడు వైశాఖ పూర్ణిమ. తథాగతు డానాడే జన్మించి యుండి, తన యవతారమును చాలించి యా నాడే నిర్వాణ మును పొంది యుండెను. బౌద్ధ రాజుల రాజధానియందు

నాటి యుత్సవ మెంత వైభవోపేతముగ జరుగ వలయునో యీ విధముగనే యచట గూడ జరిగెను. వీధులన్నియు సుగంధ జలముతో తడుపబడెను. పురము నందలి భవనము లన్నియు తోరణములతో, మంగళ పతాకములతో నలంక రింప బడెను. గాచబాట వైపున నున్న కిటికీలు మాలతీ లతలచే నలంకరింప బడెను. పురజనులు నూతన వస్త్రాభర ణములను ధరించి యుండిరి. నగరమున ప్రవేశింపగనే నాడు ఆచార్య సుగత భద్రుల ధర్మోపదేశము జరుగ నున్నదని తెలిసెను. మహారాజులయు రాజ కుమారులయు సవారీ లా వైపునకే పోయినట్లు కూడ నాకు తెలియగనే నే నితర విష యము లన్నిటిని మఱచి ఆచార్య పాదుల ధర్మోపదేశము వినవలెనను నాశచే ఆ వైపునకే వెడలితిని. బౌద్ధ విహారము నేను చూచి యుండినదే. అచటికి పోవు రాజమార్గము లన్నియు తెల్లని వస్త్రములు ధరించిన నగర నివాసులచే నిండి యుండెను. వారి వస్త్రములు, ఉష్ణీషములు, అంగరాగ పుష్ప మాల్యాదులన్నియు తెల్లనివే యయినందున అంద ఱును రజత ధారయందు స్నానమాడిరా - యనిపించు చుండెను. సౌధ వాతాయనముల నుండి యువతీ మణుల స్వర్ణాభరణముల పచ్చని కాంతి వెలుపలికి వ్యాపించు చుండెను. క్రిందనున్న శ్వేత కాంతులపై వాతాయనముల నుండి వెడలుచున్న సువర్ణ కాంతి కైలాస పర్వతముపై శరత్కాల ప్రభాత సమయమున పడుచున్న సూర్య రశ్మివలె మనోహరముగ కనబడు చుండెను. నేను బౌద్ధవిహారము చేరు

నప్పటికి దార్భాగ్య వశమున ధర్మోపదేశము పూర్తియై శ్రోతల సందేహములకు సమాధానము లొసగ బడుచుండెను.

"మహా రాజాధిరాజుల రాకవలన, విహారము వెలుపల కనబడుచున్న యానందోల్లాస కోలాహల జయ నినాదములు, విహారములోపలకూడ నుండునని నేను తలచితిని. విహారములోనికి అందఱు పోవచ్చును. కాని చాల కొద్ది మందియే లోనికి పోవ సాహసించుచుండిరి. సభాస్థలమున భిక్షువుల సంఖ్యయే యధికముగ నుండెను. గృహస్థులలో మహా రాజులు వారి దగ్గఱి యుద్యోగులు మాత్రమే ఆసీనులై యుండిరి. మహారాజుగారి దేహముపై నుత్తరీయము కూడ లేకుండెను. వారి శరీరముపై సువాసన గల యంగరాగము మాత్రము పూయబడి యుండెను. భుజములపై కేయూరములును, వక్షః స్థలమున ముత్యాల హారమును తప్ప వారు మఱేమియు ధరించి యుండలేదు. వారు శాంతముగను, మనోహరముగను దర్శన మిచ్చుచుండిరి ఆచార్యపాదులయెడ వారి శ్రద్ధా భక్తు లధికముగ నుండెను. ఆచార్య పాదులు కూడ వారి నత్యంత వాత్సల్యముతో వీక్షించు చుండిరి. అచట నందఱును కలసి సుమారైదు వందల మంది యుండి యుండ వచ్చును. వారిలో సగము మంది భిక్షువులు. మిగిలిన వారు మహారాజాధి రాజుల సామంతులును అంతఃపుర స్త్రీల సమూహమును! ఒక పలుచని పరదా వెనుక అవ రోధజన మాసీనమై యుండెను.

నేను మాటాడక యొకమూల కూర్చుంటిని. ఆచార్య సుగత భద్రులు చాల ప్రసన్న చిత్తులై యున్నట్లు కనబడు

చుండిరి. వారు మందహాస పూర్వకముగ మహా రాజులవైపు దృష్టి ప్రసరించి ధీర శాంతమగు స్వరమున "మహారాజా! తమరీ జంబూ ద్వీపమునందున్న చక్రవర్తులలో ప్రధానులు. తమ సుబుద్ధి వలన ప్రజలకు శుభము కలుగును. తమరు తథాగతుని ధర్మోపదేశము విన్నారు. తమకు దీని వలన తృప్తి కలిగినదా! మైత్రీ కరుణలనే ప్రధానముగ నెంచు కొను ఈ మతమును గుఱించి మీకెట్టి సందేహములు లేవు గదా!" అని యడిగిరి.

మహారాజులు ఆచార్యులకు శిరసా నమస్కరించి కొంతసేపు నిశ్చల ప్రతిమవలె ధ్యానమగ్నులై యుండిరి. తర్వాత కేలు మోడ్చి "ఆచార్యపాదులాజ్ఞ నొసగెదరా!" యని ప్రశ్నించుట కనుమతిని వేడిరి.

ఆచార్యులు మందహాసమున ప్రశంసించుచు "మహారాజులు తప్పక ప్రశ్నింప వచ్చును" అని నుడివిరి. అంతట, మహారాజాధి రాజులు వినమ్రులై యిట్లు ప్రశ్నించిరి: "స్వామీ! కొందఱు జైనయతులు బుద్ధదేవుని యారాధన విషయమున నన్ను కొన్ని ప్రశ్నలనడిగి యున్నారు. నేను వానికి సమాధాన మొసగ లేకున్నాను. నేనా ప్రశ్నల విషయమై యాలోచించిన పిదప నా మనసునందే గొప్ప చీకాకు రేకెత్తినది. నా యవినీతిని మన్నింపుడు. ఆ ప్రశ్నలను మిమ్ముల నడుగ ననుమతి వేడెదను."

ఆచార్య పాదులు కడు నుత్సాహముతో. "మహారాజా! సందేహింపక యడుగుడు. శంకా శల్యములను మనసు నుండి యున్మూలనము గావించుటయే యుచితము.

తథాగత భగవానుని మతము అంధ విశ్వాసముపై నాధార పడి యుండలేదు. అది తర్క విచారణలకు విరుద్ధము కాదు. అందు వలననే యది సద్ధర్మము" అని నుడివిరి.

"ఆచార్యా! బుద్ధుడు నిర్వాణము నొందిన తర్వాత గూడ పూజల నెట్లు స్వీకరింప గలడు? ఇందు రెండు విషయములు సంభవములు. మొదటిది: బుద్ధుడు పూజలను గ్రహించుచున్న, ప్రపంచమునందు అతడు కలసి యున్నాడు. అతడు ప్రపంచము నందలివాడై నలుగురితో పాటు తాను కూడ నొక వ్యక్తియే యగును. అపుడతని పూజించుట నిష్ఫలము. రెండవది: అతడు నిర్వాణము పొంది యున్నచో లోకముతో నతనికెట్టి సంబంధము లేదు. అతడు ముక్తుడు. అట్టి సమయమున కూడ నతనిని పూజించుట నిష్ఫలమే. వీయన నిర్వాణము పొందిన వ్యక్తియేమియు గ్రహింప జాలడు. అట్టి వ్యక్తి నుద్దేశించి చేసిన పూజయు నిష్ఫలమే యగును కదా! ఆచార్యా! తమరే యీ ప్రశ్నలకు సదుత్తరము లొసగ గలరు. తమరే యథార్థమును నిర్ణయింప గల సమర్థులు."

ఆచార్య పాదుల ముఖమున చిఱునవ్వు నాట్యమాడెను. మఱల వారుత్సాహముతో "మంచిది, మహారాజా! మీరు ప్రశ్నను నిర్దుష్టమైన భాషయందు దిమిడ్చియున్నారు. ఈ ప్రశ్నలకు సమాధాన మొసగుటకు నేను శక్తి కొలది ప్రయత్నించెదను. కాని నేను మిమ్ముల నొక ప్రశ్న నడిగెదను. సంశయింపక జవాబు చెప్పుడు"

"చిత్తము, సెలవొసగుడు."

"మహారాజా ! ఏదైన ప్రబలమగు అగ్ని ప్రజ్వలించి నిర్వాణము పొందిన పిదప—అనగా చల్లారిన పిదప - తృణ కాష్ఠములు మొదలగు నింధనములను గ్రహించునా ?"

"గ్రహించదు స్వామీ !"

"మహారాజా ! ఆ యగ్ని శాంతించిన పిదప ప్రపంచ ములో నగ్నియనెడి పదార్థమే లోపించునా ?"

"ఆర్యా ! లోపించదు. ఇంధన రూపములగు కాష్ఠ ములు మొదలగునవి అగ్ని కాశ్రయములు. అందువలన అగ్ని నపేక్షించువాడు తన ప్రయత్నముతో నగ్నిని ప్రజ్వ రిల్ల జేయు చున్నాడు. వాడు కట్టెల యొరపిడి వలననో, లేక, మఱెచ్చటి నుండియో యగ్నిని సంపాదించియో, తిరిగి గొప్ప యగ్నిని సిద్ధము చేసికొని తన పనిని నెరవేర్చు కొను చున్నాడు"

"భగవంతుని విషయము గూడ నట్లే యని తలంపుము. మహారాజా! గొప్ప యగ్ని రాశి ప్రజ్వలించినట్లు భగ వంతుడు కూడ పదివేల ప్రపంచములపై బుద్ధ లక్ష్మి వలన ప్రజ్వలించెను. ఆయగ్నిరాశి ప్రజ్వలించి నిర్వాణముపొందినట్లే భగవంతుడు కూడా పదివేల ప్రపంచములపై బుద్ధలక్ష్మివలన ప్రజ్వలించిన పిదప నిరవశేష నిర్వాణముద్వారా పరినిర్వాణమునొందెను. చల్లారిన యగ్ని తృణకాష్ఠములు మొదలగు నింధనముల నెట్లు గ్రహింపదో ఆ విధముననే లోకోపకారియగు భగవంతుడు కూడ దేనిని పరిగ్రహింపడు. కాని ఇంధనములులేని యగ్ని చల్లారిన పిదప, మనుష్యు లెట్టుల తమ ప్రయత్నముచే నగ్ని నుత్పత్తిచేసికొని తమ

కార్యముసాధించుకొను చున్నారో, అటులనే దేవతలు మనుష్యులు నిర్వాణ ప్రాప్తిగొందిన తథాగతుని ధాతు రత్నముల నాధారము చేసికొని స్తూపములు మొదలగువానిని నిర్మించుకొని, శీలము మొదలగువాని ననుష్ఠించి సంపత్తి శ్రేయమును పొందు చున్నారు. ఈ విధముగ తథాగతు డేమియు గ్రహింపకున్నను నతని నుద్దేశించి చేసిన పూజ ఫలించుచున్నది. అది నిష్ఫలము కాజాలదు!"

ఆచార్యుల సమాధానము స్పష్టమై, మోహనమై యితరులపై ప్రభావము ప్రసరింపజేయు సమర్థతగలదై యుండినది శ్రోతలలో బౌద్ధశ్రమణులే యధికముగ నుండిరి. వారందరేక కంఠమున "మహాస్థవిరులు, సుగతభద్రులు ధన్యులు! ఈ సమాధానము అద్భుతము! ఆచార్యా, తమ ధర్మోపదేశదక్షత యాశ్చర్యకరము!" అని జయ నినాదము గావించిరి. కాని మహారాజుల ముఖముపై గొప్ప యుల్లా సము కనుపించలేదు. వారేదో యాలోచనా నిమగ్నులై యున్నట్లగపడుచుండిరి. ఆచార్య పాదులీ విషయము నర్థము చేసికొని "మహారాజా! ఎవరు పూజను గ్రహింపరో వారి నుద్దేశించిన పూజ నిష్ఫలమగుననియేనా యూరనుచుండినది!"

"చిత్తము, ఆచార్యా!"

"మంచిది మహారాజా! పెనుగాలి వీచి శాంతించిన పిదప వాయువను పేరు నిలిచి యుండునా!"

"లేదు స్వామీ! తాలవృంతములు, వింజామరలు, గాలికి కారణములు. వాయువును కోరువాడు తన ప్రయ

త్నముతో గాలిని కలిగించి తన వేడిమిని చల్లార్చుకొను చున్నాడు."

"అటులనే. బుద్ధుడు పదివేల లోకములపై మంద మందముగ వీచుచున్న పవనమువలె మైత్రీరూపమున వ్యాపించియుండెను. ప్రచండమగు వాయువు వీచి శాంతించి నట్లు బుద్ధభగవానుడు కూడ నిర్వాణము పొందెను. వేడిమిచే తపించు వ్యక్తి యేవిధముగ విసనకఱ్ఱ సహాయమున గాలిని తిరిగి కలిగించుకొనునో యా విధముననే దేవతలు మనుష్యులు బుద్ధభగవంతుని శరీరధాతువుల సహాయమున శీలము మొదలగువాని ననుష్ఠించి తమ సంసారదుఃఖములను పోగొట్టు కొందురు. మహారాజా! ఈ విధముగనే బుద్ధుడు దేనిని గ్రహింపకుండినను, అతని నుద్దేశించి చేసిన పూజ సఫలమగు చున్నది."

"ధన్యోస్మి స్వామీ! తమ సమాధాన మద్భుతము! తమ నిరూపణనైపుణి యాశ్చర్యకరము! తమ తర్కశక్తి యపారము. నా ప్రశ్నకు సమాధానము లభించినది.* కాని యీ వార్త! తథాగతులు సర్వజ్ఞులా! త్రైపిటక సాధువులు వారితో బుద్ధుడు ధ్యానించిన పిదపనే యేదైన తెలిసికొనుచుండిరనియు లేకున్న వారు మనవలెనే యేమియు తెలిసికొనలేకుండిరనియు చెప్పిరి. వారి మాటలు సత్యములా యని నేను మిమ్ముల నడుగుచున్నాను."

"నిజమే మహారాజా! ధ్యానమువలననే వా రన్ని విషయముల గ్రహించుచుండిరి. అదియే వారి సర్వజ్ఞత. అది

---

* మిళిందప్రశ్నలు. 41 1/2

సత్యమే కాని భగవంతుని సర్వజ్ఞత కిందువలన లోటు కలుగు చున్నదా ?"

"కలుగుచున్నది స్వామీ !"

"అయితే మహారాజా, నే నొక ప్రశ్న నడిగెదను. ఆలోచించి జవాబు చెప్పుడు"

"చిత్తము. అవహితుడను."

"తమరు మహారాజులు, చక్రవర్తులు. తమ యింట ఘృత, క్షీర, దధి ధాన్యాదులకు లోటు లేదు. కాని అకాల మున నొక యతిథి మీ యింటికి వచ్చినపుడు భోజనాలయ మున సిద్ధాన్నము లేకుండినందున అతిథి సత్కారమున కాలస్యమైనచో మీరు నిర్ధనులని రుజువగుచున్నదా ?"

"కాదు స్వామీ ! అకాలమున చక్రవర్తి భోజనా లయమున గూడ వండిన యన్నము లభింపదు. అందువలన నాతడు నిర్ధనుడని పిలువబడజాలడు."

"అటులనే బుద్ధభగవానుని సర్వజ్ఞత సృజనాత్మక మైనది. అందువలన తక్షణ మెఱుగజాలనంత మాత్రమున బుద్ధుడు అజ్ఞాని కాజాలడు. ఈ విషయముననే మానవ మాత్రులకంటె నాతడు గొప్పవాడు."

"ధన్యులు ఆర్యా. తమ నిరూపణ మద్భుతము. తమ తర్క-శక్తి యాశ్చర్యకరము! నా సందేహము తొలగి పోయినది. *

---

* మిళిన్ద ప్రశ్నలు. 411/3

ఇటుల ప్రశ్నోత్తరములు మరికొంతసేపు సాగెను. అటుపిమ్మట సభా సమాప్తిని తెలుపు శంఖముపూరింప బడెను. మహారాజులు లేవగనే వారి పరిచారకులలో. అలజడి గోచరించెను. మహారాజులు గొప్ప యేనుగు నధిష్ఠించి వెడలిన తర్వాత కృష్ణవర్ధన రాజకుమారులు నన్ను పిలిచి సంధ్యా సమయమున వారిని కలిసికొమ్మని ముక్తసరిగ నాదేశించిరి. వారు వెడలిన పిదప నే నాచార్యపాదుల చెంత కరిగితిని.

# పదమూడవ ఆధ్యాయము

మహారాజాధి రాజులు నన్నువిచిత్రరీతిని గౌరవింప వందున, రాజసభ నుండి వెలుపలికి వచ్చిన తర్వాత నా చిత్తము క్షోభగ్లాన్యాది భావములచే సంక్షుభితమై యుండెను. సూర్యాస్తమయ సమయము వఱకు నే నవసరముగ నగర వీధులందు తిరుగు చుంటిని. నిజముగ నా సమయమున నేను భావావేశ పూరితుడనై యుంటిని. రాజసభయందు ప్రవేశించ గనే చంద్ర కాంతిమణి నిర్మితము, సుందరమునైన పీఠముపై నా సీనులై అశనిపాత భయమున నొకచోట చేరిన కుల పర్వతముల మధ్య నున్న సుమేరు పర్వతమా యన్నట్లు శోభించుచుండు మహారాజాధి రాజులను నేను కాంచితిని. నానా రత్నాభరణ ప్రభా వీచికలచే వారి శరీరము వేల కొలది యింద్ర ధనుస్సులచే నాచ్ఛాదితమైన మేఘమువలె నలరారు చుండెను. వారి యాసనము పై భాగమున తెల్లని పట్టు వితానము శోభిల్లుచు దాని నుండి ముత్యాల సరములు వ్రేలాడు చుండెను. నలు మూలల నాలుగు మణి మయ దండములపై బంగారు గొలుసులచే నీ వితానము బిగించ బడి యుండెను. బంగారు పిడులుగల చామరములు వీవబడు చుండినవి. స్ఫటిక మణిమయ మగు గుండ్రని పాద పీఠ ముపై మహారాజుల యెడమ కాలు మోపబడి యుండెను. నేలపై నీలమణులే పఱచి యున్నందున సభా మండపమున నించుక నీల వర్ణము వ్యాపించి యుండెను. మహారాజులు అమృతపు నురుగు వంటి స్వచ్ఛమగు రెండు దుకూలములు

ధరించి యుండిరి. వారి యంచుల యందు గోరోచనపు రంగుశోభాంసలు చిత్రితములై యుండెను. ఎక్కువ సువాసనగల శ్వేత చందనము పూయబడనందున వారి వక్షఃస్థలము తెల్లగ నగపడుచుండెను. చందన లేపనముపై కుంకుమచే కమలము చిత్రితమై యుండెను. అవి చూపరులకు ఉదయించుచున్న సూర్యుని కిరణముల నున్న నొప్పు కైలాస పర్వతమా యను భ్రమగొల్పు చుండెను. గొప్ప ముత్యాల హార మొకటి మహారాజుల వక్షమున విరాజిల్లు చుండెను. భుజములపై చందనపు సుగంధముచే నాకర్షింప బడిన భుజంగములు భుజములను చుట్టుకొని యున్నవా యన్నట్లు, ఇంద్ర నీలమణి ఖచితములైన కేయూరములు శోభిల్లు చుండెను. చెవులయందు దమర్చ బడిన యుత్పలము లత్యంత మనోహరముగ నుండెను. అష్టమి చంద్రుని బోలిన మహారాజుల విశాల లలాటమునుండి తేజస్సు వెలువడు చుండ వారి కేశములం దమర్చ బడిన పొగడ పూవుల వాసనచే సభా మండపమంతయు ఘుమ ఘుమ లాడుచు నానందమున తేలియాడు చుండెను. నే నింత వఱకు నింత గొప్ప వైభవమును చూచి యుండనందున నీ వైభవపు ప్రభావము నన్ను పరవశుని గావించెను. మహారాజు వారికి నన్నెఱుక పఱచిన తర్వాత వారు నన్నీసడింపు దృక్కులతో చూచి తన వెనుకనే సమీపమున గూర్చుండి యుండిన మాళవ రాజకుమారునితో "ఇతడు పరమ విషయలోలుడు!" అనెను.

ఈ మాట వినగానే నా చెవుల రక్త నాళములు గూడ నడిచిన రక్తముచే నెఱ్ఱబారెను. తీవ్రమగు మనః క్షోభ వలన నా శరీరమంతయు భగ్గున మండిపోయెను. తల గిఱ్ఱున తిరిగి నేను క్రింద పడిపోవుదు నేమో యని తలచితిని. అచటి యైశ్వర్య ప్రభావముచే నభిభూతుడను గాకుండినచో నే నీ వాక్యమునకు తగిన ప్రత్యుత్తర మొసగి యుండెడి వాడనే. నేను సభా భవనము నుండి వెలుపలికి వచ్చిన తర్వాత నా మనస్సునందు వేలకొలది ప్రత్యుత్తరము లుద్భవించి యుండెడి తీవ్రమై పోవుచుండెను. కాని సభా మండపమున నున్నంత వఱకు నేను నాలో కుమిలి పోవు చుంటిని. నా కప్పుడు నా ప్రాణముల లెక్కయే లేదు. కాని మహారాజు లైనంత మాత్రమున నెవరి నైనను నోటికి వచ్చి నట్లు మాటాడుట కధికారము లేదని తెలుపునట్టి, ప్రత్యుత్త రము నే నొసగ జాలక పోతిని. కాని నే నా సమయమున మూగ వాని వలె, స్తబ్ధునివలె, జడుని వలె, చేతులు జోడించి నిలుచుండి యుంటిని. మహారాజు లితర కార్యముల నిమగ్ను లైరి. నే నచట నున్నానని వారను కొనలేదు. నే నొక మనుష్యునివలె వారి కంటికి కనబడలేదు. ఐశ్వర్య మదము, తేజో భ్రష్టత్వమున కింతకంటె బీభత్సమగు నుదాహరణ మింకొకచో కన్పింపదు. ఇటుల కొంతసేపు గడచెను. రాజు గారు మరల నాపై నొకమారు తమ దృష్టిని ప్రసరించిరి. వారికి గూడ తమ మాటలను గుఱించి ఖేదము కలిగెను. కాని యాశ్చర్య మేమన రాజసభ యంతయు మాఱు మాటా డక ఊరకుండెను. స్పష్టముగ రాజగారు పొరబడు చుండుట

జూచియు అందులకు భిన్నముగ మాటలాడుట కెవరును సాహసింపలేక పోయిరి. నే నంతలో కుదురుపాటు చెంది, కంఠమును సవరించుకొని "ప్రభూ ! నా యపరాధము క్షమింతురు గాక ! తమరు చక్రవర్తులు. కాని శ్రీ వారి మ్ముఖము నుండి వెలువడిన మాటలు పక్షపాతము లేని శాస్త్రజ్ఞులవి కావు. తమరు అశ్రద్ధ ధానుని వలెను, నేయుని వలెను ప్రపంచము నెఱుగని వాని వలెను మాటాడు చున్నారు. రాజరాజేశ్వరులగు తమ రీ విధముగ నితరులపై నిర్ణయాత్మకమగు దోషారోపణము గావించుట పాడియా ? ఎట్టి దుర్మార్గుడు తమకు నాపై విరుద్ధముగ నేమి చెప్పెనో తెలియదు. వాని మాటల నాధారముగా చేసికొని నేను చేసిన తప్పేదియో నన్నెరుగనీయక తమరీ విధముగ పలుకుచున్నారు. నేను సోమపీథులగు వాత్స్యాయనుల విమల వంశమున జన్మించితిని. యథా సమయమున ఉపనయనాది సంస్కారములను పొంది యున్నాను. వేదములను సాంగోపాంగముగ నధ్యయనము చేయు భాగ్యము నాకు లభించినది. శక్తి కొలది శాస్త్రాభ్యాసము చేయుచున్నాను. అట్టి నేను మీకెట్లు విషయ లోలుడనుగా పొడగట్టు చుంటినో నేగ్రహింప జాలకున్నాను" అని యుగ్గడించితిని.

మహారాజుల మనసు కొంత మెత్తబడినది. వారు మెల్లగా "నే నా విధముగ విని యుంటిని" అని యతి తిరస్కార భావముతో నన్నొకపరి చూచి యితర కార్యములలో నిమగ్నులైరి. వారు నాకు కూర్చుండుట కాసనమియ్య లేదు. తాంబూలము చే సత్కరింపలేదు. ఈ మాటు

అదుపులేని నా మనస్సు అడ్డము తిరిగిన గుఱ్ఱమువలె సంయమమును వీడి చెలరేగినది. ఏమీ ? మహారాజులు నా విషయ లోలత్వమును గుఱించి విని యుండిరా ? వీరు వ్యభిచారులకు శరణ మొసగు చున్నది నాకు తెలియదా ? మౌఖరీ వంశమునకు చెందిన చిన్న మహారాజు వంటి పాపులగు నెందఱు సామంతులు వీరి ఛత్రచ్ఛాయల దుర్దమనీయులై విఱ్ఱవీగు చున్నారో కదా ! వీరు నన్ను గుఱించి విన్నారట ! ఏమి విని యున్నారో ! ఇంతే కదా, నేను చిన్న మహారాజుల యంతఃపురమున ప్రవేశించి భట్టినినచట నుండి విడిపించి వెంట తీసుకొని పోతిననియే గదా వినియుందురు ? ఇదేనా విషయలోలత ! ఇది మహారాజుల యైశ్వర్యగర్వము కాదా ? ఛీ ! కోపముచే నా పెదవులు చలింపసాగినవి. నేనేదో యనబోవుచుండగా కృష్ణవర్ధన రాజకుమారులపై నా దృష్టి పడెను. వారు నన్ను శాంతింపుమని సంజ్ఞ చేసిరి. మంత్రరుద్ధమై కాలరాచబడిన భుజంగమువలె నే నున్నగా సి నున్నట్లై యుంటిని. కొంతసేపటికి మహారాజులు మరల నాపై దృష్టిపఱపిరి. ఈ మాఱు కృష్ణవర్ధనులు లేచి వినయముతో "ప్రభూ, బాణభట్టు పవిత్రమగు వాత్స్యాయన వంశతిలకులు. వారికి తగు మర్యాద జరుగవలెను." అని విన్నవించిరి. మహారాజాధిరాజులు మౌనము వహించి రాజకుమారుల మాటల నంగీకరించిరి. రాజకుమారులు నన్ను అచటినుండి వెడలుమని సైగ చేసిరి. నేను గర్వముతో రాజసభనుండి వెలుపలికి వచ్చితిని. నాడు నే నేదేని యౌద్ధత్యము గావించియుండిన గొప్ప యనర్థము

జరిగియుండెడిదని నా కీనాడు స్ఫురించుచున్నది. నాడు నే నభిభూతుడవలె నుండుటయే మేలయ్యెను. అయినప్పటికి మహా రాజాధిరాజుల సహవాసమువలన వాస్తవముగ వారి హృదయము కుసుమముకంటెను కోమలమైనదని నేను బాగుగ గుర్తించితిని. నాడు వారు దయదలచియే నా యెడల నటుల ప్రవర్తించిరి. నిజముగ నన్ను గుఱించి మిక్కిలి అసభ్యము లగు విషయములు వారి కెవరో తెలిపిరి.

ఏదైనను కానియే కాని నాడు నా యుల్లము క్షోభ చెందెను. ఏమియు తోచక నేను ప్రమత్తునివలె నగరవీధు లందు తిరుగుచుంటిని. సాయంకాలమున వీధులలోని దీపములు వెలిగించబడెను. పక్షులు తమ తమ గూళ్ళకు తిరిగి వచ్చుచుండెను. స్వచ్ఛమగు నీలాకాశమున నొకటి రెండు నక్షత్రములు కూడ మిణుకు మిణుకు మనుచుండెను. నేను తిరిగి తిరిగి చివరకు నిపుణిక దుకాణమున్న చోటికి వచ్చి చేరితిని. ఆ స్థలమును నేను కష్టముతోనే గుర్తింపగలిగితిని. అచట చేరగనే నాకు భట్టిని మాటలు జ్ఞాపకమువచ్చెను. సుచరిత గూడ నిచ్చటనే యుండవలెనుగదా? ఆమెను గుఱించియే తెలిసికొనియే వెళ్ళెదనుగాక! మహారాజులతో నా కేమిపని! నేను వారితో భట్టినిని గుఱించి మాటాడదలచుకోలేదు. కృష్ణ వర్ధను లన్యాంగ సితి నిపుణులై సందున వారి మాటలే నాకు సరిగా నర్థముగుటలేదు. వారేమి కోరుచున్నారో వారికే యెఱుక! ఆచార్య సుగతభద్రులవలన కొంత సహాయము నాశింపవచ్చును. కాని వారు రాజకుమారులపై నాధారపడి యుండువారే! మఱి సుచరితయొద్దకు వెళ్ళుట కాటంక

మేమి! ఇందెవతెకిని అసంతృప్తి కలిగించవలయునను తలంపే లేదుకదా? కాని సుచరిత యెచటనున్నది! ఇచటి వారెవరైన నన్ను నెఱుగుదురా? ఎవరైన వృద్ధుడగు పెద్దమనుష్యుని అడుగుట యుచితముగ నుండును. కన్యాకుబ్జపు యువకులను నేను బాగుగ నెఱుగుదును. వారు తెలియనివారిని హేళనపాత్రులుగ భావించి, వారి నగతాళిచేసి యానందించుచుందురు. అందువలన నేను మార్గమున నొకవైపు వెళ్ళుచుండిన యొక వృద్ధుని జూచి "ఆర్యా, నేను మిమ్మొక విషయ మడుగవలయునని కోరుచున్నాను" అని యంటిని.

"ఏమిటది బాబూ?"

"తమరి దీనగరమేనా!"

"చాల కాలమునుండి నే నీ నగరముననే నివసించుచున్నాను. నేను కాశీనగరపువాడను. కాని, యీ నగరము నించుమించుగ పూర్తిగ నెఱుగుదును. నీ వేమి యడుగదలచితివి? ఈ నగరమునకు క్రొత్తగా వచ్చితివా?"

"చిత్తము. నిన్ననే యిచటికి వచ్చితిని. మాది మగధ దేశము."

"నిన్న వచ్చితివా! ఇంతకుమున్నెన్నడును వచ్చియుండలేదా!"

"ఫాల్గుణమాసమున నొకటి రెండు దినము లిచటనే యుంటిని."

నా మాటలు విని వృద్ధుని ముఖమున సంతోషము కనబడెను. ముడుతలుపడిన యతని కపోలములు చిఱునగవు

వలన విష్ఫారినన్నీ. అతడు "మూడు నెలలలో స్థానేశ్వరమున గొప్ప మార్పు గలిగినది. అవిగో, అచట జరుగుచున్న యేర్పాట్లు మూడు నెలలలో నింతగా వ్యాప్తమొందినవి. ఈ విచిత్రమగు ధర్మాచార్యాని భక్తిప్రవాహమున మునిగి తేలని స్త్రీ యీ నగరమున నొకతెయైనను లేదుగదా! పురుషుల సమూహ మొకటి గూడ నీ ఆయోజనమున చేరియున్నది. నాయనా! కన్యాకుబ్జ మొక విచిత్రమగు దేశము. మఱము పేర నీ విధముగ కాశీనివాసులు పరువళ్ళెత్తరు." అని యనెను.

వృద్ధుని లోటు నా కర్థమయినది. నేను స్వయముగ కాశీలో పురాణపఠనము చేసి వేలకొలది స్త్రీ పురుషులను ముగ్ధులను కావించితిని. కనుక నేనా విషయమును గుఱించి యీ వృద్ధునివద్ద తెలిసికొనవలసిన దేమియును లేదు. కాని నా కతని యొద్దనుండి వినోదము కల్గించు విషయములు తెలియుచుండుటచే నే నతనిని పొగడితిని. "ఆర్యా, కాశీ మాటయే వేరు! అది విద్యకు పీఠము; శాస్త్రజ్ఞానమునకు పుట్టినిల్లు" అని యంటిని.

వృద్ధుడు మఱింత యుత్సాహముతో "చాల రోజుల క్రిందట శ్రీపర్వత నివాసియగు వైష్ణవతాంత్రికుడు వేంకటేశభట్టు ఈ నగరమునకు వచ్చియున్నాడు" అని యనెను.

నేను మధ్యలో నతని నాపి "ఏమంటిరి! శ్రీపర్వతము వామాచారులకు, కాపాలికులకు సాధన క్షేత్రముగదా! అది వైష్ణవ తాంత్రికులకు గూడ సాధనక్షేత్రమని నేను క్రొత్తగ వినుచున్నానే!" అని యంటిని.

వృద్ధుడు చిరునవ్వుతో "భద్రా, కన్యాకుబ్జమునకు వచ్చియున్నావుగదా! చాల క్రొత్త విషయములు వినెదవు లెమ్ము! ఈ వేంకటేశభట్టు మొదట ఉడ్డీయాన పీఠమున బౌద్ధతంత్రము నభ్యసించుచుండెడివాడు. మఱి యచట నేమి జరిగినదో దేవుడెఱుగును. కాని, యితడు మాత్రము శ్రీపర్వతమునకు వెళ్ళి యచటనుండి యిప్పుడు కన్యాకుబ్జమునకు వేంచేసి దీనిని పవిత్రనంతము గావించుచున్నాడు! మొట్టమొదట చపల స్వభావముగల స్త్రీలే యితనియొద్ద దీక్షగైకొనిరి. చిన్న యంతఃపురములో నిఉనియ యనెడి దాసి యుండెడిది. అది ప్రప్రథమమున నితనియొద్ద నుపదేశము బడసెను. కాని యది యెక్కడకో యంతర్ధానమై పోయినది. ఇతనికి రెండవ శిష్యురాలు సుచరిత. ఈ వీథిలోనే యది ప్రసిద్ధి చెందిన గాయని. అది యిప్పుడీ నగరములో ప్రధానమగు భక్తురాలనిపించుకొనుచున్నది. ఇప్పటి స్థితి యెంతదనుక వచ్చినదనగా, సాయంకాల మగుటయే తరువాయిగ, అంతఃపుర మంతయు నిశ్శేషముగ నీ ఆయోజనలో పాల్గొనుచుండును. కంచు తాళములు, కరతాళములతో బాటు, సరియగు వాద్యము మ్రోగుచు వెఱ్ఱెత్తించునట్టి వాతావరణము కలిగించుచుండ సుచరిత సంగీత మంత్రము మోహనమంత్రమువలె నందఱిని ముగ్ధులను చేయుచుండును. వేంకటేశ భట్టు ఆవేశముతో నాట్య మాడునపుడు భూతముల రాజు మద్యమును గ్రోలి తూలుచున్నాడా యని యనిపించుచుండును. ఇది చాల విచిత్రమగు మతము బాబూ! నీవును వెళ్ళి యొకమాఱు చూడరాదా?" అని యనెను.

నేను వినయముతో "తప్పక చూచెదను. ఆర్యా! కాని యీ సుచరిత మొదట నేమి చేయు చుండెడిది?" అని యడిగితిని. వృద్ధుడు నవ్వి "నాయనా! నీ సమవయస్కుల వలన నీ వా సమాచారము తెలిసి కొనగలవు. నేను తల నెరసిన వృద్ధుడను బాబూ!" అని యనెను.

ఈ మాట వృద్ధుడు రసావిష్టుడయ్యెను. అతని యందు గ్రామవాసి స్వభావము స్పష్టముగ గోచరమయ్యెను. నేను చిఱునవ్వుతో "ఆర్యా! క్షమింపుడు. నేనచటికి చూచుటకు వెళ్ళుచున్నాను." అని యంటిని.

వృద్ధుడు "మఱి నీ వేలో యడుగవలయు నంటివే?" యనెను.

నేను త్వరగ వెళ్ళవలసినందున "ఈ విషయములనే మిమ్ములనడిగి తెలిసికొనవలయు ననుకొంటిని." అని పలికి నేనా వృద్ధునికి నమస్కరించి యచ్చటి నుండి సెలవు గైకొంటిని. నేను గొప్ప సంతోషముగా వెళ్ళితిని. జనసమూహము క్షణ క్షణ మెక్కు వగుచుండెను. నిజముగనే వచ్చిన వారిలో స్త్రీల సంఖ్యయే యధికముగ నుండెను. అందఱి ముఖములపై భక్త్యుల్లాస భావములు స్పష్టముగ కనబడుచుండెను. వేంకటభట్టు చందనపీఠముపై పద్మాసనము వేసికొని కూర్చుండియుండెను. అతని యాసనమున కెదుట నొక వేదికపై కలశముంచబడియుండెను. శక్తిపూజ చేయు తాంత్రికుల శ్రీచక్రమువలె, ఊర్ధ్వముఖము గలిగిన త్రికోణచక్రమును రెండు భాగములుగ చేసి, యధోముఖము కలిగిన త్రికోణచక్రము బియ్యము మినుములనే నేర్పరచి

యుండుట గాంచి నా కాశ్చర్యము కలిగినది. నే నింతవఱకు నూర్ధ్వముఖ త్రికోణచక్రము శివతత్త్వమును సూచించున దనియు నధోముఖ త్రికోణచక్రము శక్తితత్త్వమును తెలుపున దనియు ననుకొనియుంటిని.

భాగవత సంప్రదాయమునకును వీనికిని దూరపు సంబంధముకూడ లేదు. ఈ పద్మమున కెక్కడ స్థానమే లేదు. వీయన పద్మమున్నచోట తప్పక వజ్రముండవలెను. ఇట్లుండిన బౌద్ధతంత్రమే దీనిని అంగీకరించును. ఇదియొక యపూర్వ సమ్మేళనము. మగధలో సాధారణమగు వ్యక్తి గూడ నీ యనుష్ఠానము నాక్షేపించియుండును. కాని కన్యా కుబ్జమొక విచిత్ర దేశము! బాహ్యాచారములో నువ్వుగింజంత మార్పునుకూడ నిచట సహింపరు. కాని ధర్మానుష్ఠానమున ప్రతిదినము క్రొత్త పద్ధతులు కలియుచుండును. ఏమైనను సరియే, యిది వినోదము కలిగించునట్టి యనుష్ఠానమే. ఈ వేంకటేశభట్టే నిపుణికకు గురువనియు, నిట్టి యనుష్ఠానమును ప్రథమమున నామెయే జరిపియుండుననని తలచుకొన్న పుడు నాకు మఱింత వినోదము కలుగుచుండెను. కాని నిపుణిక యీ విషయమై యెన్నడును నాతో ఏల ప్రసంగించి యుండలేదు? దీనికి కారణమేదో యుండవచ్చును. నేను జాగ్రత్తగ చక్రమును పరిశీలించితిని. నట్టనడుమ పద్మమున్నచోటికి నలుప్రక్కల సిందూరముతో గుండ్రని చక్రములు వేసి యుండెను. ఈ సాధనపద్ధతియందు దివి వజ్రమునకు బదులుగ నున్నవా? పద్మముపైన రాగి కలశముండెను. కలశముపై మామిడాకులును వానిపై నొక రాగిపాత్ర నిండుగ యవ

లుండెను. అప్పుడే దీపారాధన జరుగుచుండెను. ఆచార్యుల కుడివైపున నొకపురోహితుడు మంత్రపఠనము చేయుచుండెను అతడు చెప్పిన ప్రకారమొక యువతి పూజావిధులను నిర్వహించుచుండెను. ఈమెయే సుచరితయై యుండవచ్చునని నే నూహించితిని. దీపములు వెలిగించునపుడు పఠించిన పురోహితుని సంకల్పమువలన నే నూహించినది సత్యమని తెలిసెను.

సుచరిత తెల్లని పట్టుచీరను ధరించియుండెను. ఆమె ముఖము గురువుగారి వైపునకు తిరిగియున్నందున నేను దూరమునుండి యామె ముఖమును చూడలేకపోతిని. ఆమె పలుచని శరీరము శ్వేతవస్త్రాచ్ఛాదితమై యున్నందున శ్రీమన్నారాయణుని మందహాసరేఖవలె నగపడుచుండెను. ఆమె ప్రతి చేష్టయందు నొక విధమగు గౌరవభావ ముట్టిపడుచుండెను. దీపారాధన, సంకల్ప పఠనము పూర్తి కాగానే ఆ దీపము నామె కలశముపై నుంచలేదు. కడు సుకుమార భంగిమమున నామె యా దీపమును పైకెత్తి వామహస్తమున త్రిపతాక ముద్రను బట్టి దీపముపై దానిని దక్షిణముఖముగ త్రిప్పెను. కిన్నంతయు నామె యత్యంత సహజభావమున చేసెను. చాలకాలమునుండి యభ్యాసము చేసినందున నామె హస్తము లవలీలగ తిరుగుచుండెను. అటు పిమ్మట నామె తన యెడమచేత చీరకొంగును లాగి మెడకు చుట్టుకొని భక్తి భావభరితయై మోకాళ్ళపై నిలుచుండెను. ఆమె చేయు క్రియలలో గురుపూజయే ప్రధానమైనదిగ కనబడుచుండెను గురువుగారి యెదుట చాలసార్లు దీపమును త్రిప్పిన తర్వాత నామె లేచి నిలిచి గురువుగారి కొకసారి ప్రదక్షిణము గావించి

మరల మోకాళ్ళపై నిలుచుండెను. ప్రదక్షిణము చేయుచున్నపుడామె చేతులు దీపమును దక్షిణముఖముగ త్రిప్పుచునే యుండెను.

ఆ సమయముననే నేనామెను బాగుగ చూచితిని. ఆమె వామనచాయగ నుండెను. అయినను ఆమె కన్నుల యందొక యపూర్వ మాధుర్యము గోచరమగుచుండెను. అధరములందు స్వాభావికముగ నవ్వును కలిగించునదియు సౌందర్య శాస్త్రవేత్తలచే 'రాగ' మని పిలువబడునదియు నైన ధర్మ మామె గంభీర ముఖశ్రీయందు ప్రత్యక్షముగ కనబడుచుండెను. ఆమె ప్రత్యంగ భంగిమనుండియు భక్తి భావము బయల్వెడలుచుండెను. కాని యామె నడకయందలి వక్రతను, పరిపాటిలేని యామె శిష్టాచారమును జూచి, యామె యింతకుపూర్వము 'ఛాయానతి' యై యుండనచ్చునని మెట్టి యనామకుడైనను చెప్పగలడు! మనస్సును రంజింపజేయు నే గుణమును సహృదయులు 'సౌభాగ్యము' అని వ్యవహరింతురో, పుష్పమునందుండు పరిమళమువలె రసికజనుల మానస భ్రమరముల స్వభావము నేది వశపరచుకొన జాలునో యట్టి ధర్మము భాగ్యవశమున సుచరిత కబ్బినది. ఆమె ప్రథమవయస్సము సౌందర్యకాంతులను విరజిమ్ముచుండ నామె ప్రతి అంగ విక్షేపమునుండియు నౌదార్యము ప్రకటితమగుచుండెను. శరీరచ్ఛాయ, కాంతుల నిచ్చుటయందు కృపణుడైనను, శోభను చేకూర్చు నితరములగు నుపాదానములనొసగుటయందు విధాత యీ నారీరత్నము నెడ పక్షపాతము గనబఱచె ననుటలో నాకు సందేహము కలుగలేదు.

ఈ ప్రాంతపు స్త్రీలయందు 'ప్రక్షేప్య', 'ఆవేధ్య' అలంకారము లెక్కువగ వాడుకలో నున్నవి. కాని సుచరిత, చెవుల యందు చక్రాకారము గల కుండలములు తప్ప మఱే యే యావేధ్యాలంకారములను దాల్చలేదు. ప్రక్షేప్యాలంకారముల నామె ధరించనే లేదు—మంజీర నూపుర మేఖలాదు లేవియు నామె శరీరము మీద లేవు. ఆరోప్యాలంకారముల నెడ నామె కెక్కువ ప్రీతి కనబడుచుండెను. అయినను వానిలో స్వర్ణహారము, మాలతీ మాలయు తప్ప మఱేవియు నామె శరీరముపై కనబడలేదు. మాలతీ మాలకు సుచరిత శరీరపు రంగు ఉచితమగు అలంకారముగ నుండెను. మాలతీ మాల యింత మనోహరముగ నాకెచటను కనబడలేదు. నాకు మాటి మాటికి వరాహ మిహిరుని మాట జ్ఞప్తికి రాగా, నేనాతని రసిక హృదయమునకు ముగ్ధుడనగుచుంటిని "స్త్రీలే రత్నముల కలంకారము లనియు, రత్నములు స్త్రీల కలంకారములు కాజాల వనియు, రత్నములు లేక యే స్త్రీ లాకర్షణీయలుగ నుండుదురనియు, స్త్రీల యంగముల నాశ్రయించనిదే రత్నములు శోభింప" వనియు వరాహ మిహిరుడు నుడివి యున్నాడు.* అది నిజము. నేడు వరాహ మిహిరు డిచటనుండి యుండెనచో స్త్రీ శరీర లావణ్యము నీ విధముగ వర్ణించి యుండెడి వాడు కదా! "ధర్మ కర్మములు, భక్తి జ్ఞానములు, శాంతి సౌమనస్యములు - నివి

---

* వరాహ మిహిరుని బృహత్సంహిత (74-2)

రత్నాని విభూషయంతి యోషా భూష్యంతే వనితా న రత్నకాంత్యా!
చేతో వనితా హరంత్యరత్నా నో రత్నాని వినాంగనాంగ సంగాత్ ॥

ముసు నారీ స్పర్శ పొందనిదే మనోహరములు కాజాలవు. స్త్రీ దేహము శిలా మృత్పిండములను కూడ 'స్వర్ణముగ మార్చగల స్పర్శ వేధి !"

మరకత శలాక వంటి తన్వి సుచరిత దీపారాధన తర్వాత చేతులు జోడించి గురువుగారి యెదుట కూర్చుండెను. తర్వాత వివిధములగు నుపచారములతో శ్రీ మన్నారాయణుని పూజ ప్రారంభ మయ్యెను. పూజ సమాప్తము కాగానే వేంకటేశ భట్టు ఆనంద గద్గద స్వరమున నారాయణ స్తుతి చేయసాగెను. చూచు చుండగనే సంయమక వాద్యము, కాంస్య, కేళీ, కరతాళములు మ్రోగసాగెను. మఱి యొక లోకమున నున్నట్లు నేను భావించితిని. ఇట్టి సంగీత వాద్యముల మనోహర సమ్మేళనము నేనిదివఱ కెచ్చటను కనీవినీయెఱుగను. ఇది నాకొక క్రొత్త విషయము. ధర్మానుష్ఠానముల యందిది క్రొత్త యేర్పాటు. వాయు మండలపు ప్రతి యణువునందు శ్రీ మన్నారాయణుని స్తుతి ముఖరితమగు చుండినట్లును, దిఙ్మండల మంతయు సలయమక గంభీర నాదముచే ప్రతిధ్వనించు చున్నట్లు నుండెను. ఈ విధముగ చాలసేపు జరిగెను. తర్వాత తటాలున అందఱు మౌనముగ యుండిరి. గురువుగారి యాజ్ఞానుసారము సుచరిత శంఖమును పూరించెను. నేను మఱి యొకమారు ఆశ్చర్య చకితుడ నైతిని. స్త్రీలు శంఖమును పూరించుట నేనింతకు పూర్వము చూచి యుండ లేదు. కాని యీ భజన యన్ని విధముల విచిత్రముగ నుండెను. ఇప్పుడు వేంకటేశ భట్టు నామ సంకీర్తనము ప్రారంభ మయ్యెను. అతడు లేచి నిలుచుండెను. అతనిది

దీర్ఘము కంఠము తిరిగిన శరీరము, కవాటము వంటి విశాల మగు వక్షస్స్థలము, ఆజాను బాహువులు, మృదంగ మంద్ర కంఠస్వరము. ఉపోద్ఘాతము లేకుండ నతడు "నారాయణుని చరణారవిందాశ్రయ మిద్దఱు ముగ్గురు పాపులను మాత్ర ముద్ధరింప దగినదై యుండెను. కాని యాతని నామ సంకీర్తన మిప్పుడు భక్తుల నశేష క్లేశములను నశింప జేయు చున్నది." అని యనెను. ఈ యుపదేశము నాకు వింతగ తోచెను. నేనీ విషయము నర్థము చేసికొన ప్రయత్నించు చుండగనే అతడు గద్గద కంఠమున—

శ్లో॥ ద్విత్రాన్ సముద్ధర్తు మలం బభూవ
పదారవిందాశ్రయణం మురారేః ॥
అశేష సంక్లేశ శమం జనానాం
నిత్యం విధత్తే వసుధామనామ ॥

అని పాడి భావావేశమున నొక విశేషమగు కంఠస్వర మున "నారాయణ, నారాయణ" అని వల్లించుచు నాట్య మాడసాగెను. తిరిగి సంయువశము కాంస్యకేళ కరతాళములు మ్రోగసాగెను. సహస్ర కంఠము లా స్వరముననే నారాయణ సంకీర్తము చేయసాగెను. గురువుగా రద్భుతమగు భావ విహ్వల దశయందుండి ఒకటి రెండు మార్లు స్మృతి తప్పి క్రిందపడిరి. సుచరిత మాత్రము మొదటి నుండి నివాత నిష్కంప దీపకళికవలె చేతులు జోడించి కూర్చుండి

---

* (భాగవతం 2, 7, 14)
అశేష సంక్లేశ శమం విధత్తే గుణానువాద శ్రవణం మురారేః ।
కుతః పునస్తచ్చరణారవింద పరాగసేవా రతి రాత్మలబ్ధా ॥

యుండెను. చాల సేపటివఱకు నిశ్శబ్దముగ భజన జరుగుచుండెను. ఆహా! మర్త్య లోకమున నెట్టి సంగీత శీతల మందాకిని ప్రవహించుచున్నది! జన సమూహ మంతయు జడ పదార్థము వలె స్తబ్ధమై గా మాధుర ప్రవాహమున మునిగి తేలుచుండెను. సంగీతము సమాప్తి నొందిన పిదపనే యెల్లరకు స్మృతి కలిగి నట్లుండెను. క్రమక్రమముగ అందరు తమ తమ నివాసములకు కదలి పోసాగిరి. గురువుగారిని వారి నివాసమునకు చేర్చుటకై శిష్యులు ప్రయత్నించుచుండిరి. చివర వఱకు సుచరిత సభా మండపముననే యుండెను. అందఱును కదలి పోయిన తర్వాత, అచటనున్న సేవకుల కా మండపములో నున్న వస్తువులను జాగ్రత్త పఱచు భారము అప్పగించి సుచరిత కూడ తన యింటికి బయలు దేరెను సమయము చూచి నే నామె యొద్దకు వెళ్ళితిని.

సుచరిత యిల్లు చేరగానే నేను సాహసించి యామెను పిలిచి "అమ్మాయీ! అన్యథా భావింప కుండినచో నే నొక విషయము చెప్పవచ్చితిని." అని యంటిని. ఆమె వెనుకకు నా యొద్దకు వచ్చి "ఆర్యా, ఏమి యాజ్ఞ? తమ సేవ చేయ జాలుదునేని నేను ధన్యురాల నగుదును" అని నుడివెను. సుచరిత శరీరమే తీర్చి దిద్దిన బొమ్మవలె పొంకముగ నుండెను. ఆమె వస్త్రములు, పదన్యాసము, ఆమె కంఠస్వరము, ఆమె చూపులు, అన్నియు తగినట్లుండెను. ఆమె మాటలలో వీణానాదము వంటి మాధుర్య ముండెను. నేను మంత్ర ముగ్ధునివలె నామె పలుకులు వినుచుంటిని. కొంత

స్నేహైన తర్వాత ఆమె మరల "ఆర్యా! తను పని యేమో సెలవిండు"" అనెను. మరల నదే వీణానాదము! కదంబ కుసుమమువలె నా యొడలు పులకరించినది. ఆలసించుట యనుచితమని తలచి నేను "అమ్మాయీ! పరదేశస్థుడను. అనుచిత మేదైన పలికిన క్షమింపుము. చిన్నరాజుగారి యంతఃపురమున నుండిన నిపుణిక యనెడి పరిచారికను నీ వెఱుగుదువా?" అని యంటిని.

క్షణములో సుచరిత నల్లని కన్నులు ధూసరితములయ్యెను. ఆమె నన్ను ఎగాదిగ చూచి, సందేహసంభ్రమములతో "అయ్యా, మీ రెచటనుండి వచ్చుచుంటిరి? ఎవరిని వెదకుచున్నారు? నేను సుచరితను. ఇదే నా యిల్లు ఇంతకన్న నెక్కువ నే నేమియు మీ కెఱింగింపజాలను. క్షమింపుడు" అనెను. ఆమె యనుమానమునకు కారణము నే నూహించితిని. వినయముగా నేను, "అమ్మాయీ, నీవు చెప్పినదే నాకు చాలును. నీవు సుచరితవు. నీ చెలి యగు నిపుణిక యింకను జీవించియున్నదను సంగతి నీకు తెలియజేయుటకై నేను వచ్చితిని. ఆమె తనపై వేసికొనిన కార్యభారము నిర్వహించుటయుం దామె కృతకృత్యురాలైనది. నేను చెప్పవలసిన దింతే. నే నిక పోయివచ్చెదను" అని చెప్పి తలవంచుకొని వెనుకకు తిరిగితిని. సుచరిత కొంతసేపటివఱకు చిత్తరువువలె నిలుచుండి పిమ్మట మెల్లగా నన్ను పిలిచి "అయ్యా, ప్రసన్నులైతిరా!" అని యనెను. నేను వినయముగ "దేవీ! మీ యెడ నే నప్రసన్నుడనగుట కేమున్నది! మీ సంశయ సంభ్రమములకు నేను కారణముల నూహింప

గలను" అని యంటిని. సుచరిత అటు నిటు పరికించి చూచి "నేను మీ పేరు తెలిసికొనవచ్చునా ?" అని యడిగెను. నేను వెంటనే "దేవీ, నేను 'బాణభట్టు' అను పేర ప్రసిద్ధి చెందితిని. కాని నా పేరు 'దక్షభట్టు'. నేను మగధ దేశస్థుడను" అని యంటిని. నా పేరు వినగనే ఆమె తన చీర కొంగును మెడకు చుట్టుకొని, చేతులు జోడించి, నమస్కరించి భయముతో "ఆర్యా ! నా యపరాధమును క్షమింపుడు. అజ్ఞానుల యపరాధమును సాధుజనులు లెక్కచేయరు. నేను తమ పేరు వినియున్నాను. తమ యాజ్ఞయైనచో లోపలికి వెళ్ళి యీ విషయమై మిమ్ము కొన్ని సంగతుల నడుగుదును" అనెను. నే నందుల కంగీకరించితిని.

సుచరిత గృహము చిన్నదైనను చాల సుందరముగ నుండెను. గుమ్మమునుండి రాచబాటవఱకునున్న ప్రదేశమంతయు గోమయముచే నలుకబడి బలపపు చూర్ణముచే ముగ్గులు వేసి యలంకరింపబడి యుండెను. తలవాకిటిపైని క్షీరసాగర శయనుడగు 'నారాయణుని మూర్తి' చెక్కబడి యుండెను. దాని చుట్టూ మాలతీకుసుమముల మాల మనోహరముగ వ్రేలాడుచుండెను. ప్రక్కనున్న చిఱువేదికలపై మంగళకలశము లలరారుచుండ నింటిపైన సౌభాగ్యపతాక మెగురుచుండెను. ఆతిథ్యము స్వీకరింపుమని ఆమె కడు నాదరమున నన్ను ప్రార్థించెను. ఆమె మాటలలోగాని చేతలలోగాని సంశయము అణుమాత్రమైనను కనబడలేదు. అయినను సహజ లావణ్యమువలన ఆమె ప్రతి చేష్టయు కమనీయముగ కనబడుచుండెను. ఇంటియందు సామాను కొద్దిగ

నుండెను. కాని దానిని చక్కగా నమర్చియున్నందున గృహ శోభ మతీంత యెక్కువగుచుండెను. ఒక చిన్న గదియందు రెండు చాపలుండెను. ముందుభాగమున వాసుదేవుని మనో హరమగు విగ్రహముండెను. ఆ విగ్రహముచెంత అగరు వత్తులు వెలుగుచుండెను. అప్పటికే యామె దాసి దీపములు వెలిగించి యుండెను. సుచరిత తన సహజ మందహాసమున నన్నొక చాపపై గూర్చుండుడని ప్రార్థించి తానొక చాపపై కూర్చుండెను.

కొంతసేపటివఱకు నిశ్శబ్దముగ కూర్చుండిన పిదప ఆమె నిట్టూర్పువిడిచి మందస్వరమున "ఆర్యా, ఆ దౌర్భాగ్యురాలింకను జీవించియున్నదా!" అని ప్రశ్నించెను. సుచరిత ప్రతి చేష్టయందును ఆమె యాభిజాత్యగౌరవ ముట్టిపడు చుండెను. ఆమె కూర్చుండుటయందును, మాటయందును, నిట్టూర్పు విడుచుటయందును, ఒకటేమిటి ఆమె సకల కార్యము లందును నొకవిధమగు గొప్పదనము ప్రకటితమగుచుండెను. నేను తదేకధ్యానముతో నామెను చూచుచుంటిని. కాని ఆమె తన యాలోచనా పరంపరలలో మునిగియున్నట్లు కన బడుచుండెను. కొంతసేపైన తర్వాత నామె మరల నిట్లు ముచ్చటింపదొడగెను. "ఆర్యా, ఈనాడు తమ దర్శనము లభించుట నా భాగ్యమనవలసినదే. మిమ్ము గుఱించి నిపు ణికవలన నే నెన్నో విషయములు విని యున్నాను. సాధా రణముగ మాటలాడునప్పుడు కూడ నామె మీ పేరు చర్చ లోనికి తెచ్చుచుండెడిది. మిమ్ము దర్శింపవలెనని యెన్నియో దినములనుండి నాకు కోరిక కలదు. కాని నావంటి హీని కట్టి

భాగ్య మెట్లు కలుగును! నేడు నారాయణుడు ప్రసన్నుడై మిమ్ములను నా యింటికి పంపినాడు. నా యవినయము వలన మీ మనసు నొచ్చినది. ఆర్యా, ఏమని విన్నవింతును. ఇచట రాజాజ్ఞ దురతిక్రమము. రాజాజ్ఞచే నిపుణికకు ప్రాణ దండన విధింపబడినది. అయ్యో! నిపుణికా! ఎంత దౌర్భాగ్యురాలవే!" అని పలికి నిట్టూర్పు విడిచెను. క్షణకాలమూరకుండి యామె నన్ను "ఆర్యా, తమ రామె నెచట చూచితిరి!" అని ప్రశ్నించి, నన్ను తన విశాల నయనములతో చూడసాగెను. నేను మొదటనుండి చివరవఱకు జరిగిన దాని నంతయు సంగ్రహముగ చెప్పితిని. నేను చెప్పుచున్నంత సేపామె యొకప్పు డాశ్చర్యమును, మఱియొకప్పుడానందమును ప్రకటించుచుండెను. నేను చెప్పినదానినంతయు వినిన తర్వాత నామె కృతజ్ఞతాభరితములగు నయనములతో వాసుదేవుని దర్శించి, కన్నులలో నీరు నింపుకొని నన్ను చూచి, "ఆర్యా, నేడు మీ దర్శనము లభించుట నా భాగ్యము" అని సందేహముతో "నారాయణుని ప్రసాదము స్వీకరించుటకు మీ కే యాక్షేపణ యుండదుకదా, స్వామీ!" అని నన్నడిగెను. నే నుల్లాసపూర్వకముగ "దేవీ, ఏ యాక్షేపణయు లేదు. అందులకే బ్రాహ్మణుడు సిద్ధముగ నున్నాడు" అని యంటిని. సుచరిత ఖిన్న గంభీరవదన మొక్కసారి సరళ స్మితముచే మెఱసిపోయెను. ఆమె ప్రసాదమును సిద్ధము చేయుటకై వెడలిపోయిన తర్వాత నే నొంటరిగ నచటనే కూర్చుండి యుంటిని.

నా యెదుట నున్న వాసుదేవుని విగ్రహమును నేనొకసారి పరికించి చూచితిని. ఈ మనోహరమగు ప్రతిమను చెక్కిన శిల్పి నిశ్చయముగ నిపుణుడే! ఒకే రాతియందు వాసుదేవుని త్రిభంగిమము గల మూర్తి చెక్కబడి యుండెను. విష్ణుప్రతిమ యొక్క క్రొత్త రూప మిది. ఏల యన త్రిభంగిమము గల రూపము శృంగార రసమును వ్యక్తపఱచును. నే నింతవఱకు నిట్టి విగ్రహమును చూచి యుండ లేదు. వాసుదేవుని కంఠమున పూమాలవంటి దేదో యగపడుచుండెను. విగ్రహమున కెదుట అష్టదళ పద్మము నందు నాటి సాయంకాల పూజాసమయమున కలశ స్థాపనము నకై యేరర్పచిన యంత్రములోవలె ఊర్ధ్వముఖాధో ముఖ త్రికోణములు చిత్రింపబడి యుండెను. ఆ చిత్రించిన విధము కడు రమ్యముగ నుండెను. నే నించుక సమీపమునకు వెళ్ళి చూడ నాశ్చర్యముచే స్తంభించిపోతిని. ఈ యంత్రములో నానారూప బీజ విన్యాసముల తర్వాత కామగాయత్రి వ్రాయ బడియుండెను. నే నొకమాఱు వాసుదేవుని వైపునకును, మఱి యొకమాఱు కామ గాయత్రి వైపునకును చూచుచు నిలుచుంటిని. ఇదెట్టి విచిత్ర సమ్మేళనము? ఇది మన్మథుని విగ్రహమా! ఎన్నటికి కాజాలదు! కాని నేను చూచుచున్న దేమిటి మఱి! ఇదెట్టి విపరీతము! విష్ణుమూర్తి విగ్రహము, కామ గాయత్రి మంత్రము! "ఓం కామదేవాయ విద్మహే పుష్పబాణాయ ధీమహీ. తన్నో నంగః ప్రచోదయాత్!"

* నా కేమియు బోధపడలేదు. నేను ధ్యానముతో వాసుదేవుని మూర్తిని పరికించి చూచుచుంటిని. నే నీ విధముగ విస్మయాశ్చర్య చకితుడనై కూర్చుండి యున్నపుడు సుచరిత యచటికి వచ్చెను.

సద్యః స్నానముచే నామె మేని కాంతి యెక్కువైనది. ఆమె నల్లని ముంగురులు కపోలముల పైకి జారి శోభిల్లుచుండెను. పచ్చని పట్టుచీర ధరించి యున్న యామె యంగ యష్టి స్వర్ణశలాకవలె మనోహరముగ నుండెను. ఆమె చేతియందు వాసుదేవునికి నైవేద్యము చేయుటకు కొన్ని యుపహారము లుండెను. ఆమె వానిని వెండిపళ్ళెము నందమర్చి యుండెను. తెల్లని వెండిపళ్ళెము చేత నిడుకొని యున్న సుచరిత, పుష్పములతో కూడిన చంద్రమల్లికవలె నొప్పుచుండెను. ఆమె కుడిచేత నొక రాగి నగ యుండెను. ఆమె మూర్తీభవించిన భక్తివలెను, రూపము దాల్చిన శోభవలెను, ప్రత్యక్షముగ నావిర్భవించిన లక్ష్మివలెను, అనురాగవతియగు సంధ్యవలెను నొప్పుచు, హృదయము నొక యపూర్వ రససాగరమున ముంచివేయుచుండెను. నేనా విధముగ నాశ్చర్య చకితుడనై కూర్చుండి యుండుట గాంచి యామె జంకినది. నాకుకూడ సిగ్గు కలిగినది. నేను మెల మెల్లగ వచ్చి నా యాసనముపై కూర్చుంటిని. సుచరిత భక్తిపూర్వకముగ నైవేద్యమును వాసుదేవుని చరణముల యందిడి పైటకొంగును మెడకు చుట్టుకొని మోకాళ్ళపై

* నేడుకూడ వైష్ణవులలో నెన్నో తెగలవారు కామ గాయత్రితో శ్రీకృష్ణుని పూజించుచున్నారు.

కూర్చుండి ప్రణామ మాచరించి కొంతసేపు ధ్యాన నిమ గ్నయై యుల్లే రెప్పలు వాల్చక వాసుదేవుని దర్శించు చుండెను. వాసుదేవుడును ఆమె నీలోత్పల మాల వంటి చూపులచే బంధింపబడి ప్రసన్నుడై యున్నట్లు కనబడు చుండెను. భక్తిచే నుజ్జ్వలమగు నామె ముఖ మానందా శ్రువులచే తడిసెను. మంత్ర పఠనము గావింపక, నామ సంకీర్తనము చేయక, యే విధుల నాచరింపకయే యీ పూజ మౌనముగనే సాగెను. మొదటి నుండి చివర వఱకు, నీ పూజ యందొక విచిత్రమగు గొప్పదనము వెలయు చుండినది.

సుచరిత అర్ఘ్య పాద్యాదుల నొసగి సన్మానీయుని జేసిన తర్వాత నేను సవినయముగా "అమ్మాయీ! అన్యథా తలంపకుండిన నేను నీ వలన నొక విషయ మెఱుగ గోరు చున్నాను" అని యంటిని. సుచరిత ప్రీత్యుత్సాహము లను కనబఱచుచు "ఆర్యా, నే నజ్ఞురాలను. కాని నే నేదైన సేవచేయ గలిగిన నందు లోపము చేయను. సెల వొసగుడు." అనెను. ఆమె విశాలమగు నీల లోచనము లౌత్సుక్యముతో నిండి యుండెను. నేను "నే నీ వాసుదేవుని పూజ, ఆరాధన విషయము నెఱుగ గోరు చున్నాను. నేటి సాయంకాలము నుండి నేను దీని నర్థము చేసికొన యత్నించు చుంటినే గాని నా మనమున సందేహము లొక దాని వెంట నొకటి పెరుగు చునే యుండెను. వానికి ప్రత్యుత్తరములు నా మనసునకు లభింపలేదు." అని యంటిని. సుచరిత నేత్రము లొక యద్భుతమగు నానంద జ్యోతిచే దీప్తి జెందు చుండెను.

ఆమె "ఆర్యా, నేనును ఈ విషయమున నజ్ఞురాలను. మూడు మాసముల క్రితము వఱకు నన్ను నేను పాప పంకిలములో బడియున్న దాననని యనుకొను చుంటిని. కాని నేడు నా మనస్సు నుండి యీ వికల్పము తొలగి పోయినది. తమరు మా గురువుల నీ విషయమున ప్రశ్నించిన వారు సరియైన సమాధాన మొసగ గలరు." అని యనెను. సుచరిత పలికిన పలుకులకు ప్రత్యుత్తర మొసగక నే నాశ్చర్యముతో నామెను చూచు చుంటిని. కొంత సేపామె వివశయైన దాని వలె కూర్చుండి యుండి తర్వాత మెలమెల్లగా "ఆర్యా! మానవ శరీరము దండన ననుభవించుటకే నిర్మింప బడి యుండలేదు. అది బ్రహ్మదేవుని సర్వోత్తమ మగు సృష్టి. ఇది నారాయణుని పవిత్రమగు మందిరము. నేనీ విషయ మును మొదటనే యెఱిగి యుండిన నింత పరితపించి యుండ నవసరము లేదు. గురుదేవులు నాకీ రహస్యమును తెలిపి నారు. నా జీవితమున, నేను దేనిని అత్యంత కలుషమని భావించు చుంటినో అదే నాకు పరమ సత్యము. స్వామీ! తన సత్యమునే మానవు డేల దేవతగ భావింప రాదు!" అని యనెను.

సుచరిత కన్నులు వాలి యుండెను. ఆమె నా కొఱకు ఆసనము, నీరు మొదలగు వాని సమర్చు చుండెను. ఆమె వాలిన కన్ను లింకను మనోహరములై కన్పట్టు చుండెను. ఒక మాఱు మాత్ర మామె నన్ను కన్నెత్తి చూచి నది. నే నింకను ఆమె చెప్పుచున్న దానిని వినుట కుత్సాహ పడుచుంటిని. ఆమె మాటలు నాకు భ్రాంతిగా నర్థము

కాలేదు. కాని యీ మాటల యందలి ప్రతిపదము నందున్న గొప్ప దనముచే, నేనామె వాక్యములను శాస్త్రములోని వాక్యముల కొసగవలసిన గౌరవ భావమున వినుచుంటిని. ఆమె తన ప్రశ్నకు ప్రత్యుత్తరము నపేక్షింప లేదు. ఆమెకు ప్రత్యుత్తరము లభించియే యుండెను. మరల నామె "ఈ శరీరము నరకమునకు హేతువనుట పొరపాటు. ఇదే వైకుంఠము. దీని నాధారము చేసికొనియే నారాయణుడు తన యనంత లీలల కనబరచు చున్నాడు. ఈ భువన మండల మంతయు నానందముచే ప్రకాశించు చున్నది. బ్రహ్మయు నానందము చేతనే సృష్టిని వెలయించెను. ఆనందము నందే సృష్టి విలసిల్లెను. ఆనందమే దానికి లక్ష్యము. లీల తప్ప ఈ సృష్టికి మరేమి యుద్దేశ్యము కాగలదు? అయ్యో, గురుదేవా! నాకీ విషయమేమి తెలియ లేదు!" అని పలికెను. సుచరిత ప్రదీప్త ముఖ మండలము మరింత యుజ్జ్వల మయ్యెను. ఆమె కీ మాటలు చెప్పు చున్నపు డపరిమితానందము కలుగు చుండెను. కాని యామె పలుకుచున్న పదములలో నొకటైనను నాకర్థము కాలేదు. ఆ పదముల యంతరాళమున నేదో యుండి యామెను ఆనంద గద్గద మొనర్చు చున్నట్లు నాకు తోచు చుండెను. ఆమె నా కాసనము నమర్చి నన్ను దానిపై కూర్చుండ మని ప్రార్థించెను. నేను మాటాడక ఆమె యాదేశమును పాలించితిని.

ప్రసాదమున కొన్ని ఫలములు, తియ్యని పిండి వంటలు నుండెను. అభిలషించిన ఫలములు, కల్పలత నుండి జారి పడి నపుడవి యింత మధురముగ నుండును కాబోలు! నా

ముందు ప్రసాదముంచి యామె చేతులు జోడించి కూర్చుండెను. ఆమె కన్నుల నానందాశ్రువులు నిండగా నామె కలౌకికమగు తృప్తి కలుగుచుండెను. నేను చిఱునగవుతో "దేవి! నారాయణుని ప్రసాదమును పొంది నేనీనాడు ధన్యుడ నైతిని. నారాయణుడు కూడ నీ యుపహారమును పొంది కృతార్థుడై యుండును." అని యంటిని. సుచరిత కంఠము బాష్పరుద్ధమై యున్న నామె మాటలాడుటకు ప్రయాసపడుచుండెను. కాని ఆమె ప్రదీప్త ముఖమండల మానందాతిరేకమున ప్రకాశించు చుండెను. మంద స్మితముతో నామె "ఆర్యా! నారాయణుడు మనుష్యులకంటె వేఱుగ నుండడుకదా! మీరు ప్రసన్నులైన నిక్కముగ నారాయణుడు ప్రసన్నుడే! మీరు సాక్షాత్తు నారాయణ స్వరూపులేకదా!" యని పలికి యకారణముగ నామె ఖిన్నవదన యయ్యెను. కన్నీటిచే తడిసిన కన్నుల వాసుదేవుని జూచుచు నామె 'గురుదేవా! మనసు మహాపాపి. అదెప్పుడు నరుని నారాయణునిగ భావించునో గదా!" అని తనలో తానేమో యాలోచనలతో మునిగెను. క్షణముసేపు రకుండి యామె నన్ను చూచి "ఆర్యా! భట్టిని విషయమేమి చేయుదురు?" అని యడిగెను. నే నేమి బదులు చెప్పవలెనో నాకు తోచదాయెను. నా తావరణము తయు శ్రద్ధాభక్తులతో పరిపూర్ణమై యున్నందున నా నోటినుండి యప్రయత్నముగ "దేవీ, నారాయణుడే చేయగలడు. మనము నిమిత్తమాత్రులమే కదా!" అను మాటలు వెడలెను. సుచరిత యూఱట చెంది "అవును, నారాయణుడే

యీ నావకు కర్ణధారుడు. మనము గాలివానను జూచి యన వసరముగ వ్యాకులపడునట్టివారమే. ఆర్యా! తానే కార్యము నకును బాధ్యతగలది కాదని మన మనసువేల తెలిసికొనజాలదు? వాసుదేవుడుండ అదియేల వ్యర్థముగ నాకులపడుచుండును!" అని పలికి కొంతసేపామె యూరక కూర్చుండెను. అప్పటికే రాత్రి చాలభాగము గడచియుండినందున నేను వెళ్ళుట కను మతి నిమ్మని వేడితిని. అనుమతించుట నామె చాల బాధపడు చుండెను; కాని మాఱు పలుకలేదు. గుమ్మముపలకు నన్ను సాగనంపుటకు వచ్చి, నమస్కరించి కాతరస్వరమున "రేపు సూర్యాస్తమయమునకు ముందే తమ దర్శనము చేసికొం దును గదా!" అని యడిగినది. నే నుత్సాహముతో "తప్పక" అని పలికి కృష్ణవర్ధనుల యతిథిశాలకు బయలుదేరి తిని. త్రోవలో నా మనస్సు సుచరిత విషయము నాలో చించుచుండెను. నేనింతవఱ కామెను గుఱించి పూర్తిగ తెలిసికొనలేదు. కాని తెలిసికొన్నంతలో నామె శ్రద్ధగలదని మాత్రము నాకు తేటతెల్లమయినది. కాని కాశీనివాసియగు నా వృద్ధుడేమి చెప్పదలచెను? సుచరితను గుఱించి స్థావే శ్వరమున దురభిప్రాయము కలదా యేమి! నాకేమియు నర్థముకాలేదు. కొంతసేపటికి నేను నా విడిదిని చేరుకొనగనే నా కొఱకై మిక్కిలి యవసరమైన లేఖలను తీసికొనివచ్చి చాలసేపటినుంచి రాజకుమారుని దూత వేచియున్నాడని తెలిసెను.

మూడు లేఖలు అందమగు తెల్లని పట్టు సంచుల యందుంచబడి యుండెను. నేను జాగ్రత్తగ నొక సంచి

విప్పితిని. లోపల కర్పూర కాష్ఠపు పలక యుండెను. దాని నలువైపుల లాతాగ్రసముచే గల్పలత చిత్రింపబడి యుండి మధ్య భాగమున మహారాజాధి రాజులగు శ్రీ హర్ష దేవుని ముద్ర యుండెను. దానిని గాంచి నే నాశ్చర్యౌత్సుక్యములకు వశుడనైతిని. పలక క్రింద ఐదు మడతలుగల భూర్జపత్రలేఖ యుండెను. ఐదు మడతలు చూడగనే మైత్రి చేసుకొను నుద్దేశముతో లేఖ వ్రాయబడినదని నేను తెలుసు కొంటిని. అత్యంతా సక్తితో నేను లేఖను విప్పి చూచితిని. అది మహా రాజాధి రాజుల యాజ్ఞాపత్రము. అందు నేను సభాపండితు నిగ నియమింప బడితి ననియు, సమ్రాట్టుల శ్రీహస్తములతో నొసగబడు తాంబూలము గ్రహించు భాగ్యము నాకు లభించిన దనియు, మరునా డుదయమున రాజ పండితుల కుచిత మగు వేషమున రాజదర్బారునకు రావలసినదనియు నాకాదేశము గావింపబడినది. అంతేకాక సమ్రాట్టుల విశ్వాసనీయుడగు ప్రతినిధి కాగల గౌరవము నాకబ్బినదని నేను చదివినపుడు నాకు కలిగిన యాశ్చర్యమునకు మేర లేదు! 'నేడు మహారాజు లే వ్యక్తిని విషయలోలుడని తిరస్కరించిరో యతడే రేపు మహారాజుల విశ్వాసనీయుడగు ప్రతినిధి కాగలడా ? నే నాశ్చర్య కౌతూహలములతో రెండవ లేఖను విప్పితిని. ఇందు నాలుగు మడుపులే యుండెను. తన యధీనమునందున్న సామంతుని పదవిని పెంచుటకై నాలుగు మడుపుల లేఖ వ్రాయబడుచుండుటచే నేను మొదట కొంత జంకితిని. నేను మహారాజాధిరాజులకు సామంతుడనై యెప్పుడుంటిని ? కాని లేఖను చదివినపిదప నది భద్రేశ్వర దుర్గపు

సామంతుడగు లోకిక దేవుని పేర వ్రాయబడియుండెనని తెలియవచ్చెను. ఆ లేఖయందు మహారాజు లతనిని చరణాద్రి దుర్గమునకు, తూర్పునను, గంగానది కుత్తరతటమున నున్న ప్రదేశములకు ప్రధాన సామంతునిగ నియమించుటకు సంతసించుచున్నారనియు, తన విశ్వసనీయ ప్రతినిధి వాత్స్యాయన వంశస్థులగు బాణభట్టులను యథోచితముగ సన్మానించి తగు సహాయము చేయవలెననియు నాజ్ఞాపించి యుండిరి. ఈ లేఖ రెండవసంచియందుండెను. నేను మూడవ లేఖను విప్పితిని. ఇది రాజకుమారుల ముద్రాంకితమై యుండెను. ఆ లేఖయందతడు తన మహాసంధి విగ్రహికుల పదవి ననుసరించి మహారాజాధిరాజుల విశ్వసపాత్ర సభాసదుడును, వాత్స్యాయన వంశస్థుడగు బాణభట్ట పండితులను మహానాదుదమున నత్యవసర కార్యమున సందర్శింపవలసినదని కోరియుండెను. రాజకుమారు లేదో గొప్ప రాజ్యతంత్రపు పన్నాగము పన్ని సంకల్పించెననియు, నే నందు నిమిత్త మాత్రునిగ నుపయోగింపబడ నున్నాననియు నేను వెను వెంటనే గ్రహించ గలిగితిని. కాని నా కందు లేశమాత్ర మైనను సందేహము లేదు సరికదా యది నా కంతగ సంతోష దాయకమును కాలేదు. బాణభట్టు డెట్టి దేశద్రిమ్మరియైనను భట్టినికి సేవజేయు నవకాశము లభించినందున రాజకీయ తంత్రములందు మహత్త్వముగలవాడైనాడని మొదటిసారి నేను తెలిసికొంటిని. ఇది హర్షింపదగిన విషయము కాకపోయి నను విచారింపవలసిన విషయము మాత్రము కాదు. నేను నిశ్చింతగ శయ్యపై మేనువాల్చి వెంటనే నిదురించితిని.

ప్రాతఃకాలముననే స్నానాదికములను తీర్చుకొని నేను రాజకుమారుని యావాసము చేరుకొంటిని. అతఁ డప్పటికే నాకై వేచియుండెను. నన్ను చూచి మందహాసము చేయుచు "భట్టూ ! మహారాజాధిరాజుల యాజ్ఞ చేరినదా ?" అని యడిగెను. నేను వినయముగ తలయూపి చేరినదని తెలిపితిని. రాజకుమారుడు "నే నీ కార్యమును సాధించుట కెన్నియో యనృతములాడవలసివచ్చినది. కాని దానిని గుఱించి నీవు అన్యథా తలంపకుము. నేను చేసిన దంతయు నార్యావర్తమును వినాశకుండమున బడకుండ రక్షించుట కేసుమా ! తోడేళ్ళవంటి నీచులు, చీమలవంటి సంఘీభావముగల సరిహద్దు దోపిడిగాండ్రు మఱల సరిహద్దున గుమిగూడుచున్నారు. ఆర్యావర్తమున దేవాలయములు విహారములు, వృద్ధులు, బాలకులు, సాధువులు, స్త్రీలు, బ్రాహ్మణులు, శ్రమణులు సర్వనాశనమనెడి సుడిగాలికి బలి కానున్నారు. నేడు గుప్తరాజుల ప్రతాపమస్తమించినది; దుర్మదయౌధేయులు కోఱలుతీసిన పులులవలె దర్పముడిగియున్నారు. మౌఖరీవంశస్థుల విక్రమానలము చల్లారిపోయినది. నేడు కన్యాకుబ్జ సామ్రాజ్యమొక్కటే యీ వినాశమునుండి ఆర్యావర్తమును రక్షింపగలదు. కాని భట్టూ, ఈ దస్యులు కొండచరియలను దాటి మైదానమున ప్రవేశించినచో వారి నరికట్టుట కష్టమైన పని. ఈ విషయమున కష్టమునుండి ముక్తిపొందుటకు ఆశానిలయము భట్టిని తండ్రి యొకడే. అతడిపుడు ఖిన్నుడై నిరుత్సాహియై యున్నాడు. స్థానేశ్వరమున నున్న బౌద్ధులు రాజుగారి యెడ నసంతృప్తులై మౌఖరీవంశ గురువగు భద్వ్యాశర్మ పలుకు

బడికి లోనై యున్నారు. అతనిని సుముఖునిగా చేసికొనజాలిన యస్త్రము నీచేత నున్నదని నే నెఱుగుదును. భట్టినిని మహా రాజాధిరాజుల సహోదరికి ఉచితమగు మర్యాదలతో కన్యా కుబ్జమున నుంచుటకు సంసిద్ధులమే, కాని రాజవంశమునకు సంబంధించిన యే గృహమునందును తానుండనని యామె పట్టుబట్టియున్నదే! భట్టూ దీని కుపాయమేమో నీవే యాలో చించి చెప్పుము" అని యనెను. నే నొకింత సేపటివఱకు వశీ భూతుడనైన వానివలె నతనిని చూచుచుంటిని. నా ప్రత్యుత్త రము నపేక్షింపకయే రాజకుమారుడు మరల "నీవు మౌఖరీ వంశ రాజ్యలక్ష్మియగు రాజ్యశ్రీ మహారాణిగారి నెఱుగు దువుకదా?" అని యడిగెను. నేను తలవంచి యొప్పుకొంటిని. వెంటనే రాజకుమారుడు "భట్టిని యామె యతిథిగ నుండగలదు. ఇదిగో ఆమె యాహ్వానము." అని వెండిసంచియందు చీనాంశు కముచే చుట్టబడిన లేఖ నొకదానిని నా చేతులయందుంచెను. తర్వాత నా ప్రత్యుత్తరము నపేక్షింపకయే; "ఇక నీకెట్లు సాధ్యమో యట్లు భట్టిని నిచటికి గొనిరమ్ము. ఆమె యేది కోరినను మహారాజుల ప్రతినిధివై నీ వంగీకరింపుము. నీవు రేపే యిచటినుండి వెడలుము. తిరిగి వచ్చిన తర్వాత నీవే పురుషపురమునకు వెళ్ళవలసి యుండును. ఇదంతయు కడు జాగరూకుడవై శీఘ్రముగ చేయవలసి యున్నది. భట్టూ! నీవే ఆర్యావర్తమును సర్వనాశమునుండి రక్షింప వలసి యున్నది. నీ యేమఱుపాటు నిరపరాధులగు లక్షలాది జనుల నాశనమునకు హేతువు కావచ్చును. నేడు నీవు మహారాజాధి రాజులను దర్శింపుము" అని పలికెను. రాజకుమా

రుడు నేను మాటలాడుట కవకాశ మొసగలేదు. అతని పలుకులు తూచినట్లు, ఆవేశరహితములై స్పష్టముగ నున్నందున ఆలోచించుటకు నా కవకాశమే చిక్కలేదు. వినయముతో తలవంచి అతడు చెప్పినదంతయు అంగీకరించుచుంటిని. రాజకుమారుడు తనమాటలను ముగించుచు "భట్టూ! లెమ్ము! ఆలస్యముచేసిన అనర్థము సంభవించును." అనెను.

# పదునాల్గవ అధ్యాయము

ప్రథమదినమున మహారాజుగారివలన తాంబూలమును స్వీకరించుటకు నేను గొప్ప పరిహారము చెల్లించుకొనవలసి వచ్చెను. మహారాజుగారు ఆస్థానమునకు రాకమునుపే నేను రాజసభను చేరుకొంటిని. అప్పటికి రాజసభయందు వాగ్వాదము ఎక్కువగనుండెను. కొందఱు సామంతులు జూదమాడుటకు గళ్ళు గీచుచుండ మఱికొందఱు జూదమునందు నిమగ్నులై యుండిరి. కొందఱు వీణవాయించుచుండ కొందఱు చిత్రఫలకముపై రాజుగారి చిత్తరువును చిత్రించుచుండిరి. ఒకవైపు కొంతమంది అంత్యాక్షరి, మానసి, ప్రహేలిక, అక్షరచ్యుతకము వంటి కావ్యవినోదములందు మునిగియుండిరి. కొందఱు సామంతులు రాజుగారు రచించిన కవిత్వమునకు వ్యాఖ్యానము చేయుచుండిరి. కొందఱు రసికశిఖామణులు చామరధారిణులయు, నితర వారవనితలయు సంభాషణలయందు మునిగి తేలుచుండిరి. వారిలో కొందఱు నిండుసభయందే, సంశయమును వీడి కామినీ జనముల కపోలములపై మకరికా పత్రములను చిత్రించుచుండిరి.* ప్రప్రథమమున రాజాస్థానమున సభ్యుడై, యచటికి పోవువాని చిత్తమున నీ దృశ్యములెట్టి ప్రభావమును నెఱపునో దాని నూహింపవచ్చునే కాని, వర్ణింప నలవి కాదు. సభయంతయు నుచ్ఛృంఖలత్వమే మూర్తిభవించినదా యన్నట్లుండెను. కాని సభ్యులెల్లరు తమ్ము తమ కార్యములందప్రమత్తులై తామే రాజుగారి యనుచరులమనియు భక్తులమనియు తెలియునటుల మెలగుచుండిరి.

* కాదంబరి, పూర్వభాగము - రాజసభ వర్ణనతో సరిపోలును.

ఏమఱుపాటునగూడ వారు ముఖస్తుతి చేయుట మఱచియుండ లేదు.

మహా రాజాధిరాజులు, ప్రధానాధికరణికులతోడను, కృష్ణవర్ధన రాజకుమారులతోడను, సభాభవనమునకు విచ్చేయగనే సభయంతయు రాజసభా నియమములకు కట్టు వడెను. భేరీ నినాద శంఖారావముల మధ్య వందిమాగధుల కైవార జయధ్వనులచే వాయుమండలమంతయు ప్రకంపిత మగుచుండెను. ఉత్తరీయము నలంకరించుకొని సువాసనగల కృష్ణాగరుధూపము వేసికొనిన చామర ధారిణుల పలుచని చీరలు పరపరలాడసాగెను. తామరతూండ్లవలె కోమలమగు వారి చేతులగాజులు గలగలలాడెను. తత్తరపాటున లేచి నిలుచుండునపుడు సామంతరాజుల కేయూరము లొకదానిని నొకటి నొరసికొని కటకటలాడెను. మంగళశ్లోకముల జదువు పురోహితులు తత్తఱపాటు జెంది, వారిలో నొకడు తన యుత్తరీయమున తానే దగుల్కొని క్రింద పడబోవుచుండెను. మంగళద్రవ్యములను పట్టుకొనిన విలాసినుల యొడ్డాణపు చిఱుగజ్జెల మృదుధ్వనిని విని రాజభవనపు దిగుడు బావుల యందుండు సారసపక్షు లుత్సాహముతో ధ్వనిచేయ రాజ సభయందలి కోలాహలము మఱింత యధికమయ్యెను. మహా రాజాధిరాజులు సింహాసనము నధిష్ఠింపగనే జయనినాదము లాగిపోయెను. భేరీశంఖములు మౌనముద్ర వహించెను. వందిమాగధుల కైవారములు శాంతించెను. పురోహితుల యాశీర్వచనములు అక్షతలు చల్లుటతో ముగిసెను. ఆ ముగింపుతో సభయం దాశ్చర్యకరమగు శాంతి యేర్పడెను.

అప్పుడప్పుడు చామరధారిణుల వాచాలములగు కంకణములు, తమ మోతచే శాంతిని భంగపఱచుచు ప్రవేశానంద మొసఁగు చుండెను. నా కోరికలు మాత్రము మహారాజాధిరాజుల కృపాకటాక్ష వీక్షణ ప్రసాదము లభించెను. తాంబూల స్వీకరణము కొంచెము కష్టమైనపని యగుటచే నే నా నాఁడు తదవసరమున సరిగా నడచుకొననందున సభ్యుల యుపహాసము నకు గుఱియైతి నని నే నూహించితిని.

రాజసభా కార్యక్రమము ప్రారంభమయ్యెను. ప్రధానాధికరణికుడు ముఖ్యమగు వివాదములందు తాను చేసిన తీర్పులను మహారాజాధిరాజులచే స్వీకరింపజేసెను. చాలకొలది వివాదములయందే యాతనికిని రాజుగారికిని అభిప్రాయభేదము లేర్పడెను. రెండు మూఁడుసార్లు ధర్మశాస్త్రప్రవీణుల యభిప్రాయమడుగఁబడెను. ఒకటి రెండు తగవుల తీర్పు విషయమున రాజుగారు కృష్ణవర్ధన రాజకుమారులతో చాలసేపు ఆలోచించిరి. వారిద్దఱు చాల మెల్లగ మాటలాడుకొను చున్నందున నే నేమియు నర్థము చేసికొనలేకపోతిని. కాని రాజకుమారుడు కొంచెము వ్యాకులపడుచున్నట్లును, ప్రధానాధికరణికుని కనుబొమలు ముడివడి యతని ముఖముపై క్రూరభావము కనబడుచుండుటను గుర్తించుటకు నా కెంతో కాలము పట్టలేదు. కాని మహారాజాధిరాజుల ముఖముద్ర ప్రారంభమునుండి చివఱవఱకు నొకేవిధముగ నుండెను. తృప్తి గాని, కోపముగాని, వ్యాకులతగాని వారి ముఖమున కనబడ లేదు. వివాదముల ప్రసంగము సమాప్తమయిన కొంతసేపటి వఱకుకూడ మహారాజులు రాజకుమారునితో నాలోచన

చేయుచునే యుండెను. కాని ప్రధానాధికరణికునితో కలిసి ధర్మశాస్త్రజ్ఞులగు విద్వాంసులు వెడలిపోగానే వారి యాలోచనలు ముగిసెను. ఇప్పుడు గాయకులు, విద్వాంసులు, విదూషకులు, వందిమాగధులు మున్నగువారి వంతు వచ్చినది. కవులు తమతమ క్రొత్తక్రొత్త శ్లోకములు చదివి వినిపించిరి. కొందఱిని తియ్యని మాటలతోడను, కొందఱికి తాంబూలము నొసగియు, మఱికొందఱికి కానుకలిచ్చియు లేదా తన ఆభరణముల నొసగియు మహారాజుగారు అందఱిని సంతోషపఱచి వారి యాశీర్వాదముల నొందిరి. ముఖస్తుతి చేయువారి ప్రతాపము సభయందెక్కుడుగ నుండెను. కృష్ణవర్ధనుల సంకేతమును గుర్తించి నేనును రాజుగారి నాశీర్వదించుటకు లేచి నిలుచుంటిని. చాల కష్టముమీద నేనొక ఆర్యావృత్తమును జదివితిని. నాకా వాతావరణమంతయు విసుగుబుట్టించునదై కనబడుచుండెను. నేనా వృత్తమున ముఖస్తుతియందు మితి మీఱియుంటిని. కాని శ్లోకమును ముగించి ఆశీర్వదించుటకై నేను నా చేతిని పైకెత్తినపుడు నా గుండె లదరెను. అయ్యో! జీవించియుండిన యే వ్యక్తినిగాని స్తుతించుచు కవిత్వమల్లనని నేను నిపుణికకు మాట యిచ్చియుంటినే! ఎంతపని జరిగినది!! అయితే నేనీ ప్రపంచమున నిక వేయి దినములు మాత్రమే జీవించియుందునా యేమి! ఈ మాటలు తలపునకు వచ్చినందున నేను హతాశుడనై ఉత్తరాపథము నంతటను ప్రబల ప్రతాపులగు శ్రీ హర్షదేవుల యెదుట నిలుచుంటినను మాటయే మఱచితిని. కాని రాజకుమారుడు నన్నప్పుడు తప్పించెను. నేను చెప్పిన ఆర్యా

వృత్తములోని యొక యంశమును తిరిగి చెప్పుచు పరిహాసపూర్వకముగ నతడు "భట్టూ, ప్రతము మాటను జ్ఞాపకమునకు తెచ్చుకొని విహ్వలుడవగుట యుచితము కాదుసుమా!" అని యనెను. సభయంతయు గొల్లుమనెను. మహారాజులు కూడ చాలసేపటి వఱకు కిలకిల మని నవ్వుచుండిరి. విషయమేమని తెలియని సభాసదులుకూడ మహారాజులు నవ్వుచుండుటను జూచి పొట్టలు చెక్కలగునట్లు నవ్వుచుండిరి. నేను కొంచెము సిగ్గుపడి వెనుకకు తగ్గితిని. ఈ మారు మహారాజులు మిక్కిలి యాదరముతో నన్నుజూచి "నీవు మంచి కవివలె నున్నావే!" అనిరి. నేను తలవంచి "మహాప్రసాద" మంటిని. కొంతసేపటి వఱకు, విటులయు, విదూషకులయు, చవిలేని సంభాషణము జరుగుచుండెను. అది అశ్లీలముగ నుండెను. నాకిదంతయు విసుగును పుట్టించుచుండెను.

ఈ సమయముననే సభాసమాప్తిని తెలియజేయు శంఖమూదబడెను. మహారాజాధిరాజులు లేచి నిలబడగనే కంకణ వలయ నూపుర కేయూరాంగదముల కలస్వనములతో వంది మాగధుల జయనినాదములు మఱియొకమాఱు మోగినవి. క్రమక్రమముగ విలాసినుల యెఱ్ఱని ముఖములపై నిలిచియున్న కృత్రిమమగు మందహాసము లోపించెను. సభాసదుల ముఖస్తుతితో కూడుకొన్న హాస్యము శాంతించెను. సభాసదుల మొగలిపూవంటి యుత్తరీయములు క్రమక్రమముగ అదృశ్యము కాజొచ్చెను.

విదూషకుల యశ్లీల హాస్యము క్రమముగ గాంభీర్యము వహించుచుండెను. నేను తలుపులుమూసిన యింటి

మధ్యనుండి వెలుపలికి వచ్చువానివలె బయటికి పోవ నుద్యుక్తుడనైతిని. రాజసభయందలి వాతావరణమున నాకూపిరి యాడలేదు. గబగబ నేను వెలుపలికి వచ్చుచుండగ ఎవరో యొక్క వ్యక్తి నన్ను వెనుకనుండి "భద్రా! కొంచెమాగుము" అని పిలిచెను. నేను వెనుకకు తిరిగి యాతని ప్రసన్నమగు ముఖమును జూచితిని. ఆతడు ధావకుడు. ఆతడు రాజసభయందు చాల మధురమగు కవిత్వము వినిపించియుండెను. ఆతడు పద్యము చదువుతీరు అత్యద్భుతమైనది. అతడు మహారాజు ప్రేమకు పాత్రుడని తెలియుచుండెను. నేనతనిని జూచి సంతోషమును వెలిబుచ్చితిని. ధావకుడు నవ్వుచు "రాజసభకు వచ్చిన తరువాత మాబోంట్లను అస్పృశ్యులుగా భావించిన ట్లు!" అనెను. నేను వినయముతో "ఆర్యా, నన్ను మీరకారణముగ లజ్జితునిగా చేయుచున్నారు" అని యంటిని. కాని ధావకుడు మంచి రసికుడు. కొంత సేపటిలోనే యాతడు నన్ను ఆప్తమిత్రునిగ జేసికొనెను. కొంతసేపటివఱకు నేవో గాలికబుర్లు మాటలాడుచుండి సెలవు పుచ్చుకొన్నప్పు డతడు "నీవు మహారాజుల యాంతరంగిక సభ్యులలో నొక్కడవు కాదగినవాడవు. నీకు తప్పక యాహ్వానము లభించును" అనెను. నేనతని మాటల కర్థమేమని యడిగితినిగాని యతడు కన్యాకుబ్జ పౌరులకు సహజమగు మందహాసముతో నా భుజము పట్టుకొని "త్వరలో తెలియును లేవయ్యా" యని పలికి నా యనుమతిని గైకొనకయే వెడలిపోయెను. నేనొకింత చకితుడనై నా నివాసము వైపునకు సాగిపోతిని.

ఆ పగలు అతికష్టమున గడిచెను. పడమటి యెడారి నుండి వచ్చుచున్న వేడిగాలి, ముల్లోకములందుండు తేమను పీల్చి వేసినట్లుండెను. ప్రచండదావాగ్నివలె నది వనప్రాంత మందలి చల్లదనమును మ్రింగుచున్నట్లుండి కన్యాకుబ్జము నందలి జలాశయముల నిర్జలములుగ చేయుచుండెను. సూర్య మండలమునుండి ధూమరహితమగు నగ్ని జ్వాలయొకటి యెడ తెగక భూమిపై వ్యాపించుచున్నదా యన్నట్లు తోచెను. సూర్యాస్తమయ మగుట కింకొక ఘడియకంటె నెక్కువ సమయము లేదు. కాని అప్పటికిని స్థానేశ్వరపు రాజమార్గము వేడిగాలి చేతను, సూర్యుని వక్రకిరణముల చేతను కనకనలాడు చుండెను. కొండచిలువ బుసకంటెను భయానకమగు వాయు తరంగములు విశాలమగు రాతిభవనముల గోడలను ఢీకొని మార్గమునబోవు యాత్రికులపై పడుచుండెను. పైపెచ్చు భయంకరములగు సుడిగాలులచే రేగిన దుమారము ఆకాశము నందు వ్యాపించి బాధపెట్టుచుండుటచే ఆ మార్గమున పోవుటకు కూడ కష్టముగ నుండెను. అయినను నే నింటినుండి బయలుదేరితిని. సుచరిత యాహ్వానమున నొక యద్భుతమగు నాకర్షణశక్తి యున్నందున దాని నతిక్రమించుట యసంభవ మగుచుండెను. నేనామె యింటికి చేరునప్పటికి మరీచిమాలి తనకిరణముల నుపసంహరించుకొని యుండెను. పశ్చిమసముద్ర తీరమున నాతని క్లాంత ముఖమండలపు రక్తరాగము వ్యాపించియుండెను. వేడిగాడ్పుల వేగము మందగించు చుండెను. పగలంతయు సూర్యాతపముచే తపించి సూర్యాస్త మయమున చంద్రుని తనివితీర చూచు నాశతో తూర్పు

దిక్కును చూడ నుత్కంఠితయగు చకోరమువలె, నేను సుచరిత ఘుంటియెదుటను నుపస్థితుడ నైతిని. కాని చంద్రదర్శనము కాలేదు! గోమయముచే నలికిన సుచరిత ముంగిలి యంతయు ధూళిధూసరమై యుండెను. చాలమంది యేదో యనుమానముచే నచట వృథాగా పరుగిడిన ట్లగపడుచుండెను. క్షీరసాగరశయను డగు శ్రీమన్నారాయణుని ప్రతిమచుట్టు వ్రేలాడుచుండిన మాలతీమాల వాడిపోయి యుండెను. ద్వారబంధములు అలంకారశూన్యములై యమంగళకరములుగ గన్పట్టుచు మనసునందొక భయమును కలిగించుచుండెను. నాకేమియు దిక్కుతోచలేదు. ముందు నాటిరాత్రి యేదో విపరీతపు సంఘటన జరిగియుండవచ్చును. విషయలోలుడ ననిపించుకొనిన నేను రాజోద్యోగినై తర్వాత మహారాజుల ప్రతినిధినైతిని. మఱి భర్తురాలైన సుచరిత మాఱి మఱి యేమైనదో యెవరికెఱుక! నా హృదయమొక తెలియరాని భయముచే నిండిపోయెను. ఈ విషయమును గుఱించి యెవరినడుగవచ్చునని యాలోచించుకొనుచుండ నిన్నటిభజన మండపము సంగతి జ్ఞాపకమునకు వచ్చెను. ఆ మండప మచటికి సమీపముననే యున్నందున నే నటు వైపునకు వెళ్ళితిని.

మండపమున సుమారొక వేయిమంది కూర్చుండి యుండిరి. నలుగురైదుగురు అటు నటు తిరుగుచుండిరి. నిన్నటి కోలాహలము లేదు సరికదా, చీమ చిటుక్కుమన్నచప్పుడు కూడ వినపడలేదు. అందఱి ముఖములు గంభీరములై వాని యందావేశము స్పష్టముగ గోచరించుచుండెను. అయినను సభయంతయు స్తబ్ధమై శాంతమై యొప్పుచుండెను. సభాధ్య

క్షుడు మాత్రము సంయతమగు భావ యందేదో శ్రోతలకు తెలియజెప్పుచుండెను. అతని యాజ్ఞనుగొని ఒక్కరొక్కరుగ సభ్యులు లేచి వక్తవ్యాంశమును సంగ్రహముగ వినిపించి తిరిగి తమ తమ యాసనములపై ఆసీనులగుచుండిరి. వారి లోని కట్టుబాటును చూడ వారు యంత్రములవలె నగపడు చుండిరి. వెలుపల నిలుచున్న యొక పెద్ద మనుష్యుని అంచటి సమాచారమును గుఱించి యడుగ నతడు గుస గుస లాడుచు "నేటి సూర్యోదయమునకు కొంతకాలము ముందు సుచరితా దేవియు, విరతివజ్రుడును కైదు చేయబడిరి. నగర ప్రతీహారుని సేనకులు వేంకటేశభట్టును, అఘోరభైరవ పరమహంసలను నావపై నెక్కించుకొని యెచ్చటికో వగియున్నారు. ఇది యంతయు బౌద్ధుడగు రాజు నాజ్ఞచే జరిగినది. శాంతి ప్రియులు, అమాయకులునగు ప్రజల ధర్మాచరణమున నీ చర్య జోక్యము కలుగజేసికొనుటయే! స్థానేశ్వరమునకున్న విద్వాంసు లీ విషయమున తమ కర్తవ్యమేమని నిశ్చయిం చుట కాలోచనలు సలుపుచున్నారు. కన్యాకుబ్జీయుల సహ నము ప్రసిద్ధికెక్కిన విషయము. ప్రమోదవిషయములందు పాల్గొనుచుండునపుడు వారివంటి చపలు లీ జగత్తున లేనే లేరనిపించెదరు. కాని వారు నిగ్రహము నాచరణలోనికి తెచ్చినపుడు వారి గాంభీర్యము సముద్రమువలె దురధిగమ్య మగును. ఆ నిగ్రహమే యీ సభయందు కానవచ్చును" అనెను. సభయందు కొంతసేపు చర్చజరిగెను. అటుపిమ్మట వృద్ధుడగు సభాధ్యక్షుడు లేచి మేఘగర్జనమువంటి స్వరమున "ఆర్య సభాసదులారా! స్వస్తి! నే నీ సభలోనున్న శాస్త్ర

పారంగతులు, ప్రసిద్ధ శీలవంతులు, ఆచారవంతులు నగు ఆర్య నాగరికుల నిర్ణయమును తెలుపుచున్నాను. సభ్యులారా! చాల దుర్ఘటమగు కాలము సమీపించినది. ఆచార్య భర్వు పాదులు పంపిన లేఖను స్థానేశ్వరమునందున్న ప్రతి నాగరికుడు చదివియున్నాడు. దుర్ధమనీయమగు మ్లేచ్ఛుల సేన పర్వత మార్గమును దాటివచ్చుటకు ప్రయత్నించుచున్నది. ఉత్తరాపథము నందలి దేశాలకు విపత్కరములు, బ్రాహ్మణ శ్రమణులు, బాలవృద్ధులు, స్త్రీలు ప్రతాపశాలియగు రాజుయొక్క యాశ్రయముననే సురక్షితముగ నుండగలరు. అట్టి సమయమున ప్రజలు ప్రభుభక్తియెడ నసంతుష్టులైన సర్వనాశనము తప్పదు. విరతి వజ్రునిపై విగ్రహమును తీర్పలేదని మోపిన నేరము శాస్త్ర సమ్మతము కాదు. సుచరితకును నతనికిని గల సంబంధము శాస్త్రసమ్మతమైనది. వారిరువురు గృహస్థాశ్రమమును స్వీకరించి నందువలన నపరాధులని మోపిన నేరము నిందింపదగినది. సుచరిత యవలంబించుచున్న యనుష్ఠానము చిరకాలము నుండి యాచరణలో నున్న భక్తిమార్గము ననుసరించి యున్నది. స్థానేశ్వరపు విద్వన్మండలి ఆమె యసాధారణ నిష్ఠ, నిగ్రహము, చిన్మయ స్వరూపిణియెడ నాత్మ సమర్పణము, మొదలగు వానిని గాంచి, ఆమెకు తన శ్రద్ధాంజలి సమర్పించుచున్నది. ఆర్య వేంకటేశ పాదులయు, అవధూత స్వాములగు అఘోర భైరవులయు, దేశ బహిష్కారమును విని మాకు మనఃక్షోభ కలిగినది. కాని యిట్టి సంఘట సమయమున, రాజతంత్రమున నే విధమగు శైథిల్యము రాకూడ

దను నుద్దేశముతో, పదిమంది విద్వాంసుల సమూహ మొకటి మహారాజుగారిని దర్శించి యీ యనర్థమునకు ప్రతీకారము చేయునట్టుల ప్రయత్నింప వలసినదని యీ సభ నిశ్చయించినది. మహారాజులు మా ప్రార్థనను మన్నింతు రని యీ సభ విశ్వాసము. సభ్యులారా! ఈ సమయమున మనము ఆవేశము చెందిన, అది వినాశమునకు దారి తీయుగలదు. ఈ నిర్ణయమునకు నేను మీ యొక్కదటి అనుమతిని వేడుచున్నాను. సభ్యుల మౌనము అంగీకారముగ భావింపబడును" అని పలికి సభాధ్యక్షుఁడు దూరకొండెను. కొంత సేపటి వఱకు సభయంతయు నిశ్శబ్దముగ నుండెను, సభ్యులందఱు నీ నిర్ణయమును మాఱు మాటాడక అంగీకరించినట్లు వ్యక్తమగుచుండెను.

శరత్కాలపు స్వచ్ఛమేఘముల మధ్య మెఱపుతీగ మెఱసినట్లు తటాలున సభయందొక మూలనుండి పింగల ప్రకాశ మొకటి దృగ్గోచరమాయెను. ఆ ప్రకాశము మహామాయయగు భైరవియే. ఆపాద మస్తకము కప్పుకొని యున్న ధూసర కాషాయ వస్త్రము మధ్య క్రోధారుణమగు ముఖమండలము, సంధ్యా సమయపు మేఘముల మధ్య నుండి యుదయించుచున్న చంద్రమండల దీప్తికి ప్రతిస్పర్ధియా యని తోఁపించుచుండెను. సిందూరలిప్తమగు నామె త్రిశూలము జేగురురంగుగల అధిత్యక యందు నాటిన క్రుద్ధ ధూర్జటి త్రిశూలమువలె భయంకరమ్మై మనోహరమై యొప్పుచుండెను. కఠోర స్వరమున నామె: ఆర్య సభాధ్యక్షా! నేను సభను సంబోధించి యొకటి రెండు మాటలు

చూడుడు. మీ దేశమున నవమానింపబడి నిందింపబడి యకారణముగ దండింపబడిన లక్షలాది యువతీ మణులలో నొకతె దానను. ఇట్టి నింద్యమగు వ్యాపారమునకు రాజాంతః పురములును, సామంతుల భవనములును ప్రధానాశ్రయములని యెవరెఱుగరు? మహారాజాధిరాజుల చామర ధారిణులు, తాంబూల కరండవాహకు లీ విధముగ నపహరింపబడి తీసుకొనబడిన కన్యలని మీలో నెవరికి తెలియదు? ఆర్య సభాసదులారా! ఈ భాగ్య హీనురాండ్రకు తండ్రులు లేరా? వీరు తమతల్లుల యనుంగు బిడ్డలు కారా? వారి తలిదండ్రుల హృదయమున తమ సంతానముపై నున్న వాత్సల్యము మహారాజాధిరాజుల వాత్సల్యముకంటె నే విధముగ తక్కువ? ఉత్తరాపథము నందలి విద్వాంసులు నీతిమంతులగు నాగరికు లీ రాజుల సహాయము నపేక్షించుట యెంత హేయమైనది! మహారాజాధిరాజులు మీ ప్రార్థనను నిరాకరించినచో మీ రేమి చేయుదురని నే నడుగుచున్నాను. మహారాజులు స్వయముగ శీలవంతులు; గుణవంతులును. కాని, కన్యల నపహరించుటయే తమ ప్రతాపముగ నెంచు నందలకొలది సామంతులకు వారాశ్రయ మొసగి యున్నారని మీలో నెవరెఱుగరు? సామాజికులారా! నే నసత్యమును వచించుచో నా తల నీ త్రిశూలముతో ముక్కలు ముక్కలు చేయుడు" అనిచెప్పి మహామాయ క్షణకాలమాగి సభవైపు ఒక్కమాఱు చూచెను. ఆమె కన్నులనుండి స్ఫులింగములు రాలుచుండెను. సభ్యులెల్లరు చెవులను నిక్కబొడుచుకొని యామె

యుపన్యాసమును వినుచుండిరి. మరల మహామాయ ఆను సింగమువలె గర్జించుచు "అమృత పుత్రులారా! మృత్యు భయము మాయ. రాజభయమన్ననో యది దుర్బలమగు చిత్తవైకల్యము మాత్రమే. ప్రజలే రాజును సృష్టించిరి. మీరెల్లరు నేకీభవించి మ్లేచ్ఛుల సేన నదిరింపుడు. దేవ పుత్రులయు, మహారాజాధిరాజులయు నాశ వదలిపెట్టుడు. ఉత్తరాపథముమానము మీ చేతులలో నున్నది. అమృత పుత్రులారా! ఆర్యవిరతి వ్రజులను, ఆయుష్మతి సుచరితను ఖైదుచేయుట లక్షలాది యమాయిక బ్రాహ్మణ శ్రమణుల రక్షణార్థమై జరిగి యుండలేదు. అది మహారాజాధి రాజుల మానముతో లేక వారి నాశ్రయించిన సామంతుల మానముతో కాపాడుటకే జరిగినది. ఈ యన్యాయము మొదటిది కాదు; చివరిది కాజాలదు. ఇది చిరకాలమునుండి స్థిరమగానున్న భరింపరాని యైశ్వర్యమదము. ఇందు న్యాయము నపేక్షించుట వ్యర్థము. అమృత పుత్రులారా! అనునయ వినయములచేగాని శాస్త్రవాక్యముల సమన్వయము చేయుటచేగాని ధర్మము రక్షింపబడజాలదు. ఆత్మత్యాగము వలననే ధర్మము రక్షింపబడగలదు. న్యాయరక్షణకై ప్రాణముల నర్పించుట నేర్చుకొనుడు. సత్య రక్షణకై ప్రాణత్యాగముచేయ సిద్ధపడుడు. అమృత పుత్రులారా! మృత్యు భయము మాయసుమా!"

వేయి కంఠము లొక్కుమ్మడి "మృత్యు భయమే మాయ" యని ప్రతిధ్వని చేసెను. ఆ కంఠధ్వని దుర్భే

ద్యమగు స్థానేశ్వరపు ప్రాకారములను చీల్చుకొని వెలుపలి భాగమునకు వ్యాపించి కలవరపెట్టెను. క్రమక్రమముగ శ్రోతల సంఖ్య యధికమయ్యెను. వారి నినాదములు ఆకాశమును గూడ చీల్చునట్లు "మృత్యుభయమే మాయ" అనుధ్వని చెవులను గింగురుమనిపించుచుండెను. ఆ గుంపు క్షణక్షణమునకును పెరుగుచుండుటచే ఆ సభా భవనము చాలలేదు. మహామాయ త్రిశూలము నెత్తి జనమును శాంతింపజేయ ప్రయత్నించెను, కాని గగనమును ఛేదించునట్టి ఆ జనఘోషమునందామె కంఠస్వరము లెక్కకు రాలేదు. గుంపు రాజమార్గములందును, కిటికీలయందును, వృక్షములపైకిని, ధ్వజస్తంభములపైకిని వ్యాపించుచుండెను. సభయందు సాక్షాత్తు త్రిశూలధారిణియగు పార్వతియే యావిర్భవించినదనియు, ఆమె యన్యాయమార్గగామియగు రాజును ధ్వంసము చేయుడని యాజ్ఞాపించినదనియు, పుకారు క్రమక్రమముగ నెల్లెడలను వ్యాపించెను. ఇదెక్కడి వింత! మహామాయ సందేశమును వీ రెంత విచిత్రముగ మార్చివేసిరి. ఉండియుండి "అమృత పుత్రులారా! మృత్యుభయమే మాయ" అను ధ్వని వాయుమండలమును కంపింపజేయుచుండెను. ప్రజలు తలకొకమాటగ దీని కర్థము చెప్పుచుండిరి. వృద్ధుడగు సభాధ్యక్షుడు మహామాయను చూచి భయముతో "భవతీ! మీరు వచించినదంతయు సత్యమే. కాని ఆవేశపూరితులై యున్న ప్రజలు స్ఫులింగములవంటి మీ పలుకులను సరిగా నర్థముచేసికొను స్థితిలో లేరు; కనుక మీరే వీరిని శాంతింపజేయుడు. ఆచార్యభర్వుపాదుల లేఖ

సమయానుకూలమైన యుపశాంతికే కాని శాశ్వత ధర్మ సందేశము నిచ్చునది కాదు. భవతీ! యీ క్లిష్టసమయమున ప్రభుశక్తిని ధిక్కరించి విప్లవముగు గావించిన తిరిగి ప్రజా శక్తిని క్రమబద్ధ మొనర్చునంతలో మ్లేచ్ఛులు నన యీ దేశ మును మాడ్చి మసిచేయగలను. భవతీ! అసమయమున ప్రజలయందు బుద్ధివైకల్యము గాపించుట యనుచితము" అని పలికెను.

మహామాయ గుంపును చీల్చుకొనుచు వేగముగ వెళ్ళి యొక యెత్తయిన చోటున నిలబడెను. విద్యుల్లత వంటి యామె మేనికాంతి యీ గుంపునందొక్కమూలు మెఱుపుతీగవలె మెఱసిపోయెను. ఆమెను చూచి గుంపు జయనినాదములు గావించెను. త్రిశూలమును పైకెత్తి మహామాయ అజ్ఞాపించుదానివలె "అమృతపుత్రులారా! శాంతింపుడు!!" అని గట్టిగా నఱచెను. ఆశాంతముగవలె, వివశవలె, మంత్రబద్ధమైన దానివలె జనసమూహము శాంతిం చెను. తరువాత మహామాయ "అమృతపుత్రులారా! సంయ మనమును వదలకుడు. మీ నగర విద్వాంసులు మహారాజాధి రాజులనుండి న్యాయమును కోర నభిలషించి యున్నారు. వారికి నా డవకాశ మొసగుట న్యాయము. కాని, న్యాయ మును పొందినంతమాత్రమున నీ సమస్య తీఱిపోజాలదు. దుర్ధర్షులగు మ్లేచ్ఛులసైన్యమును వేతనభోగులగుసైనికు లెదిరింపజాలరు. బ్రాహ్మణుడేమి చండాలుడేమి, అందఱు తమ స్త్రీల మానాభిమానములను రక్షించుటకు సిద్ధపడవలెను. నేను దేశపు భవిష్యత్తును చూడగలుగు చున్నాను. అమృత

పుత్రులారా! చాల దుర్ఘటమగు కాలమాసన్నమైనది. రాజులు, రాజపుత్రులును, దేవపుత్రులపై నాశలిడుకొని స్వయముగ ప్రయత్నము చేయకుండిన దీనిఫలము నిశ్చయముగ పరాజయమే యగును. ప్రజలలో మృత్యువన్న భయము వ్యాపించియున్నది. అది యశుభ లక్షణము. మీరార్యావర్తమును రక్షింపదలచినచో ప్రాణముల నర్పించుటకు సిద్ధపడుడు. ధర్మరక్షణార్థమై ప్రాణముల నర్పించుట యేదో యొక జాతివారి వృత్తి కాదు. అదిమానవ మాత్రుని యుత్తమ లక్ష్యము. న్యాయమెచ్చట లభించినను సరే, దానిని బలముచే పొందుడు. న్యాయమును పొందుట మానవుని జన్మస్వత్వము అనియు, దానిని పొందకుండుట అధర్మమనియు మీ రెఱుగకుండిన భారతవర్షము భవిష్యత్తు అంధకారమయమైనట్లే. అమృత పుత్రులారా! మ్లేచ్ఛులసీన భరత ఖండముపై చేయనున్న దాడి మొదటిదికాదు, కడపటిది కాజాలదు. నేడు మీరు శ్రీహర్షదేవులపైనను, దేవపుత్రులపైనను నాధారపడినచో బహుశః నేడీ విపత్తు తొలగిపోవచ్చును కాని రేపు తొలగిపో జాలదు. తువర మిళింద హర్షదేవులు చిరకాలము జీవింప జాలరు. కాని మీరు చిరకాలము జీవింప వలసినవారు. అన్నలారా! నేను మీ భవిష్యత్తును గాంచ గలుగుచున్నాను. రాజులు, మహారాజులు, సామంతులు, స్వార్థవశులై పోవుచున్నారు. ప్రజలు భీరువులై పిఱికిపందలై పోవుచున్నారు. విద్వాంసుల యొక్కయు, శీలవంతుల యొక్కయు, బుద్ధి కుంఠితమగుచున్నది. రాజు, ప్రజలు, విద్వాంసులు అందఱును గ్రుడ్డి

వారైనందున ధర్మాచరణమునకు వ్యాఘాతము కలుగు చున్నది. ఇది యశుభ లక్షణము. అమృత పుత్రులారా! ఇది యశుభ లక్షణమని నే నెలుగెత్తి చాటుచున్నాను. మిమ్ము మీరు కాపాడుకొనుడు. ధర్మాచరణమున దృఢముగ నుండుడు. న్యాయరక్షణకై ప్రాణముల నర్పించుట నేర్చుకొనుడు. బ్రాహ్మణులు మొదలుకొని చండాలుర వఱకు నున్న ప్రజలందఱు నేకీభవించి బండఱాయివలె దుర్భేద్యముగ నిలువుడు. ఇది యొక్కటే రక్షణోపాయము. రాజవేతనము ననుభవించు సేనపై నమ్మకము వదలుడు. మృత్యుభయమే మాయ!" అని పలికెను. మంత్ర ముగ్ధుల వలె ప్రజలామె పలుకులను వినుచుండిరి. తటాలున మహా మాయ ఆ చోటువిడలి కన్నులు మూసి తెఱచుటలో వెడలిపోయెను. దిగ్భ్రమజెందిన ప్రజలకేమియు నర్థము కాలేదు. ఏదో ఎదురుచూడని సంఘటన సంభవించునని మాత్రము వారూ హింపగలిగిరి.

నేను చూచుచుండగనే యెన్నియో ఘటనలు జరిగి నవి! ఈమధ్య పశ్చిమాకాశమెఱ్ఱనై పచ్చనై యెన్నో రంగులు మార్చినది. మధ్యాకాశమునుండి నల్లని కాటుక వంటి చీకటి కురియుచు నలుదిశల వ్యాపించుచుండెను. తూర్పుదిక్కున నుదయాద్రిపై చంద్రుని పాండురకిరణములు ప్రసరించుచుండెను. ఆర్యవిరతి వజ్రుడును సుచరితయు నేదో యపరాధమునకై కైదు చేయబడిరని నా కప్పటికి బోధపడి నది. కాని మహామాయ ప్రస్తుత విషయమును విడిచి యప్రస్తుత విషయమును గురించి యింత పెద్ద యుపన్యాస

మేలు చేసెనో నాకు బోధపడలేదు. ఈ విషయమున నేను చేయవలసినదేమైన నున్నదా లేదా యను విషయము కూడ నాకు తెలియలేదు. అశ్వారూఢులైన సైనికులు జనసమూహమును జాగరూకులై గమనించుచు, అవసరము కలిగిన తమ వాడియైన బల్లెములచే విప్లవము నణగద్రొక్కుటకు సిద్ధముగ నుండిరి. అకస్మాత్తుగ మహాత్ముని యావిర్భావము, ఆమె యంతర్ధానమును చూచి జనసమూహము దిగ్భ్రమజెందెను. ఒకదానివెంట నొకటి శీఘ్రముగ నడచిన ఘటనాచక్రగతి నన్ను కింకర్తవ్యవిమూఢుని గావించెను. అప్పటికి చంద్రోదయకాంతిచే తూర్పుదిక్కు పాండురమై యుండెను. నేనట్టి సమయమునకూడ ఆ మనోహర శోభను తిలకించు నవకాశమును వదలలేకుంటిని. తూర్పుదిక్కాంతయు ప్రియసమాగమజన్యమగు నానందముచే భాసిల్లుచున్నట్లుండెను. ఎత్తయిన వృక్షశాఖాశిఖలపై లేబసుపు కిరణములు పరచినట్లుండెను. చంద్రోదయమగుచున్నందున దిగంతమునుండి దీర్ఘములగు స్వర్ణశలాకలు నాటబడిన నీలాకాశ మద్భుతమగు శోభచే సుదీప్తమై యుండెను. అట్టి సమయమున నెవ్వరో యూపుచున్నట్లు నాకు తోచెను. తిరిగి చూతునుగదా, అతడు ధావకుడు. సాక్షాత్తుగ మూర్తీభవించిన పరిహాసమువలె నుండెను. చందనమలదిన యతని వక్షస్థలముపై మాలతీమాల శోభిల్లుచుండెను. భుజమూలమున వకుళపుష్పవలయములు మనోహరముగ చుట్టబడియుండెను. దువ్విన యతని పండు వెంట్రుకల జుట్టునందు దుర్లభజాతికుసుమముల గుచ్ఛమొకటి సొంపుగ నగపడుచుండెను. తాంబూలచర్వణమునం దతడు

చాల నిర్దయునివలె కనబడుచుండెను. తన నోటిపై గాని, విడెముపై గాని యతనికి కనికరము కలుగలేదు. కాని పట్టెడు తమలపాకులు కలిపినూడ నాతని నోటిని మూయజాలకుండెను. అతడు ముఖమును పైకెత్తి పెదవులను ఆకాశమునకు సమానాంతరముగ నిలిపి మాట్లాడుచుండెను. ఊర్ధ్వముఖి యగు ధారాయంత్రమువలె, నాతని నోటివెంట నవర్గళముగ కవితాధార వెడలుచుండెను! నా భుజము నూపుచు తాంబూల రససిక్తమగు స్వరమున నతడు "ఆర్యా! చంద్రుని చూచుచున్నావా! ఎవరైనను జ్ఞాపకమునకు వచ్చినారా?" అని యడిగెను. అతని పరిహాసపు పలుకులు విని నేను త్రుళ్ళిపడితిని. నేయక నా సమయమునకే భట్టిని నా తలపునకు వచ్చినది. కాని ధావకుడాగుట యనునది యెఱుగడు. అతడు "మిత్రమా! నిజముచెప్పనా? నేను పూర్వదిక్కున ఉదయగిరిపై నుదయించు నిశానాథుని జూచినపుడు తన హృదయాంతరాళమున ప్రియుని దాచుకొని, వియోగదుఃఖముచే తెల్లబడిన ముఖముగల ప్రియవిరహ దుఃఖాతుర యగు నాయిక జ్ఞాపకమునకు వచ్చుచుండును *. నీ కెట్లు తోచుచున్నది?" అని యడిగెను. నే నించుక మోదమందించుచు "మిత్రుడా! ఇది యనుభవముపై చెప్పుచుంటివా లేక కల్పనయేనా!" అని యంటిని. ధావకుడు "అనుభవము నీది, కల్పన నాది. సరేనా! ఈ భాగ్యమైన నాకు దక్కవలెను

---

* రత్నావళిలోని యీ శ్లోకముతో సరిపోల్చునది (1-5)

ఉదయగిరి తటాంతరిత మియం ప్రాచీసూచయతి దిఙ్నిశానాథమ్।
పరిపాండునా ముఖేన ప్రియమివ హృదయస్థితం రమణీ॥

కదా! నీ వా దుఃఖపడుచున్న ప్రియురాలిని కలిసికొన్నప్పుడామెతో నెట్లు మాటలాడవలెనో దానినికూడ నీకు నేర్పెదను బాబూ! నేను గొప్ప గొప్పవారికే నేర్పియున్నాను సుమా! ఈ విషయమున మహారాజాధిరాజులే నాకు శిష్యులు!" అని గర్వముతో పలికెను. నేను "కానీ, నీనేర్పు చూతము" అని యంటిని. ధావకుడు "ఎందుకు తొందర? రేపు నేర్చుకొందువు లెమ్ము! నే నిపుడు కృష్ణవర్ధనుల సందేశమును తీసికొని నిన్ను వెదకుచు వచ్చితిని. ఈ నగరమున నిన్నెఱిగియున్న వారందఱు నిన్ను వెదకి తెచ్చుటకై పంపబడియున్నారు. సుచరిత తన వాఙ్మూలమున నీవామె నాయకుడవనియు, నీయెడనామె కాదరాభిమానములు గలవనియు, చెప్పినది. నీవు వెంటనే చెరసాలకు వెళ్ళియామె నెట్టులైనను రాజుగారి కనుకూలవతిగ నొనర్పవలెనని రాజకుమారు లాదేశించి యున్నారు. నీవు చెరసాలలోని కే యాటంకము లేక వెళ్లుటకై యేర్పాట్లు గావింపబడినవి. త్వరగా కదలుము. లేనిచో ననర్థకము వాటిల్లును" అనెను.

ధావకుడు ఆలోచించుటకును నాకు గడువొసగలేదు. దూరమునుండి దుందుభిధ్వని వినిపించుచుండెను. దాని యభిప్రాయమును నాకు తెలుపుచు ధావకుడు "కృష్ణవర్ధనులు ప్రజలను శాంతింపవలసినదని హెచ్చరించుచున్నారు. అవధూతస్వామియగు అఘోర భైరవులను, ఆర్యవేంకటేశ పాదులను తిరిగి నగరమునకు తీసికొనివచ్చినారు. ఈనాడే గడ్డుప్రశ్నను గుఱించి మహారాజులు, కృష్ణవర్ధనులు, యధికరణికులు మొదలగు వారినడుమ గుసగుసలు సాగినవి" అని పలికెను. నేను

"మిత్రమా, ఏగడ్డు ప్రశ్నను గుఱించి?" అని యడిగితిని. ధావకుడు మూతివిఱిచి "ప్రశ్న యేమున్నది? అంతయు బుద్ధి హీనత, అంతే! ఈ విరతి వజ్రుడెప్పుడో బౌద్ధ భిక్షువుగా నుండెడివాడు. మఱి ఆ పెద్దమునిమీకేమి వచ్చినదో యేమో! అతడు ఆఘోరభైరవ వేంకటేశభట్టుల చేతులలో చిక్కి నాడు. ఈ వేంకటేశభట్టు పోకిరివలె కనబడుచున్నాడు. అం మనకేమి తెలియునులెమ్ము. ధర్మసాధనమున్నదేమో కూడ నాకు తెలియదు. ఈ పెద్దముని, విరతివజ్రుని, సుచరితను, తన క్రొత్త యాశ్రమస్థానమున దీక్షను స్వీకరింపజేసినాడు. ఆ విషయ మీ నగరముననున్న బూటకపుబౌద్ధ పండితుడగు వసుభూతికి తెలిసి, అత డుగ్రుడై తన శిష్యుడగు ధనదత్త శ్రేష్ఠిని రెచ్చగొట్టి యొకకన్నాగము పన్నినాడు. ఇప్పుడా ధనదత్తుడు విరతివజ్రుని తండ్రి తనయొద్ద వేయి దీనారములు ఋణముచేసి చనిపోయినాడని చెప్పుచున్నాడు. విరతివజ్రుడు సన్యాసిగా నున్నంతవఱకతని కీఋణబాధ లేకుండెను. కాని యతడిపుడు సుచరితతో గృహస్థధర్మమును స్వీకరించినందున నతడా శ్రేష్ఠి ఋణమును వడ్డీతో కూడ తీర్చవలసియున్నది. సంగ్రహముగ విషయమిది. ఇందు నీవేమి చేయవలెనో నీవే యాలోచించుకొనుము. నేను నిన్ను చెఱసాలవద్దకు చేర్చి, మఱియొక చోటునకు వెళ్ళెదను" అనెను. నాకు విషయము కొంతవఱకు బోధపడినను ధావకునివలన నింకను తెలిసికొంద మని నేను "మిత్రమా! ఈ మహామాయ నేకిట్టి యనర్థమేల చేసినదో?" అని యంటిని. ధావకుడు నవ్వి "మిత్రమా! ఇది రాజధాని సుమా! ఇంకను నెన్నో విషయములను

చూచెదవులెమ్ము! మహామాయనిచట కొద్దిమంది మాత్రమే యెఱుగుదురు. నాకుగూడ నామెను గుఱించి కొంతవఱకు తెలియును. ఆమె మహారాణియగు రాజ్యశ్రీగారి సవతి!" అని యనెను. నిద్రనుండి మేల్కొన్న వానివలె నే నులిక్కిపడి "సవతియా?" అని యంటిని. ధావకుడు మందలించుచు "గట్టిగానఱచెద వెందుకయ్యా? ఈ నగరమున రాణిగార్ల సవతులయుండవి యున్నది అసవి!! తెలియునా?" అని యనెను. నేనతని చెవిలో "అయితే, మహారాజాధి రాజులుకూడ..." అని యను నంతలో, ధావకుడు చెవ్రులుమూసికొని "పాపము శాంతించుగాక, పాపము శాంతించుగాక! ఈ నగరమున స్వచ్ఛమగు శీలముగలవారు ముగ్గురే! శ్రీహర్ష దేవమహారాజులు, రాజ్యశ్రీమహారాణులు, తరువాతి..." అని ధావకుడు చెప్పుటకు నిశ్శబ్దములుచు నావైపుచూచెను. నేను "ఆ మూడవ భాగ్యశాలియెవరు?" అని యడిగితిని. ధావకుడత్యంత గంభీరముగ "మహాకవి ధావకుడు!" అని పొట్ట చెక్కలగునట్లు నవ్వెను. నేనుకూడ నవ్వితిని. అటుపిమ్మట ధావకుడదేదో చెప్పుచుండెనుగాని నేను మహామాయను గుఱించి యాలోచించుచున్నందున నేనేమియు వినజాలక పోతిని. మహామాయ రాజ్యశ్రీ సవతియేనా? నేడామె యీ దేశము నందవమానింపబడి నిందించబడిన లక్షులాదిస్త్రీలలో తానుకూడ నొకదానినని చెప్పెనే? ఇందేమి రహస్యముండ వచ్చును? పాపమామె యెట్టివేదనకు గుఱియై రాణిగనుండి సన్న్యాసినియయ్యెనో కదా! విధియామెనెంత కఠోరముగ పరిహాసము చేసెను! మహామాయ యొకనాడు మౌఖరీవంశపు

రాజ్యలక్ష్మిగానుండెను. ముదురుచున్న వయస్సునందు కూడ నామె ముఖమున ప్రకటితమగు తేజస్సు ధావకుని మాటలను నిరూపించుచున్నది. కాని ధావకుడు నిక్కమే వచించు చున్నాడు. నేడు మహామాయ చెప్పినదంతయు, నెన్నో సంవత్సరములుగ నాహృదయమున సంచితమైయున్న కటుత్వమును ప్రతిబింబిత మొనర్చుచున్నది. ఆడుసింగపు టాకృతి మారినదేగాని, యాత్మయదియే! కాని యీ ధావ కుడు గూడ నొక విచిత్రమైన వ్యక్తియే. ఇతడెట్టికవియో తెలియదుకదా! మహామాయ భ్రష్టురాలైనట్లును ఇప్పుడు మఱింత భ్రష్టయైనట్లును నింత గొప్పవిషయము నింత చుల కనగా చెప్పుచున్నాడే! మీదు మిక్కిలి యితని ముఖమెంత నిర్వికారముగ నున్నది! ఎట్టి యాశ్చర్యము!” అని నేను తలపోయుచు ధావకుని వెంట నడచుచుంటిని.

చెరసాలవద్దకు చేరగనే ధావకుడు “మిత్రమా చూడుము, చెరసాల ద్వారము తెఱచియే యున్నది. నీవు రాజకుమారుల యాజ్ఞను పాలింపుము. నేను వెళ్లుచున్నాను” అని యనెను.

చెరసాల రాతితో కట్టబడిన దృఢమగు భవనమే కాని యెత్తు చాల తక్కువైనందున ఎవరునుగూడ దాని యందు నిలుచుండుటకు వీలులేకుండెను. భవన మంతయు నొక గుహవలె నగపడుచుండెను. ద్వారమువద్ద నున్న యశ్వత్థవృక్షము దానిని మఱింత భయంకరముగ నొనర్చుచుండెను. కావలివారు నాపై రడిగి ద్వారమును తెఱచిరి. లోనికి వెళ్ళగనే నే నొక విశాలమగు ముంగిలు

ప్రవేశించితిని. ఈ ముంగిలికి నలువైపుల గుహలవంటి చిన్న గదులుండెను. వానియందొక ద్వారముకడకు నేను గొంపోబడితిని. ద్వారము తెఱువగనె వెన్నెలచే నా చిన్నగది ప్రకాశించెను. ఆ గదియందు గాలిగాని వెలుతురుగాని ప్రవేశించుటకు మార్గమే లేదు. నేలపై రాతి చప్పట వేసియుండినను గదియంతయు నొకవిధమగు దుర్వాసనతో నిండియుండుటచే యచట నిలుచుండుట కష్టమగుచుండెను. అందు సుచరిత నివాత నిష్కంప దీపశిఖవోలె పద్మాసనము వేసుకొని కూర్చుండియుండెను. ద్వారమును తెఱచినపుడు కలిగిన చప్పుడువలన నామె ధ్యానమున కంతరాయము కలియుండనోపు. ఆమె యొకసారి మాత్రము మెడను ప్రక్కకు త్రిప్పి మమ్ములను చూచెను. కావలివాడు నాకామెకు చెప్పినన్ను పరిచయముచేసెను. సుచరిత కన్నులాశ్చర్యముతో విప్పారెను!

కావలివాని మాటలను తొలుదొలుత ఆమె నమ్మలేకపోయెను. పిమ్మట నమ్మెను. ఒక్క క్షణములో నామె ముఖముపై నానందము చిందులు ద్రొక్క సాగెను. ఒక్కతరి సౌందర్యధార రాతి చప్పటయందంతటను ప్రవహించిపోయెను. సుచరిత లేచి నిలుచుండుటకు ప్రయత్నించెనుగాని ఆమె చేతులినుప సంకెళ్ళతో కట్టిబడినందున లేవలేకపోయెను. అప్పటి యామె తొట్రుపాటు నా హృదయమును కరిగించివేసెను! ఆహా! ఎట్టి కరుణార్ద్రమైన మనోహరవదన మది! ఆమె పెదవులపై చిఱునగవు నాట్యమాడుచుండెను; తన యసహాయ స్థితిని తలచుకొని యామె కన్నులు వాలి కన్నీరు కారునను భయమున నామె నన్ను విచ్చిన కన్నులతో జూడక

క్రీగంటనే చూచు చుండెను. ఆమె చిక్కుపడిన కేశములు చెదరి యుండినందున భుజమును విదిలించి యామె వానిని సర్దుటకు ప్రయత్నించు చుండెను. పాపటను మొదటనుండి కప్పుచుండిన మేలిముసుగు వెనుకకు జారి వీపుపై బడి యుండెను. కాని పాప మామె చేతులు బంధింపబడి యుండుటచే నామె దానిని సవరించుకొన జాలక పోయెను. హృదయవిదారకమగు నామె మనోభావమును కావలి వాని పాషాణ హృదయముగూడ గుర్తించెను. అతడు వెంటనే యొక వృద్ధురాలిని పిలుచుకొని వచ్చెను. ఆ వృద్ధురాలామె ముసుగును సవరించి, సీమంత భాగమును కప్పెను. కడు ప్రయాసతో సుచరిత నన్నే "అస్థానమున ఆర్యులకు ప్రణమిల్లుటకుగూడ నేను సిగ్గుపడు చున్నాను. నాయవినీతిని మన్నింతురుగాక! ఇదికూడ నారాయణు డొసంగిన ప్రసాదమే" అనియనెను. ఒక క్షణకాల మామె ముఖము వెలవెల పోయెను. కాని వెంటనే కుదురుపాటు చెంది "భగవంతునికి దేనివలన నానందము లభించునో యదియే మనకు కర్తవ్యము" అనెను. తర్వాత క్షణము నేనామె వివశయైనదానివలె స్తబ్ధముగనుండెను. అప్పుడప్పుడామె యధరములు మాత్రము కదలుచు నేదో యదృశ్య శక్తితో నామె తెలియరాని భాషలో మాటాడు చున్నట్లుండెను. నా హృదయము కరిగి సహస్రధారల పాఱిపోవ నాతురపడుచుండెను. 'దేవీ! బాణభట్టు నీ కష్టముల నన్నిటినీ తనపై వేసికొనుటకు సిద్ధముగ నున్నాడని యే విధముగ నేను చెప్పగలను! అయ్యో! అది సంభవమా! ఏ రాజతంత్రమీ పద్మపుష్పమును నిచుప సంకెళ్ళతో బంధించెనో!

ఎట్టి పాపబుద్ధి యీ వెన్నముద్దను ముండగడ్డి మోకులతో బిగించెనో! ఎట్టి కలుషజీవిత యీ మాలతీమాలను మండుచున్న నిప్పులపై పాఱవేసెనో! దేవీ! నీ ఘోరకష్టమును, వేదనను సంపూర్ణముగ తనపై వేసికొనకున్న నీయకించనుని జీవితమే భారవహ మగునని నేనెట్లు చెప్పగలను! ఈ విషయమున బాణభట్టుని శక్తియెంతది!' అని నేను లోలోన చింతించుచుంటిని కాని సుచరిత నిర్వికారముగ నుండెను. ఆమె యీ క్లేశము నన్నిటిని నారాయణుని ప్రసాదమని సంతోషముగనే స్వీకరించియుండెను.

అప్పటికి చంద్రుడాకాశమున కొంత పైకెగబ్రాకియుండెను. మహావరాహుడు ధరిత్రిని తనదంతములపై నిడుకొని క్షీరసాగరమునుండి యిప్పుడే వెలికివచ్చినట్లును, భువనమండల మంతయు క్షీరధారలచే తడుపబడి క్షీరమయమైనట్లును కనబడుచుండెను. ఈధవళ కాంతియందు సుచరిత కైదుచేయబడిన కారాగృహము క్షీరసాగరమున నీటికోడి యీదుచున్నదా యన్నట్లగపడుచుండెను. నేను కాతరభావమున "దేవీ! నా యవినీతిని మన్నింపుము. నేనీ విషయమును మొదటినుండి చివరవరకు వినుటకు కుతూహలముతో నిచటికి వచ్చితిని. ఇందేదైన మంచిచేయుటకు నేను నిమిత్తమాత్రుడను కావచ్చును. మీరు సమ్మతించినచో కృతార్థుడనగుదును" అని యంటిని. పాలిపోయిన సుచరిత మనోహర ముఖమండల మొకసారి యానందదీప్తిచే వెలిసిపోయెను. ఆమె "ఆర్యా! మీర కారణముగ నన్ను సిగ్గుపఱచుచున్నారు. నే నకించనురాలను, రాజుల కొసగెదు

మర్యాద నొసగి నన్ను 'దేవి' యని సంబోధింపవలసిన యవసరమిపుడేటువచ్చినది. నావిషయమునందేదియు దాగియుండ లేదు. పాపమో, పుణ్యమో, ధర్మమో అధర్మమో, నాచే చేయబడినదంతయు నేను నారాయణునికర్పించితిని. అందుచే నది యఖిల విశ్వమునకు చెందినది. ఆర్యా, నాజీవితము నందేదియు రహస్యముగ నుంచదగినదిలేదు. ఏమి చెప్ప ముందురో యానతిండు" అనిపలికెను. నేను సానుభూతి తెలుపుస్వరముతో "దేవీ! యీ విషయమునకు మూలమేది? ఆర్య విరతివ్రజుల వ్యవహారమును మిమ్మెందులకు కైదు చేసిరి? దీనిని గుఱించియే నేను తెలిసికొనగోరుచున్నాను" అని యంటిని. సుచరిత పెదవులపై చిరునవ్వు లాస్యము చేసెను. ఆమె కన్నులు వాలిపోయెను. కాని కనుబొమలు మాత్రము ముడివడుచు విడిపోవుచుండెను. ఆమె నావైపునకు చూడ నభిలషించుచుండెను. కాని లజ్జాభారముచే నామె రెప్పలను పైకెత్తలేకుండెను. మెల్లగ నామె "ఆర్యా! ఆద్యంతము తమరు వినదలచుకొన్నారా?" అని యడిగెను. నేను సవినయమ్ముగా "నేనెంత వినవచ్చునో యంత వినగోరు చున్నాను" అని యంటిని. వాలియున్న యామె కన్నుల యందపూర్వమగు రసమాధుర్య తరంగములు కదలుచుండెను. భుజమును విదలించి తన కేశ సంపదను సర్దుకొని యామె 'అవధరింపుడు' అనెను.

సుచరిత మెలమెల్లగ నిట్లు చెప్పదొడగెను:- "నేను నా కథను మధ్యనుండి వినిపింపవలసి యున్నది. ఏలయన నా బాల్యమును గుఱించి నాకేమియు జ్ఞాపకము లేదు. నాతల్లి

దండ్రు లెవరో నాకు తెలియదు. చాలా చిన్న వయస్సుననే నా సంరక్షకుడు నాకు వివాహముచేసి యథా శీఘ్రముగ తన కర్తవ్య భారమును వదల్చుకొనెను. అత్తవారింట నేను నా యత్తగారిని మాత్రమే యెఱుగుదును. నే నత్తవారింటికి వెళ్ళక ముందే నా మామగారు పరలోకగతులైరి. నేను వెళ్ళిన కొన్ని దినములకు నా భర్తగారు ముముక్షువులై పరివ్రాజకు డయ్యెను. అప్పటికి అజ్ఞానావస్థయం దున్నందున నేను విషయముల యర్థము నరయజాల కుంటిని. అత్తగారు తనవాత్సల్యము నంతయు నాపై వర్షింపజేసి నన్ను పెంచెను. కాలక్రమమున నే నొకనాడు నా స్థితిని గుఱించి తెలిసికొన గలిగితిని. వసంతర్తువున చైత్రమాసము, చైత్రమాసమున పల్లవరాజి, పల్లవరాజియందు పుష్పసంభారము, పుష్పసంభారమున భ్రమరావళి, భ్రమరావళియందు మత్తపిలువరయే వచ్చినట్లు నా శరీరమున యౌవనము ప్రవేశించెను. నా యత్తగారు తీర్థయాత్రకై వెడలిరి. నే నామెవెంట నానాస్థలముల తిరుగుచు నా మనస్సులో నున్న కోరికను తలచుకొని కుళ్ళుచుంటిని. స్థానేశ్వరము నా మామగారి నివాసస్థానము. నా యత్తగారు తనయంతిమ దినములలో నచ్చటనే నివసించు చుండిరి. ఇంతకు ముందామె యొకసారి తీర్థయాత్రకై కాశీకి వెళ్ళియుండెను. ఒకనాడు కాశీకి సమీపమున నున్న జనపదము వెళ్ళుచున్నపు డొకచో తేజశ్శాలియు, సుందరాకారుడునైన యువకుడొకడు పురాణ కాలక్షేపము చేయుచున్నట్లు మేము వింటిమి. అతని ఆకర్షణీయమగు శైలి, శ్రుతిమధురమగు పఠనము, హృదయమును

వారించునట్టి ప్రతిపాదనము మొదలగునవి యీ జనపదము నం దభూతపూర్వమగు ధార్మికోత్సాహమును వ్యాపింప జేసెను. మేము కూడ పురాణమును వినుటకై వెళ్ళి యుంటిమి. పురాణశ్రవణము ముగియగనే నాయత్త గారా తరుణుడగు నా పండితునికి తన నియమానుసారము నా చేతిని చూపించి తన పుత్రుడెప్పు డింటికి తిరిగివచ్చునని యాతనిని ప్రశ్నించెను. ఆర్యా! నేను మీతో నిజము చెప్పుచున్నాను. నాడు నా యస్తిత్వమంతయు గట్లను త్రెంచుకొని యునికి పొంగిపోయెను. నా శరీరమంతయు రోమాంచితమయ్యెను. లజ్జావేగమువలన నా కరతలమునుండి స్వేదజలము స్రవింప సాగెను. నేను పూర్ణురాలనని నాడు ప్రథమమున నేను గుర్తించితిని. ఒకానొక కోటిశ్శ నా హృదయమును స్పృశించెను. అదే నా జీవితమున కొక గొప్ప వరప్రసాదమయ్యెను. ఆ బ్రాహ్మణుడు నా చెమర్చిన యీ చేతుల నంతగా చూడక మందహాసముచేయుచు 'దేవీ! నీ వఖండ సౌభాగ్యవతివి' అని సహజముగా పలికి నా యత్తగారి నూఱడించెను. నాటి దినమున హృదయమున క్షీణించిన ఆశాంకుర మొకటి మొలకెత్తెను. అది నా క్రొత్తజన్మము. నేను ప్రపంచము నుండి విచ్ఛిన్నమైన స్వతంత్రపిండమును గాననియు, నలువైపుల దుర్వారమగు శక్తులచే కట్టబడియుంటిననియు నాడు మొట్టమొదట నేను తెలిసికొంటిని. ఆర్యా! తమరు నా మాటలను విశ్వసించుచున్నారుకదా!" అని సుచరిత యడిగెను.

ఈ యనవసరపు ప్రశ్నకు కారణము నా కర్థము కాలేదు బహుశః చాలమంది యీమె వృత్తాంతమును విని సందేహించి యుండవచ్చును, లేదా స్వామికి నాపై విశ్వాసము లేకపోవచ్చును. కాని నాడు వారణాసివద్ద ఒకానొక జనపదమునందు నాకగపడి నాకు తన కోడలి చేతిని చూపి, తన పుత్రు డెప్పుడు వచ్చునని యడిగిన వృద్ధురాలు; హఠాత్తుగ జ్ఞాపకమునకువచ్చెను. ఈ చరితయే యీమె కోడలాయని సందేహము కలిగెను. సుచరిత నన్నొక క్షణము వీక్షించి మరల తన వృత్తాంతము తెలుప నారంభించెను.

“ఆర్యా, బ్రాహ్మణయువకుని భవిష్యద్వాణి నిజమైనది. నేనఖండ సౌభాగ్యవతినే యైతిని. నే నా కథనే తమకు విన్నవించుచున్నాను. నేను నాయత్తగారితోట కన్యాకుబ్జమునకు తిరిగి వచ్చుచుంటిని. అది చైత్రమాసము. కొలనులలో క్రొత్త క్రొత్త పద్మములు వికసించి యుండెను. ఆమ్రమంజరులు మనస్సును మత్తింపజేయు సౌరభము స్రవంతముగ నొసగుచుండెను. మదించిన కామినీ జనపు పుక్కిలింత జలముచే పొగడచెట్లు పుష్పించుచుండెను, మ్రాని పుష్పపు మొగ్గలపై భ్రమరముల సమూహపు నల్లదనము వ్యాపించియుండెను. యువతీమణుల అందెలచే నలంకరింపబడిన చరణతాడనములచే అశోకవృక్షములు పుష్పములను తాల్చుటయందు పోటీ చేయుచుండెను. తియ్యమామిడి చెట్లపై తుమ్మెదలు ‘ఝుమ్మ’ని రొదచేయుచు నాక్రమించియుండెను. అనవరతము చెట్లపైనుండి రాలుచుండిన పుప్పొడిచే భూమియంతయు ధవళమై యొప్పుచుండెను. పుష్పమధుపానముచే తూలు

చుండిన యాడు తుమ్మెదలు తీగల తూగుటుయ్యెలలపై నూగుచుండెను. వికసించిన లవలీపల్లవములయందు దాగుకొని కోయిలలు తమ మధురకంఠస్వరముల గానముచేయుచు రసికుల చిత్తములను రంజింపజేయుచుండెను. అనంగదేవుని ఆయుధగృహమునందు లవలాది క్రొత్త యస్త్రములునిండి యుండెను. నేను చిత్రకూటమునందొక సరోవరమునకు స్నానార్థమై నాయత్తగారితో వెళ్ళియుంటిని. ఆ సరోవరమునందు స్నానముచేసిన స్త్రీ సౌభాగ్యము యుగాంతమువఱకు స్థిరముగ నుండునని ప్రతీతియుండెను. ఆ సరోవరము దట్టమైన నీడలుగల వృక్షసమూహము మధ్య నుండెను. దాని గట్టున నెండుటాకులును, ఎండిన పూలును గుట్టలు గుట్టలుగ పడియుండెను. పుష్పపరాగము పడియుండుటచే నాసరోవరపు గట్టు బంగారు కాంతిగలదై యుండెను. సరోవరమంతయు వివిధములగు కుముద కమలోత్పల శతపత్రములచే నిండియుండెను. దానికొక వైపున మామిడితోటయుండెను. అచటి పుష్పమంజరి నాళములను మత్తిల్లిన కోయిలలు తమ వాడిగోళ్లచే చీల్చియుండుటవలన వానినుండి నిరంతరము తేనె కారుచుండెను. ఆ కొలనుకు మఱియొక వైపున చిన్న మంచిగంధపు తోపుండెను. ఆ చెట్ల బోదెలపై చుట్టుకొనియున్న సర్పములు పర్వతములందు విహరించుచున్న నెమలి కూతలను విని వడలిపోవుచుండెడివి. సరోవరపు గట్టుననున్న వృక్షము క్రింద రాలియున్న పుప్పొడిపై కలహంస మిథునములు విహరించియుండుటచే వాని పదచిహ్నములచే చెదరిన పుప్పొడి చిత్రించిన వాసంతీదుకూలమువలె వనస్థలి

యనెడి సుందరి సౌందర్యమును నూఱురెట్లధికము చేయు చుండెను నాయత్తగారు సరోవరములోని జలమును స్పృశించి గద్గదకంఠమున నేదో ప్రార్థన గావించి ధ్యానమగ్నయై జపము సేయసాగెను. నేను కొంతసేపటివఱకు సరోవరపు శోభను తిలకించుచు ముగ్ధురాలనై నిలుచుంటిని. మామిడి తోటను, చందనవనముల యనురికను చూడగా తప్పక అవి మానవుని కౌశలముచే నంత యందముగ నాటబడినట్లు స్ఫురించెను. నే నల్లనల్లన ఆ మామిడితోటవైపునకు వెడలితిని. నా మనస్సకారణముగ కుతూహల పడుచుండెను. ఆర్యా! గాయపడిన హృదయమెప్పుడును ఆశావాదినియేకదా! నన్నెవరో బలవంతముగ నటువైపుకీడ్చుచున్నట్లును, ఏకొరతవలన నేను భ్రమించిన దానివలెను, నన్ను నేను మఱచిన దానివలెను నుంటినో, యా కొఱత పూర్తి కాగలదని నాకు తోచుచుండెను. అక్కడికి వెళ్ళి చూతునుగదా, ఒక తరుణ తపస్వి స్నానార్థమై సరోవరమువైపునకే వచ్చుచుండెను. ఆర్యా! నేనేమి చూచుచుంటిని! శివుని తృతీయ నేత్రాగ్ని శిఖలయందు తనమిత్రుడు భస్మమగుటను చూచి వసంతుడే వైరాగ్యము వహించెనా, లేక మహాదేవుని శిరోభాగమున నుండు చంద్రుడు తన మండలమును పూర్తి చేసుకొనుటకు తపస్సు చేయుటకుద్యమించెనా, లేక కాముడే శివుని ప్రసన్నునిగా నొనర్చినపిదప తన పాపమునకు ప్రాయశ్చిత్తము చేసికొనుటకై ఈ కఠోరతపస్సును ప్రారంభించెనా యన్నట్లుండెను. అత్యంత తేజోరాశియగుటచే నామునికుమారుని చూచినపుడటుల చంచలమగు విద్యుత్పుంజము మధ్యనున్న

ట్లును, లేదా గ్రీష్మకాలపు సూర్యమండలపు మధ్యనున్నట్లును లేదా అగ్నిశిఖలమధ్య శోభిల్లుచు నున్నట్లుండెను. దీపప్రకాశమును బోలిన పింగళవర్ణపు దట్టమైన దేహచ్ఛాయచే నతడు వనమునంతటిని పసుపుపచ్చగ నొనర్చుచుండెను. అతని విశాల నయనములను జూచి నడవియందలి హరిణములన్నియును కలిసి తమ నయనశోభ నతనికి దానమిచ్చినవా యన్నట్లుండెను. కేశరహితమగు నతని ముండన శిరము క్రింద వైరాగ్యముయొక్క విజయధ్వజమువలె మూడు అడ్డరేఖలతని తరల దేహకాంతులను దాటుకొని అలరుచుండెను. అతడు తెల్లని పట్టుచీరమును ధరించియుండెను. దానిని చూచునపుడు నవయౌవనారుణ రాగమతని హృదయమందిముడలేక వస్త్రములవలన వ్యాపించెనా యనిపించుచుండెను. అతని పెదవులపై కొంచెము నల్లనిమసిరేఖ ముఖపద్మమునందలి మధువును గ్రోలునాసచే తుమ్మెదపంక్తియే యచట నున్నదా యనిపించుచు మనోహరముగ కనబడుచుండెను. ఆకులతో గూడిన పొగడపండును తలపించు కమండలువు నతడొకచేత ధరించి యుండెను. మఱియొక చేతి మన్మథుని దహనశోకముచే వ్యాకులయైన రతీదేవి నుదుటి సిందూరమే పూసియున్నట్లు చిన్నదగు నెఱ్ఱని జపమాల వ్రేలాడుచుండెను. పిక్కలవరకు రక్తవర్ణపు చీవరముచే నాచ్ఛాదితుడై యున్న యాతరుణతపస్విని జూచి నేను మంత్రముగ్ధవోలె నిలబడితిని. బ్రహ్మచర్యవ్రతవిజయపతాకము, ధర్మముయొక్క యౌవనము, వాగ్దేవి వేష విన్యాసము, సర్వవిద్యలు స్వయముగ వరించిన పతి, సమస్తజ్ఞానము మేళవించిన

కనురెప్ప లప్పటికిని చలించలేదు. చెవియందున్న ఆర్ద్రవికసిత పల్లవములు నామమాత్రమునకు కపోలభాగమునుండి తొలగి యుండెను. కేశభారము భుజములపై మున్నుపటివలెనే జారి పడియుండెను. కర్ణకుండలములింకను భుజములపై నూగులాడుచుండెను. ఛీ! ఛీ! సిగ్గులేమికికూడ మితియున్నది!” అనియెను.

ఇంతవఱకు సుచరిత తన వృత్తాంతమును సహజముగ చెప్పెను కాని అటుపిమ్మట నామె కంఠమించుక బొంగురు వోయెను. చంద్రుని ధవళజ్యోతిర్ధార తిన్నగ నామెముఖముపై పడుచుండెను. ఆ శ్వేతావరణముచే నామె ముఖమెంత భాసమానమగుచుండెనో యంత ఆచ్ఛాదితమగుచుండెను. కాని యీమాఱామె మనోహరముగ ముఖముపై మెఱసి పోయిన యెఱ్ఱదనము నాశ్వేతావరణముకూడ దాచలేక పోయెను. జాహ్నవీతోయమునందు ప్రతిబింబించు రక్తోత్పలములవలె, నీటియావరణములోనుండి యుగపడు దీపశిఖ వలె, శరత్కాల మేఘముల మధ్యనుండి ప్రకాశించు బాలారుణుని ప్రభవలె నా యెఱ్ఱదనము రమణీయముగ నుండెను. ఒక్కక్షణము సేపామెచూపులు క్రిందికి వాలినవి. కాని మఱుక్షణముననే ఆమె మేలుకువజెంది “ఆర్యా! ఆవిధముగ నెందుకు జరుగునో చెప్పగలరా? అది పూర్వజన్మపుకర్మ బంధమా? లేక ఉత్తర జన్మమునకు కారణమా? దుర్వారమగు నేప్రచండ శక్తియొక్క సంజ్ఞామాత్రమున ఆజన్మలాలితమగు లజ్జాబంధన మిట్లు పట్టుతప్పునో, అది పాపమా? ఆర్యా! దాని నెందులకాసురశక్తి యనుకొందురు. నేనీ వృత్తాంతము నెవ్వారెవ

రికి చెప్పితినో వారందఱు బుద్ధిమంతులవలె తలలూపి నన్ను పాపాత్మురాలనిరి. అకారణముగ నాపై నారోపింప బడిన నాయీ పాపవహ్నియందు చాలకాలమునుండి నేను తప్తమగుచున్నాను. ప్రేమాధిదేవతను వైరాగ్య నయన జ్వాలలందు భస్మము చేయించి కవులు గౌరవమును పొందుటకు వైరాగ్యమంతగొప్పదా ? మీరే సెలవిండు” అనిపలికి కొంత సేపటివఱకు నా ప్రత్యుత్తరము నాశించుచు నన్ను చూచుచుండెను. నేను “దేవీ! విభిన్నములగు ప్రశ్నలకు విభిన్నములగు సమాధానములుండును. మీరు రెండు ప్రశ్నలను కలిపి సమాధానమడుగుచున్నారు. కాళిదాసుడు ప్రేమాధిదేవతను వైరాగ్య నయన జ్వాలల భస్మము చేయించియుండలేదు. కాని యతనిని తపస్సనందుడ్డిపైకి తీసి సౌందర్యముయొక్క హస్తమునందు ప్రతిష్ఠించి యున్నాడు. పార్వతీదేవి తపస్సుచే నిజమైన ప్రేమాధిదేవత జన్మించెను. భస్మమైనది జడ శరీరము యొక్క ఆహార నిద్రల వంటి వికార ధర్మము మాత్రమే. ఆ వికారము మర్త్యమైనను దేవత మాత్రము కాజాలదు. దేవీ! దేవత యెన్నటికిని మర్త్యము కాలేదు. మీరు వేర్వేరుగ ప్రశ్నల నడుగుడు. నేను మీ వృత్తాంతము నంతయు విన గోరుచున్నాను.” అని ముక్తసరిగ చెప్పితిని. సుచరిత ఆశ్చర్య చకితయైన మృగశాబకమువలె విస్ఫారిత కన్నులతో నన్ను జూచుచు “ఆర్యా! యేమంటిరి! పార్వతి శివుని యేకైక దేవునివలె నారాధింప లేదా? జడ శరీరధర్మముల పాప భూయిష్ఠమగు నాకర్షణచే నా మైవ్రతము ఫలించినా? వ్రజభూమియందలి గోపికలు నిఖిలానందసందోహు

డగు ముకుందుని రూపమాధుర్యమునెడ చూపిన యాసక్తి ప్రేమ కాజాలదా? అటులైన గోపికల ప్రేమయే కామ మనియు, కామమే ప్రేమ యనియు ఏల వచింపబడినది? * పార్వతీదేవి యాసక్తి కేవలము బాహ్య జడధర్మ మేనా?" అని ప్రశ్నించెను. ఒక్క క్షణములో కాళిదాసుని శిల్ప నైపుణి చిత్రించిన పార్వతీదేవి రూపము-ఇంటియందు నివసించక శిలపై శయనించుచు ఎండ గాలి వానలందు నిశ్చలముగ నుండి తపోనిరత యైన యామె రూపము - నా కన్నులయెదుట విద్యుల్లత వోలె మెఱిసిపోయెను. మహారాత్రియే తన విద్యున్మయ దృష్టిచే నపుడపుడు చూచుచు నా మహాతపస్సునకు సాక్షీ భూతమై యుండెను. ♀ పార్వతీదేవియొక్క ఆ స్థితికిని, సుచరితయొక్క యీ స్థితికిని నెంతయో సామ్యమున్నను నెంతయో భేదముకూడ కలదు. నేను స్నేహార్ద్రమగు కంఠ మున "దేవీ! పార్వతి శివునే తన సర్వస్వమని తలచెను. కాని దోషము శివునిది. శివుడు తన చిత్తవైకల్యమునకు కారణము తెలిసికొనగోరి యన్ని దిశలను, జూచెను. జడ ప్రకృతితో చైతన్యము కలిసినపు డుత్పన్నమగు వికారమే

---

* భక్తిరసామృతసింధు' నందలి "ప్రేమైవ వ్రజరామాణాం, కామ యిత్యభిధీయతే" తో సరిపోల్చనగును.

♀ సరిపోల్చుము : శిలాశయాం తామనికేతవాసినీం
నిరంతరాస్వాంతర వాతవృష్టిషు।
వ్యలోక యన్నున్మిషితై స్తటిన్మయై
ర్మహా తపః సాక్ష్య ఇవస్థితాః క్షపాః ॥
(కుమారసంభవము - 5/25)

మనస్సు.* కాని కల్యాణీ! నేను నీ వృత్తాంతము సంపూర్ణముగ వినగోరుచున్నాను." అని యంటిని. సుచరిత యిట్లు పలికెను. "ఆర్యా' తమరు బుద్ధిమంతులు. ప్రియముగ మాటలాడువారు. సగము విషయము మాత్రము విని నిర్ణయించుట మూర్ఖుని లక్షణము. అందఱు నా వృత్తాంతము సగమే విని యున్నారు. ఆ వినియున్న సగము వృత్తాంతమీ నగరమున నెన్నో వికృతరూపములను దాల్చినది కాని తమరు పూర్తిగ వినగోరుచున్నారు. నిపుణిక కూడ సగమే విని యుండినది. కాని యామె సానుభూతికలది కనుక నన్ను సందేహించి, నా నడవడికను పాపభూయిష్ఠమని యనలేదు. నేను తమ కిప్పుడు నా వృత్తాంతమంతయు విన్నవించుకొందును. నే నావిధముగ నా మనసు నదుపులో నుంచుకొనుటకు యత్నించుచుండ నాయత్తగారు చాలసేపటివఱకు నేను తిరిగి రాకుండుటను గమనించి నన్ను వెదకుకొనుచు నచటికి వచ్చిరి. ఆమె యా యెఱ్ఱని చీవరము ధరించిన మునికుమారుని చూడగనే కాతరస్వరమున 'అయ్యో నా తండ్రీ, అమృతకాంతా!' అని యెలుగెత్తి యఱచుచు సగము మూర్ఛిల్లినదానివలె ఆ తాపసివద్ద క్రిందపడిపోయెను. వైరాగ్యముచే నిర్వికారమగు ముని కుమారుని ముఖముపై కరుణారేఖలు పొడమినవి. అతడు కమండలువు నొక వైపుంచి యామె తలను తన యొడిలోనికి దీసికొని యుపచారములు చేయుచు "తల్లీ, శాంతింపుము. అనవసరముగ ఏల నుద్విగ్న

---

* హేతుం స్వచేతో వికృతేర్దిదృక్షు ర్దిశాముపాన్తేషు ససర్జదృష్టిమ్.
(కుమారసంభవము 3/69)

రాల వయ్యెదవు?" అని యనెను. తల్లి కరుణాపూరిత నయనములతో పుత్రుని జూచి "నాయనా! నేను మందభాగ్యనగు నీ తల్లిని. నే నేడ్చుచుండ నీ వెట్టి ధర్మమును సంపాదించుచున్నావు? ఇటు చూడుము. ఇది నీ భార్య! దరిద్రురాలు! స్వర్గమునం దింతకంటె సుందరులగు అప్సరసలు దొరకుదురనియేనా నీ వీ స్వర్ణమణిమయమగు ప్రతిమను విడిచి తపస్సు చేయుచుంటివి?" అని యనెను. ఇవేటి మాటలు! అత్తగారి యీ మాటలు వినినపుడు నే నెంత హతచేతస్కనైతినో యంత సిగ్గుపడితిని. కాని తపస్వి గంభీరముగ నుండెను. అతని తేజోవిలసితమగు ముఖముపై నిర్వికారభావము లా విధముననే యుండెను. అత్తగారు మాత్రము తన గోడు వెళ్ళబోసికొనసాగెను. కాని మునికుమారుడు శాంతముగ విని 'తల్లీ! ఈ ప్రపంచమే దుఃఖభూయిష్ఠమైనది.' అని యనెను. అది యొక విచిత్రమగు సన్నివేశము! యావజ్జీవితపు నైరాశ్యము, కష్టములు మూర్తిరూపమును దాల్చిన తల్లి వెక్కి వెక్కి యేడ్చుచు జలిగొల్పు తన విషాద గాథను వినిపించుచుండెను. ఆమె కన్నులనుండి శ్రావణమాసపు వర్షధారలవలె కన్నీరు కారుచుండెను. కాని పుత్రుడు తన తల్లిని గుర్తించవట్లును ఆమెయు ప్రపంచమునందలి యితర తల్లులలో నొకతె యైనట్లున్ను నిర్వికార భావమున నుపదేశము చేయుచుండెను. నా స్త్రీత్వ మీ వంచనము సహింపజాలక పోయెను. కాని నే నేమియు మాటలాడజాలకపోతిని. సిగ్గుచే నా కంఠ మవరుద్ధమయ్యెను. చివరకు తల్లి మఱియొక రూపమునాల్చెను.

ఆమె 'మూర్ఖుడా! ఎవరో నేర్పిన మాటలను చిలుకవలె తిరిగి పలుకుచుంటివా? తల్లినే గుర్తించుటకు సిగ్గుపడునట్టి యీ ధర్మాచరణ వంచనకాదా! దుఃఖమయమగు నీ ప్రపంచమును మఱింత దుఃఖకర మొనర్చుటచే నీ సౌఖ్య సాధమునకు రాజమార్గము తయారగుచున్నదా? నీ సహార్గము స్వార్థమయమైనది! నీ పౌరుషమునకు ధిక్కారము!' అని యనెను. తాపసుని చిత్త మొకింత కరగెను. అతడొకసారి నా వైపునకును మఱియొకసారి తన తల్లివైపునకును జూచుచుండెను. అత్తగారు నన్ను చూచి మందలించుచు 'చూచుచు నిలుచున్నావేమే దరిద్రురాలా? వీడే నీ భర్త! వీడే నీకు దేవత. రమ్మ! వచ్చి వీని పాదములపై బడి నిన్ను నీవు సమాప్తము నొందించుకొనుము? భాగ్యహీనురాలా! చావ వెందుకే? నేను చచ్చి, చావన్న నెట్లుండునో నీకు నేర్పెదను రమ్మ. వీడే నీ చేయిపట్టి యుండెను. వీడే నిన్నుద్ధరింపగలవాడు. నీవు వీని శరణునొందుము. నేను వెళ్ళుచున్నాను. ఇంతదనుక నేను నీ కొఱకు చాల విలపించియున్నాను. పోయిన పెన్నిధి నాకు నేడు దొరికినది. ఈ మాఱు నేను దీనిని పోగొట్టుకొనను. ఇదే నా యంత్యకాలము' అనిపలికి తల్లి తనవక్షమున చేతితో గ్రుద్దుకొని మొదలు నరికిన చెట్టువలె తాపసి యొడిలోని కొరిగిపోయెను. నాకన్నులు చీకట్లు క్రమ్మినవి. 'అయ్యో! తల్లీ!' అని యార్తనాదము చేయుచు, నేను కూడ నత్తగారి స్మృతిలేని శరీరముపై బడితిని.

కొంతసేపటికి నాకు తెలివి వచ్చినది. నేను కన్నులు తెఱచి చూడ నా తపస్వి తేజోవిలసిత ముఖమండలముపై చింతాధూమ మావరించి యుండెను. అతని విశాలనయనములనుండి ముత్యములవంటి యశ్రుధార స్రవించుచుండెను. నేను సిగ్గుచెందుచు, శోకముచే క్రుంగుచు, హతచేష్టనై, కర్తవ్యమును నిర్ణయించుకొనజాలక జడీభూతురాలనై యుంటిని. అతనికంఠము బాష్పరుద్ధమైయుండెను. నావైపు చూచి యించుకసిగ్గుచే నతడు 'కల్యాణీ! ధైర్యమూనుము. ఈ కమండలువుతో కొంచెమునీరు తీసికొనిరమ్ము' అని యనెను. నాజన్మము కృతార్థమైనట్లనిపించెను. ప్రత్యుత్తర మొసగక నేను సరోవరమునుండి నీరు తెచ్చితిని. తల్లిగారి కన్నులపైనను, తలపైనను నీరుచిలుకరించి అతడు తన చీవరముతో విసరుచుండెను. కొంతసేపైన తర్వాత నతడు నన్నుచూచి కన్నులువాల్చి 'దేవీ! మీరు తల్లిగారి యడుగు కాళ్ళను మీ యడుచేతులతో రుద్దుడు.' అని యనెను. నే నతని యాజ్ఞను పాలించితిని. ఈ విధముగ కొంతసేపు శుశ్రూష చేసినతర్వాత అత్తగారు కన్నులు తెరచిరి. ఈ మాటా తపస్వి వ్రతము భంగమైనది. అతని సంయమము గట్లు తెంచుకొనినది. దీర్ఘకాలమునుండి నేర్చుకొన్న భాష లోపించినది. అతడు బాష్పగద్గదుడై 'అమ్మా! అమ్మా!' అని పిలిచెను. వాత్సల్యోద్వేలితమగు మాతృహృదయ మీమాటు ఉప్పొంగిపోయినది. ఆమె తపస్వి మెడను తన క్షీణమగు బాహులతలచే బంధించి వెక్కి వెక్కి యేడ్వసాగెను. ఆమె 'ఆఁ! అలాగుననే నాయనా! నన్ను 'అమ్మా' అని

పిలువుము, నా తండ్రీ! అమితకాంతా! స్వర్గమున మీ తండ్రీ నీ యీ రూపమును చూచి నన్ను మిక్కిలి తిట్టుదురు. తండ్రీ! నేనింక జీవింపజాలను. ఒక్కసారి మరలనన్ను 'అమ్మా' అనిపిలువుము. నాయనా! నేను నీయొడిలో చిరనిద్ర పొందగోరుచున్నాను. నా తండ్రీ! ఒక్కసారి 'అమ్మా' అని పిలువుము' అనెను. తపస్వి యీ మాటు తన్ను తా నాపుకొనలేక పోయెను! అతడు వెక్కి వెక్కి యేడ్చుచు 'అమ్మా! అట్లనవలదు. నేను తిరిగి నీ యొడి చేరెదను. నన్నొకమాటు నా గురువుగారి యాజ్ఞను బడయనిమ్ము' అని యనెను. తల్లి ముఖ మీ మాటలు వినగనే యెఱ్ఱ బారెను. కరుణరసమున మఱియొకమారు వీరరస మావిర్భ వించెను. ఆమె గర్జించుచు 'తాను తల్లికంటె గొప్ప గురువునని యెంచువాడు వంచకుడు. పాషండుడు. నీవు నా వాడవు.నా రక్తమాంసపు ముద్దవు. నీకు నేనుతప్ప మఱియెవరు గురువుకాగలరు?' అని యనెను. అత్తగారి దుర్బలశరీరమీ యావేశమును భరింప లేనందున ఆమె సంజ్ఞాశూన్యయై పడిపోయెను. నేను దుఃఖము నాపుకొనజాలక 'అత్తయ్యా! నాకింక దిక్కెవ్వరు?' అని విలపింపసాగితిని. తపస్వి దగ్గుత్తి కతో 'కల్యాణీ! ఆందోళన పడకుము. తల్లిగారిని బ్రతికిం చుట నా చేతిలోని పని' అని పలికి తల్లిగారికి పరిచర్యలు చేయుచు, నన్ను పరిపరి విధముల సేవచేయుమని యాదే శింప సాగెను. కొంతసేపీవిధముగ పరిచర్యలు చేసినపిదప అత్తగారికి తెలివివచ్చెను. వెంటనే దృఢస్వరమున నతడు 'అమ్మా! నీవు చెప్పిన ప్రకారమే నేను ప్రవర్తింతును.' అని

పలికెను. తల్లిగారు వాత్సల్య విహ్వలయై యతని శిరము మూర్కొనెను. ఆమె వక్షమునుండి స్తన్యము స్రవింప సాగెను. ఆమె యాతపస్విని రెండేండ్ల శిశువువలె తనయొడిలో నిక్కి తీసికొని లాలింపసాగెను. తర్వాత 'కంద్రీ! నీవు నిదమునే చెప్పుచున్నావు కదా? నేను చెప్పినదానిని చేసెదవుకదా!' అని యడిగెను. తపస్వికూడ సహజ స్వరమున 'అమ్మా, తప్పక చేసెదను' అని యనెను. అప్పుడామె 'అయితే దీనిని చేపట్టుము! ఒకమారు మోసగించి యున్నావు. తిరిగి మోసగింపకుము' అని యనెను. తపస్వి యొకమారా కాశమువైపునకును మఱియొకమారు భూమివైపునకును చూచి నన్నుద్దేశించి 'కల్యాణీ! తల్లిగారి యాజ్ఞను వినుచుంటివికదా!' అని ప్రశ్నించెను. నేను తలయూపి యూరకుంటిని. 'నేను తల్లిగారి యాజ్ఞానుసారము నిన్ను చేపట్ట నుద్దేశించి యున్నాను. జీవితమున నేను తలపు నందుంచుకొనిన లక్ష్యమును చేరుటకు నాకు సహాయపడుటకు నీవు సిద్ధముగ నున్నావా!' అని యతడడిగెను. నేను మాఱుపల్కలేదు. సిగ్గుచే నాతలవంగి పైకెత్తనేలేను. తల్లిగారు ప్రేమతో 'చేయిజాచవే తల్లీ' అని యనెను. అంతే! వెంటనే నా పాణిగ్రహణము జరిగిపోయెను. తల్లిగారు ప్రసన్నవదనయై యాశీర్వదించుచు పుత్రునిజూచి 'నాయనా! లెమ్ము. నావెంట రమ్ము' అని యనెను. పుత్రుడు తల్లిగారి చరణములపై శిరమిడి 'అమ్మా! ఒకసారి గురువుగారి యనుమతిని తీసికొననిమ్ము' అని ప్రతిమాలెను. తల్లిగారనుమతించిన పిదప వారు వెళ్ళిపోయిరి. తర్వాత నేమి జరిగినదో నాకు తెలియదు. కాని ఫాల్గుణ శుద్ధ పౌర్ణమికి వారింటికి

తిరిగివచ్చి నన్నఘోర భైరవులకడకు తీసికొని వెళ్ళిరి. అవధూత పాదుల యాదేశానుసారము మేమిరువురము ప్రస్తుతపు గురువుగారికడ దీక్షను గైకొంటిమి. కాని ఆర్యా! నాభర్త తిరిగి యింటికి వచ్చునప్పటికి తల్లిని చూచుభాగ్య మాయనకు లేకపోయెను. అప్పటికే ఆమె స్వర్గస్థురాలయ్యెను. ఇంతవఱకు నేనందఱికి నా వృత్తాంతములో సగము చెప్పగలిగితిని. అత్తగారు లేకపోవుటచే మిగిలిన సగమెవరికిని తెలియుట కవకాశము లేకపోయినది. ఆకస్మాత్తుగ నిన్న మిగిలిన సగము కథ సత్యమనుటకు ప్రమాణము లభించినది. ధనదత్త శ్రేష్ఠి నాభర్తను కనుగొన్నాడు. అందువలన మిగిలినకథ యింక రహస్యముగ నుండుట కవకాశములేదు." అని యనెను.

సుచరిత తన వృత్తాంతమును చెప్పి నావైపు దృష్టినిగిడించి చూచుచు నానోటినుండి యేదో వినగోరుచుండెను. కాని నేను మఱియొక యాలోచనలో పడియుంటిని. మొదటిసారి నేనఘోరభైరవులయొద్దకు వచ్చియున్న విరతివజ్రుని జ్ఞప్తికి దెచ్చుకొనుచుంటిని. శాంతస్నిగ్ధమగు నాతని ముఖము వెనుక నెంత మనోవ్యథ యుండెనో నే నిప్పుడూహింపగలిగితిని. వేదనానుతాప పశ్చాత్తాపములను దిగమ్రింగి అతని ముఖమున ఉట్టిపడుచుండిన ధూమరహితమగు నగ్నివంటి తేజస్సు, అతని గంభీర హృదయమునకు తార్కాణ మనుటలో నతిశయోక్తిలేదు. నేను సుచరితను గుఱించికూడ నాలోచించుచుంటిని. ఈమె యెంత గాంభీర్యము గలది! ఈమె నడవడిక యెంత స్వాభావికముగ నున్నది! ఆహా! "కాంచనపద్మ ధర్మి" యగు శరీరమున

గూడ నిట్టి కోమలత్వ, సరసత్వములుండగలవా! క్షణము సేపాగి నేను "నా యవినీతిని మన్నించిన నేను మిమ్మొక ప్రశ్న నడుగ గోరుచున్నాను. మీ వృత్తాంతములో సగము గోపాయిత మొనర్చి దాని నెందుకు వికృతము గానిచ్చితిరి?" అని యంటిని. సుచరిత వెను వెంటనే "ఆర్యా! ఈ వృత్తాంతమున సగమే, నాకు సంబంధించిన సత్యము. మిగిలిన సగము ఘటించియుండినను నాకు సంబంధించినంతవఱకున్న సత్యములో నేలాటి లోటు కలిగియుండదు. మిగిలిన సగము, అత్తగారి సాక్ష్యము నపేక్షించుచుండినది. మీ రీ యుత్తరార్థము నెంత సులభముగ నమ్మితిరో యంత సులభముగ నెవరును నమ్మజాలరు" అని యనెను. నేను సందేహించుచు "దేవీ! ఉత్తరార్థములో మీకు సగమే తెలియును. మిగిలిన సగము నాకు తెలియును. కాని మీ రిందే విషయమైనను దాచలేదుకదా?" అని యడిగితిని. సుచరిత సహజసుందరములగు కన్నులలో నవ్వు కిల కిల లాడెను. ఆమె "ఆర్యా! మీరు సరస హాస్య కుశలురని నేను విన్నది నిజమే! నే నేమి దాచుకొన్నాను? ఏమియు దాచుకొనలేదే!" అని యనెను. నే నామె కన్నులలోనికి చూచి నవ్వుచు "కల్యాణీ! ఆర్య విరతి వజ్రుల గురువుగా రొకనాడు విరతి వజ్రులను పిలిచి 'నీవు కౌల-సిద్ధ అవధూత స్వామియగు అఘోరభైరవుని వద్దకు పొమ్ము' అని యాజ్ఞాపించిరని వారు అఘోరభైరవులకు చెప్పుచుండ నేను వినియుంటిని. నేను నాడు దాని నర్థము చేసికొనలేకపోతిని. నేడు దాని భావము నాకు విశదమైనది. విరతివజ్రులు తన గురువుగారితో తన వృత్తాంత

మంతయు చెప్పియుండవచ్చును. గురువుగారు శిష్యుని వ్రత భంగమునుండి తప్పించుటకు ప్రయత్నించి యుండవచ్చును; శిష్యుడందుమూలమున వ్యాకులపడుచుండవచ్చును. కాని గురువుగారాదేశించిన నియమములను దత్తచిత్తుడై పాలించుచుండవచ్చును. కాని—" అని పలుకుచు నే నించుక సాగి సుచరిత వైపునకు చూడసాగితిని. ఆమె కోమలమగు ముద్ర మాఱిపోయి యామె గంభీరమగు ముద్రను దాల్చి యుండెను. ఆమె "ఆర్యా, తర్వాత జరిగిన దానిని సెలవిండు. నేనీ విషయమును ప్రథమముగ వినుచున్నాను." అనెను. నేను నవ్వుచు "దేవీ! పుష్పములచే పుష్పమయముగను, మధుకరములచే భ్రమరమయముగను, కోయిలలచే పరభృతమయముగను, నెమళ్ళచే మయూరమయముగను కనబడుచుండు వసంతకాలమునకు జన్మభూమివలె నొప్పుచుండు దట్టమగు చూత లతాకుంజమున ఆర్యవిరతి వజ్రులను గురువుగారు కాంచియుండవచ్చును. అట విరతివజ్రులు గురువుగారి యుపదేశములను వించి, చిత్రలిఖితునివలెను, ఉత్కీర్ణునివలెను, స్తంభితునివలెను, మృతునివలెను గాఢనిద్రయందున్న వానివలెను, యోగసమాధియందున్నవానివలెను చలింపక యుండియు వ్రతమునుండి చలించియుండి యుండవచ్చును. గురువుగారు తన నైరాత్మ్య భావమును గుఱించిన యుపదేశమునకు లభించిన యీ ఫలమును చూచి యుండవచ్చును. శూన్యసమాధియొక్క యీదశ గురువుగారి కర్థము కాకపోయి యుండవచ్చును. ఆ శూన్యసమాధి యేవిధమైనదో కదా! హృదయస్థితయగు ప్రియురాలిని దర్శించుటకై వారి యింద్రి

యములన్నియు భరింపరాని విరహవేదనను తప్పించుకొనుటకై ప్రయత్నించుచున్నవా యన్నట్లు హృదయమున ప్రవేశించి యుండవచ్చును. ఈ విధముగ వారి శరీరమంతయు గొప్ప శూన్యాకారమును ధరించియుండనోపును. నిష్పంద నిమీలిత నయనములకు హృదయమును దహించుచున్న ప్రేమాగ్నిధూమము తగులుచుండ వానినుండి యెడతెగని కన్నీటిధార కారుచుండవచ్చును. దీర్ఘ నిశ్వాసవాయువుచే లతాకుసుమములు కంపించుచు వానినుండి రాలుచున్న పుప్పొడి దిఙ్మండలమున వెదజల్లబడుచుండవచ్చును. ఈ స్థితిలో గురువుగారు వారిని తటాలున పిలిచియుండవచ్చును. ఆర్యవిరతి వజ్రులు గురువుగారి పిలుపు విని గబ గబ లేచినపుడు వృక్షములు పుప్పొడిని చల్లి, మనసిజుని వశీకరణ చూర్ణపు ప్రభావము నెక్కువ చేసి యుండవచ్చును. అశోక పల్లవములు తమ మృదు స్పర్శచే, తమ రాగమును వారిపై ప్రసరింపజేసి యుండవచ్చును. వనలక్ష్మి క్రొత్త రాజ్యమున ప్రవేశించు యువరాజును బోలిన యా కిశోర తపస్వి నుదుటిపై మధుబిందువులను చిలుకరించి యుండవచ్చును. వసంతర్తువు కోయిలల సంగీతముచే తుమ్మెదల రొదలచే చంపక కుసుమపు మొగ్గలచే, ఆమ్రమంజరుల సౌభాగ్యముచే నాతని నభినందించియుండవచ్చును. దేవీ! మీరానాడు ఇట్టి చిహ్నముల నేమియు గాంచలేదా? మీ రా విషయమును నా యెదుట దాచుచున్నారుకదా?” అని యంటిని. సుచరిత రెప్పలు వాల్చి నవ్వుచు “ఆర్యా! మీరు నన్ను పరిహసించుచున్నారు” అనెను. తర్వాత కొంతసేపటివఱకు ఆమె

తనలో తాను మునిగి తేలెను. తగు,సను నును చూచి నేను "అయితే యీ సందర్భమున, ధనదత్తుడు ప్రసక్తికి తెచ్చిన ఋణవిషయము, నిజమేనా?" అని ప్రశ్నించితిని. సుచరిత కొంత యావేశముతో "ఆర్యా! అది పూర్తిగ నసత్యము. అతడు నాతో ఈ ప్రసక్తియే చేసియుండలేదు. నా భర్త సన్న్యాసమును స్వీకరించినమాట నిజమే. కాని నే నింత కాల మిచటనే యుంటినికదా! ఋణము మాట నిజమే అయినచో నతడు నాతో ఈ విషయమేల చెప్పియుండలేదు? ఆర్య విరతి వజ్రులు గృహస్థులయిరనుట కూడ నసత్యమే. వారు చేయుచుండు పనులన్నియు తమ గురువుగారి యను మతిని పొందియే వారు చేయుచున్నారు. ప్రపంచమేమైనను ననుకొనుగాక! వారు మొదట నేవిధముగ నున్నారో అదే విధముగ నేడును నున్నారు. గురువుగారి యాదేశప్రకారము వారు తమ సాధనాపద్ధతిని మాత్రము మార్చుకొన్నారు. అంతే! మొదట నే విధముగ వారు ధర్మమునకు భూషణముగ నుండిరో అదేవిధముగ 'నేడును నున్నారు" అని యనెను.

నేనా మెను రెచ్చగొట్టి యామె మాటల కంత రాయము కలిగించుచు "దేవీ! మీరీ కారణమువలననే, మహారాజాధిరాజుపై నప్రసన్నులైతిరా!" అని యంటిని. సుచరిత నవ్వుచు "ఫేనబుద్బుదములవలె నిరంతరము పుట్టుచు, గిట్టుచున్న యీ నశ్వరములగు జీవులలో మహారాజేమి, శ్రేష్ఠియేమి! నేను మహారాజులపై ప్రసన్నురాలను కాను; అప్రసన్నురాలను కాను. ఆర్యా! నేనింతకంటె శేష్ఠుడగు మహా

రాజును, శరణుజొచ్చుటకు ప్రయత్నించుచున్నాను. నేనేల మహారాజుపై నప్రసన్నురాలను గావలెను ! మహారాజు అన్యాయము చేసియుండిన, అందలి భాగోగులు వారెఱు గుదురు. సుఖముగాని, దుఃఖముగాని నాకేది లభించినను నేను దానిచే నారాయణు నారాధించెదను. ఈ బేడీలను గూడ నే నతనికే యర్ఘ్యరూపమున సమర్పించితిని." అని యనెను. నేను వినయముగా "దేవీ ! మీ వ్యవహారము వలన నగరమున గొప్ప యలజడి కలిగినది. భయంకరమగు రక్తపాతముగూడ జరుగునేమోయని రాజోద్యోగులు దిగులుపడి యున్నారు. మీరిపుడు మహారాజాధిరాజులవారికి సహాయ మొనర్పగలరా లేదా, అను విషయము నేను మీనుండి తెలిసికొన గోరుచున్నాను. శాంతిని స్థాపించుటకును, ప్రజల యందు రాజుపై విశ్వాసమును నెలకొల్పుటకును మీసహాయ మవసరము. దేవీ ! దుర్దమనీయులగు దస్యుల సైన్యము హిమాచలపు కనుమల కటువైపు ప్రోగగుచున్నది. ఇట్టి తఱి ప్రజల యసంతృప్తివలన నేదో యనర్థము వాటిల్లగలదు" అని పలికితిని. సుచరిత ఆశ్చర్యముతో నన్నుజూచుచు "ఆర్యా, నేనీ విషయము క్రొత్తగ వినుచున్నానే ! ప్రజలింతకు ముందు నన్ను గుఱించి యింతగ లెక్కచేయనే లేదే ! నేనీ నగరమున మొదటినుండి లోకోపవాదమునకు పాత్రురాలనై యుంటిని. ఈ నగరము నందలి రసికుల మాటల నతిక్రమించలేకుంటిని. అందువలన వారు నన్ను గుఱించి యేమేమో యపనిందలను వ్యాపింపజేసి యున్నారు. ఉన్నట్లుండి ప్రజలలో ఇట్టి తిరుగు బాటెట్లు కలిగినది ?" అని యడిగెను. నాకుకూడ నాశ్చర్యమే

కలిగినది. నేను సాయంకాలమున సభయందు జరిగిన కథను యథాతథముగ ఆమెకు తెలియజేసితిని. అటువిన్నట సుచరిత ప్రసన్న చిత్తయై "ఆర్యా! నాకిపుడు విషయము బోధపడినది. నా భర్తయొక్కయు, నా యొక్కయు దోషరహితములగు నడవడికల వలన, నెటుల రాజకార్యములకు విఘ్నము కలిగినదో అటులనే ప్రజల శాంతి కంతరాయము కలిగినది. ఆర్యా! ఇది స్వార్థపరులగు నిరువురి ప్రతికక్షుల ఘర్షణ మాత్రమే. ఇందు మేము నిమిత్తభూతులమైతిమి. ధనదత్తుని గురువగు వసుభూతి బౌద్ధ ధర్మమునకు విజయము కలిగించియే తీరును. నేటి సభకు గుప్తసూత్రధారుడు, వసుభూతికి ప్రతిస్పర్థి, పరమస్మార్తుడునగు ఆచార్య మేధాతిథి సనాతన ధర్మమునకు పునః ప్రతిష్ఠ గావింపనిదే విడువడు. వీరిరువురి తగవుల మధ్య ప్రజ లేగంగలో పడినను వారికి చింతలేదు. వారు తమతమ మతములగొప్పదనము చాటుకొనవలెను. వీరియం దొకరి పక్షమున రాజ్యశక్తియున్నది; మఱియొకని చేత ప్రజల తిరుగుబాటు, విరతి వజ్రుడు బౌద్ధమునుండి వైష్ణవమునకు వచ్చుటయే ప్రపంచమునందలి గొప్పవిషయమన్నట్లు వీరనుకొనుచున్నారు. తమమతము విజయమునకై వీరు పడుచున్న వివాదములయందు చిక్కుకొని ప్రజలు నాశనమైనను సరే! కాని ఆర్యా! వీరిరువురిలో నెవరిపక్షము గ్రాహ్యము? ఈ యగ్నిజ్వాలలయందు మహారాజుగారి వైపునుండి యింధనములు పడలేదా? ఆర్యా, మీరెఱుగరు కాని దీనికి నాందీ యేనాడో జరిగినది. ఆర్యవిరతివజ్రులేనాడు క్రొత్తమతమును స్వీకరించిరో యానాడే స్థానేశ్వరమునందు మతమును గుఱిం

చిన యావేశము ప్రబలమైనది. విద్వాంసుల ప్రార్థనపై నగరపు శ్రేష్ఠివర్గమువారి యనుగ్రహముతో గొప్ప మంటపము నిర్మితమై మా గురువుగారికి ఆహ్వానమంపబడినది. ఎంత పాపాత్మునికైనను తన బోధను వినిపించుటకు వెనుదీయకుండుట మా గురువుగారి సిద్ధాంతము. అందుచే పౌరుల యాహ్వానమును వారు సహర్షముగ నంగీకరించిరికాని ఆర్య విరతి వ్రజులు వెలుపలికి వచ్చుటకు సమ్మతించలేదు. గురువుగారి యొత్తిడిపై నేనుమాత్ర మచట నుండుటకు వారనుమతించిరి. బౌద్ధాచార్యులగు వసుభూతికిని మా గురువుగారికిని మధ్య ఘర్షణ కలిగించుటకై యెంతో ప్రయత్నము జరిగినది. కాని మాగురువుగారు సాక్షాత్తు దేవతాస్వరూపులు. భజనలు పూజలు తప్ప వేరు విషయములతో వారికి ప్రసక్తియే లేదు. తన పని ముగియగనే యొక్కక్షణమైనను వారచట నాగెడువారుకారు. భజన ప్రారంభమగుటకొక క్షణము ముందు వారచటికి వేంచేయుచుండిరి. కొందఱు పండితమ్మన్యులగు వ్యక్తుల యాత్మాగ్నియందు రాజుగారును ప్రజలును దగ్ధమగుచున్నారు. తరుణులు, బాలుడు, అనాథులు, వృద్ధులు మొదలగువారు నివసించు ఈ ఆర్యావర్తమంతయు మాడి భస్మమగు సమయ మాసన్నమైనది. తిరుగుబాటు చేసిన ప్రజలు అజ్ఞానులు, అంధులు, అపాత్రులు" అని పలికెను.

సుచరిత దీర్ఘమగు నిట్టూర్పువిడిచి, కొంతసేపు మౌనముగ నుండి తర్వాత "పూజ్యురాలగు మహామాయగారి హృదయమందలి కల్మష మింతకాలమునుండి చేసిన తపస్సుచే

గూడ దగ్ధము కాలేదు. వాస్తవముగ కల్పనముగూడ మనుష్యుని సత్యస్వరూపమే! దానిని స్వీకరించిన నాడే అతడు కృతార్థుడగుచున్నాడు. దానినణచినచో నది మనుష్యుని సర్వనాశనము గావింపగలదు. మనయందున్న సుగుణ దుర్గుణము లన్నింటిని నిర్వికార భావముతో శ్రీమన్నారాయణుని కర్పింపనంతవఱకు అవి భారస్వరూపములగుచుండును." అని యనెను. సుచరిత పలికిన యీ వాక్యమును నేను సగమే అర్థము చేసికొన గలిగితిని కాని యాలస్యమగుట వలన ననర్థము కల్గునను భీతిచే 'నేనామె మాటల కంతరాయము కల్గించుచు "దేవీ! మఱి యేది దారి?" అని ప్రశ్నించితిని. అందులకు సుచరిత సహజముగ "మహారాజాధిరాజులయందే యీ చిక్కును తీర్చగల యుపాయము కలదు. భజనలు, పూజలు చేసుకొను మా జన్మహక్కును మాకు వారు దయ చేసిన చాలును. నే నీ విషయము మహారాజుగారి దృష్ట్యా చెప్పుచున్నాను. నా కా పూజ యెట్లుండెనో, యిదికూడ నదేవిధముగ నున్నది. నా హక్కును నా యొద్దనుండి యెవరు లాగుకొనగలరు?" అని యనెను.

నేను సమయము చూచి, "అయితే దేవీ, మీ రీ మరతుపై నా వెంట వచ్చెదరుకదా?" అని యడుగ నామె "ఆర్యా! తప్పకుండ వచ్చెదను" అని పలికెను.

నేను భక్తి శ్రద్ధలతో వంగినశిరస్సును మఱింత వంచి యా మహీయసి, దేవకన్యయగు సుచరితకు 'నమస్కరించితిని. అహా, మహాకవీ! చతురస్రశోభియై నవయౌవనముచే ప్రకాశించుచుండు స్త్రీ శరీరము కుంచచే వన్నెపెట్ట

బడిన చిత్తరువా లేక సూర్యకిరణములచే వికసింపచేయబడిన యరవిందమా యని నీవు భావించియుంటివి కాదా!*
కాని సర్వతోముఖముగ వ్యాపించు మనస్సు నవయౌవనపు ప్రథమోద్రేకముచేతను అఖండానంద సందోహమగు జ్యోతి చేతను భాసిల్లుచుండ నీ వెన్నడైనను చూచితివా? యౌవనము గ్రుడ్డిదనియు చంచలమైనదనియు నెవ రనగలరు! దానియందు గూడ ఉత్కృష్టములగు గుణములు కలవు.

నేను ప్రణామ మాచరించుచుండుట జూచి యామె యాతురత జెంది "ఆర్యా! నన్ను మీ రపరాధినిగ గావించు చున్నారు." అని పలికెను. శరీరము బిగించి కట్టబడియుండి నను, ఆమె నాకు సాష్టాంగప్రణామ మాచరించి తన యపరాధమును తొలిగనము గావించుకొనెను. తర్వాత నన్ను దెప్పుచు "నన్ను సిగ్గుపఱచుటకు ఆర్యులు నాలో ఏమి దోషము గ్రహించితిరో తెలియకున్నది. అభ్యాస దోష మున నేను కొంచె మధికముగ మాటాడి, నేను గొప్ప జ్ఞానవంతురాలనని తెలుపుకొనుటకు ప్రయత్నించితిని. అంతే కాదా? క్షుద్రత్వపు సంకెళ్ళు చాల దృఢమైనవికదా! త్వరగా అవి వీడిపోవు. నా భర్త యెవరో నేర్పిన పలుకులను నాడు విడచిపెట్టెనే! మఱల వాని నుపయోగించ లేదు. మంద భాగ్యురాలనగు నేను విని నేర్చుకున్న నాలుగు ముక్కలను

---

* కాళిదాసుని యీ శ్లోకముతో సరిపోల్చుడు :—

ఉన్మీలితం తూలిక యేవచిత్రం సూర్యాంశుభిర్భిన్నమివారవిందమ్
బభూవ తస్యాశ్చతురస్రశోభి వపుర్విభక్తం నవయౌవనేన॥

(కుమారసంభవం 1/32)

వాగుచునే యుందును. కాని నే నందులకై యేల పశ్చాత్తాపము చెందవలెను! మంచిదానినో, చెడ్డదానినో; నిందితురాలినో, అవమానితురాలినో, నా రూపమిదే! నారాయణుని మూర్తిపై వేయబడిన పుష్పదళము వలె వాసన లేకున్నను నా జీవితము సార్థకమైనదే! నా యభిమానమును మీరు లెక్కచేయ వలదు." అని యనెను. నేను వినమ్రుడనై "దేవీ! మీ శరీరము, మనస్సు కృతార్థము లైనవి. మీ జ్ఞానము, వాణి, సార్థకమైనవి. అన్నింటికంటె మీ ప్రేమ యెక్కువగ సార్థకతను చెందినది. మీకు ప్రణామముచేసి భవ సాగరమున దారి తెన్నులు తెలియక కొట్టుకొనిపోవు నిరర్థక జీవులు కూడ కృతార్థు లగుదురు. మీరు సతీత్వమునకు పొలిమేర వంటివారు; పాతివ్రత్యమునకు చరమసీమ వంటివారు; స్త్రీ ధర్మమున కలంకారము వంటివారు." అని యంటిని. సుచరిత నన్నెక్కువ మాటలాడ నీయక నవ్వుచు "ఆర్యా, తమరు కవనము చేయుచున్నారే!" అనెను.

నే నామె మాటలలోని ధ్వనిని గ్రహించితిని. విరతివజ్రుని భావనా ప్రతిమను నిర్మించి నేను సుచరిత స్నేహసిక్తమగు హృదయము నానందముచే నార్ద్రి మొనర్చి యుంటిని. అది యామెకు మఱపురాలేదు. నేను మఱల మఱి యొక మాఱు సౌందర్యమూర్తిని భావించి దానిని వర్ణింతు నేమోయను సంశయ మామెకు కలిగెను. మన్మథ దేవుడని యెవరి నామె యనుకొనుచుండెనో నేను దానిని జడశరీరపు ధర్మమే యని మొదటినుండియు తలచుచుంటిని. కాని విరతివజ్రుడు మొదట నెట్లుండెనో యిపుడును నట్లే యున్నాడని

యామె పలుకులను విన్నపుడు నా భ్రమ తొలగి పోయెను. నే నంత తగ్గుస్థాయి యందుండి యామె మాటలు విను చుంటిని! సుచరిత సతీత్వమును ప్రశంసించుట కుద్యమించుచు రెండు హృదయముల నొక్కటిగ నొక క్షణములో కలిపి కట్టివేయగల యద్భుత శక్తిశాలియగు మనోభవుని నే నిపు డైన సరిగ నర్థము చేసికొంటినా, యను సందేహము నాకు కలిగెను. నేను నా జంకను పోగొట్టు కొనుటకై నవ్వుచు "దేవీ! నేనా శక్తిని మించకుండు సత్యమునే వచించు చున్నాను. అయితే నేను మీకొక మాట చెప్పెదను. దానిని విన్నచో మీ కాశ్చర్యము కలుగక మానదు." అని యంటిని. సుచరిత కడు నుత్సాహముతో "ఏమిటది?" అని యడిగెను. ఆమె మనోహర ముఖార విందముపై ఔత్సుక్యమును చాలసేపుండు నటుల నేను మెలమెల్లగ "నేను మంచి జ్యోతిష్కుడను. కాశీ వద్దనుండు జనపదమున మీకు కన బడిన బ్రాహ్మణ యువకుడును, మీ మనస్సునం దకారణ ముగ ఔత్సుక్యమును నిలిపిన వాడను నేనే!" అని యంటిని. ఆశ్చర్యముతో సుచరిత కనురెప్పలు పైకెగిరి పోయినవా యన్నట్లామె కన్నులు తెఱచినవి తెఱచినట్లే యుండి పోయెను, చాల సేపటివరకామె యట్లే యుండెను! తర్వాత కుదురుబాటు చెంది సంకెళ్ళతో గట్టిగ కట్టబడి యుండిన చేతులను భూమిపై నాన్చి ఆమె భక్తితో నాకు ప్రణ మిల్లెను.

# పదునైదవ అధ్యాయము

భద్రేశ్వర దుర్గమునకు చేరువగ నున్న దుర్గమునకు శరకాంతారము కనబడు చుండెను. వెండిపలకలవలె దూరము వఱకు తన మధ్య భాగమున వ్యాపించి మెఱయు చుండిన యిసుక మైదానము నది కప్పుకొని, మండుచున్న ధరిత్రి తన సహస్ర జిహ్వాలతో నాకాశము వైపునకు జూచుటకు ప్రయత్నించు చున్నదా యన్నట్లుండెను. ఉండి యుండి గాలికి పొరలుచున్న యిసుక రాసులు పొగలు రాజుచున్న యగ్ని కుండమునుబోలి చిత్తమును భయభ్రాంత మొనర్చు చుండెను. క్రిందనుండి పైదనుక నెక్కడను చల్లదనము మచ్చునకైనను లేకుండెను. చాల దినముల నుండి నేను గుఱ్ఱముపై సవారి చేయుచు వేగముగ తరలి వచ్చుచుంటిని. నా మనమున నొకసారి భట్టిని చింతాక్రాంత మగు ముఖ ముదయించు చుండ, మఱియొకసారి సుచరిత ప్రసన్న వదన ముదయించు చుండెను. ఒకటి భద్రేశ్వరము వైపునకు నన్ను లాగుచుండ మఱియొకటి నన్ను స్థానేశ్వరము వైపున కీడ్చు చుండెను. స్థానేశ్వరములోని సంఘటనలు అద్దములో ప్రతి బింబించిన నీడవలె నాకు స్పష్టముగ కనబడు చుండెను. సుచరితను కారాగారము నుండి విడిపించి నేనామెను శేంక కేశ భట్టుగారి యొద్దకు పిలుచుకొని పోయినపు డచ్చటికి అవధూత పాదులు మొదటనే విచ్చేసి యుండిరి. మహా మాయ కూడ నచటనే యుండెను. అది యొక యపూర్వ మగు దృశ్యము. సుచరిత మాటాడక ప్రణామముచేసి యొక

మూల కూర్చుండెను. నేను కూడ నామె ననుసరించితిని. అచట చాలసేపు నిశ్శబ్ద మావరించి యుండెను. అవధూత పాదులు మహామాయ నుద్దేశించి కొన్ని మాటలు పలికి యుండిరి. నేనా మాటలను తలచు కొన్నప్పుడు నా శరీర మంతయు గగుర్పాటు చెందుచుండును. ఏమి జరుగనున్నదో కదా! నలువైపుల మంట లలుముకొను చున్నవి; మృత్యు దేవతయొక్క భయంకర భ్రూవిక్షేపము నెవరును తప్పించు కొనలేరు. భద్రేశ్వర సౌధశిఖరములను జూచినదే తడవుగ భట్టిని నా స్మృతి పథమునకు వచ్చెను. చాల కాలమైన తర్వాత నేడు భట్టినిని చూడబోవు చున్నాను. కాని నేను రాజ కార్యములను గూడ చేయవలసియున్నది. భట్టిని కడకు పోవలయునని హృదయము వేగిరపడు చున్నను నేను మొదట లోరిక దేవుని విషయము ముగించుకొనుట యుచితమని తలచితిని. భద్రేశ్వర సౌధశిఖరములు కనబడినను నాకవి యదృశ్య రూపమున నన్ను దేవత యంగుళులను బోలియుండి యన్నియు భట్టినివైపునకు చూపుచున్నట్లు కనపడుచుండెను. మల మల మాడ్చుచున్న నీ యెండలో, 'భంయ్' యని ధ్వనించుచున్న శరకాంతారము మధ్య వేడి గాడ్పులతో గూడుకొన్న సుడిగాలియందు భట్టిని జ్ఞాపకమునకు రాగానే, అచట నేదో కల్పలత మొలకెత్తినట్లును, చంద్రుని శీతల కిరణము లుదయించినట్లును, చందనలత చిగిర్చినట్లును, నా హృదయ మపూర్వమగు కాంతి సౌరభశైత్యములకు నిలయ మయ్యెను. నా శరీరమంతయు వికసించిన కదంబపుష్ప కేసర

ములవలె గగుర్పాటు చెందెను. అప్పుడే నా యెదుట మహా సరయూనది యొక్క తీక్ష్ణప్రవాహము కనబడెను.

మహాసరయూ నదియందు స్నానము చేసి నేను తిన్నగ లోరికదేవునికడకు జేరితిని. నన్ను చూచి హృదయుడగు ఆభీరసామంతుని కన్నులు చెమర్చినవి. కడు నాదరమున నాతడు నాకు నమస్కరించి నా క్షేమములనడిగి ప్రేమాదరములతో భట్టిని కుశల సమాచారములను నాకు తెలియజేసెను. గద్గదకంఠమున నతడు "ఆర్యా! గొడ్డువోయిన నీ భవకాననమున భట్టిని కల్పలతవంటిది. అట్టి దేవదుర్లభమగు స్వభావము కలిగియుండుట ఏ తపఃఫలమో తెలియదుకదా! ఆమెను మీరిచట నుండనిచ్చినందులకు నేను సంతుష్టుడను; మీకు కృతజ్ఞుడను; క్రీతదాసుడను. ఆమె మిమ్ములను జూచి చాల ప్రసన్నత జెందగలదు. ఆమె కన్నులెన్నో దినములుగ నుపవాసము చేసినట్లున్నవి. మీరు వెళ్ళి యామెకు దర్శన మొసగుడు" అని యనెను. నేను వినయముగ నతనికి నా కృతజ్ఞతను వెలిబుచ్చి యాతని యనుమతిని గైకొని మహారాజాధిరాజుల లేఖ నాతని కొసగితిని. క్షణకాల మాతడు నా వైపు ఆశ్చర్యముతో జూచి తర్వాత "మీ రిపుడే భట్టిని యొద్దకు వెళ్లుడు" అనెను. ఇట్లు లోరిక దేవునికి రాజుగారి లేఖ నందజేసి, నేను భట్టిని యొద్ద కేగితిని. లోరికదేవుడు స్వయముగ చదువగలవాడు కాడు. అతడా లేఖను తనయొద్ద నుంచుకొని వెంటనే తన మంత్రిని పిలువనంపెను. నే నాతనికడ అనుజ్ఞ గైకొంటిని.

అచట భట్టిని, మహారాణియగు రాజ్యశ్రీ లేఖను చదివి ఒకసారి నావైపు కరుణాపూరితమగు దృష్టిని మాత్రము బఱపి తలవంచుకొనెను. షంకెనపూవులవంటి యామె పెదవులు క్షణములో నెండకు వాడిపోయిన మొగిలిపూవువలె తెల్లబారెను. మనోహరములగు విశాల నేత్రములు తడిసిన ఖంజనశాబకములవలెనిశ్చేష్టములయ్యెను. చాల దినముల తర్వాత నన్ను చూచుటచే నామె తనూలత నావరించియుండిన యానంద తరంగములు గొప్ప యలలతో నిండిన యానందసాగరము తటాలున హేమంత ఋతువందలి ఝంఝామారుతపు టూపులకు మంచువలె గడ్డకట్టినదా యన్నట్లు శాంతించెను. ఆమె యధరము చలించెను. లలాటము కొంచెము ముడుచుకొని విడిపోయెను. చిబుకము కొంచెముగ నదిరి గృహమునంతయు నొకవిధమగు మనోహర కాంతిచే నింపివేసెను. నా వలన నేదో గొప్ప యపరాధము జరిగినదని దెలిసికొనుటకు నాకెక్కువ కాలము పట్టలేదు. నా శరీరమంతయు సాధ్వసజన్యమగు స్వేదబిందువులచే తడిసిపోయెను. నే నపరాధుని వలెను, తుచ్ఛుని వలెను, బంధితుని వలెను, ఆమె యెదుట కింకర్తవ్యతామూఢుడనై స్తంభించిపోయి నిలుచుంటిని. భట్టినికి నాపై జాలి కలిగెను. ఆమె తన్ను తాను స్థిమిత పఱచుకొనుచుండు సమయమున నిపుణిక యచటికి వచ్చిచేరెను. నిపుణిక యింకను బలహీనముగనే యుండెను. ఆమె శరీరము పాలిపోయి యుండెను. కాని నా రాకను గుఱించిన సమాచారము తెలిసిన వెంటనే యా పాండురమగు దుర్బల శరీరమున నానందము నిండి

పోయెను. ఆమె నిజముగ నా వలన నెన్నో విషయములను విను కుతూహలముతో వచ్చియుండెను. కాని మా యిరువురి యవస్థలను జూచి యామె నిశ్చేష్టయైనది. తర్వాత క్రమక్రమముగ నామె మాటాడక నాకు నమస్కరించి, భట్టిని ప్రక్కకు చేర్చి, యామె చెంతనున్న వెండి జరీసంచి యందుండిన లేఖను చూడసాగెను. ఆమె జిజ్ఞాసను శాంతింప జేయుటకై నే నా లేఖను గుఱించిన వృత్తాంతమును సంగ్రహముగ నామెకు చెప్పితిని. నిపుణిక ముఖముపై వివిధములగు భావములు ప్రకటితమై మాసిపోయెను. నా మాటలు ముగియుటయే తడవుగ నామె తోక త్రొక్కిన నాగుబామువలె బుసపెట్ట సాగెను. ఆమె కన్నులనుండి యగ్నికణముల ప్రవాహము వెలువడుచున్నదా యన్నట్లుండినది. గుక్క త్రిప్పుకొనక ఒక్కుమ్మడిగ నామె తన యిచ్చ వచ్చిన ట్లేదేదో మాటలాడి కడపట కాలిచే తన్నబడిన యాడు సింహమువలె గర్జించుచు "ఛీ, ఛీ, భట్టూ! భట్టిని నవమానపఱచుటకు నీ వెట్లు ఒప్పుకొంటివి! విషయలోలుర కాశ్రయమగు కన్యాకుబ్జపు రాజు, భట్టిని సేవకుని తన సభాసదునిగ నియమించుటకు సాహసించెనా! మౌఖరీ వంశపు రాణిగారి యాహ్వానమును మోసికొని తెచ్చుటకు నిన్నే బుద్ధి ప్రేరేపించెను! ఛీ, ఛీ,! ఇంత సాధారణమగు విషయము గూడ నీవు తెలిసికొనజాలక పోతివా! ఈ లేఖను చింపి ముక్కలు, ముక్కలు చేయు శక్తి నీలో లేకపోయెనా!" అని పలుకుచు క్రోధావేశమున నామె యా లేఖను నిజముగనే చింపివేయ సాగెను. మౌఖరీ వంశమునకు చెందిన ప్రతివ్యక్తిని నలిపి

వేయ నిచ్ఛగించుచున్నవా యన్నట్లామె వ్రేళ్లు శీఘ్రముగ కదలుచుండెను. భట్టిని నిపుణికను మెల్లగ తన వైపునకు లాగుకొని యామె నుదుటిని నిమురుచు "హలీ! ఇట్లు మాట లాడ తగునా! భట్టు మన సంరక్షకుడు కదా! అతని కేమి చేయుటకైన నధికారము గలదు. మన మేలు కొఱకును దేశము మేలు కొఱకును అతడేమి చేసినను అది మన యంగీ కారమును పొందవలసినదే! నీవు నీ భట్టిని నెందుకంత గొప్ప దానిగ భావించు చున్నావే! ఛీ, ఛీ! ఈ విధముగ నావేశము జూపదగునా?" అని మృదువుగా బలికెను. నిపుణిక భట్టిని యొడిలో నిశ్చేష్టయై పడిపోయెను. ఆమె నేత్రముల నుండి తెరపిలేక యశ్రువులు రాలుచు నామె గండస్థలము లను కడుగుచుండెను.

పిదప భట్టిని నావైపు తిరిగి మొదటికంటె నెక్కువ దయతో నన్ను చూచి "భట్టూ! నిపుణిక యపరాధమును క్షమింపుము. ఆమె చాల బలహీనమై పోయినది. ఆమె స్నాయువు లన్నియు చెదిరి బలహీనమైనవి. అందువలన నామెకు త్వరగ కోపము వచ్చుచుండును" అని యనెను. కొంతసేపటివఱకు ఆమె నిపుణిక లలాటమును తన చేతితో నిమురుచున్నపుడు రాహువు నోటినుండి వెలువడిన చంద్ర మండలముపై కల్పలత, తన కిసలయసుధను పూయుచున్నదా యన్నట్లుండెను. నిపుణిక క్రమక్రమముగ తెలివి తప్పి నిద్రించుచున్న దానివలె పడియుండెను. ఆమె కన్నులు మూతలు పడి యుండెను. భట్టిని యామె నుదురు నిమురుచు "ఈ మధ్య నీమె కీ విధముగనే యగుచున్నది. తలచుగ

నావేశపడుచు, నిశ్చేష్టయై క్రిందపడు చుండును. కాని భట్టూ! మహాశ్వేతాయతో నీవీమె సంగతిని గుఱించి చెప్పితివా ?" అని యడిగెను. నేనింతవఱకు లజ్జా సాగరమున మునుగుచు తేలుచు, నేమియు దిక్కుతోచక యుంటిని. కడు నిపుణతతో నామె నా మనస్సు నింకొకవైపునకు త్రిప్పినది. అవధూతపాదులు అపరాజితా పుష్పరసమున గలిపి నిపుణిక కిమ్మనిన యౌషధము సంగతి జ్ఞాపకమునకు వచ్చెను. నేనా యౌషధమును భట్టినికిచ్చితి నేగాని తలయెత్తి యామెను జూచుటకు సాహసింపజాలక పోతిని. నా యీ యవస్థచూచి పాపము భట్టినికి చాల కష్టముగ నుండెను. నా మనస్సును మఱియొక పనియందు నియోగింపవలెనను తలంపుతో నామె పలువిధముల [illegible] కుపచారము చేయుమని యాదేశించుచుండెను. నిపుణికకు శయ్య యమర్చబడెను. శీతలోపచారములు గావింపబడెను. చివరకామె నచటనే యుండనిచ్చి మేము ముంగిట చేరుటకు నిశ్చయించితిమి. నేనంతదనుక నోరు మెదల్పక భట్టిని యాజ్ఞను పాలించుచునే యుంటిని గాని నిపుణిక తిరస్కారవాక్యములచే కలిగిన బాధను నేనొకక్షణకాలమైనను మఱువజాలకుంటిని. నాతప్పు నా కపుడు బాగుగ తెలియవచ్చెను. నేనేల నట్లు గావించితిని! నా తెలివి మంటగలిసెనా? అయ్యో! దౌర్భాగ్యుడా! భట్టిని మానరక్షణార్థమై యెట్టి యిక్కట్టులనైన నెదుర్కొనిన యిట్లేల వర్తించితివి! అధికారగర్వమున కన్యాకుబ్జేశ్వరుడు నిన్ను 'విషయలోలుడు' అని యన్ననాడు నీవేల భట్టినికి యుక్తమగు ప్రత్యుత్తర మొసగలేదు! ఛీ, భాగ్యహీనుడా!

మౌఖరీ వంశపురాణిగారి యాహ్వానమును నీవు కన్యా కుబ్జేశ్వరుని యెదుట కాలరాచి యుండవలసినది. కాని యేమి చెడుకాలమో! నా యాత్మగౌరవ మా సమయమున నెక్కడకు పోయినది? నేను భట్టిని కవమానము జరుగనిచ్చి తిని. నా పాపమునకు ప్రాయశ్చిత్తమే లేదు. తుషానలమున మండినను ఈ పాప ముపశమింపదు.

ముంగిట జేరిన పిదప భట్టిని నవ్వుటకు ప్రయత్నిం చెను. ఆమె మనసునందెట్టి దుఃఖముగాని గ్లానిగాని లజ్జగాని లేదని నాకు తెలుపవలెనని యామె యభిప్రాయము. ప్రయ త్నముపై సాధించిన యామెనవ్వు వికసించిన కమలమువలె నున్న యామె ముఖముపై మనోహరముగ నుండెను. ఆ నవ్వును జూచినపుడు నా మనస్సు మతింత బాధపడ జొచ్చెను. అహా! నే నెట్టి మందమతిని! దేవదుర్లభమగు నిట్టి మహాత్మను నేనవమానింప జేసితినే! కమలకోమలమగు నిట్టి హృదయముపై నాఘాతము కలుగనిచ్చితినే! అని చింతించు నా హృదయము కరిగి యామె పాదములపై ప్రవహించుటకై యుబలాట పడసాగెను. నాకంఠము బొంగురు బోయి, నా వాక్ఛక్తి లోపించి, యుప్పొంగి వచ్చుచున్న యశ్రువులచే నా కన్నులు నిండి, దృష్టి రుద్ధ మయ్యెను. జ్ఞానుతాపములచే నా శరీరము దహించుకొని పోవుచుండెను. దిశలన్నియు నాకు శూన్యములైనట్లుండి, తలగిఱ్ఱున తిరుగుచుండ, నేను నిలబడలేక చతికిల బడితిని. భట్టిని నాయొద్దకువచ్చి అత్యంతానురాగమున నా నుదుటపై చేయివైచి, తొట్రుపడుచు "భట్టా! నీవుకూడ నింత

యుద్రిక్తుడవైతివేమి? నిపుణిక మాటలచే నీవిట్లు కలత జెంద నగునా? లేమ్మా, భాగ్యహీనురాలగు ఈ భట్టినిని చూడుము. నీ వెట్టి యపరాధమును చేసియుండలేదు. నీవు కన్యాకుబ్జేశ్వరుని సభాసదుడవైనంత మాత్రమున నా కవమాన మేలకలుగును? అనవసరముగ కలత జెందుట పాడియా?" అని నన్ను బుజ్జగించెను. నాకు మెల మెల్లగ తెలివివచ్చెను. మోకాళ్లపై కూర్చుండి నేను "దేవీ! మీరన్నింటిని క్షమింపగల నిబ్బరముగలవారు. అన్నింటిని మఱచి పోగల యౌదార్యము గలవారు; కాని మందభాగ్యుడగు బాణునకు శాంతి లభించుటెట్లు?" అని మాత్రమనగలిగితిని.

భట్టిని ముఖముపై నొక విచిత్రమగు భీతి గోచరించెను. ఆమె నోటమాట వెలువడలేదు కాని యామె కన్నులామె మనోభావములను స్పష్టము చేయుచుండెను. ఆమె ముఖము వెలవెల బోవుచు, తడిసిన కదంబ కుసుమపు మొగ్గ సూర్యుని వేడిమికి కమిలి పోవుచున్నట్లామె ముఖము గగుర్పాటు జెందుచుండెను. నేను వ్యాకుల చిత్తుడనై 'దేవీ! నేను తాపసాగరమున మునిగియున్నాను; లజ్జాపంకమున నిమగ్నుడనై యున్నాను నాకు కర్తవ్యము బోధపడుటలేదు. నిపుణిక సత్యమునే పలికినది. మాఖరి వంశమువారి యాహ్వానమును నేనప్పుడే కాలరాచి యుండ వలసినది. భట్టిని సేవకుడై గౌరవము పొందినవాడు చక్రవర్తుల సభాసదుడగుట తగదు. కాని దేవీ, ఎట్టిదుర్వారమగు శక్తియో యొక ధాటియో కాని, నా తెలివియే మంటగలిసినది!

నేనేముఖము పెట్టుకొని మిమ్ములను క్షమింపుడని కోరగలను!"
అని యంటిని.

భట్టిని తన్ను తాను నిగ్రహించుకొనలేక పోయెను.
ఆమెముఖము, ఉదయాద్రి శిఖరముపైకి అప్పుడే వచ్చిన
చంద్రబింబమువలె నెఱ్ఱబడెను. "నీవు కృష్ణవర్ధన రాజకుమా
రుల కృతజ్ఞతా పాశబద్ధుడవై యుంటివని నేననుకొనను.
నీవేమిచేసియున్నను కృష్ణవర్ధనుల వేడికోలుపై చేసినదే.
ఈ విషయము నిపుణికకు తెలియదు. నాకు తెలియును.
నీవురాజకుమారుల కృతజ్ఞతకేల పాత్రుడవైతివి! నాకొఱకే
కదా! భట్టూ! నిన్నపరాధినని తలచుటకు ముందు నన్ను
ముక్కలు ముక్కలుగ చేసి పాఱవేయుటమంచిది. ఎచ్చట
కూడ నీవు నాకవమానము కలిగించి యుండలేవు. స్నాయు
వులు బలహీనముగ నుండుటచే నిపుణిక నోటికి వచ్చినట్లు
ప్రేలినది. నీవేది చేయుదువో దానినే నేనాచరించవలెను.
భట్టూ! అనవసరముగ నే నెక్కువగ మాటాడకుండునట్లు
చూడుము. నీవు దేనిని జేయుమని కోరెదవో అదినాకు
సర్వవిధముల నాచరణీయమగును. ఈ నా యభిప్రాయమును
నీవు విశ్వసింపుము. భట్టూ! లేచి నన్ను కాపాడుము. సిగ్గుచే
నీవిట్లు క్రుంగిపోయిన నేను దానిని భరింపజాలను." అనెను.
ఒక్కక్షణములో నా జడత్వ మంతరించినది. పొగమంచు
తొలగగనే దిఙ్మండల మెటుల ప్రసన్నముగ నుండునో,
చీకటి తొలగగనే తూర్పు దిక్కెంత విశుద్ధముగ నుండునో,
మేఘములు విచ్ఛిన్నములైన పిదపశరత్కాలపు నభోమండల
మెటుల నకల్మషమై యలరారునో యటులనే నాచిత్తమునిర్మల

మయ్యెను. భట్టిని కన్నులలో నేనొకయపూర్వమగు మాధుర్యమును గాంచితిని. నా జన్మాంతరము లెన్నియో కృతార్థములైనట్లు తోచినది. ఆ చూపు నన్నభినవ రససిక్తమొనర్చుచు, స్నేహ ధారచే తడుపుచు, నిదివఱకు కని విని యెఱుగని యొకానొక ప్రపంచము లోనికి లాగుకొని పోయినట్లుండెను. నేను భయముచే లేచి నిలబడి భట్టినిని జూచి "దేవి! భట్టిని!" అని మాత్ర మనగలిగితిని. అటుపిమ్మట నా కంఠము గద్గద మయ్యెను. అశ్రుపూరిత నయనములతో నే నామెను చూచితిని ఆమె కూడ నేమియు మాటలాడక కరుణా పూర్ణమగు మనోహర వీక్షణము నాపై బఱపి కన్నులు వాల్చెను.

అప్పటికి సూర్య భగవానుడు పశ్చిమ సముద్రము వైపునకు వ్రాలి యుండెను. పృథ్వినుండి యాకాశము వఱకు నెఱ్ఱని కిరణముల సమూహము పరివ్యాప్త మయ్యెను. సారసములు క్రేంకారములు సలుపుచు ఇండ్ల పై భాగముల నుండు తమ తమ గూండ్లకు తిరిగి వచ్చుచుండెను. క్రీడా మయూరములు వాసయష్టి వైపున కుత్సాహముతో చూచుచుండెను. నీరు తెచ్చు రమణీమణుల యందెల చప్పుడు మందగించు చుండుట స్పష్టముగ వినబడు చుండెను. నభో మండలము నుండి యొక విధమగు యలసత మెల్ల మెల్లగ దిగివచ్చి ప్రపంచము నందంతట వ్యాపించు చుండెను. భట్టిని వదన బింబము లజ్జచే నెఱ్ఱబారి యుండెను. ఆమె కపోలము లందొక విచిత్రమగు వికాసము కనబడు చుండెను. ఆమె క్రీగన్నుల యందొక విధమైన వక్రత గోచరించు

చుండెను. బహుకాలముగా నున్న హృదయ వేదన యొక్క సారిగా అదృశ్య మయ్యెను. తత్ఫలముగా నుత్పన్నమైన నిర్మలానంద ప్రవాహమున నిజ సహజానుభావ తరంగములు లాస్య మొనరించు చుండెను,

ఆహా! భట్టిని ముఖముపై నప్పటి శోభ చూడవలసి నదే! కాని వర్ణింప నలవి కానిది! పుష్పించిన దమనక యష్టిని బోలిన యంగలత, లజ్జానుభావముల ఘాత ప్రతిఘాతములచే ఆకాశ గంగయందలి జలావర్తమున బడిన పారిజాత లతవోలె కదలుచుండెను. చాలసేపటి వఱకు ఆమె కన్నెత్తినన్ను చూడలేకపోయెను. తర్వాత మెల మెల్లగ వెళ్ళి యొక మట్టి యరుగుపై కూర్చుండెను. ఒక మాటామె తన సీమంతమును వాసంతీ యుత్తరీయపు కొంగుతో కప్పుటకు యత్నించుచు మెలమెల్లగా నా వైపునకు దృష్టి సారించెను. ఆ చూపు హృదయమును భేదించు నట్టిది. ఆమె మందహాస మొనరింప మఱియొకసారి ప్రయత్నించెను. కాని సాఫల్యము బొందలేదు. ఆమె నవ్వు శరత్కాల నభోమండలమున తటాలున మెఱపు తీగ మెఱసి యదృశ్యమైనట్లును, శోభా సాగరమున నొక తరంగము లేచి శాంతించినట్లును ఒప్పారుచుండెను. నేను చేతులు జోడించి "దేవీ! ఈ సేవకుడు మీరు మన్నించుటచే కృతార్థుడయ్యెను. కాని నా మనస్సు నందున్న సిగ్గు పూర్తిగా నశించలేదు తమ యాజ్ఞయైనచో నొక ప్రశ్న' నడిగెదను. మహారాణి రాజ్యశ్రీ లేఖను చదివి మీరెందుకు విచారమున మునిగితిరో నే నెఱుగగోరుచున్నాను. సేవకుని కనికరించుట,

అతనిపై కోపపడుట సర్వథా యుచితమే. నా వలన, నేఁడుప రాత్రియు జరుగకుండిన తన ముఖ మెందులకు వాడినది?" అని ప్రశ్నించితిని. భట్టిని చాల సేపటివఱకు శూన్య దృక్కులను నాపై ప్రసరింప జేయుచు, నామె మనస్సెక్కడనో యున్నట్లును, హృదయము నందు గ్రహణశక్తి లేనే లేనట్లును, ప్రేమయొక్క యూటయే యింకి పోయినట్లును, హృదయస్పందనమే యాగిపోయినట్లుండెను. ఆమె యెఱ్ఱని ముఖమొక్క క్షణములో పారిజాత గర్భపటలమువలె పాండురమయ్యెను. నేను క్రొత్తభయముచే వణకిపోతిని. కాని భట్టిని తన్నుతాను స్థిమితపఱచుకొనినది. కన్నులు వాలిపోయి యధరములు కదలి, ముక్కుదూలము కొంచెము వంగిపోయెను. ఆర్ద్రకంఠస్వరమున నామె "నన్నవధూత పాదుల శరణమునకు గొనిపొమ్ము. వారు లేకున్న నేను సుచరిత యింటిలో నుండెదను."

భట్టిని ప్రస్తావించిన రెండు చోట్లు నాకునచ్చలేదు. కాని యీ సమయమున ఆమె కెదురాడుట ఉచితముకాదని నేను మౌనముగనుంటిని. భట్టిని నా మనోభావమును గ్రహించి, అచటినుండి లేచుచు "లేక నీకెక్కడ యుచితమని తోచిన అచటికైనను సరే! కాని నేను మౌఖరీ వంశస్థుల యతిథినైగాని, కన్యాకుబ్జేశ్వరుని యతిథినైగాని యుండుట కంగీకరింపను" అనిపలికి యామె నిపుణిక కడకు చరచర వెళ్ళిపోయెను. అప్పటికే రెండు ఘడియలరాత్రి గడచి యుండెను. దిఙ్మండలమంతయు గాఢాంధకారముచే వ్యాప్తమై యెవ్వరో కాటుక లేపనము

చేసిరా యన్నట్లనిపించెను. నా మనసునందెన్నో యాలోచనలు వచ్చిపోవుచుండెను. నేను నాకర్తవ్యమును నిర్ణయించుకొనజాలకుంటిని. అట్టితఱి వెలుపల వేలాది కంఠముల జయనినాదములు వినబడెను. ఆ జయధ్వను లేయుత్సవ సందర్భమున వెలువడుచుండినవో నాకర్థముకాలేదు. వెలుపలికి వెళ్ళి చూచివత్తమని బయలుదేరుచుండ భట్టిని నన్ను పిలిచెను. అప్పటికి నిపుణికకు తెలివివచ్చియుండెను. భట్టిని యామెకేదో ప్రేమపూర్వకముగా నచ్చజెప్పుచుండ నామె విలపించుచుండెను. నన్ను చూడగనే ఆమె లేచికూర్చుండుట కుద్యమించగనే భట్టిని యామెను వారించెను. ఆమె మనోవ్యథ యామెకన్నులనుండి వేయి కన్నీటి ధారలై కారుచుండెను. నేనామె చెంతకు వెళ్ళి "నిఉనియా! నీకిపుడెట్లున్నది?" అని మెల్లగ పలుకరించితిని. కాని ప్రత్యుత్తరముగ నామె విశాలనయనములనుండి కన్నీరెక్కువ వేగముగ కారజొచ్చెను. భట్టిని ప్రేమతో నామెలలాటమును నిమురుచు "నిఉనియా! స్వస్థతజెందుము. భట్టు సుచరిత వృత్తాంతము నెఱింగించును." అనెను. ఆమాటలు వినినంతనే నిఉనియ ముఖము వికసించెను. ఆమెయందొక నూతనమగు శక్తి యుద్భవించెను వెంటనే ఆమె "భట్టూ! నీ వామెను చూచితివా? ఆ భాగ్యహీనురాలెట్లున్నది!" అని యుత్సాహముతో నడిగెను. నేను "ఆమె భాగ్యహీనురాలు కాదు నిఉనియా, అఖండ సౌభాగ్యవతిసుమా!" అని యంటిని. నిపుణిక కన్నులు ఆశ్చర్యానందములతో విప్పారెను "నిజ

ముగ !" అని యామె ప్రశ్నింపగా. నేను "ఔను, కర్ణరాజా నిజమే !"" అని యంటిని.

ఆసమయముననే జయనినాదములు భట్టిని యింటి ద్వారమువద్ద వినబడుచుండెను. మేము చెవియొగ్గి వింటిమి. వందలకొలది స్త్రీ పురుషులు ఒక్కుమ్మడిగ అత్యంత హర్షోల్లాసములతో "దేవపుత్రుడగు తువరమిళిందునికి జయమగుగాక" అని నినాదము చేయుచుండిరి. భట్టిని యింటుకి ఆశ్చర్య జిజ్ఞాసా భావముతో నావైపునకు చూచెను. అంతలో నొక దాసివచ్చి మహాసామంతుడగు లోరికదేవుడు తన రాణితోడను అనుచరులతోడను వచ్చియున్నాడనియు వారి చేత పూజాద్రవ్యములున్నవనియు, వారు వెంటనే భట్టినిని దర్శించుట కనుజ్ఞను వేడుచున్నారనియు తెలిపెను. భట్టిని యొకక్షణకాలము గంభీరముగనుండి తర్వాత సహజ స్వరమున "భట్టూ ! నీవువెళ్ళి విషయమేమో విచారించిరమ్ము. నాకేమియు నర్థము కాలేదు" అని యాదేశించెను. నేను వెంటనే ఆమె యాజ్ఞను పాలించితిని. నేను ద్వారముకడకు వెళ్ళి చూడగానే మహాశ్చర్యముతో స్తబ్ధుడనైతిని.

వందలాది కాగడాలవెలుగున నొకగొప్ప జనసమూహము నృత్యగానవాద్యములచే దిక్కులను మారుమ్రోగించుచుండెను. అందఱికన్న ముందు లోరికదేవుడు అశ్వారూఢుడై యుండెను. అతనివెనుక మంత్రులు, రాజ పురోహితులు నదేవిధముగ నశ్వారూఢులైయుండిరి. వారివెనుక లోరికదేవుని రాణి పల్లకియందాసీనయై యుండెను. వారందఱి కంటె వెనుక కొలదిదూరమున మల్లుల సమూహ మొకటి

పలువిధముల తమ వ్యాయామ నైపుణిని ప్రదర్శించుచుండెను. ఈ ప్రదర్శన మొకవైపు నెంత యుద్ధానముగ నుండెనో, మరి యొకవైపు నంత సంయమితమై యుండెను. వందలకొలది మల్లు లొక్కసారిగ వివిధ శస్త్రసజ్జితులై భయంకరములగు భంగిమముల అంగప్రోటన, నాటన, ఉన్నోటన, వికుంచన, సంతోలన, క్రియలను ప్రదర్శించుచుండిరి. వారు తెరపిలేక వాయించుచుండిన తాళోట్టనములచే దిగంతములు దద్దరిల్లుచుండ ధనుష్టంకార యష్టి కోళుల ఝుంఝుణాధ్వనులచే నాకాశము కంపించి పోవుచుండెను. వారి యుద్ధాను యుగ వికంపనముచే ప్రేక్షకుల కన్నులు మిఱుమిట్లు గొలుపుచు ఒక్కొక్కప్పుడొకని యంగమోటనము మఱియొకని వికుంచనమున దగుల్కొనునా యనిపించుచుండెను. కాని మహా క్రమనియమబద్ధమగు వ్యాయామము లొక్కమారు ఆగి పోయి మల్లు రొక్కసారిగ నిలబడి యద్భుతమగు విరామ నినాదము చేయుచుండ జనసమూహము మొదటినుండి చివరివఱకు దేవపుత్రుడగు తువరమిళిందుని జయఘోషచే పృథ్విని కంపింపజేయుచుండుట గాంచి మహాశ్చర్యము కలుగుచుండెను. భట్టిని స్నానాగ్రమునొద్ద మల్లులు తమ వ్యాయామ ప్రదర్శనము ముగిసియుండియు నద్భుతమగు కట్టుబాటు కలిగి వరుసలొకారమున నిలుచుండిరి. వారి మధ్య నేబదిమంది స్త్రీ పురుషుల జంటలు వారికి సమానాంతరమున నిలువబడిరి. వారిచేత చిన్నచిన్న కత్తులుండెను. లోరిక దేవు కక్ష్యమునుండి దిగగనే మంత్రులు పురోహితులుకూడ తమ తమగుఱ్ఱములనుండి దిగిరి లోరిక దేవుని యాదేశమున

వ్యాయామము ప్రదర్శన మాపబడగా నతడు వినయముతో తనను భట్టిని కడకు గొంపొమ్మని నన్ను ప్రార్థించెను. అతడు "ఆర్యా దేవపుత్రనందినిని మేమెఱుగనంతవఱకు మావలన నెన్ని యపరాధములు జరిగియున్నను నవి క్షంతవ్యములు. మేమిపుడామెను కనుగొంటిమి. కనుక ఆమెను గౌరవించుట యందొక క్షణమాలస్యమైనను మేము భరింపలేము. మీ రిచ్చిన కన్యాకుబ్జేశ్వరుని లేఖవలన మాకన్ని సంగతులు తెలిసినవి. మీతో మేమెన్నో విషయములను మాటాడవలసి యున్నది. అయినను ఈ కర్తవ్యము నిర్వహించుటయం దాలస్యముగావించుట యవాంఛనీయము." అని పలికెను. నేనాతని సందేశమును భట్టినికి తెలియజేసితిని. ఆమె కదలక మెదలక యుండి క్షణకాలము దీర్ఘముగ నాలోచించిన తర్వాత "నీ యభిప్రాయమేమి? నన్ను వెళ్ళుమనెదవా?" అని యడిగెను. నేనియు నాలోచింపకయే నానోట "దేవీ! తప్పక వెళ్ళుడు" అను పలుకులు వెలువడెను.

భట్టిని యొప్పిన వెంటనే లోరిక దేవుడు కత్తిమాసి నమస్కరించెను. వెంటనే ఘనోహియను శంఖమును పూరించెను. చూచుచుండగనే 'దేవపుత్రనందినికి జయము, జయము' అను నినాదములచే దిక్కులు పిక్కటిల్లెను. భద్రేశ్వరపు కోటయందలి సౌధముల నుండి ప్రతిధ్వని వెలువడి సందున జయనినాదము చాలసేపటివఱకు చెవులయందు గింగురుమనుచుండినది. ఆ సమయముననే లోరిక దేవుడు తన ముప్పది రెండంగుళములు పొడవుగల భయంకరమగు ఖడ్గమును పైకెత్తెను. చూచుచుండగనే మల్లుల లాఠీకఱ్ఱలు

పెళపెళలాడెను. అది యొక భయంకరమగు దృశ్యము. కత్తు లొండొకటి నోరచుకొనుచుండుటచే కాగడములదరిపోవు చుండెను. విచిత్రమగు నాకత్తులు త్రిప్పుట యందందఱు నిమగ్నులై నట్లుండిరి. కాని యాశ్చర్యమేమన, అనవరత మంత వేగమున కత్తులు తిరుగుచుండినను నెవరికిని దెబ్బలు తగులలేదు. ఎవరును చలింపలేదు. ఎవరును తమస్థానములను వీడలేదు. క్రమక్రమముగ నాకత్తిసాము చేయువారి వలయము కుంచితమగుచుండి యొకప్పుడు కత్తులు తప్ప మఱియేమియు గనబడకుండెను. మఱుక్షణమున కత్తులన్నియు పెళపెళ లాడి, జనసమూహ మొక్కుమ్మడిగ 'భట్టినికి జయమగుగాక' అను ధ్వనిచే ముఖరితమయ్యెను. నేనాశ్చర్యముతో చూచుచుండ గనే యాత్రిప్పుచుండిన కత్తులు రెండు మంచెలుగ తయా రైనవి. ముహూర్తకాలములోనే యందఱు కన్యలు శృంగార రసభరితమగు ద్విపదీ ఖండము నొకదానిని గానముచేయ మఱియొక మాఱు చిన్నచిన్న కత్తులు వెళపెళమన ధ్వని చేసెను. ఆ కర్కశధ్వనికి, ప్రాచ్యభాగమునను మారీ జనకంఠ మాధుర్య మెంతో యింపుగ నుండెను. తిరిగి మల్లు లందఱెపుడు వలయాకారముగ నిలువబడిరో, మధ్య వలయాకారమున నున్న కుమారీ జనమెపుడు కుంచించుకొని యెటపో చేరిరో చాల సూక్ష్మముగ పరిశీలించువారికి గూడ తెలియలేదు. ఈ నృత్య కౌశల మద్భుతముగ నుండెను. అది యెంత యుత్తాలముగ నుండెనో యంత తాలబద్ధముగ కూడ నుండెను. కుమారీ జనమొక విచిత్రమగు సుకుమార భంగిమమున భట్టినిని

చుట్టుకొని, కొలది ప్రయాసచే నామెను ఎత్తుకొని ముందు వైపున నున్న కఱ్ఱలమంచెపై కూర్చుండబెట్టిరి. తర్వాత భయంకరమగు రాసక నృత్యము ప్రారంభమైనది. వారి మధ్యనున్న భట్టిని భూతముల యుత్సవము మధ్య పార్వతీ దేవి కూర్చుండి యున్నదా యన్నట్లుండెను. భట్టిని ముఖముపై సహజమగు గాంభీర్యమగపడుచుండెను. ఒక్క క్షణముగూడ అందెట్టి వికారము కనుపడలేదు. కంటకీలతల మధ్యవికసించిన చంద్రమల్లిక వోలె నామె మనోహరమగు వదనము తనంత తాను పరిపూర్ణమై యొప్పుచుండెను. ఆ భయంకర నృత్యమింకను సాగుచునే యుండెను, కంచుతాళములు మ్రోగుచుండెను. నూపురధ్వనులతో కలసిన కఱ్ఱల 'కటకట' ధ్వనులచే దిగంతరాళము ముఖరితమగుచుండెను.

భట్టిని వెనుకనున్న మంచెపై లోరిక దేవుడు తన రాణీ సమేతముగ నాసీనుడయ్యెను. కొంతసేపటికా నృత్యము ఆగిపోయినది. పురోహితుడు శంఖమును పూరించగనే మంత్రి ధూపదీప నైవేద్యములతో భట్టినికి అర్ఘ్యమిచ్చెను. లోరిక దేవుడు మనోహరమగు వెండి పళ్లెరమున నారికేళ, పూగీ ఫలయుక్తముగ నాగవల్లీ దళములనుంచి భట్టినికి సమర్పించి గద్గద కంఠమున నతడు "దేవీ! తెలియక మావలన జరిగిన యపరాధమును క్షమింపుము. అజ్ఞాత ప్రతిస్పర్ధి, ప్రత్యంత బాడవుడు, ఆత్య్యాల మానరక్షకుడు, మాననీయుడు, దేవపుత్రుడునగు తువరమిళిందుని నయన తారలగు మీరు నా గృహమును పవిత్ర మొనర్చుట నా భాగ్యము. నాయెద్ద నున్న పదివేలమంది మల్లులు మీకు దాసులు; లోరిక దేవుడు

సద్గుణమ్ములకు నెల్లప్పుడు దాసుడే! చక్రవర్తుల భ్రూ విక్షేపముల నతడెన్నడును లెక్క చేయలేదు. అతడు సముద్రగుప్తుని వంశజుల ననుగమించుట కంగీకరించును. లేదా స్వతంత్రుడై యుండును. కాని దేవీ, నేడు గుప్తవంశజుల ప్రతాపానలము నిర్వాపితమైనది. మౌఖరీ వంశజుల భుజబల మంతరించినది. ధర్మాచార హీనులగు బౌద్ధనరపతుల నిర్వీర్య శాసనము ఆర్యావర్తమునంతటిని వినాశగహ్వరమున పడద్రోసినది. ఈ సమయమున లోరికదేవుని కెచ్చటను ఆశాకిరణము కనబడుటలేదు. దేవీ, నీచులగు మ్లేచ్ఛులసేన కొండచరియల కటు వైపు గుమికూడుచున్నది. దుర్మదమ్లేచ్ఛవాహిని నీ పవిత్ర భూమిపై పడనీయకుండ నడ్డుకోగల సమర్థుడెవడు? కొండ చరియల నడ్డగింప కవాటము పట్టి విశాలవృక్షము గలవాడెవ్వడు? దుర్దాంతమగు మ్లేచ్ఛవాహినిని మిడుతలదండుగ మాడ్చివేయగల ప్రతాపాగ్ని యెవరికి గలదు? దేవపుత్రుడు డొకడే అట్టివాడు! తమ యెడ ప్రేమచే నతడు వ్యాకులచిత్తుడై యున్నాడు. లోరికదేవుని మల్లవాహినియొక్క ఆనందోల్లాస ధ్వని నేడు దేవపుత్రునిని మేల్కొల్పగలదు. తమకు సేవచేయు నవకాశము నాకు లభించినది. అందువలన నాకు సంపూర్ణార్యావర్తమునకు సేవచేయు నవకాశమనాయాసముగ లభించినది. దేవీ, నాకీయవకాశమును ప్రసాదింపుడు." అని యనెను. భట్టిని కన్నులు చెమర్చినవి. ఆమె సంభ్రమముతో లోరికదేవునిచూచి "ఆర్యా, మీ మాటలు విని నేను సిగ్గుపడుచున్నాను." అని యనెను. లోరికదేవుడామె నెక్కువగ మాటలాడ నియ్యలేదు. అతని మనస్సు

మార్గము నాలోచింపవలసినదే, అని తలపోయుచు నేను ద్వారము వెలుపలనె కూర్చుండి యుంటిని. ఆకాశమున వృశ్చికరాశి పశ్చిమ దిక్కునకు దిగజారుచుండెను. దాని ప్రక్కనున్న కుజగ్రహముయొక్క యెఱ్ఱని నక్షత్రము కనబడుచుండెను. వృశ్చికమునకు పార్శ్వమున కుజగ్రహ మొక విచిత్రమగు భయమును గొల్పుచుండెను. ఎట్టి విచిత్రయోగము! వృశ్చికరాశియందు కుజుని సంక్రమణమువలన ధరిత్రి రక్తముచే తడిసి యడుసై జారుచుండునని సంహితలలో చెప్పినమాట నిజమేనా ! పవిత్రమగు ఆర్యావర్తమునందు మఱియొకమాఱు తోడేళ్ళ భయంకర తాండవము ప్రారంభమగునా! అవలోకనమాత్రమున రాక్షసరాజు వక్షఃస్థలము పగిలిపాటల వర్ణమగునట్లు చేసిన యానృసింహ భగవానుని భయంకర నేత్రములను నేను మనస్సునందే స్మరించితిని. * వృశ్చికలగ్నమందున్న కుజుడు ఆభయంకర నేత్రముల ఛాయవంటివాడే. మేదిని మనుష్య రక్తముచే తడిసి యడుసువలె నగునేమో! పంటభూము లన్నియు భస్మముగ మాఱిపోవునేమో ! జనపదము లందలి జనులందఱు దస్యులచే ప్రజ్వరిల్ల జేయబడిన యగ్ని శిఖల కాహుతి యగుదురేమో! మానవాస్థి పంజరముల రాసులచే మార్గములు దాటశక్యముగా

---

* సరిపోల్చునది :-

జయత్యుప్రేన్ద్రః సచకారదూరతో విభిత్సయాయః
క్షణలబ్ధలక్ష్యయా ।
దృశైవ కోపారుణయా రిపోరురః స్వయంభయాద్భిన్నమి వాస్ర
పాటలమ్ । కాదంబరి-13

కుండునేమో! కరాలమగు మృత్యుదేవత తాండవముచే నార్యావర్తమునందెల్లెడల హాహాకారములు వెడలునేమో! ఎవరికెఱుక!

ప్రభూ! ఈ రక్తపాతము నరికట్టుట సాధ్యముకాదా? రాజులయొక్కయు, సామంతులయొక్కయు, మొండిపట్టు వలన దాని నరికట్టు సాధనముగూడ నశించి పోవునా? నాడు అఘోరభైరవులు మహామాయను మందలించుచు "నీవు త్రిపుర భైరవి లీల నాపజాలవు. మహాకాలుని తాండవ నృత్యమును నీవు నిలుపజాలవు. శూలపాణికపాలమాల రచనకు నీవు అడ్డంకి కలుగజేయజాలవు. ఏలయన నీవు సంపూర్ణముగ త్రిపుర భైరవియందు లీనమై పోలేదు. నీవేనాడు ఆ శక్తియందు లీనమై పోయెదవో నాడా లీలను నీ వెట్లుకోరి నట్లు త్రిప్పగలవు. పిచ్చిదానా? త్రిపురసుందరికి నీ వెంత యియ్యగలవో అదియంతయు నీదే. ప్రజల దుఃఖమును నీవు నిజముగ నీ దుఃఖమని భావించితివా? మహామాయా! నిజము చెప్పుము. కపటము వీడుము. నీవు అమృత పుత్రులను సంబోధించితివి కదా? నీవు నిజముగ నమృత పుత్రిక వైతివా నిన్ను నీవ శేషముగ త్రిపురసుందరి చరణారవిందముల సమర్పించిన నాడే నీవు కోరినది, నీవు చేసి చూపగలవు. వట్టి మాటలవలన నిన్ను నీవే యవమానించుకొనుచున్నావు. త్రిపుర భైరవి లీలను మఱియొక రూపమున జూడగోరినచో, నీవే త్రిపుర భైరవి కావలెను. అంతే కాని మఱొక మార్గము లేదు. దుర్ఘటమగు సమయ మాసన్న మగుచున్నది సుమా!" అని యనెను. వికారరహితముగ మహామాయ "నేను తమ

యాశీర్వచనమును గొనుటకై వచ్చియున్నాను" అనెను. అపుడవధూతపాదులు కోపముతో "ఇదంతయు అసత్యము; వంచన! నీ యాశీర్వచనము కొఱకు జగత్తంతయు తహ తహ లాడుచున్నది. నీవా మహాశక్తికి ప్రతికృతివి. నేను నిన్ను త్రిపురభైరవి రూపమున చూచి కృతార్థుడనయ్యెదను. నేను నా జీవితమంతయు స్త్రీ నుపాసించుచునే యున్నాను. నా యుపాసన యసంపూర్ణముగ నిలిచిపోయినది. నీవు విశుద్ధమగు నారీరూపమునుదాల్చి నన్నుద్ధరింపుము — విశుద్ధ నారీ—త్రిపురభైరవీ!" అని పలికెను. మహామాయ తన చీర కొంగును మెడకు చుట్టుకొని గురుదేవునకు ప్రణమిల్లి త్రిశూలమును చేతబూని లేచినిలబడి "గురుదేవా! తమ యాజ్ఞ శిరోధార్యము" అని యనెను. ఆమె కన్నులనుండి విచిత్రమైన జ్యోతి యొకటి వెలువడు చుండగా ఆమె ముఖమండలము మధ్యాహ్న మార్తాండునివలె మండు చుండెను. గురుదేవులు వెన్నెముకను తిన్నగనిలిపి కను జామలను పైకెత్తి చాలసేపటివఱకా తేజోమండిత ముఖ మునపై తన దృష్టిని నిలిపియుంచిరి. మహామాయ ప్రతిమవలె నిశ్చలముగ నిలుచుండినది. గురువుగారు తమదృష్టి నచ్చటి నుండి మఱల్చగనే ఆమె బిరబిర ఒకవైపునకు వెడలి పోయెను. నేడుకూడ నేనా దృశ్యమును స్మరించిన మాత్ర మున నా శరీరము గగుర్పాటు చెందుచుండును. కాని నేనంత వఱకు అవధూతపాదుల మాటల భావమేమని తెలిసికొన లేకుంటిని. ఈ ధరిత్రి రక్తస్నాత యగునా, లేక రక్షింప బడునా? నిజముగ మహామాయ త్రిపురభైరవి యగునా?

మహాకాలుని తాండవనృత్యము నిజముగ నాగిపోవునా! తల్లీ! త్రిపురసుందరీ! ఎచ్చటనుంటివో కదా! రోతపుట్టించు నీ ప్రపంచమును నీవేల తీర్చిదిద్ది సౌందర్యాత్మక మొనర్ప రాదు? నీవు కరాల తాండవనృత్యముచే నీ ధరిత్రిపై నెల్లప్పుడు మహానాశనమనెడి యాటనే యాడుచుందువా? రుద్రాణీ! దాక్షిణ్యముగల నీ వదన మెక్కడ? ఆ సుకుమార భావము, శాంతినొసగు హాస్యము, భయపడియున్న జగత్తునకు శాంతినిగూర్చునట్టిదియు, తత్తరపాటు చెందుచున్న ప్రపంచమునకు ఊరట నిచ్చునట్టియు, పృథ్విని రక్తస్నానమునుండి తప్పించునట్టియునైన మనోహర భంగిమము—ఇవన్నియు ఏవీ? నేనిట్లు చింతించుచుండ నా యెదుట భట్టినివచ్చి నిలుచబడెను. ఆమె కన్నులు గొప్ప అశ్రుకణములచే పరిపూర్ణమై కంఠము బాష్పరుద్ధమై, ముఖము ఎట్టిని కాంతిచే తేజరిల్లుచుండెను. అయినచో త్రిపురసుందరి దక్షిణముఖమిదియేనా యేమి! దక్షిణముఖము! కరుణధారలు ప్రవహించునట్టిది; అనురాగకాంతులచే విలసిల్లుచున్నది!, స్నేహస్నిగ్ధమై మెఱయుచుండునట్టిది అహా! అవధూతపాదులు పూజింపుమని నాకింతగ నేర్పిన యా భువన మోహిని రూపమిదియేనా యేమి! కురంగ నేత్రములనుబోలిన భయచంచలములగు ఈ నేత్రములు, శరచ్చంద్రుని బోలిన యాహ్లాదకరమగు నీ వదనము, బింబఫలము వంటి యా తామ్రాంధరములు, చందనము పూయబడిన యా యంగములు, 'కరుణాశ్రుసిక్తమును, హృదయము నాకర్షించునట్టిదియునగు నీమనోహరదృష్టి—ఇదే

కదా భువనమోహిని రూపము. గురువుగారే నాకాధ్యాన శ్లోకమును నేర్పియుండిరికదా!

కురంగనేత్రాం శరదిందువక్త్రాం బింబాధరాంచందన గంధలిప్తామ్।
దృశాగల త్కారుణి కాశ్రయాంతాం, సమ్మోహయంతీం
త్రి జగన్మనోజ్ఞామ్ ॥

“త్రిజగన్మనోజ్ఞా” యొక్క శోభ యందింతకంటె నేమి యెక్కువగ నుండును? హృదయమునకు శాంతినిచ్చు యొట్టి దృష్టియది! అమృతమును స్రవించు వాగ్ధార! ఎట్టియుదారశీలము! ఎట్టి నిర్మలమగు శోభ! భువనమోహిని యొక్క యీ రూపమును చూచిన వారికింకేమియు చూడనవసర ముండదు. నేను చకితుడనై భట్టిని చూచుచుంటిని. భట్టిని సానుభూతి తెలుపు కంఠస్వరమున, “భట్టూ! అలసివచ్చి యున్నావు కొంచెము ప్రసాదము తీసికొందువుగాని లెమ్ము! లోపలికి పోదముపద” అని యనెను. నేను మాఱుబల్కక మంత్ర ముగ్ధునివలె భట్టిని వెనువెంట నడిచితిని, నే నెక్కడికి పోవుచున్నానో కదా,

# పదునాఱవ అధ్యాయము

నేను ప్రాతఃకాలమున నిద్రలేచునప్పటికి ప్రొద్దు పొడిచియుండెను. లేవగనే ప్రథమమున నేను నిపుణికనే చూచితిని. ఆమె అప్పుడే స్నానముచేసి యుండుటచే ఆమె కేశములింకను తడియారలేదు. ఆమె పాలిపోయిన ముఖముపై నవి ప్రభాతసమయమున చంద్రుని యావరించుకొని యున్న సజల జలధరములవలె శోభిల్లుచుండెను. తెల్లనిచీరచే చుట్టబడిన యాకోమలి తనూలత వికసించిన కామినీ గుల్మమువలె మనోహరముగ కనబడుచుండెను. ఆమె ముఖము పాలిపోయి యున్నను కాటుక పిట్టలవంటి చంచలములగు ఆమె కన్నులు చాల రమణీయముగ నుండెను. నేడామె పెదవులపై నవపల్లవము నవ్వు నాట్యమాడుచుండెను. నేను నిద్రలేచుట చూచి యామె కడునాదరముతో నాకు నమస్కరించెను. నేను మాటలాడుట కవకాశ మొసగకుండ ఆమె స్వయముగ, "భట్టూ, నీవు నన్ను క్షమించినావుగదా! నీవు గొప్పవాడవు. నేను తుచ్ఛురాలను. నన్ను నీవు తప్పక క్షమించియే యుందువు. కాని నేను నిన్నింకను క్షమింపలేదు. నీవు మాాఖరీ రాణిగారి యాహ్వానము మోసికొనివచ్చి నిన్ను నీవు అవమానపఱచుకొనుటయేకాక భట్టినికికూడ నవమానము కలుగజేసి యున్నావు. నేను మీలో నెవరి యవమానమును సహింపజాలను. కాని నీవు వచ్చినదే తడవుగ నిన్ను నిందించినందులకే నాకు గ్లాని కలుగుచున్నది. అప్పుడు నాలో నేను లేను. నా హృద

యము బలహీనమై పోయినది. నేను దేనిని సహింప లేకున్నాను. కాని నేను నిన్న పలికినది మాత్రము సరియైనదే." అని యనెను. నేను నిపుణిక కన్నులలో స్ఫులింగములకు బదులుగ నవ్వు తొణుకుచుండెను. ఆమె ముఖముపై తేజమునకు బదులు చంచలత్వము వ్యాపించియుండెను. ఆమె వదనమున ప్రసన్నత ప్రస్ఫుటమయ్యెను. సంతోషముగా కనబడెను. నేను స్నేహస్నిగ్ధమగు కంఠస్వరమున "నిఉనియా! నావలన ప్రమాదము జరిగినది. నాకపుడు కర్తవ్యము బోధపడలేదు. నీవు కర్తవ్యమేదో సూచింపుము. ఇప్పుడు నా తప్పులను లెక్కపెట్టుటవలన ప్రయోజనమేమి?" అని యంటిని. నిపుణిక ముఖముపై సహజమగు మాధుర్యము నాట్యమాడ సాగెను. ఆమె మందహాసము చేసి, "తప్పులు నీవు చేయుచుండ కర్తవ్యము నేను చెప్పుచుండవలెనా?" అని యడిగెను. నేనించుక కలుగజేసికొనుచు, "ఇదేమియు క్రొత్తగాదే!" అని యంటిని. నిపుణిక కన్నులలో నుల్లాసము కనబడుచుండెను. ఆమె నవ్వుచు "జడదారి యగు వటువు సంగతి జ్ఞాపకమున్నదా?" అని నవ్వునాపుకొనుటకు నోటిని కప్పి లోలోన పొట్ట చెక్కలగునట్లు నవ్వుచుండెను. ఆమె కొంగుపైనున్న పలుచని యంగుళులు చాలసేపటివఱకు వణకుచుండెను. వాని యుపయోగమునుచూచియే నేను నిపుణికను నానాటక మండలిలో చేర్చుకొని యుంటిని.

ఒక్క క్షణములో నాకు విదిశానగరమునకు చెందిన జటాధారి యగు వటువు జ్ఞాపకమునకు వచ్చెను. అతడు తనను నాటక మండలిలో చేర్చుకొమ్మని నన్ను ప్రతిదినము

వేధించుచుండెను. అతని నుదురు ప్రశస్తముగనుండి మొద్దు
బారి యుండెను. కన్నులు పగిలిన 'దానిమ్మపండువలె నెఱ్ఱ
గను, కంఠస్వరము కర్కశమై తీవ్రముగ నుండెను.
అతనిచే నభినయనము చేయించుటకు వీలగు పాత్ర నాకు
లభింపలేదు. కాని యతడు మాత్రము నన్ను వదలిలేదు.
మండలిలోని వారందఱికి నతనిపై విసుగు కలిగినది. కాని
నా మూలముగ వారతనిని సహించుచుండిరి. ఒక్క నిపు
ణిక మాత్ర మతని రెచ్చగొట్టలేదు. నన్ను జూచియే
యామె యతనిని రెచ్చగొట్టు నాటకము విడచిపెట్టెను. కాని
జటదారి యామె మానమును జూచి యది తన యెడ గల
యనురాగమని భ్రమపడుచుండెను. అతని గడ్డము చీపురు
కట్టవలె నుండెను.' అతని మీసములు చిందఱవందఱగ
నుండి చక్రూతిపై మొలిచిన కాకివెదుర్ల పొదవలె నుండెను.
అత డెల్లప్పుడు రంగస్థలముపైకి వచ్చుట కవకాశము
కల్పింపుమని నన్ను ప్రార్థించుచుండెను. ఒకనాడు మా
నాటకమండలి 'అభిజ్ఞాన శాకుంతలము'ను ప్రదర్శింపబోవు
చుండెను. ఆనాడు నగరమునందలి గొప్పవారందఱు నాటకమును
జూడ రానుండిరి. యువరాజభట్టారకులు కూడ వేంచేసెదరని
మాకు తెలిసెను. నాడు మారీచముని వేషము వేయుచుండిన
దేవరాతు డకస్మాత్తుగ జబ్బుపడెను. జటదారియగు వటువున కీ
పాత్ర నియ్యవచ్చునని నే ననుకొంటిని. ఆ పాత్రధారి విశేష
ముగ చేయవలసిన దేమియు లేదు. అందువలన కన్నులుమూసి
కొని కదలక కూర్చుండుట. నే నతనిచే దినమంతయు నభ్యా
సము చేయించితిని. సాయంసంధ్యయైన తర్వాత నాటక

ప్రదర్శన మారంభమయ్యెను. యువరాజ భట్టారకులు కూడ నేతెంచియుండిరి. నాటక ప్రదర్శన మద్భుతముగ నడచుచుండెను. నిపుణిక సానుమతి పాత్ర ధరించియుండెను. ఆమె మనోహరముగు నంగిలత నాడు మాలతీకుసుమముల యభిరామమగు మాలవలె కమనీయముగ కనబడుచుండెను. ఆమె జడయందు వ్రేలాడుచుండిన యశోక వల్లవములు, చెవులలో గండస్థలమును తాకుచున్న కేసరములు గల శిరీష కుసుమములామె శోభను నూఱు రెట్లధికముగ నొనర్చుచుండెను. ఆమె యీ వేషముతో మత్తవారణి వెనుక నిలుచుండి యభినయమును జూచుచుండెను! కడపటి యంకమభినీతమగుచుండెను. నేనుకూడ నిపుణికయొద్దనే నిలుచుండి యభినయమును జూచుచుంటిని. జటాధారి యగు వటువు మారీచుని వేషము ధరించి రంగస్థలమునకు వచ్చి విచిత్రముగ ప్రవర్తింప నారంభించెను. ఉండియుండి యతడు ప్రేక్షకుల వైపునకు కన్నులు తెరచి చూచుటకు ప్రారంభించెను. ప్రేక్షకులతని యభినయమును మెచ్చుకొనుచుండిరో లేదో యని తెలిసికొనగోరుచు నతడు ఒకప్పుడు ప్రేక్షకులను మఱియొకప్పుడు వెనుకకు తిరిగి నేపథ్యమువైపునకును చూచుచుండెను. అట్లతడొక ముహూర్తకాలమైనను స్థిరముగ కూర్చుండలేకపోయెను. నేను శ్రమపడి చేసిన ప్రయత్నమంతయు మంటగలిసి పోవుచుండెను. ప్రేక్షకుల ముఖములపై చిఱునగ వంకురింపసాగినది. నేను వ్యాకులపడుచు, "నిపుణికా! చేసిన ప్రయత్నమంతయు మంటగలిసినదే!" యని అంటిని. నిపుణిక నన్ను చూచి క్షణకాలము చింతిల్లి

తర్వాత "ఏమియు చెడలేదు, నీవు సూరీమని పాత్రను ధరించుము. నే నితని సంగతి, చూచెదను, పొమ్ము." అని పలికి తాను సీతాకోక చిలుకవలె నాట్యము చేయుచు రంగ స్థలముమీదకు వెళ్ళెను. ఆమె తన వామహస్తమును కటి దేశముపై నుంచి చంచల గతిని ఉద్వర్త నృత్యముచే రంగ స్థలమును గలగల లాడించెను. జటాధారి యగు నా మూర్ఖపు వటువు లేచి నిలుచుండెను. నిపుణిక తన కుడి చేతితో నతని గడ్డమును పట్టుకొని, ప్రశ్నించు కంఠమున, "ప్రియుడా, నృత్యము చేయవా!" అని యనెను. ఒక్క క్షణములో నా దృశ్యమంతయు హాస్యరసభరితమయ్యెను. జటాధారి గంతులు వేయసాగెను. కాని నిపుణిక వాని గడ్డమును విడువలేదు. అతని ప్రతి భంగిమమును చూచినపుడెల్ల ఆమె యేదోయొక భావగర్భితమైన మాట పలుకుచు మనోహరముగ తాళము వేయుచుండెను. ఈ విచిత్ర ప్రహసనము చాల సేపటివఱకు జరుగుచుండెను, నిపుణిక తన కౌశలము చూపుచు పాపమా జటాధారిని ఒకసారి తన కాళ్ళపై బడునట్లు చేసి, మఱియొక సారి నడుము పట్టుకొని నాట్యమాడించి యింకొకసారి యతని తల వెంట్రుకలను రంగభూమిపై రుద్దునటుల చేయించి, యీ విధముగ రసాభాసమై చెడిపోయియున్న దృశ్యమున కొక ప్రహసన రూపమును గల్పించి తాను రంగ స్థలమునుండి వెడలిపోయెను. పందలకొలది ప్రేక్షకుల వికటాట్టహాసములచేతను వారి "భేష్! భళిరా!" యనెడి పలుకులచేతను రంగస్థలమంతయు నొక్కసారి కదలిపోయెను. యువరాజ భట్టారకులు సహృదయులయినందున పరిస్థితిని

చక్కగా నర్మముచేసికొనిరి. వారు తమ యమూల్యమగునుత్తరీయమును నిపుణికకు ప్రసాదించి యామెను గౌరవించిరి. ప్రేక్షకుల అట్టహాసమును పార్శ్వభాగమునగొని శాంతముమూర్తీభవించిన మారీచాశ్రమ దృశ్యము మఱింత రక్తిగట్టెను. నాడు నిపుణిక నా మానసమును గాపాడెను. ఆ మనోహరదృశ్యమును జ్ఞాపకమునకు తెచ్చుకొనియే నేను నిపుణిక తన నవ్వు నాపుకొనలేకపోయెను. నేను కూడ నవ్వునాపుకొనలేకపోతిని. పొట్టచెక్కలగునట్లు నవ్వుచు నేను "అవును నిపుణియా, తప్పు చేయునది నేను, దానిని సరిదిద్దు మార్గమును జూపునది నీవు!" అని యంటిని. చాలసేపటివఱకు ఆమె తన భావ తరంగములందు తేలియాడుచు తటాలునగంభీరవదనయై "నేను నవ్వులాటకు చెప్పుచుండుటలేదు. నేను నిజముగనే మార్గము నాలోచించుటకే వచ్చితిని. నా మాట వినుము" అనెను.

నిపుణిక గంభీరముగ నుండినను ఆమె కపోల పాలలికచ పుండరీకముల కాంతిని ధరించియుండెను. ఆమె చంచలములగు కన్నులలో పరిహాసము తొంగిచూచుచునేయుండెను. ఇంకను ఆమె చిరకొంగుచే ముఖమును కప్పుకొనియుండెను, ఆమె యధరములు కొంచెముగ నదరుచుండెను. ఆమె మధురమూర్తి శరశ్చంద్రికలే గడ్డకట్టి యున్నట్లును, క్షీరసాగరపు శోభయే యొకచో చేరినట్లును, అమృత కలశపు స్వచ్ఛతయే మూర్తి రూపము దాల్చినట్లును. చాల మోహనముగ కనబడుచుండెను. ఆమె తన కన్నులను వాల్చి ప్రతి మాటను తూచి తూచి పలుకుచున్నదా యన్నట్లు చాల నింపాదిగా మాటాడుచుండెను. ఆమె "భట్టిని స్థానేశ్వరము

వెళ్ళవచ్చును. కాని ఆమె యచట, నెవరి యధీనమున నుండ జాలదు. ఆమె స్వతంత్రరాజ్ఞ. మామె వెంటనే యుండును. నీవు లోరిక దేవుని ఒప్పించి వేయిమంది మల్లులను భట్టిని సేవకై నియోగింపజేయుము. ఆమె స్థాణ్వీశ్వరమునగూడ నొక స్వతంత్ర దేశపు రాణి తన దేశమున నున్నట్లేయుండును. ఈ భాగ్యహీనురాలు కూడ నామె వెంటనే యుండును. భట్టిని సేవయొక్క నీడను స్పృశించుటకు గూడ స్థాణ్వీశ్వరపు మహారాజాధిరాజుల కధికారముండజాలదు. వారు నిపుణియను స్థాణ్వీశ్వరపు గొడ్డవలలోనికి లాగినచో నచట నెత్తురు నదులై ప్రవహింపగలదు. మొదటి బలి కన్యాకుబ్జేశ్వరపు రాజసభా పండితుడగు బాణభట్టుడే యగును. భట్టూ! ఒక సాధారణ దాసకొఱకు నీకు నీ ప్రాణముల నొడ్డగల సాహసము గలదా!" అని యడుగుచు, ఆమె నా వైపునకు దృష్టి ప్రసరించెను. తర్వాత నామె కంఠస్థాయిని పెంచి, "విషయ లోలురకు శరణమొసగు కన్యాకుబ్జరాజు ఏ యపరాధమున నాకు మృత్యుదండన విధింప గోరుచున్నాడు! ఆ నా యపరాధము నాధారముగగొని యే యతడు, దేవపుత్రుడగు తువర మిళిందునితో మైత్రి నపేక్షించుచున్నాడే! నావంటి యసహాయలగు నబలలను దండించు నాతని కఠోర భుజ దండములు తన ప్రజను మ్లేచ్ఛవాహిని నుండి రక్షింపలేవా! ఆర్యా! ఈ నిర్వీర్యమగు రాజ తంత్రముతో దేవపుత్రుని సేన కలిసినచో నార్యావర్తము రక్త ప్లావితము గాకుండ నుండ గలుగునని నీకు నమ్మకమున్నదా! ఆర్యావర్తము నందలి సంఘమునకు పురుగు పట్టి

నది. దానిని సర్వనాశము నుండి యెవరును తప్పింప జాలరు. నాకు తెలియక అడుగుచున్నాను. సత్యము కొంచెమైనను పరిపూర్ణ సత్యమునకది భిన్నముగ నుండునా?" అని పలికి ప్రత్యుత్తరమునకై నావైపు జూచెను ఈ ప్రశ్న కేమి ప్రయోజనమో నా కర్థము కాలేదు. అయినను "నేను విన్నది సత్యమునకు విరోధియని యే" అని నేను సహజముగ పలికితిని. నిపుణికకు కొంత యూరట గలిగెను. ఆమె "ఆర్య! నీవు నాకు దేవతవు. నీవే నాకు సత్యము. నీ చెంత చాల కాలముండు భాగ్యము నాకు దక్కినది. నేనే పాపపు నడవడి వలన నా జీవితపు దారుణ దుఃఖాగ్నియందు తపించుచుంటిని. నీవే నాపై వొట్టుపెట్టుకొని నిజము చెప్పుము. స్త్రీ జన్మయెత్తుటయే యన్ని యనర్థములకు మూలకారణముగా నా? జాతీయ జీవితమునకు చెందిన బృహత్సత్య మీ లఘుసత్యమునకు భిన్నముగ నుండునా? బృహత్సత్యము పేర మిథ్యావంచనలు తాండవమాడుచుండుట లేదా? అట్టి సమయమున దేవపుత్రుని ప్రబలభుజదండము లీ సంఘమును, మహానాశగహ్వరమున బడకుండ నిల్పగలవు? మహాకాళి స్వేచ్ఛగా నీ దేవభూమిపై నిర్భయముగ నృత్యముచేయగలదని నేను మరీ మరీ చెప్పుచున్నాను. మహానాశమనెడి సుడిగాలియందంతయు దూదిపింజెవలె నెగిరిపోగలదు. తెలియరాని పాపములకు ప్రాయశ్చిత్త మసంభవము. అవమానింపబడిన యొక సాధారణ యువతి నిపుణిక. ఆమె సంఘముయొక్క నింద్యములగు తలంపులకు తన ప్రాణమును బలిగావించెను. ఈ వాణి యామె హృదయాగ్ని యతలగహ్వరమునుండి

వెడలుచున్నది. మీ రెండవ రానున్న ఘుంఘూంకారితము నడ్డగించుటకు వ్యర్థముగ ప్రయత్నించుచున్నారు. కాని ఆర్యా! ఒకమాటు నీవు చక్రవర్తుల భ్రూ విక్షేపములను లెక్కగొనక యీ బృహత్సత్యమును గొప్ప గొప్ప సింహాసనముల యొద్దకు జేర్చుము. ఆ సత్యముయొక్క స్వరము హీనమైనను సింహాసనారూఢుల కది వినబడినచో మహాకాళి క్రోధాగ్ని శమింపవచ్చును. ఆర్యా! హృదయస్పందనము లేని పిశాలమగు నీ దైన్యపుదిబ్బపై నయనాభిరామమగు నీ సామ్రాజ్యపు రథయాత్ర సాగుచున్నది. నే నీ దిబ్బలోని యల్పనేయున్నను. నేను స్వయముగ నాటించిన్న యగ్నిచే మండెడి దిబ్బనుకూడ మాడ్చి మసిచేయుటకు సహకర్తురాలిగ నన్ను గావింపుము. నేను నీ ఛాయాంతి నాశించుచున్నాను. నారీ జన్మము పొంది కేవలము నిందలపాలగుటయే జీవిత సారము గాదు. నీవే యొకప్పుడు నా కానంద జ్యోతిష్కణము నొసగితివి. నీవే నాకు తేజస్ఫులింగమును గూడ ప్రసాదింపుము!" అనెను.

నే నాశ్చర్యచకితుడనై యీ దీర్ఘోపన్యాసమును వినుచుంటిని. ఇది యెట్టి ప్రలాపము? స్నాయువుల దౌర్బల్యము వలన నీ మందభాగిని తిరిగి ప్రలాపించుచున్నదా? అది ప్రేలుడే యయినచో నేను ప్రథమముగ సత్యముగ నిట్టి ప్రలాపమును వినుచుంటిని. నా హృదయము చీల్చుకొని దాని గర్భమున "నిజముగనే లఘుసత్యము బృహత్సత్యము నకు భిన్నముగా నుండునా?" అను ప్రశ్న గంభీరముగ ప్రతి. ధ్వనించుచుండెను, కాని నేను కన్నులారం గాంచుచుండినది

కూత నదియేకదా ? సామాన్య ప్రజలే కార్యమును జేసినిందింప బడుచున్నారో దానినే చేయు గొప్పవారుమాత్రము సన్మానింపబడుచున్నారు! నిపుణికలో నెంత మార్పు వచ్చినది! ఆమె నేడు పరితాపాగ్నిచే మండుచున్న కాగడావలె నున్నది. ఈమె యేమి చేయగలదు ? ఒంటరిగా నేదనినైనను నాధిరింపగలదా ? సంఘమును నగ్ని ప్రతిదినము నెందరెందరినో యాహుతి గొనుచున్న మాట నిజమే ! కాని దీని నతిక్రమించు మార్గమేది ? స్త్రీని మించిన యమూల్యమగు రత్నము మఱొకటి లేదుగదా ? మఱి యట్టి స్త్రీ రత్నమును మించి మఱి యెవరి కట్టి దుర్దశపట్టినది. నిపుణిక నా వలన నేమి యాశించుచున్నది ? విశుద్ధమగు నారీ సహకారము లభింపనందున నే యనద్ధూతపాదుల తపస్సు అసంపూర్ణముగ నుండిపోయెను. నిపుణికకు పురుషుని కరావలంబనము లభింపనందువలన నామె త్యాగేచ్ఛ అపూర్ణముగ నుండిపోయినది. మఱి సత్యమేది ? నేను నిపుణిక కన్నులనుండి స్ఫులింగములు రాలియుచుండుట స్పష్టముగ జూచితిని. ఈమె కుటిల మనార్గభావనా ? నే నేమి ప్రత్యుత్తర మొసగుదునని యాలోచించుచుండగనంతలో నిపుణిక రెక్కలు నఱికిన పక్షివలె నా పాదములపై బడి పొరలినది. నేను "అయ్యో, అయ్యో" అని హాహాకారములు చేయసాగితిని. ఆ సమయమున పూజావేదికపై నున్న భట్టిని యీ కేకలు విని పరుగెత్తుకొని వచ్చినది.

నిపుణిక సంజ్ఞాశూన్యయై యుండియు నాపాదములను గట్టిగా పట్టుకొని యుండెను. అది గట్టిపట్టే ! నేను భట్టిని

చూచి భయముతో కంపించుచు లేచి నిలుచుటకు ప్రయత్నించితినిగాని నిపుణిక పట్టు గట్టిగా నున్నందువలన నేను నిలుచుట కంతరాయము కలిగినది. భట్టిని జాలిగొలుపు కంఠ స్వరమున "పట్టు విడిపించుకొనవలదు భట్టూ! ఆమె కందువలన శాంతి లభించుచుండవచ్చును." అని యనెను. నేను లేచుచున్న వానిని లేచుచున్నట్లే యుండిపోతిని. భట్టిని నేలమీద కూర్చుండి నిపుణిక తల వెండ్రుకలలో తన వ్రేళ్ళను చొనిపెను. కష్టముమీద నేనుకూడ నేలమీంద కూర్చుంటిని. నిపుణిక చేతులు మునుపటివలనే నాపాదములను గట్టిగ పట్టుకొని యుండినవి. నేను నిపుణిక యావేశ పూరితమగు మాటల సారాంశమును భట్టినికి తెలిపితిని. ఆమె మాటలాడక క్రిందికి వంగియున్న నిపుణిక నుదుటిని తన కిసలయ కోమలములగు కరతలములతో నొత్తుచుండెను. ఆమె విశాల నయనములనుండి కన్నీరు జారిపడుచుండెను. ఆమె కన్నీటిని చూచి నా హృదయము కరగిపోయెను, కన్నులలో నీరు తిరుగకుండునట్లు నే నేమి చేయుగలను! భట్టిని కోమల హృదయము వ్యథచే వ్యాకులపడకుండునటుల నే నేమి చెప్పవలెను! భట్టిని తన కొంగున గట్టిన యౌషధమును తీసి, సుకుమార భంగిని నిపుణిక కన్నులపైనను నుదుటిపైనను పూయసాగెను. కొంత యుపచారము చేసిన పిదప నిపుణిక కన్నులు తెరచి భట్టినిని చూచి భయముతో మెల్ల మెల్లగా, "అమ్మా! భట్టినీ! నీవు నన్నుం వదలిపెట్టవు గదా! నేను విషయులో లురకు శరణము నొసగు కన్యాకుబ్జేశ్వరునికి భయపడను." అనియనెను. భట్టిని మృదు స్వరమున మందలించుచు,

"ఛీ,ఛీ, సోదరీ! నిన్ను విడచి నేను బ్రతుకగలనా?" అని యనెను. పాలిపోయిన నిపుణిక గండస్థలము, కన్నీటి ధారలచే దడిసిపోయెను.

నిపుణిక మరలలేచి కూర్చుండెను. ఆమె యేదో మాటలాడ ప్రయత్నించెను. కాని భట్టిని యామెను వారించెను. చాలసేపటివఱకు నిపుణిక ప్రక్కననే తలవంచుకొని కూర్చుండి యుండెను. ఆమె తెల్లని కెంపుటుకలలో భట్టిని వ్రేళ్లు చిక్కుకొని యుండెను. నేను చాలసేపటివరకు ఆలోచనా పరంపరలలో చిక్కుకొని యుంటిని. అచ్చట కొంతసేపటి వఱకు నిశ్శబ్దముగ నుండెను.

తర్వాత నిపుణిక భట్టినితో "అమ్మా! నా యొడలంతయు మండుచున్నది. నా హృదయము భగ్గుమని మండుచున్నది. నేను మండిపోవ నభిలషించుచున్నాను. నా యంత్యకాల మాసన్నమైనది. భట్టుతో నన్నొకమాఱు మాటలాడనిండు." అని యనెను. భట్టిని తన వ్రేళ్ళతో నామె నోటినిమూసి ఆమెను మాటలాడకుండ జేసి, "అయితే ఒక్క వాక్యములో నీవు చెప్పవలసినదేదో చెప్పవలెను." అని యనెను. నిపుణిక నిరాశచే "అటులయిన నేనిప్పుడు మాటలాడను లెండు" అని యనెను. "అదే మంచిది." అనుచు భట్టిని యామెను ఇంటిలోనికి తీసికొనిపోయెను. నేను చింతాక్రాంతుడనై యచటనే కూర్చుండి యుంటిని.

అంతలో నొక వృద్ధ దాసివచ్చి 'ఆభీరరాజగు లోరిక దేవుడు నన్ను కలిసికొన కుతూహలపడు చున్నందున వెంటనే స్నానాదికములను నిర్వర్తించు కొమ్మని భట్టిని

యాదేశించినదని చెప్పెను. నేను వెంటనే లేచి వెళ్ళితిని. మధ్యాహ్నము కాకమునుపే యంశుమాలి తీవ్రకిరణములు భూమిపై కాగుచున్న వెండి యూచలవలె పడుచుండెను. మహాసరయూనదీతీరము చాలదూరమువఱకు వ్యాపించి యుండిన యిసుక తిన్నెలయందు దారుణమగు వేడిమి వ్యాపించి యుండెను. దూరమున నున్న యశ్వత్థ వృక్షముపై నుండి వినబడుచున్న యడవిపావురముల ఘూత్కారము తప్ప మఱియెక్కడనుండియు నే శబ్దము వినబడలేదు. దప్పిగొన్న తొండలు కాకిపెమళ్ళ మొదళ్ళను విడచి నీటిని వెదకుచు అనవసరముగ మాసిపోవుచుండెను. మహాసరయూనదీ ధార పలుచనిదై పాదరసపు రేఖవలె కనబడుచుండెను. ధూసరమగు నాకాశమండలము, తాండవ నృత్యముచే డస్సి యున్న ధూర్జటియొక్క భస్మావృతమగు జడవలె దిగంతము వఱకు వ్యాపించియుండెను. వాయుమండలపు ప్రతిపొర యందును ఝుంఝూమారుతముయొక్క పూర్వాభాసము స్తబ్ధమై నిలచియుండి విచిత్రమగు నా శంకను కలిగించుచుండెను. స్నానాదులను నిర్వర్తించుకొని నేను లోరికదేవుని సభ చేరుకొనుసరికి మధ్యాహ్న సమయము తెలుపు శంఖను పూరింపబడెను! లోరికదేవుడు మధ్యాహ్నము భోజనమైన పిమ్మట తన విశ్రాంతి గృహమున నన్ను కలిసికొనునని నాకు తెలియజేయబడెను.

నాటి అపరాహ్ణకాలమున నేను లోరికదేవుని కలసికొన్నపుడు నా యాశ్చర్యమునకు మేఱయే లేదు. లోరికదేవుని భవనమున విశాలబహిఃప్రకోష్ఠమునందు, శుకసారిక,

29

లావకత్తిత్రికి, కుక్కుట మయూరాది పక్షుల కలకలము వినబడుచుండుననియు, గోమయముచే నలుకబడిన ప్రాంగణమున కెదుటనున్న ద్వారముపై మాలతీమాల శోభించుచుండుననియు, ద్వారము ప్రక్కననుండు బలివేదికలపై రమణీయమగు సాలభంజిక లుంచబడియో లేక చెక్కబడియో యుండుననియు, శయనాగారమున తినిశ దేవదారుతోగాని, హరిచందనముతోగాని చేయబడిన మంచములు, మంగళకరమగు దంతపత్రములు గల నల్లని ప్రతి శయ్యక యుండుననియు, మంచము తలవైపున మధ్యభాగమందితని యిష్టదైవ ప్రతిమ యలంకరింపబడి యలరారుచుండుననియు, దగ్గఱనే యొక వేదికపై మాల్యచందనాది యుపలేపనములుంచబడి యుండుననియు, అతడు శిల్పప్రియుడైనచో గజదంతముపై వీణ తప్పక యుంచబడి యుండుననియు, దానిని వలయముగ చుట్టుకొని గోరంట పూలమాల వ్రేలాడుచుండుననియు, శయ్యకించుక దూరమున గాంధార దేశపు రత్నకంబళి పఱుపబడి యుండుననియు, సహృదయ, విట విదూషకుల మనోరంజనార్థమై తాంబూలము, అత్తరుబుడ్డీ, మారేడుబెరడు, మైనపుసబ్బు మున్నగునవి యుంచబడియుండుననియు నేను నా మనసునందు భావించియుంటిని. వాత్స్యాయనుడు వందలకొలది వత్సరములకు ముందు పాటలీపుత్ర నాగరికుల జీవనచర్యను జూచి, సూచించిన ఏర్పాటు నేడు భారతదేశమంతటను అభిజాత్యుల కాదర్శమై యుండెను. ఆర్యావర్తమందలి ధనికుల కోరిక లన్నియు ఈ యాదర్శము ననుసరించియుండును. కాని లోరికదేవుని విశ్రామాగారము సర్వథా భిన్నముగ నుండెను. రాతిగోడలలో గజదంతము

లకు బదులుగ నిసుపచీల లుండెను. వానిపై ధనుష్కాంస్య ముద్గరములుండెను. వీణ కాదుగదా దాని వాసనకూడ నచట లేదు. లోరికదేవుని సాధారణమగు మంచముపై కంబళి పఱువబడి యుండెను. తాంబూలము, అత్తరుబుడ్డీ, జూదపుపలక మున్నగునవి లేవు. కక్ష్యయంతయు అతని విశాలమై బలిష్ఠమై తీర్చిదిద్దిన దేహమునకు సంపూర్ణముగ సరిపోలు చుండెను. నాలుగుమూలల ధూపపువత్తులు వెలుగుచుండెను. మధ్యభాగమున గోవర్ధనమును ధరించుచుండిన బాలకృష్ణుని విగ్రహము విరాజిల్లుచుండెను. స్వామివారి పాదముల కడ కర్పూరదీపము వెలుగుచుండెను. ఆ కక్ష్యయందు మనోజ్ఞత సంపూర్ణముగ వెలయుచుండెను. కాని యుద్దేశపూర్వకముగ సౌకుమార్యమునకు తావు కల్పించలేదు. నన్ను చూడగనే లోరికదేవు డత్యాదరముతో లేచి నాకాసనము నిచ్చి, సమ్మానించి, దుర్లభగంధరాజ కుసుమముల స్తబకము నొక దానిని నాకు కానుకగ నిచ్చెను. తర్వాత నతడు తన మంచముమీద నాసీనుడయ్యెను.

ఉపోద్ఘాతముచే కాలమును వ్యర్థముగానింపక అతడు నన్ను జూచి, "భట్టూ! దేవపుత్రనందిని పరిచయము నాకు తెలుపక నీవు కన్యాకుబ్జేశ్వరుని కెందుకు తెలిపితివి?" అని యడిగెను. నేనుకూడ నుపోద్ఘాతము లేకయే "నేను భట్టిని యాజ్ఞానువర్తుడనగు సేవకుడను, ఆమె నిజవృత్తాంత మెవ్వరికిని నేను తెలుపకూడదని యామె యాజ్ఞ, నేను కన్యాకుబ్జేశ్వరునికి గూడ నామెను గుఱించి చెప్పలేదు. వారికి కృష్ణవర్ధన రాజకుమారులవలన నామె వృత్తాంతము తెలిసినది.

రాజకుమారులు భట్టిని గ్రహించి యిదివరకే యెఱిగియుండిరి, వారామెను గుర్తించు యెట్టుల నెరిసికొనిరో యను విషయము నే నిపుడు తమకు విన్నవింపజాలను." అని పలికితిని.

శ్లోకిక దేవుని ముడుచుకొని యున్న కనుబొమలు సహజముగ విచ్చిపోయెను. నుదిటిపై నున్న ధనురాకారము గల ముడుతలు తిన్నని రేఖలుగా మారినవి. గండ స్థలముపై బడియుండిన ముడుతలు మాయమైనవి. అతని కన్నులలో సహజమగు విశ్వాస భావము మరల కనబడెను. కొంచెము సేపాగి అతడు ఒడుదుడుకులు లేని కంఠస్వరమున, "చూడుము భట్టూ! నా నాడులలో గుప్త వంశపురాజుల యన్నముచే తయారయిన రక్తము ప్రవహించు చున్నది. నేను నా పదునెనిమిదవ యేటి నుండి గుప్తరాజుల సేన యందు సైనికుడనై యుండి, సింధు, కుభానదుల కట్టవైపు పఱకు సముద్రగుప్తుని గరుడ ధ్వజమును ఎగురునట్లు చేసితిని. ఇపుడు నావయసు అఱువది సంవత్సరములకు పైబడినది. ఈ ప్రౌఢావస్థయందు నా యన్న దాతలు బలహీనులగుట జూచి నిన్నటి కోమట్లను రాజాధి రాజులుగ నొప్పుకొందునని నీ వాశించు చున్నావా! అది యసంభవము. నే నొకరి యాశ్రయమును స్వీకరింప వలసినచో గుప్త వంశజుల యాజ్ఞయమే నాకు సమ్మతముగ నుండును. కన్యాకుబ్జ రాజును నేను చరణాద్రి దుర్గమునకు తూర్పు దిక్కున కెప్పటికిని రానియ్యను." అని, పలుకుచున్నపుడతని కన్నులలో రోషము ప్రకటితమగుచుండెను. కాని తన్ను తానతడు కుదుటబఱచుకొని "గిరివర్త్మమున కట్టువైపునుండి భయ

మును గొల్పు సమాచారము తెలిసినది. కన్యాకుబ్జపు నపుంసక శాసనము ఆ యాపదను తప్పింపజాలదు. దేవపుత్రుడగు తువరమిళింగుని మైత్రిని సంపాదించినంత మాత్రమున ధర్మభ్రష్టమైన శాసనము బలపడజాలదు. అయ్యో! నేడు గుప్తవంశమునందు బలవంతుడగు బాలకుడొకడుకూడా మిగిలి యుండలేదు గదా! స్కంధగుప్తునితో పాటు గుప్తరాజుల ప్రతాపానలము చల్లారిపోయినది. యోగ్యుడు యోగ్యుని చేరిననాడే శక్తి పుట్టుచున్నది భట్టూ, అయోగ్యుడగు రాజుతో మైత్రి చేసికొన్నంత మాత్రమున దేవపుత్రుడగు తువరమిళింగుడు శక్తిమంతుడగునని స్వప్నమునందు కూడ నమ్మవలదు. కూట నీతి నాకు తెలియదు. మీరు నానాశాస్త్రముల నభ్యసించి మీ బుద్ధిని తీక్ష్ణ మొనర్చుకొనినారు. కాని నాకట్టి యవకాశమే లభించలేదు. నేను గుఱ్ఱము వీపుమీదనే విశ్రమించితిని. యుద్ధ వాద్యముల మ్రోత మధ్యనే రాత్రిని గడిపితిని. నేను నీతి కుశలుడనను గర్వము నాకిసుమంత యైనను లేదు. నేను సాధారణమగు మాటను సూటిగ నర్థము చేసికొన గలను. సత్యము, అసత్యము-ఈ రెండు నెన్నటికిని కలియ జాలవు. ఆర్యావర్తమునందు సంఘమున నెన్నియో తరగతు లేర్పడినవి. ఇది భగవంతుడు చేసిన యేర్పాటు, కాదు. ఇది యసత్యము. గిరివర్త్మమున కావలి నుండి వచ్చు మ్లేచ్ఛవాహిని యిట్టి యసత్యమున కవకాశమిచ్చి యుండలేదు. నేను నా కన్నులారా చూచిన విషయమునే మీకు చెప్పుచున్నాను. ప్రబల ప్రతాపశాలురగు గుప్త నరపతులీ

సంఘము నందలి మిథ్యా భేదములతో నుదాత్త భావములను మేళవింప యత్నించిరి. అది తప్పు. గోవింద గుప్తుడీ రహస్యమును తెలిసికొని యుండెను. తువర మిళిందుడును కూడ నీ రహస్యమును తెలిసికొని యున్నాడు. కాని గుప్త వంశపు చక్రవర్తులు దీనిని గ్రహింప జాలరైరి. అందుచే వారు నశించిరి. జరుగ వలసినదే తుదకు జరిగినది. ఆర్య గోవింద గుప్తుని సలహా ననుసరించిరా నేని యాభీర సాహాని యుండెట్టి యంతస్తులను ఏర్పాటు చెయ్యలేరు. నా పదివేల మంది మల్లులందరు నొకే వర్గమునకు చెందినవారు. గుప్త రాజులు మ్లేచ్ఛుల సేనతో కలియుటకు వలసి వచ్చినపుడీ యాభీర సేనయే పనికి వచ్చెను. భట్టూ!, నేను నా యనుభవము మీద చెప్పిన దేమనగా, దేవపుత్రుని సైన్యముతో నెవరైనను మైత్రి సంపాదింప గలిగిన గుప్తుల యీ యాభీర సైన్యము మాత్రమే సంపాదింప గలరు. కన్యాకుబ్జపు సేన దేవపుత్రునికి భార స్వరూపము కాగలదు. భట్టూ! నేను చెప్పినది బోధపడుచున్నదా?" అని యడిగెను.

నేను వినయముతో తల నూపితిని. లోరిక దేవుడు తిరిగి "ఆర్యావర్తమంతయు రక్తముచే అద్దుపై జారుచుండు సమయ మాసన్నమైనది. కన్యాకుబ్జుల కుటిలనీతి యీ సమయమున నీ దేవభూమిని మహా నాశమునుండి రక్షింప జాలదు. నేను గర్వముచే నేదియు చెప్పుటలేదు. విశ్వకల్యాణము నాశించి మీకు హెచ్చరిక జేయుచున్నాను. భట్టినిని కన్యాకుబ్జపు మహీపతుల చేతులందెన్నటికిని విడిచి పెట్ట వలదు." అని చెప్పి నావైపు ప్రశ్నించు నట్లుగా

చూచెను. నేను సవినయముగా "ఆభీర రాజా! ఔదార్యముతో మీరొసగిన సలహా విస్పష్టమై యొప్పుచున్నది. అందులకై మీకు నేనెంతయు కృతజ్ఞుడను. నేను నా జీవితమంతయు తోక తెగిన యెద్దువలె స్వేచ్ఛగా గడిపితిని. నాకు కూటనీతిగాని యుద్ధ విగ్రహములుగాని తెలియవు. నేను ప్రవాహ వశమునను, పరిస్థితులను బట్టియు, రాజ్యతంత్రపు బెత్తులలో తగుల్కొంటిని. కాని నా చేతుల నుండి మృత్యువు కూడ భట్టినిని లాగుకొనజాలదని మాత్రము మీరు నమ్ముడు. భట్టినిని యెప్పుడును రాణివలె చూచెదను. మీరు నా యపరాధమును మన్నించినచో మీ యంతఃపురమున నామె స్వతంత్రురాలగు రాణివలె నున్నదని కూడ నేను చెప్ప సాహసించెదను" అని యంటిని. ఆభీరక దేవుడు నవ్వెను. "నీవు చాల అమాయకుడవని" ఆ నవ్వులోని అంతర్యము. కాని అతడేమియు మాటలాడలేదు. కొంతసేపటివరకు మౌనము దాల్చి తర్వాత నతడు "నేను పదివేలమంది మల్లులను భట్టిని సేవకై నియోగించితిని. ఆమె తన ఇచ్చవచ్చినట్లు వారిని నుపయోగించుకొనగలదు. నా రే దేవపుత్ర నందినిని వెంటనిడుకొని పురుషపురమునకు వెళ్ళవలెనని నా యభిలాష. ఈ విషయమున నాకు స్వార్థమేమియును లేదు. ఏదైన నున్నచో నది కేవలము గుప్తరాజుల శత్రువుల భుజబలములపై ఈ పవిత్రభూమిని రక్షించు భారముంచ కూడదనియే. నేను వారికి సంబంధించిన మరియే యితర కార్యములయందును జోక్యము కలుగజేసికొనదలచలేదు. వారు గుప్తచక్రవర్తుల యెడ తమ మాటను నిలుపుకొనలేక

పోయినారు. భట్టూ! నీవు న్యాయముగ నాలోచించి చూడుము. అందువలన విశ్వ కల్యాణము సిద్ధించునా, సిద్ధించదా ?" అని యనెను.

నేను నిజముగానే ఆలోచనలలో మునిగితిని. నేను కృష్ణవర్ధనుల కేమని ప్రత్యుత్తర మొసగగలను? కన్యాకుబ్జమును చీల్చుకొనుచు నింత సైన్యము వెడలుచుండ సంఘర్షణ జరుగకుండనుండుట సంభవమా? ఆ సంఘర్షణవలన మహానాశనమునకు మార్గము సులభతరముగాదా? అట్టిచో భట్టిని భవిష్యత్తు అంధకారమయమగునుగదా! లోరిక దేవుడు సరళమగు స్వభావము గలవాడే కాని మహారాజాధిరాజులను గుఱించి యతనికి దురభిప్రాయము గలిగినది. అంతేకాక అఱువది సంవత్సరములనుంగి యున్న వైర మంత సులభముగ చల్లారదు. మఱి యుపాయమేది?

నేను వినయముతో "భట్టిని యాజ్ఞను గైకొనుటకు నా కవకాశ మొసగుడు" అని యంటిని. లోరిక దేవుడు సంతోషముతో ననుమతి యొదగెను.

లోరిక దేవుని విశ్రామాగారమునుండి వెలుపలకి వచ్చునపుడు నా మనస్సు నెందెన్నియో యాలోచనలు కలిగెను. ఆర్యావర్తపు పవిత్రమగు దేవభూమి మనుష్యుల యస్థిపంజరములతో నిండి శ్మశానభూమిగా మాఱిపోగలదని నేను తలచితిని, ఈ మహానాశము నతిక్రమించు నస్త్రమును భగవంతుడు భాగ్యవశమున నాచేత నుంచినను దాని నుపయోగించు విధానమును నే నెఱుగ లేకపోతిని. నిపుణికను కలసికొనుట: స్త్రీ వేషమును ధరించి చిన్న రాచనగరునుండి భట్టినిని

రక్షించుట, అకస్మాత్తుగ భదంతులను అవధూతపాదులను కలిసికొనుట, కృష్ణవర్ధనులతో, పరిచయము కలుగుట, మున్నగు గత స్మృతులన్నియు నా కొక్కొక్కటిగ జ్ఞప్తికి రాసాగెను. ఇవి యన్నియు తొలుతనే ఆలోచింపబడి విధిచే నిర్దేశింపబడినవా యేమి? ఇన్ని సన్నివేశములు దైవనిర్ణయము ననే యొకచోట చేరగలిగినవి. ఇది యెంత విచిత్రమైన కలయిక! ఇదంతయు నిపుణుడగు కవిచే వ్రాయబడిన ఆఖ్యాయిక వలె కనబడుచున్నదే! అవధూతపాదులు మొదటినాడే నా యస్తిత్వము నంతటిని ఊపివైచి భట్టినియే నా దేవత యని చెప్పియుండెను. నేటి ఘటనాచక్రము 'సిద్ధి'నే 'సాధనము'గ మార్చియున్నది. నే నంధకారములో బడి యున్నట్లుంటిని. ఆశాజ్యోతి, నా కెచ్చటను కనబడ లేదు. కాని 'సిద్ధి'నే 'సాధన' మనుకొనుట పరిపక్వము గాని మనసు యొక్క కల్పనమాత్రమే. ఈ కల్పనను మనసునందు దృఢ పడనిచ్చుట ప్రమాదకరము. దీనివలన ప్రపంచమున కంతటికిని శుభము చేకూరవచ్చునుగాని నేను నాశనమగు దును. ఒకవైపు ఆర్యావర్తపు శ్రేయస్సు, మఱియొకవైపు సర్వనాశనము నున్నవి, వీనిలో దేనిని నేను కోరుకొందును! నా కవధూతపాదుల మాటలు జ్ఞాపకమునకు వచ్చెను. వారు విరతివజ్రులతో "చూడుము బాబూ, సత్యమెప్పుడు విభజింపబడ జాలదు. మా బౌద్ధ తత్త్వశాస్త్రజ్ఞులు దానిని "సంవృతి సత్యము" (లోకమునకు సంబంధించినది) అనియు, "పర మార్థ సత్యము" అనియు, ఈ రెండును ఒకదాని కొకటి విరుద్ధమైన వన్నట్లు విభజించుచు వంచన చేయుచుందురు.

సత్యము; నిజముగ నది సత్యమేమైనచో అది జగత్తున కంతకును సత్యమే. లోకమునకు సంబంధించిన సత్యమే పరమార్థమునకును సంబంధించిన సత్యము - త్రికాలములందు నది యబాధ్యము" అని సెలవిచ్చియుండిరి. అవధూత పాదుల వాక్యముల కర్థ మేమైయుండును? కరతలామలకము వలె నా కోక విషయము సుస్పష్టముగ కనబడుచుండెను. నేను నా సత్యమునే యాచరణలోనికి తీసికొనిరాగలను. నేను విశ్వశ్రేయస్సు నభిలషించినను దానిని నేను నాలో నిముడ్చుకొనజాలను. నేను భట్టినిని రాజకీయములందొక యాటబొమ్మనుగ కానియ్యను. భట్టిని నాకు రాజరాజేశ్వరి. ఆమె యెదుట మహారాజాధిరాజులగు శ్రీ హర్షదేవులెంత! ఆభీరరాజగు లోరికదేవుడెంత! నా కర్తవ్యము అకుంఠితమగు రాజరాజేశ్వరీ సేవ యొక్కటే! ప్రాణమున్నంతవరకు నే నెవరిని కూడ నా కర్తవ్యమున కడ్డుతగలనియ్యను. నే డాభీరరాజు పలికిన మాటలలో నాయీ కర్తవ్యమున కడ్డు తగులునట్టి దే దైనగలదా? లేదే! కృష్ణవర్ధనులు చెప్పిన దానిలో మాత్రము నాయీ కర్తవ్యమునకు విరుద్ధముగ నుండునట్టి దేదైన గలదా? అట్టి దేదియు కనబడదే! రాజకుమారులు "భట్టిని నే విధముగనైన నిచటికి గొని రమ్ము!" అని చెప్పియుండిరి. నేను భట్టినిని రాజరాజేశ్వరిని గావించి దీసికొని వెళ్ళెదను. భట్టిని సంజ్ఞామాత్రముచే తమ ప్రాణముల నర్పించివేయువారి, ఆభీరమల్లు లామె సేవకై యినియోగింపబడుదురనుకొందము - ఇందు నా కర్తవ్యమునకు విరుద్ధమైనదేమున్నది? భట్టిని సైన్యము కన్యాకుబ్జ

మును దాటి వెడలగలడు. దీని నడ్డగించువాడు నన్నైనను చంపును, లేదా నే నతనినైనను చంపుదును. నేను చని పోయిన తర్వాత భట్టిని యేమగును? ఛీ ఛీ, మూర్ఖుడ వగు బాణుడా! నిన్ను నీవు భట్టిని సంరక్షకుడవని యెంచుకొను చుంటివా? భట్టిని నీ జీవితమునకు 'సిద్ధి' వంటిది. ఆమె సేవకై ప్రాణముల నర్పించుటయే నీ యధికారము. నే నిట్టి యాలోచనలలో మునిగి వెళ్లుచుండ వెనుకనుండి నన్నెవరో గంభీరమగు కంఠస్వరమున "ఆర్యా, తమరు మమ్ములను మఱచియే పోయితిరి!" అని సంబోధించిరి.

వెనుకకు తిరిగి చూడగా మౌఖరీవంశపు వీరుడగు విగ్రహవర్మ నిలుచబడి యుండెను. శ్రద్ధాతిరేకముతో నతడు భూమికి శిరము నానించి వంగి ప్రణమిల్లెను. నేనతని నాశీర్వదించి అతనియొక్కయు అతని సైనికులయొక్కయు కుశలమును ప్రశ్నించితిని. తగు ప్రత్యుత్తర మొసగిన పిదప నతడు "ఆర్యా, పదివేల యాభీరమల్లుల సైన్యమును చూచి తమరు పదిమంది మౌఖరీవంశపు వీరుల నుపేక్ష చేయకూడదు. మేము రాజ్యశ్రీ మహారాణి యుంచిన సైనికులమనుట నిజమే. కాని మమ్ముల నెవరైన తిరస్కరించిన దానికి తగిన ప్రతీకారము మే మెఱుంగుదుము. మా సైనికులు మీ యాజ్ఞ నెదురుచూచుచు చాల కష్టముపై తమ్ముతా మాపుకొని యున్నారు. లేకుండిన ఆభీరరాజు కన్యాకుబ్జేశ్వరుని దుర్భాషలాడెనని మాకు తెలిసినవెంటనే యిచట రక్తము నదులై ప్రవహించి యుండెడిది. మేము మంత్రౌషధులచే రుద్ధవీర్యయగు కాలసర్పమువలె కాలము వెళ్ళబుచ్చు

చున్నాము. మీ యాజ్ఞయైనచో చంచల జిహ్వాలగు నీ పది సర్పములు భద్రేశ్వరపు గర్వోన్మత్తులగు సైనికులను కాటందగలవు.” అని పలికి విగ్రహవర్మ యొరనుండి తన వికరాల కరవాలమును బయటికి తీసెను.

నా నుదుటిపై స్వేదబిందువులు మెఱిసిపోయినవి. నేను విగ్రహవర్మను శాంతింపజేయు నుద్దేశించి “నరశ్రేష్ఠుడా! ఈ సమయమున చిన్న చిన్న విషయములయందు శక్తిని దుర్వినియోగము చేయుట యుచితము కాదు. నీవు మౌఖరీ వంశస్థులగురువగు ఆచార్య భర్వుపాదుల శపథ శప్తమైన లేఖను జపించియున్నావు కదా. దురంతమగు మ్లేచ్ఛవాహిని కొండకనుమల కటువైపు గుమిగూడుచున్నది. మీరు కన్యా కుబ్జేశ్వరుని యాజ్ఞచే రాజరాజేశ్వరియగు దేవపుత్రనందిని యొక్క సేవకై నియోగింపబడియున్నారు. మఱియొకచో మిమ్ములను నియమించునంతవఱకు మీ కర్తవ్య మామెను రక్షించుట తప్ప మఱియొక్కటి కాజాలదు. ఈ కార్యము నందాభీరసేన మీకు తోడ్పడుటకన్న మఱియేమి చేయ గలదు! వీరాగ్రేసరా! ఆర్యావర్తమును మహానాశమునుండి రక్షింపవలసి యున్నది. ఆ మహోద్దేశమునకై మీరు మిమ్ము లను బలిగా నింపుడు. బలియగుట కింతకంటె మంచి యవ కాశము లభింపదు” అని యంటిని. విగ్రహవర్మ వంగి నమస్కరించి తన కరవాలము వొరయందుంచి “ఆర్యా, అన్నిటికంటె గొప్ప యుద్దేశ్యము అన్నదాత మానరక్షణము! అయినను మీ యాదేశమే మాకర్తవ్యము. కా భట్టినిని సంరక్షించు భారము ముఖ్యముగ మాపైనున్నదని

మాత్రము మీరు మఱువకుడు." అని పలికి మఱియొకసారి నమస్కరించి వెడలిపోయెను.

అప్పటికాకాశమున పడమటి దిక్కున సాంధ్యరాగము లల్లుకొని యుండెను. ఒకటి రెండు పొడిమేఘములా త్రైలుపు నందు సంపూర్ణముగ మునిగియుండి ఆర్యావర్తమును రక్షించుటకై చేయబడు వేర్వేఱు ప్రయత్నము లీవిధము గనే రక్తధారల యాపాదమస్తకము మునిగి పోగలవని మహాకాలుడు తన యనంతిమమగు సంకేతముచే సూచింప గోరుచున్నాడా! యని తోచు చుండెను. మజ్జనము గావించుచున్న వృద్ధ భాస్కరుని కిరణము లొకటి రెండు దిశల కొసల వఱకు వ్యాపించి యుండి సద్యోరక్తస్నాతయై వచ్చి యున్న మహాకాళియొక్క నృత్యపు టూపులకు చెదరిన యామె పింగళ వర్ణపు జటలాయని భ్రమగొల్పు చుండెను. ఆకాశమంతయు ధూమాన్వితమగు నగ్నికుండమువలె నుండు చుండెను. చెట్లచిటారు కొమ్మలపై బడియున్న యెఱ్ఱని కాంతి భయంకరమగు సందేహమును కలిగించుచు మంటలకు భీతిజెంది పాఱిపోవుచున్న వనదేవతల పాదముల లాక్షా రసపు టెఱ్ఱదనమాయని భ్రాంతిగొలుపుచుండెను. భూమి నుండి యాకాశమువఱకు నలముకొనిన యీ యెఱ్ఱని కాంతి భయంకరమగు నే భవిష్యత్తును తెలుపుచున్నది? త్రిపుర భైరవి వ్యగ్రలీలలకు నేనే సాక్షీ భూతుడనై యుండగలనా? ఏమి జరుగనున్నదో గదా!

# పదునేడవ అధ్యాయము

నిపుణిక యారోగ్యమును జూచి నేను చాల వ్యాకుల పడితిని. నేనామెతో గడపిన యొక్కొక్క దినము నాకు జ్ఞప్తికి రాదొడగెను. మొదటిసారి ఆమె నా యొద్దకు వచ్చినప్పుడామె వయస్సు పదునారు సంవత్సరములు కూడ నిండి యుండదు. నా యెదుటకి వచ్చినపుడామె లజ్జాభయా క్రాంతయై నాతో మాటలాడలేదు సరికదా నన్ను కన్నెత్తి సరిగా చూడనైన చూడలేదు. ఆనాడామెతో నేనేమియు మాట లాడలేదు. ఆమె కాశ్రయ మొసగుటకు భయపడవలసి యుండియు నేనామె కాశ్రయమిచ్చితిని. పాపమామె చాల ఎక్కువగ విలపించుటచే నాకామెపై జాలి కలిగెను. నాడు రాత్రి యంతయు నేను బాగుగ నిదురింపలేదు. అది వసంత కాలపు మత్తును గొల్పుసమయము. తియ్యమామిడి గుత్తుల గుబాళులచే దిగంతము లన్నియు మత్తుగొనుచుండెను. తనివి తీర మధువును గ్రోలిన తుమ్మెద లెల్లెడలను విహరించు చుండెను. వృక్షలతాదులు పుష్పపల్లవముల భారముచే వంగియుండెను. మందముగ వీచుచున్న మలయమారుతపు తాకిళ్ళకు లతాగుల్మముల పుష్పస్తబకము లూగుచుండెను. మదించిన కోయిలలు జనుల మనసుల నకారణోత్సుక్యము చేకూర్చుచుండెను. వనప్రాంతమంతయు లతలయున్మాద నృత్యము చే నుల్లసితమగుచుండెను. ఇట్టి శోభాసాహార్ద్రభరమగు వాతావరణమున భయభ్రాంతమగు నిపుణిక ముఖము నాకు కనబడెను. ఆ దినమంతయు నేను చింతాకులితుడనై

యుంటిని. అయ్యో ఎంత చిన్న వయస్సు ! ఇట్టి సుకుమార వయసు నందెట్టి మర్మభేద్యమగు దుఃఖమిూ. చిగురుబోడిని నీ సాహసమున కొడిగట్టుటకు ప్రేరేపించెనోకదా ! మానవుని కిని సంఘమునకును గల సంబంధముయొక్క పునాది యందేదో యొక గొప్ప దోషమున్నదని నేనానాడు ప్రప్రథ మముగా గుర్తించితిని. ఆదోష మెట్టిదని యొంత యాలో చించినను నేనర్థము చేసికొనలేకుంటిని. అటుపిమ్మట కూడ నిపుణిక తనను గూర్చి కొన్ని విషయములనే చెప్పెను. ఆమె యనాయాసముగ నెన్ని విషయములను జెప్పుచుండెనో వానిని విని తృప్తిపడుటయే యుచితమని నేను భావించితిని. ఆనాటినుండియు నే నామెయెడనట్లే నడచుకొనుచుంటిని. మనసు ప్రసన్నముగనున్నపుడామె చెప్పువానిని విను చుందును. ఎక్కువగ నడుగుటవలన ప్రయోజనమేమియు నుండదు, దానివలన సిద్ధించునదియు అంతకంటె నేమియు నుండదు. స్త్రీల దుఃఖములు చాలగంభీరమైన వగుటచే వారు తమ దుఃఖముల పదియవ వంతునుగూడ చెప్పజాలరని కరుణాపూరితములగు సంఘటనలనుండి నేను తెలిసికొన జాలి తిని. వారియెడ సానుభూతి చూపినచో వారిహృదయావేద నలో నొక్కింత తెలిసికొన నవకాశము కలుగును. నిన్న నిపుణిక నాతో "ఆర్యా ! నేనే పాపము చేయుటచే నాజీవిత కాలమంతయు ప్రచండమగు నగ్నికుండమున దగ్ధమగు చుంటిని ? స్త్రీ నగుటయే నా యీ దుర్దశకు హేతువు కాదా ! మీరు నాపై నొట్టుబెట్టుకొని సత్యమును పలుకుడు" అనెను. ఈ మాటలలో నెంతమర్మభేదకమగు దుఃఖమిమిడి

యున్నదో నేనెఱుగుదును. సంఘముచేతను, కుటుంబము చేతను పూజలు పొందుటకు తగిన గుణములెన్నియో నిపుణిక యందున్నవి. కాని ఆమె పూజింపబడలేదు. ఇన్ని దినములుగ నేనామెవెంట నున్నాను. కాని నేనామె శీలమునందేకళంకమును జూడలేదు. ఆమె మోహనాకారము గలదే, నవ్వు మొగముగలదే, వినోద స్వభావముగలదే, కృతజ్ఞత గలదే, కాని యివి యన్నియు దోషములా? దోషమింకేదో వస్తువునందున్నదనియు, అదే సద్గుణముల నన్నింటిని దుర్గుణములని భావించుచున్నదనియు నా హృదయము చెప్పుచున్నది. ఆ వస్తువేది? నిజముగ సంఘమునందు అసత్యము సత్యమునుండి ప్రవేశించియున్నది. నిపుణికయందలి సేవాభావమును చూచి నా కాశ్చర్యము గలుగుచుండును. ఆమె యెన్నోవిధముల నాకెంతయో సేవచేసెను. నే నామె ఋణమును జన్మ జన్మాంతరమున గూడ తీర్చుకొనజాలను. నాపై నామెకు మోహముండెననియు ఆలోచింపక నవ్విన నా నవ్వు ఆ మోహమును నాశము గావించినదని ఆమెయే నాకు చెప్పెను. నిపుణిక వంటి సేవాపరాయణురాలు, చారుస్మిత, వినోద స్వభావముగల లలనయెడ శ్రద్ధాసక్తులు చూపజాలని పురుషుడు రాతిబొమ్మకంటె నెక్కువ విలువ గలవాడు కాజాలడు. నిపుణిక యేనాడు 'నీవు జడుడవు' అని యన్ననెనో నాడామె మోహము పూర్తిగ నశించియుండెనా? నాయెడ నామెకున్న యనురాగమును ఆమె యెప్పుడును వ్యక్తము చేయలేదు. కాని ఆమె ప్రతి భావభంగిమమునను ఆమె సేవలయందును, మౌనమగు నుల్లాస మొకటి యుండి

యామె ప్రతి కార్యమునందేదో భావము దాగుకొనియున్న దని స్పష్టముగ తెలుపుచుండెను. నేడు కూడ నా భావమట్లే యున్నది. దాని పైభాగమున నున్న నురుగు మాత్రము తొలగిపోయినది. నేడు కూడ నామె హృదయమునందొక మూల నిశ్చలముగ నున్న యొక దేవుడు ఆమె సమానముగ నన్ను పూజించుటచే, తృప్తిజెందుచున్నాడు. నిపుణికను చూచినపుడు నా మనస్సు భావతరంగములచే నుద్రిక్తము కాలేదని చెప్పుట యసత్యమగును. నా మనసునందున్న యామె ప్రతిమను నే నెంతగ నారాధించుచున్నానో ఆ సంగతి అంతర్యామియే యెఱుగును. కాని నేను నా హద్దు నెఱుగుదును. నన్ను నే నదుపులో నుంచుకొను శక్తి భగవంతుడు నా కొసగియున్నాడు. పాపము నిపుణిక దుఃఖాగ్నియందు దగ్ధమగుచు తన జీవితమునంతయు గడపెను. ఆమెకు నేనేమి సేవ చేయగలిగితిని? నా ప్రాణసంరక్షణకై నేడామె సమ్మోహన మనెడు బలివేదికపై తన్ను తాను బలి యొనర్చుకొనినది. తనకు నాపై మునుపుగల యనురాగమును గుఱించి ఆమె భట్టినికి తెలిపియుండ వచ్చును. లేకున్న 'నిపుణిక పట్టునుండి పాపమునను విడిపించుకొనవలదు. ఆమెకు శాంతి లభించుచుండవచ్చు'నని భట్టిని యేల అనును? ఛీ, ఛీ! యెంత లజ్జాకరమగు విషయము! నిపుణిక మోహమింకను తొలగిపోలేదని నా మనస్సు నేడును చెప్పుచున్నది. ఏ మూలనో యొక యగ్నికణమింకను ప్రజ్వరిల్లుచునే యున్నది! మఱి నేనో? నన్ను నేను పరిశీలించి చూచుకొన్నప్పుడు నా పూజారాధన గొడ్డుబోయిన

దనియు, నిందు ఫలించిన లేక పుష్పించిన చిహ్నముకూడ లేదనియు కరతలామలకమగుచున్నది. ప్రతి కర్తవ్యమునకు మనసునందొక యాధారముండును. కొందఱు యశమును కోరియు, మఱికొందఱు ధనము నాశించియు, నింకను కొందఱు భక్తికొఱకును తమ కర్తవ్యమును నిర్ధారణ చేసికొనుచుందురు. నేను నా నాటకమండలి నేల భిన్నము గావించితిని? నేనాఱు సంవత్సరములనుండి యేల దేశద్రిమ్మరినై సంచరించుచుంటిని? నా యీ పనులకు మనసునందేదైన నాధారము గలదా?' నా మనసునందు కూడ నిపుణికపై మోహముండెనా? "నేను పొగరాజుకొనుచుండుట పూర్తియైనది. నే నింక మండిపోవుదు"నని నిపుణిక యన్నపు డామె చిత్త మెంతయు తిక్తమైయుండెనో కదా! అప్పటినుండి భట్టిని యేదో భయముచే వ్యాకులపడుచునే యున్నది. కన్నీరింకిన యామె కన్నులు నా శక్తినంతయు కరగించివేయుచున్నవి. నే నిచటికి వచ్చి మూడునాళ్ళయినది. ఈ మూడునాళ్ళలో నే నే నెన్ని విషయములు తెలిసికొనుచున్నాను! సౌరభహ్రదము వద్దనున్న శైవసిద్ధాయతనమున సేవచేసిన సమ్మోహన ప్రభావమున గలిగిన బాధలన్నియు నివారించునని తాను విన్నట్లు భట్టిని కాతరస్వరమున నాకు జెప్పియుండెను. అవధూతపాదు లొసగిన యౌషధముపై నమ్మకముంచుట మంచిదని నే నన్నప్పు డామె కన్నులనుండి యశ్రుబిందువులు జారెను. అందువలన నేను మాఱుపలుకక నిపుణికను సౌరభహ్రదమునకు గొంపోవుదునని యామెకు ఊరట గలిగించితిని. భట్టిని కన్ను

లలో కన్నీరు చూచినపుడు నా హృదయము వక్కలై, పెదవులెండి, నదురు చెమర్చి శ్వాస సరిగా నాడకుండ నిలచి పోవును. అహా!. నే నెంత అవశుడనైతిని!

నేను భట్టినిలో కూడ నొక మార్పు గమనించు చున్నాను. జరుగగూడనిదేదో జరుగనున్నదను భయము ఆమె హృదయము నూపివేసినది! ఆమె హృదయవేదన పైకి బొత్తిగా నగపడుటలేదు! కాని యామె ప్రతి కార్యమునం దొక విధమగు పరధ్యానము స్పష్టమగుచుండెను. సహజముగ క్రమబద్ధమగు నామె మనోవ్యాపారముల నతి కట్టు విచార మెద్దియో ఆమె చిత్తమున నాగియుండనోపును. అది ఝంఝామారుతమువలె మనః ప్రకృతిని సంక్షోభింప జేయుచుండెను. నాతో నిపుణికవిషయమై చెప్పుటకు వచ్చి యున్నపు డామె తన వక్తవ్యమునే మఱచినట్లు, కొంతసేపు రెప్ప వాల్చక నా వైపు చూచుచుండెను, భట్టిని యింతసేపు శూన్యదృష్టుల బఱపుచుండుట నే నింతవఱకు చూచి యుండలేదు. నే నామె వక్తవ్యము వినగోరినపుడు గాఢ నిద్రయందుండి మేల్కొన్నదానివలె నామె యుక్కిఱి బిక్కిఱి యయ్యెను. ఆ సమయమున నామె శోభ యెంతో మనోహరముగ నుండెను! తనకు తామే జారిన కేశముల మధ్య నున్న ఆర్ద్రార్ద్ర ముఖబింబము శైవాల సమూహముచే చుట్టుకొనబడి తుంపరలచే తడిసిన శతపత్రమువలె మనోహర ముగ నుండెను. కాని వ్యాకులపడుచుండుటచే పట్టుదప్పిన యామె భ్రూలతలు మనోభవుని భగ్నచాపమువలె భీషణ మనోహరములై యొప్పుచుండెను. పాటల కుసుమములవంటి

యామె యెట్టుని పెదవు లెండిపోయి నా మనసునందొక విచిత్రమగు యాశంకాభావమ్మును రేకెత్తించుచుండెను. ఆమె కపోలపాలియం దుల్లాసముగాని, వికాసముగాని చురుకుదనముగాని కనబడక బాహ్యవికారములన్నియు నంతర్వ్యాప్తములైనట్లును హృదయవికారము లన్నియు మఱి యొకచో కేంద్రీభూతమైనట్లును స్ఫురించెను. ఆ శోభాసరో వరమున తరంగములు లేవు; చంచలత్వము లేదు; ఉపరితల మున మాత్రము గాంభీర్య స్థైర్యములు కనబడుచుండెను! అయ్యో! పాప మామె హృదయము నే దుఃఖ మింతగ గ్రుంగదీయుచున్నదో కదా!

సౌరభహ్రదము (ఉత్తర ప్రదేశమున బలియాజిల్లా లోని 'సురహా' సరస్సుగా నుండవచ్చును) భద్రేశ్వర దుర్గ మున కెంతో దూరము లేదు. భట్టిని కోరికను తెలిసికొని ఆభీర సామంతుడు నిపుణికకొక పల్లకీ, నాకొక యశ్వమును నేర్పాటుచేసి మావెంట కొందఱు విశ్వాస పాత్రులగు నను చరులను కూడ నంపెను.

జాము ప్రొద్దెక్కునరికి మేమా సరోవరము చేరితిమి. రమణీయమగు నా సరోవరమును చూడగనే నిపుణికకు చాల సంతోషము కలిగెను. ఆ సరస్సును చూడగా నాకును మన శ్శాంతి కలిగెను. ఆ సరస్సు ప్రళయ కాలమున దిశాసంఘులు సడలినపుడు ఆకాశమే పృథ్విపై వెల్లకిలపడి యీ విధముగ మారెనా, లేక ఆదివరాహుని దంతములచే నుద్ధరింప బడిన ధరిత్రి రంధ్రము నీటితో నిండి యీ విశాలమగు

సరస్సుగా నూతెనా యున్నట్లుండెను. తూర్పు నుండి పడమటి దిక్కు వఱకు వ్యాపించి యుండిన సౌరభ హ్రదమునకు సాటి యీసౌరభ హ్రదమే. తీవ్రమగు మంటలను గ్రక్కుచుండు నా గ్రీష్మ కాలమునందు గూడ నా సరోవరమున కుముదకువలయ కల్హారములు వికసించి యుండి హృదయ తాప శమనము చేయునట్టి కాంతుల నీనుచుండెను. వికసించిన పుండరీకముల మధు బిందువులు నీటిపై బడి వ్యాపించి నెమలి యీకలయందు చంద్రాకృతిగనుండు చిహ్నములవలె సరోవరపు టుపరితల మంతయు ననురంజితమగు చుండెను. తుమ్మెదల సమూహ మనెడి యాచ్ఛాదనముచే పరిమళ భరితములగు పద్మములు కప్పబడుచుండెను. పద్మముల పూదేనెను గ్రోలి మత్తిల్లిన కలి హంసల కలవరముచే సరోవరము ముఖరిత మగుచుండ, మత్తిల్లిన సారసముల మధుర క్రేంకారములచే వాయు మండలము చిల్లులు పడుచుండెను. అనేకములగు జలచరముల సంచారముచే నందలి వీచికలు వాచాలములగు చుండెను. వాయు వీచికలచే నాలోడిత మైన సరోవర తరంగములు పైకి లేచి జారిపడుచుండ హాని నుండి నీటి తుంపరలు చాల దూరము వఱకు వెదజల్లబడి యచట వర్షాకాలపు దృశ్యము గోచరమగు చుండెను. హ్రద మంతయు సౌరభ మయమై స్నానార్థమై యందు దిగిన వన దేవతల కేశభరమున ముడుచుకొన్న పుష్ప సౌరభమే యింత యానందము కల్గించు చున్నదా యని అప్పుడప్పుడు భ్రమ గలుగు చుండెను. తెల్ల తామరల మధ్య తెల్లని కల

హంసలు కలిసి తిరుగుచుండి తమ ప్రియురాండ్రను తమ యొద్దకు పిలుచుచు కేకరింతలు పెట్టినపుడే తప్ప అచ్ఛోద నది యున్నదని అనుమానించుటకు కూడ వీలు లేకుండెను. పచ్చని కేసరములు సరోవరము నంతయు కప్పి కమనీయ మగు శోభను సంపాదించుచు, ఛాయా రూపమున నవత రించిన చంద్రమండలపు తరంగ ధౌతమగు అమృత ధవళ వర్ణమా యని భ్రమగొల్పు చుండెను. ఆ సరస్సు గట్టున నుండు వృక్షపల్లవ పుటముల గాలిచే వీచబడిన సరోవర తరంగములు, జలదేవతల యదృశ్య శిశువులు జలమున లీలా విలాసముగ నీదు చున్నారా యన్నట్లు అడుకొను చుండెను. * ఈ రమణీయమగు సరోవరమును చూచిన యుత్కంఠి తుని చిత్తము విశ్రాంతి నొందును; విరహాతురుని హృద యము చల్లబడును; ఉన్మత్తుని బుద్ధి నిర్మలమగును; విసిగి యున్న వాని చిత్తమునకు శాంతి చేకూరును. దూరదూరము వఱకు వ్యాపించియున్న అడవి పనసలగుబుర్లు, అడవి రేగు గుల్మములు, చంద్ర చెట్లగుబుర్లు, చింత చెట్ల గుంపులు నా సరోవరపు శోభ నధికము చేయుచుండెను. పడమటి దిక్కు నుండి వీచుచుండిన వేడిగాలి అగ్గిని కురిపించుచు, మల్లో కము లందున్న తేమను పీల్చుటకు సిద్ధమై, దావానలము కన్న ప్రచండమై, వన పంక్తుల నల్లదనమును భస్మము చేయుచుండ, భయంకరములగు సుడిగాల్పులచే నెగురగొట్ట బడిన ధూళిచే నాకాశమంతయు ధూసరితమగుచుండ, ప్రచండ మార్తాండ ఖరకిరణజాలము ధరిత్రిపై నున్న పచ్చ

* చూ: కాదంబరీ కథాముఖము నందలి పంపా సరోవరపువర్ణన.

దనమును హరించుటకు సిద్ధమైయుండ, సౌరభప్రవాహము తన పరిసరములలో నున్న వనములను వృక్షములను నల్లగ మిసిమిసి లాడునట్లు చేయుచుండెను. ఇచట నాకసము శరత్కాలపు మేఘరహితమగు నభోమండలమును జ్ఞప్తికి తెచ్చుచుండెను. ఉత్తప్తమగు పశ్చిమ పవనము పెంపుడుపులివలె తన స్వభావమునే మఱచియుండెను. ఏపుణెకకీ శోభ యెంతో మనోహరముగ గనబడెను. ఆమె శివివితీర మత్తును గొలుపు ఈ మాధుర్యమును గ్రోలెను.

స్నానము చేసిన అనంతర మేము శైవసిద్ధాయతనము వైపునకు వెళ్ళినపుడు ప్రపాతశీకర సిక్తమగు వాయువు మా మనఃప్రాణములను శీతల మొనర్చుచుండెను. ఒక క్షణము సేపు మేము కైలాసపర్వతముపై నుంటిమా యను భ్రమ గలిగినది. ఆహా! కైలాసపర్వతపు సెలయేటి నీటి తుంపురుల నాత్మవశము చేసికొన్నట్టియు, భూర్జపత్రములను రాల్చివేసినట్టియు, నందికేశ్వరుని రోమంథఫేన స్పర్శచే ధన్యతను బొందినదియు, హరజటావిహారిణి యగు మందాకినీ భగవతీ తీర్థమును పానముచేసినదియు, పార్వతీదేవి కర్ణ పల్లవములను కదలించినదియు, రుద్రాక్ష పుష్ప పరాగముచే సువాసన నొందినదియు, సురపొన్న పల్లవములను ఊచి మహాదేవుని బడలికను పోగొట్టినదియు నగు పవనమిదియేనా? 'ఈ శైవ సిద్ధాయతనమునందు జనుల రాకపోకలు చాల నరుదుగ నున్నట్లుండెను. మరకతమువంటి పచ్చదనము గలిగి చాల దూరము వ్యాపించినట్టిదియు, మనోజ్ఞములగు హారీతపక్షుల

కలస్వనములచే రమణీయముగ నొప్పుచున్నట్టియు, తూలుచున్న భ్రమరముల పదాఘాతములచే శిథిలములైన మొగ్గలు కలిగినదియు, నేడును సహకార పల్లవములను కొఱుకుచున్న మదించిన కోయిలలు గలిగినదియు, తుమ్మెదల రొదచే ధ్వనిమయమైనదియు, మరీచాంకురములను నిర్భయముగ రుచిచూచుచుండు తరుణ చకోరపక్షులు గలిగినదియు, అందలి సంపెంగపూవుల కేసరపరాగముచే పసుపుపచ్చగ గావింపబడిన తిత్తిరి పక్షులు గలదియు ఫలభారముచే వంగియున్న దానిమ్మచెట్ల గూళ్ళయందు క్రీడా కలహములలో మునిగియున్న ఊరపిచ్చుకల జంటలు గలదియు, ఒకదానియందొకటి తగులుకొనిన తమ చిన్న రెక్కలను విదలించి కుసుమపరాగమును రాల్చు. అడవి పావురములు గలిగినట్టియు, శుకశారికలచే కొఱికివేయబడి వనస్థలినంతయు సౌరభముచే నింపుచున్న పండ్ల బెరడులు గలిగినట్టియు తమ రెక్కలను విదలించి పుష్పస్తబకములను నలువైపుల వెదజల్లునట్టి మదించిన తరుణ పారావతములు గలిగినదియు, మధుర మనోహర శోభకు పుట్టినిల్లునగు నిచ్చటి వనరాజికి మనుష్యుల పరిచయ మంతగా లేదనిపించుచుండెను. త్రిశూలపాణియగు పరమేశ్వరుడు తన నివాసమున కెట్టి యభిరామమగు, వనము నేర్పఱచుకొని యున్నాడు! నిపుణికనే డమితానందముతో నిండి గాలిలో తేలి యాడుచు బోవుచుండెను. ఆమె జీవితాశయము నేడు నెరవేరినదాయన్నట్లుండెను. సరోవర తటమునుండి సిద్ధాయతనమువఱకు వ్యాపించి యుండిన మనోజ్ఞమగు హరితతృణశాద్వలాస్తరణమునుగాంచి యచటనే కూర్చుండి పోదమను కోరిక సహజముగ గలుగు

చుండును. కడు ప్రయాసతో మేము మా యభిప్రాయ నాపు కొంటిమి. మొదట శూలపాణియగు భగవంతుని సందర్శించి ప్రదక్షిణము గావించి పిమ్మట నితర కార్యములను చూడ దలచి మేము తిన్నగ దేవాలయమునకు వెళ్ళితిమి. అచ్చట నాలుగు స్తంభములపై స్ఫటిక శిలలతో నిర్మింపబడిన మంటపముండెను. అందు ముల్లోకములకు గురువగు మహాదేవుని ముక్తాధవళ శిలా నిర్మితమగు చతుర్ముఖ లింగ మొకటి యుండెను. నిపుణిక భక్తి గద్గదయై యపుడే కోసి తెచ్చిన పదునొకండు [illegible]పత్రములా దివ్యమూర్తి పదతలముల నిడి ప్రణమిల్లినపుడు, మదనవిరహ పీడితయగు రతీదేవియే ముక్కంటి కోపాగ్నిని చల్లార్పుటకై యచట ప్రణమిల్లినదా యున్నట్లుండెను. ఆమె రోమ రోమమునుండి కృతజ్ఞతా కాంతులు వెలువడుచుండెను. మహాదేవుని కర్పించిన జలకణములు స్రవించుచుండిన కమలములను జూచినపుడు నా మనసు కరగిపోయెను. అవి పైభాగమున [illegible]చేయబడిన చంద్రఖండములవలెను, ఆనందాతిరేకముతో తాండవము చేయుచున్న ధూర్జటి వికటాట్టహాసపు చిన్న చిన్న యవయవములవలెను, తాండవముచే విధ్వంసమైన వాసుకి పడగ తునుకలవలెను, పాంచజన్యశంఖపు సహోదరులవలెను, క్షీరసాగరపు [illegible]యపద్మములవలెను, ఐరావతముచే నర్పింపబడిన మౌక్తిక కిరీటమువలెను, ఆ మహాదేవుని ప్రతిమాశోభను వర్ధిల్లజేయుచుండెను. ఆ మూర్తి యెదుట మోకరిల్లిన నిపుణిక హృదయమునందు మందాకినీ ప్రవాహమువలె వందలాది పవిత్ర భావతరంగములుండెను. మహా

దేవునికి ప్రణామిల్లినపుడు. నేనా పవిత్రతామూర్తియు, భక్తి స్రోతస్వినియు శ్రద్ధానిర్ఘరిణియు అనురాగఖనియు, సేవకు ఊటయునైన నిపుణికకు మనస్సునందే శ్రద్ధాంజలిని ఘటింప కుండ నుండలేకపోతిని. ప్రదక్షిణము గావించిన పిదప బహిర్ద్వారముకడ నిపుణిక మఱియొకసారి యలసినదాని వలెను, స్రబ్ధురాలివలెను, తన్ను తాను మఱచినదానివలెను ఆగిపోయెను. ఆమె కంఠము రుద్ధమై, కన్నులు బాష్పపూరితములై ముఖము రోమాంచితమై యుండెను. చాలసేపటివఱ కామె శివలింగమును కృతజ్ఞతాభరములగు కన్నులతో చూచుచుండి తర్వాత మెలమెల్లగ నా యొద్దకు వచ్చెను. నేనుకూడ కడపటిసారి శివునికి ప్రణామ మాచరించి సరోవర తీరమునొద్దకు బయలుదేరితిని. సిద్ధాయతనమున కనతి దూరమున విశాలమగు వకుళవృక్ష మొకటి యుండెను. మే మిరువుర మా వృక్షము క్రింద కొంతసేపు కూర్చుంటిమి.

చాలసేపటివఱకు మాటాడక కూర్చుండిన పిదప నిపుణికయే మౌనభంగము గావించుచు "ఆర్యా, నేడు నా జన్మ జన్మాంతరములు కృతార్థములైనట్లు నాకు తోచు చున్నది. నా హృదయజ్వాల నేడు శాంతించినట్లు స్ఫురించు చున్నది. నా జన్మ నిరర్థకము గాదని నీ వెన్నోసార్లు చెప్పి యుంటివి. దాని నినాడు స్పష్టముగ తెలిసికొన్నట్లు నేను ముందెన్నడును తెలిసికొనియుండలేదు. అల్లదిగో! దూరమున నచట మరకత పత్రములలో నుంచిన శంఖపు చిప్ప వలె శ్యామరాసులలో కదలక మెదలక నిదురించుచున్న బలాకపంక్తిని చూచుచున్నావు కదా! నేడు నామనస్సుకూడ

నటులనే, నిశ్చలముగ, నిర్మలముగ, నిర్వికారముగ నున్నది” అనెను. నేను ప్రసన్నుడనై “నిఉనియా, నాకు చాల సంతోషమైనది. నీ మనశ్శాంతిని జూచి యూరట చెందితిని” అని యంటిని. నిపుణిక కన్నులలో క్షణకాలము వినోదరేఖ మెఱసెను. ఆమె “భట్టూ! నీ వప్రసన్నుడవై యుండవలసినది. నా మాట విని నీవు ఖిన్నుడవై యుండినచో నా మనస్సు మఱింత కల్మషరహితమై యుండి యుండును క్షణములో నిపుణిక విలాసవతివలె మాఱె యామె నిరుపమానములగు నేత్రములు మందహాసమున మునిగిపోయెను. నే నామె మాటలలోని అంతర్యము నర్థము చేసికొని” నిఉనియా, ఇన్ని రోజులు నా దుఃఖము నీ మనోవికారముల నణచగలిగెనా? నేను సుఖితుడనగుటవలన వచ్చునది లేదు, పోవునది లేదు!” అని యంటిని. నిపుణిక పాలిపోయిన కపోలములు అనురాగదీప్తిచే మెఱసిపోయెను. చిలిపితన మెఱుగు కన్నులలో ప్రేమ వికారముదయించెను; నుదురు చెమర్చెను. ఆమె యొకమాఱు నన్ను చూచి కన్నులు వాల్చుకొనెను. కొంతసేపైనతర్వాత బొంగురుబోయిన కంఠస్వరమున నామె “ఆర్యా, మీ ఖిన్నత్వము నా కొక నిధివలె నున్నది. ఖిన్నుడవై యున్న నిన్ను జూచినపుడెల్ల నా జన్మము సార్థకమైనదని నేను తలంచుచుంటిని. నీ వీ వాసన లేని పువ్వును నీ చరణముల చేరుటకయోగ్యముకాదని తలచితివి. నాటి రాత్రి నీ నవ్వు నా హృదయమును పటాపంచలు గావించి యుండెనుగాని అది నాతప్పు. నీవు నాటకమండలిని ఎత్తివేసి నా మనోవికారము

లను దృఢపఱచితిని. అయ్యో! నే నెంత దుర్లభమగు వస్తువు నాశించియుంటిని! నేను దానిని బొందుట కర్హత లేనిదానను. ఈ మూసంవత్సరములూ కఠోరమగు ప్రాయశ్చిత్తము జేసికొని నేను నా మోహమును జంపుకొంటిని. అందులకు కానుకగ భగవంతుడు నాకు నీ యాశ్రయమును ప్రసాదించెను. నా మనోవికారములు సత్యములై యుండు నవి నన్ను విడిచి యెచటికి పోగలవు? నేను వేంకటేశపాదులవలన దీక్ష గైకొన్న సంగతి నా కేల చెప్పలేదని నీ వానాడు నన్ను గట్టిగ నడిగితివి. ఆ దీక్షయే యొక మిథ్య. నేను నిన్ను జూచిననాడే నే నా దీక్ష సంగతి మఱచిపోతిని. నే నీ మనోవికారములను నారాయణుని చరణములయం దర్పించు ప్రయత్నమున కృతకృత్యురాలను గాలేకపోతిని. అట్టి ప్రయత్నమున సుచరిత కృతకృత్యురాలైనది. ఆమె ధన్యురాలు. నిన్ను గాంచి నేను నా మనోవికారములనే సిద్ధికి సోపానములని భావించితిని. కాని భట్టూ! నేను నిన్నొక మాట నడుగదలచితిని" అని పలుకుచున్న నిపుణిక కన్నులలో లజ్జాసక్తు లొక్కసారిగ నుదయించెను. నేను ప్రేమతో "ఏమి తెలిసికొనగోరుచున్నావు నిఉణికా?" అని యంటిని. ఆమె కన్నులు వాలిపోయెను. ఆమె చుఱుకైన పలుచని యంగుళులు దూర్వాంకురములను గిల్లుచుండెను. అకారణముగ నామె తన కొంగును పాపటపైకి పూర్తిగ లాగుకొని డగ్గుత్తికతో "భట్టూ! నిన్ను దుఃఖితునిగ జేయు భాగ్యవిశేషము భాగ్యహీననైన నాకును కొంత దక్కగలదా?" అని యడిగెను. నేను

ప్రేమపూర్వకముగ," తప్పకుండ, నీడనిచ్చూ, నేనేమి చలిం చని రాతిబొమ్మనా!" అని యంటిని. నిపుణిక ముఖమండలము రాగదీప్తమై ఆమె కంఠము నావరించిన జడత్వము తొలగిపోయెను. ఆమె భాష్పపూరిత నేత్రములతో నన్ను జూచుచు "ఆర్యా, నేను కృతార్థురాలను. గొడ్డుబోయిన నా జీవితము సార్థకమైనది. ఇంతకంటె నెక్కువగా నేనాశించను సరికదా, ఆశించు యోగ్యతయు నాకులేదు. ఆర్యా, నేను పరమపాపిని. ఇతరుల సుఖమును జూచి నేనేల యీర్ష్య జెందవలెను! సేవాధర్మ నిర్వహణమున నేను సఫలురాలను గాలేదు. సతీధర్మము నాచరించుట యందును నేను సాఫల్యము నొందలేను. అయ్యో, నీవే నాపాప జ్వాలను జూడ గలిగియుండిన నేమయ్యెడిదో! సౌరభేశ్వరుని దర్శనముచే ఈపాప జ్వాలలు శాంతించినచో నాజీవితము తరించును. కాని ఆర్యా, నీవు నన్ను క్షమింపుము. నేను నామనస్సు తేలికగనున్నది!" అని యనెను.

నిపుణిక యిదంతయు నేల చెప్పుచున్నది!

ఒక జాము ప్రొద్దుండగనే మేముచటినుండి బయలు దేరి సూర్యభగవానుడు నిజారుణ కిరణముల నుపసంహరించు కొనుటకుముందే భద్రేశ్వర దుర్గమును జేరితిమి. అప్పటికే భట్టిని వ్యాకులపడుచు మా కొఱకు ప్రతీక్షించుచుండెను. ఆమె ఆదర పురస్సరముగా మాకు స్వాగతమొసగెను. కొంచెము విశ్రాంతి తీసికొన్నపిదప ఆమె నన్ను పిలువనంపి యొకలేఖ నాకిచ్చెను. అది కృష్ణవర్ధన రాజకుమారుల లేఖ. అందాతడు తన సహోదరియగు చంద్రదీధితికి తన వాత్స

ల్యము తెలుపుచు, మహారాజాధిరాజు తన యపరిచితయగు భగినికి స్వాగతమొసగి ధన్యుల మగుదుమని సందేశమంపి నట్లు తెలిపియుండెను. అంతేకాక యేమర్తులపై భట్టిని రాదలచుకొనునో వాని నంగీకరించియే ఆమెను గొనిరావల యునని యతడు నాకు తెలియజేసియుండెను. ఆభీరరాజును కూడ నన్నివిధముల సంతోషపెట్టి యతనిని అనుకూలునిగ చేసికొమ్మనియు, కొండకనుమల కటువైపు గుమికూడు చున్న మ్లేచ్ఛవాహిని వర్షాకాలము ముగియగనే మిడుతల దండువలె ఆర్యావర్తము పైకి వెడలుననియు, దానిని ఆభీర సేనయే యడ్డుకొనగలదనియు రాజకుమారుడు వ్రాసి యుండుట జూచి నే నాశ్చర్యము చెందితిని. ఈ పవిత్రకార్య మందు తన సైన్యము నంతయు నియోగింపవలెనని ఆభీర రాజును కోరవలసినదిగ అతడు తన ప్రియసోదరియగు చంద్ర దీధితిని మఱిమఱి ప్రార్థించి యుండెను. ఆభీరరాజు సామంతు డగుటకు సిద్ధము గాకున్నచో సోదరరాజువలె నాతని నీ కార్యమునకై యాహ్వానింప వలెననినాకు స్పష్టముగ తెలిపి యుండెను. కట్టకడపట నతడు కాశీనివాసియై, మీమాంసా శాస్త్రవేత్తయై రాణించు నాయగ్రజుడు శ్రీ ఉడుపతి భట్టును నావెంట నిడుకొని రావలసినదనియు, నది మిక్కిలి ఆవశ్యకమనియువ్రాసెను. రాజకుమారి దొరకినదను సమా చారము దేవపుత్రులకు తెలియజేయబడెనని వ్రాయుట కతడు మఱువలేదు. ఆచార్య భర్వుపాదులు నాలుగైదు దిన ములలో రాకుమారిని జూడరావచ్చుననియు, అందువలన భద్రేశ్వరమునుండి బయలుదేరుట కాలస్యము కాగూడ

దనియు, తన సోదరియగు కుమారి, చంద్రదీధితో స్నేహ సౌఖ్యమును పొందుట కాతురపడుచున్నాననియు నతడు తెలియజేసెను. లేఖయంతయు నొక రాజతంత్రపు చిక్కు వలె నుండెను. ఎవరినికూడ విడిచిపెట్టక అందఱిని క్షమించినట్టి భావతో ఈ చిక్కులోని కీవ్వకొనుటకు ప్రయత్నము చేయబడి యుండెను. ఎక్కడగాని పొల్లులేదు. సరికదా ఆ లేఖ యందలి ప్రతిపదమునుండి లేఖకుడు సహృదయుడనియు, ఉదారాశయములు గలవాడనియు విదితమగు చుండెను. నేను లేఖను జదివి యాలోచనలో బడితిని. మఱియొక చిక్కులో నేనుదగుల్కొనగూడదనుభావము నాలో ప్రబల ముగనుండెను. నేనిప్పటికి కొంచెము జాగరూకుడనై యుంటిని.

కొంతతడవు ప్రతీక్షించిన తరువాత భట్టిని "భట్టూ ఏమాలోచించుచున్నావు?" అనెను. నేనామెను చూచుచు "దేవీ, నీ యాదేశమే నాకు కర్తవ్యము. నేనే చిక్కులోను తగుల్కొనకూడదని యాలోచించుచున్నాను." అని యంటిని. నిపుణిక నన్ను తిరస్కారభావముతో జూచు చున్నట్లుండి "భట్టూ, చిక్కేమిటి? స్పష్టమగుదానిని నీవు మరల అస్పష్ట మొనర్చుచున్నావు. అభీరరాజు సైన్యము వెంట భట్టిని స్వతంత్ర రాజ్యపు మహారాణివలె స్థానేశ్వరము వెళ్ళగలదు. మహారాజాధిరాజులకు అక్కఱ యుండిన వందమార్లు భట్టిని దర్శనార్థమై రాగలరు. భట్టిని మర్యాదకు భిన్నముగ నొక యాకల్లాడినను నెత్తురు నదులై ప్రవహింప గలదు. ఇంకెవరు చావకున్నను సరే, మన మిరువురము

తప్పక బలియగుదుము. ఇందు భయపడవలసినదేమున్నది! నేను భట్టిని మర్యాదకు గీటురాయిననై ముందువెళ్లెదను. నీవు ప్రాణములు సమర్పించుటకు వెనుకాడుచున్నావా యేమి ?" అని యనెను. నేను "మరణింపవలసిన యవసరము వచ్చినపుడు బాణభట్టు తప్పక తన యసువులను ధారపోయ గలడు. కాని యంతకుముందే, యతడెందుకు మరణించ వలెను ?" అని శాంతముగ పలికితిని. భట్టిని యేమియు విన నట్లు "స్థాణ్వీశ్వరమే వెళ్ళవలసియున్న బయలుదేరుము, ఆలస్యమెందులకు ? ఆచార్య భర్వుపాదు లచటకువచ్చి యుండిన యెడల నిచటికి తప్పక వచ్చెదరు. వారెనుబది సంవత్సరముల వృద్ధులగుటచే వారికందువలన కష్టము కలు గును. ఆభీరరాజ సైనికులొక వేయిమంది ప్రస్తుతము సరి పోవుదురు. రాజకుమారులు నాకు సోదరులు. వారి వాత్స ల్యము నాకమూల్యమగు నిధివంటిది. కాని వారి రాజ్య తంత్రపు టాదేశములు సహింపరానివి. నే నాభీరరాజున కేమియు చెప్పుటకు సిద్ధపడను. అతడు నాపై చూపిన దయ మరొకరుచూపలేరు. అతడు తన కర్తవ్యము తానే నిర్ణయించు కొనగలడు. నే నందు జోక్యము కలిగించుకొనను." అని యనెను. సందేహ మొకింతయులేక విస్పష్టముగ నున్న యీ యాదేశమును వినినంతనే నానాడులకొక యపూర్వమగు శక్తి లభించెను. ఇంతవరకు భట్టిని యిట్టి విస్పష్టమగు నా దేశము నింతటి నిరుపమమగు భావముందేనాడు నొసగి యుండ లేదు. నిజముగ నామె తన కర్తవ్యమును నిర్ణయించుకొనెను. కాని ఈ కర్తవ్యమున కసలు జన్మస్థానమేది ?

నేను లేనిపోని సందేహములలో బడకుండ నుండుటకై యీ నిర్ణయము జరిగెనా? లేక భట్టిని దుఃఖితప్త హృదయము నందు పితృపాదులను దర్శింపవలెనను యుత్కంఠ ప్రబలమై యుండెనా! ఇంతవఱకు భట్టిని యీ దేశములు సార్థకములు, గౌరవార్హములు నైనట్లు కన్పట్టలేదు. వానియందొక విధ మగు దైన్యముండెడిది. కాని యీసారి యీ యీ దేశమునం దధికారము, గురుత్వము, నిర్దిష్టభావము లుండెను. ఈ కుసుమకోమల హృదయ మెంత గంభీరమైనది! మహాకవీ! నీ వెక్కడ నున్నావో కదా! నాడు నీవు నీ భావనానేత్రముల తపోనిరత యగు 'పార్వతీదేవి స్వచ్ఛరూపమును జూచి యుంటివి. దాని ప్రతిమ సాక్షాత్తుగ నేడీ ధరిత్రిపై నలరారు చున్నది. ఇట్టి సౌకుమార్య గాంభీర్యముల ననలారు మణి కాంచన యోగ మెచట లభించును? నేను నారాయణుని లోకకల్యాణ భావన, మహాదేవుని తపోనిష్ఠ, దేవేంద్రుని దేవత్వము, సురగురుని నిర్మల ప్రజ్ఞ, మదనుని విజయా కాంక్ష, పార్వతీదేవి దృఢనిశ్చయము, సరస్వతీదేవి సంపూర్ణ శుచిత్వము, మున్నగునవి యన్నియు కలిసి రూపమును దాల్చె నవి. భట్టిని నే డార్యావర్తమును రక్షింప సంకల్పించినది. ఈ లక్షలాది నిరాశులగు జీవుల మమత్వ మామె నవనీత కోమలమగు హృదయమును నిశ్చయముగ కరగించివేసినది. పైకి పొగ కనబడకపోయినను ఆమె గంభీర హృదయమున ఆక్రందన జ్వాలలు మండుచున్నవనుట నిశ్చయము. భట్టిని స్థానేశ్వరము వెళ్ళుటకై సిద్ధపడినది!

స్థానేశ్వరము! ఆహా! ఇచ్చటనే యెందఱో యువతులను మానవుని పశుత్వమున కెఱజేసిన రాజవంశమున్నది కదా! భట్టిని మఱల నచటకే పోవుచున్నది. ఆ రాజవంశమును భస్మీభూతమొనర్పగల జ్వాల లామె రోమకూపముల నుండి వెడలుచుండలేదా! తప్పక యెచ్చటనో యీ జ్వాల యుండి తీరవలెను. భట్టిని చాల గంభీరమగు యువతీరత్నము. ఆమె స న్నిక్కవ చిక్కులలో పడవేయు నిచ్చగింపక పోవుచున్నదేమో! కాని ఆమె యీ విషయమై యేమియు నాలోచన చేయులేదా? నిపుణిక మాటి మాటికి ప్రాణములర్పించుటకై రెచ్చగొట్టుచుండుట మఱి యొందులకు? దానికి రహస్యమిదియేనా యేమి? బాణభట్టు ఈ చిన్న రాజవంశమును క్షమింపజాలడు. రాజతంత్రపు కుటిల భుజంగము గూడ నాతనిని కర్తవ్యపథమునుండి తొలగింపజాలదు. మదించియున్న యీ చిన్న రాజవంశము తాను చేసినదానికి ప్రతిఫలము తప్పక పొందగలదు. స్థానేశ్వరమునకు వెళ్లుటవలన సిద్ధించునట్టి శుభ పరిణామములలో నిది యొకటి కాగలదు. భట్టిని రేపటికి తప్పక బయలుదేరవలెను.

ఇక నాలోచించవలసిన దేమియు లేదు. వర్షాకాల మాసన్నమైనది. ఆకాశము మేఘములతోడను, ధరిత్రి నవ జలధారలతోడను, దిగ్వలయము విద్యుల్లతలతోడను, వాయుమండలము నీటితుంపరలతోడను, నిండిపోకుండునంత వఱకే ప్రయాణము నిరాపదము కాగలదు. త్వరలోనే మాలతీలతలు పుష్పింపనున్నవి. కదంబవృక్షములయందు పుష్పకేసరములు వికసింపనున్నవి; కుముదకుట్మలములు విక

సింపగలవు; నెమళ్ళు నృత్యము చేయగలవు; మేఘములును విద్యుల్లతలును దాగుడుమూత లాడుకొనగలవు. అట్టి తఱి భట్టిని శిబికలయందును, ఎడ్లబండ్లయందును ప్రయాణము చేయుచుండుట యుచితముగాదు. ఇదే శుభసమయము. ఇప్పుడే ప్రయాణమునకు సిద్ధపడవలెను. కాని నిపుణిక ఆరోగ్యము మమ్ములను నాలుగైదు రోజులవఱకు నాపివేసెను. నిపుణిక కొంచెము స్వస్థత జెందగనే గంగాదశహరా నాడు మేము బయలుదేరితిమి. వేయిమంది ఆభీరమల్లుల దేవపుత్రనందిని జయ జయ ధ్వనులు కుంభినినే కంపింపజేసెను. భట్టిని శిబిక చుట్టును పదుగురు మౌఖరీవంశ వీరులు కరాళ కరవాలములు తళ తళ మెఱసెను. నిపుణికకు ప్రత్యేకముగ నొక పల్లకీ యేర్పాటు గావింపబడెను. విగ్రహవర్మ దేవపుత్రనందిని కత్యంత సన్నిహితముగ నుండునని పట్టు బట్టి అందు సఫలత నొందెను. ఈ విధముగ భట్టిని విశాలవాహిని స్థానేశ్వరమునకు బయలుదేరెను.

# పదునెనిమిదవ అధ్యాయము

స్థానేశ్వరమునకు సుమారు రెండు మైళ్ళ దూరమున భట్టిని స్కంధావారము సిద్ధమయ్యెను. కృష్ణవర్ధన రాజకుమారులు స్వయముగ నచటనుండి మహారాజాధిరాజులచే నేర్పాటు గావింపబడిన యుత్సవమున పాల్గొనవలసినదని భట్టినిని సాదరముగ ప్రార్థించిరి. కాని భట్టిని దృఢశాంత కంఠస్వరమున నా ప్రార్థన నంగీకరింపలేదు. ఇతరు లన్యథా భావింపకుండ నదనెడి యుద్దేశముతో, నన్నా యుత్సవమునకు సంబంధించిన సభలయందుపస్థితుడనగుట కనుమతించెను. భట్టిని మాత్రము ప్రసన్నచిత్తయై యుండెను. రాజకుమారులతో సంభాషించుటవలన నామె మానసమునందున్న యెన్నో దురభిప్రాయములు తొలగిపోయెను. వాభ్రవ్యుడు కుశలముగ నుండెననియు, అతడు రాజ్యశ్రీ మహారాణి కొలువున నున్నాడనియు తెలిసికొని యామె సంతసించెను. ఆ వార్త విని ఆమె హృదయమున నాటుకొనిపోయిన గొప్ప శల్య మొకటి వీడిపోయిన ట్లామెకు తోచెను. చిన్న రాజవంశమునకు సంబంధించిన ఆస్తిపాస్తు లన్నియు రాజ్యమునకు సంక్రమించెననియు, విషయాసక్తుడగు నా సామంతునికి భట్టిని యభిమతము ననుసరించి దండన విధింపబడుననియు రాజకుమారులామెతో జెప్పిరి. వారు గద్గద కంఠమున "మహారాజాధిరాజులగు హర్షవర్ధనుల సహోదరి యెడ జూపిన దుర్వ్యవహారమునకు తగినశిక్ష యాసామంతునికి తప్పక విధింపబడును" అని యనిరి. రాజకుమారులరాక చే

భట్టినికేగాక నిపుణికకు గూడ నూఱటగలిగెను. కృష్ణవర్ధను లామెయెడ “దేవపుత్రనందిని చెలికత్తె” యను నాదరము జూపిరి. సదాచరణము, మధురభాషణము వారికి మోహాస్త్రము లయ్యెను. భట్టిని కృతజ్ఞతా పూరితములగు నయనములతో రాజకుమారునిజూచి యూరకుండెను. ఆమె సహజమగు ననుభావముల ప్రభావము రాజకుమారులపై బడెను. సోదరీ సోదరుల యీ కలయిక యపూర్వముగ నుండెను.

భట్టిని మనస్సు ప్రసన్నముగ నుండెను. శ్రీరమునే మోహింపజేయునట్టి యామె మాధుర్యచ్ఛవి యీ సహజమగు ఆనందకాంతిచే పుష్పించిన మాలతీలతను తలపించుచు నభిరామముగ నుండెను. మానసికానందముకూడ నద్భుతమగు రసాయనమే! భట్టిని శోభనేడు నూఱురెట్లధికమయ్యెను. ఆమె యధరముల బంధూకరాగము నేఁడు మఱింత కాంతిమంతమై యుండెను. మొగలిరేకుల నే నిందించునట్టి నేత్రశోభయనేన్నొ రెట్లధికమై యుండెను. కపోలములపైని ఇప్పమొగ్గల బోలిన మోహనకాంతి మనోజ్ఞమైయుండెను. శంఖము నవహసించు నామె గ్రీవాభంగము మఱింత యుల్లాస పూర్ణమై యుండెను. ఆహా! కవులెంత వెఱ్ఱివారు. వారు వ్యర్థముగ కల్పనా జాలమునందు చిక్కుకొని గిజగిజ తన్నుకొనుచుందురు! రామణీయమున కధిదేవతయు సౌందర్యమునకు పుట్టినిల్లునై, శోభకు సముద్రమును బోలిన యిట్టి రూపమును వారెన్నడు చూచి యుందురు? భట్టిని సంతోషముగ నుండుటనుగాంచి నా యొడలంతయు పులకరించెను. నేను కూడా ప్రసన్న చిత్తుడనై యుండుట ఆమె కానందము

కలిగించి యుండవచ్చును. ఆ సమయముననే వెలుపలనెవరో పాడుచుండిరి. భట్టిని నన్ను పిలిచి నిర్వ్యాజమనోహర స్మిత ముతో "భట్టూ, నేడు చాల ప్రసన్నచిత్తుడవై యున్నావే!" అనెను. నిజముగ నేను ప్రసన్న చిత్తుడనై యుంటిని, నాకు శక్తియుండిన భట్టిని మోహనాకారమునకు ప్రతిబింబము నొకదానిని నా హృదయమునే కరగించి పోతపోసికొని యుండెడివాడను. ఆమె "వెలపట నెవరో పాడుచున్నారు, చూడుము" అని తన వ్రేళ్ళతో సైగచేయుచు నడిచెను. ఆనందతరంగములతో మునిగి తేలుచు నేను వెలుపలికి వచ్చితిని. గైరిక వస్త్రములను దాల్చిన భైరవినులు మధురోదాత్త స్వరమున గానము చేయుచుండ ఆభీరసైనికులు మంత్రముగ్ధులవలె వినుచుండిరి. పాట అపభ్రంశ భాషలో నుండెను. ఆపాట సారాంశమిది.

"అమృత పుత్రులారా, నగాధిరాజగు హిమాలయ సమీపమందు నేడు కలవరము కనబడుచున్నది. పార్వతీ పితృపాదులయెడ యందీ కలవరమెందుకో యెవరికైన తెలియునా? యువకులారా! ప్రత్యంత దస్యులు వచ్చుచున్నారు.

"సముద్రగుప్తుని ప్రతాప మేమి చేయగలిగెను? చంద్రగుప్తుని రణహూంకార మేమిచేసెను! మౌఖరీవంశీయుల దుర్దాంతవాహిని యేమి సాధించెను? మ్లేచ్ఛ లింకను జీవించియే యున్నారు. అమృత పుత్రులారా, ప్రత్యంత దస్యులు వచ్చుచున్నారు!

"ఆర్యావర్తపు యువకులారా! జీవింప నేర్చుకొనుడు. అసువులను ధారపోయ నేర్చుకొనుడు. చరిత్రనుండి గుణపాఠములు నేర్చుకొనుడు. ఆర్యావర్తము నేడు వినాశగహ్వరపు టొడ్డున నిలువబడి యున్నది. యువకులారా! ప్రత్యంత దస్యులు వచ్చుచున్నారు!

"రాజులపై నమ్మకముంచుట ప్రమాదకరము. రాజపుత్రుల సైన్యమున కెదురుజూచుట పిరికితనము. ఆత్మరక్షణ భారమొక జాతివారిపై మాత్రమే వదలుట మూర్ఖత్వము. యువకులారా! ప్రత్యంత దస్యులు వచ్చుచున్నారు!

"ఆర్యావర్తమంతయు నొక్కటే: దాని సంఘము, దాని ప్రాణము, దాని మతములు నన్నియునొకటే. దేశరక్షణ అందఱికి సరిసమానమైన ధర్మము. యువకులారా! ప్రత్యంత దస్యులు వచ్చుచున్నారు!

"సాధారణ మగు దుఃఖభారమునకు సోకుడు ముసుగు కొట్టువలె ముడుచుకొనిపోవు దేవపుత్రుల యాశ వదలుకొనుడు. ఆ యాధారము చాల దుర్బలమైనది. యువకులారా! ప్రత్యంత దస్యులు వచ్చుచున్నారు. జాగ్రత్త పడుడు!

"అమృత పుత్రులారా, ఈ రాజుల ఇంద్రియ లిప్స మితిమీఱినది. వారి యంతఃపురములు లేవదీసికొని వచ్చిన కులస్త్రీల యాక్రందనములచే ప్రతిధ్వనించుచున్నవి. రాదశక్తి యను కూకటి వేరునకు నుసి పురుగు పట్టినది. యువకులారా! ప్రత్యంత దస్యులు వచ్చుచున్నారు!

"అమృత పుత్రులారా, పెనుగాలివలె పరువెత్తుడు. మ్లేచ్ఛ వాహినిని తృణమువలె నెగురగొట్టుడు. ఆపదను

చూచి భయపడుట యౌవనము నవమాన పఱచుటయే!
యువకులారా, ప్రత్యంత దస్యులు వచ్చుచున్నారు!

"అటు చూడుడు! కుల స్త్రీలు కన్నుల నీరు గ్రుక్కు
కొని మీ వైపు చూచుచున్నారు. వారి సౌభాగ్యము మీ
చేతులలో నున్నది. యువకులారా! ప్రత్యంత దస్యులు వచ్చు
చున్నారు!

"అటుచూడుడు! తల్లులు మీవైపు చూచుచున్నారు!
చంటిపిల్లలు మిమ్ముల నాశతో వీక్షించుచున్నారు. ఆగకుడు!
యువకులారా! ప్రత్యంత దస్యులు వచ్చుచున్నారు!

"మీరు త్రాగిన తల్లిపాలపై ఆన! కుల స్త్రీల
సౌభాగ్యముపై ఆన! చంటిపిల్లల వాత్సల్యముపై ఆన! లెండు
భేద భావములను మఱచిపొండు ప్రత్యంత దస్యులు సమీ
పించు చున్నారు!

"ఆర్యావర్తమును హాహాకారపు సుడిగాలినుండి
తప్పింపగల వారెవ్వరు? దేవపుత్రులుగాదు, రాజాధిరాజులు
గాదు, మహా సామంతులుగాదు. యువకులారా! లెండు,
ప్రత్యంత దస్యులు సమీపించుచున్నారు!

"మఱి ఆర్యావర్తమును హాహాకారపు సుడిగాలి
నుండి తప్పింపగల వారెవ్వరు? ఆర్యావర్తపు యువకులే!
అన్నలారా! ప్రత్యంత దస్యులు వచ్చుచున్నారు!

"అమృత పుత్రులారా! మారణ యజ్ఞమున కాహుతి
కండు. తల్లులకొఱకై, అక్కచెల్లెండ్ర కొఱకై, కులస్త్రీల
కొఱకై యసువుల ధారపోయుటకు నేర్చుకొనుడు. లెండు!
యువకులారా, ప్రత్యంత దస్యులు వచ్చుచున్నారు!

"అమృతపుత్రులారా! మృత్యుభయము మిథ్య జీవించుటకు మరణించుము. మరణించుటకు జీవించుము. నగాధిరాజు మీ వైపు చూచుచున్నాడు! అన్నలారా, ప్రత్యంత దస్యులు వచ్చుచున్నారు!"

"మహామాయ మిమ్ముల నాహ్వానించుచున్నది. మహామాయ మీ తల్లివంటిది. మాతృ గౌరవమును కాపాడుడు. అమృతపుత్రులారా, ప్రత్యంత దస్యులు వచ్చుచున్నారు!"

"అమృత పుత్రులారా! మృత్యుభయమే మిథ్య. కర్తవ్యమునందాలస్యము చేయుట పాపము. సందేహ సంభ్రమములు అభిశాపములు సోదరులారా! ప్రత్యంత దస్యులు వచ్చుచున్నారు!"

పాట ముగిసెను. భైరవిను ఉల్లాసముతో తమ త్రిశూలములను ఆకసమున కెత్తుచు, "ఆర్యావర్తము నందలి యువకులకు జయము గాక! మహామాయా మాతకు జయము గాక!" అని నినాదములు చేసిరి. సహస్రకంఠము లతో నొక్కుమ్మడిగ అభీరసైన్యమంతయు "మహామాయా మాతకు విజయము గాక!" అని ప్రతిధ్వని చేసెను.

భైరవినులు మరల ఇట్లు పాడదొడగిరి: "వేయి నాలుకలు గల కొండచిలువ బుసవలె నెవరా గర్జించునది! ఇది యుప్పొంగుచున్న సముద్రము కాదు; విద్యుద్గర్భ యగు మేఘము కాదు; ఇది ఆర్యావర్తపు యువకుల దుర్దమనీయ వాహిని!

"దీని నడక నాపగలవా రెవ్వరు! దీని తరంగావర్తమున మునిగిపోకుండ నెవ రుండగలరు? దీని భయంకర వేగమున కొట్టుకొనిపోకుండ నిలుపగలవా రెవ్వరు? ఇది ఆర్యావర్తపు యువకుల దుర్దమనీయవాహిని!

"అమృతపుత్రులారా, కుల స్త్రీల సౌభాగ్యము మీ చేతులలో నున్నది. కన్నెపడుచుల మానము మీ చేతుల నున్నది. వృద్ధుల మర్యాద మీ చేతులలో నున్నది. ఇది ఆర్యావర్తపు యువకుల దురంతవాహిని!"

నా రక్తమునందొక విచిత్రమగు సంచలనము కలిగెను. నాకు ఆర్యావర్తపు నవయువకులపై నొక యపూర్వమగు విశ్వాస ముదయించెను. నా వక్షఃస్థలము గర్వముచే నుబికిపోయెను. రణచండిక భయంకర నృత్యము చేయనున్నది. కాని యందువలన ఆర్యావర్తమున కెట్టి నష్టము కలుగదు. మహామాయ యొక్క ఈ శిష్యురాండ్రు ఆర్యావర్తమును మహానాశమునుండి సంరక్షించు నుపాయమును తెలియజేసిరి. స్త్రీ యొక్క కోమలకంఠమున నెట్టి యద్భుతమగు శక్తి కలదు! ఈ కోమలకంఠములనుండి వెలువడిన ఓజస్స్ఫూరితమగు సంగీతము నూఱురెట్లధికముగ ప్రభావము బఱపుచుండెను. "యువకులారా, ప్రత్యంత దస్యులు వచ్చుచున్నారు!" అని వారి కోమల కంఠములించుక కంపముతో పలుకునపుడు వాయుమండలము నందలి ప్రతి భాగము కంపించినట్లును, ఆకాశపు ప్రతి కోణము ప్రతిధ్వనించినట్లును, దిగంతరాళమున ప్రతి బిందువు ఉచ్చలితమైనట్లును, కాన వచ్చెను; కాని భయ మెంతమాత్రము లేనట్లు తోచెను.

ఆర్యావర్తపు తరుణులు నేడు కృతార్థులు. దేవాలయము లును, పణ్యభూములును నిరాపదములైనవి. స్త్రీ బాలకు లూఱటచెందిరి: నేడు జగత్తునందలి యశేష యువ సమూహము చలించిపోయినది.

భట్టిని పట్టుదలతో భైరవినుల గీతమునందలి సారాంశ మును వినెను. కొంతసేపామె తన్ను తాను మఱచిపోయి యేవో మాటలలో చిక్కుకొన్నట్లు కానవచ్చెను. మహా మాయ పాటలో దేవపుత్రునివిషయము చర్చించిన యంశము ఆమెకు కొంత కష్టముకలిగించినట్లునాకు తోచెను. ఆమె ఖేద మునుతొలగింపనెంచి నేను, "మహామాయ సత్యమునందు సగమేకనుగొన్నది. మిగిలిన సగము నామె తెలిసికొనియుండిన సుప్తరూపమున నన్నెంత గొప్ప శక్తి దేవపుత్రుని హృదయమునను సోకును ముకుకుచెట్టువలె వాడి పోవజేసెనో యామెకు తెలిసియుండెడిది" అని యంటిని.

భట్టిని ముఖముపై చిఱునవ్వు తొణకిసలాడెను. ఆమె యధరములపై నపూర్వమగు రసమాధుర్య ముదయించి నయన కోరకములం దొకవిధమగు లీలాలోల విలాసమే మెఱసిపోయెను. అమె "నీవు కూడ మిగిలిన యా సగము సత్యమును తెలిసికొనలేవు భట్టూ!" అని యనెను. భట్టిని పరిహాసమును నే నర్థము చేసికొంటిని గాని నే నేమి యుత్తర మొసగవలెనో తెలియలేదు. యథార్థముగా అ సగము సత్యము నాకు తెలియదు. తన సంతానముపై తండ్రి హృద యమున నెంత మమత్వముండునో నే నూహించి తెలిసికొని యుంటిని. నాకు మహామాయను తప్పుబట్టు నధికారము

కలదా? భట్టిని నా లోపమును గుర్తించినది. నేను సంశయా స్పదుడనగుట జూచి భట్టిని ముఖము హాస్యముచే మఱింత వికసించగా నామె "భట్టూ, నేనింకొక విషయమై యాలోచించుచుంటిని. రాజుల పైనను, రాజపుత్రుల పైనను నమ్మక ముంచుకొని కుటిలప్పాయిటచే ఆర్యావర్త ముద్ధరింపబడజాలదని మహామాయ నిశ్చయముతో వచించెను; కాని యది కూడ నసంపూర్ణమగు సత్యమే" అని పలికి కొంతసేపూరకుండెను. ఆమె యేదో చెప్ప నభిలషించుచుండెను. కాని కౌలీన భారముచే నామె వాక్యము అణగిపోయెను. నే నామె ముఖము వైపున కౌతూహల్యముతో జూచుచుంటిని. ఆమె కన్నులు మూతలుపడెను; కంఠము పూడియుండెను; ఏమఱుపాటున నున్నందున నామె మేలిముసుగు సీమంతభాగము నుండి జాఱియుండెను. కలువవంటి నల్లని కేశపంక్తుల నట్టనడుము నుజ్జ్వలమగు పాపటరేఖ పవిత్రదేవి చికురజాలముల మధ్య మందాకినీ ధవళధార కొంతసేపు విహరించుటకై వచ్చి త్రోవ దప్పి నిలిచిపోయినదా యన్నట్లు మనోహరముగ కనబడుచుండెను. ఈ సీమంతరేఖపై సిందూరరాగమే నాడు మెఱసిపోవునో, కబరీభారపు తిమిరకాంతులతోపాటు బాలా రుణుని ఖైదీగా గొనగలదో, చంద్రమండలముల మధ్యనే నాడు ఉషః కాంతి రేఖ లుదయింపగలదో, స్నిగ్ధమగు ఘనమేఘముల మధ్య నే నాడు విద్యుల్లతాసంచలనము మెఱయుచుండునో యా దిన మెంత శుభదినమో గదా! అహ! ఆదిన మెంత మంగళప్రదమో గదా! అని నేనా

మానవులనుట సత్యదూరమా? మహామాయ యెవరిని మ్లేచ్ఛులనుచున్నదో వారుకూడ మానవులేకద ! కాని శ్రేసశేమున వారి సంఘమునందు అగ్రవర్ణములవారు నీచ కులమువారన భేదము లేదు. ఇచ్చటి సంఘము నందు వేయి అంతస్తులుండ వారి సంఘములో పరిశీలించిన రెండు మూడు తెగ లుండునేమో ! వారందఱు ఇంచు మించుగ నీ యాభీరులవలె నుందురనుకొనుము. భారతదేశ మున నున్న గొప్ప కులమువారు చాల గొప్పగ నుండ తక్కువకులమువారి చిన్నతనమున కంతు పంతు లేదు. కాని వారిలో నందఱు సమానులే. వారి స్త్రీల యందు— రాణి మొదలుకొని పరిచారికవఱకు—వందలాది భేదములు లేవు. వారందఱు రాణులే, అందఱు పరిచారికలే! నీవు వారి భయంకరమగు రూపమునే చూచియున్నావు. కాని వారి కోమలమగు హృదయములను జొత్తిగ నెఱుగవు. భారత దేశపు మహనీయమగు సాధనామార్గము నచటికి చేర్చి, యీ దేశపు సంఘమునందుండు నికృష్టమగు జటిల నియమముల నిచ్చటినుండి తొలగించుట సంభవము కాదా ? ఈ రెండు విషయములు జరుగనంతవఱకు సంఘమున శాశ్వతమగు శాంతి యసంభవము. మహామాయ యీ విషయమును గుర్తింపలేదు. ఆమె సత్యమునం దర్ధభాగమునే చూచు చున్నది. బౌద్ధ సన్యాసులు కూడ సత్తే సత్యమునం దర్ధ భాగమునే చూచియున్నారు. భట్టూ! నీవీ పూర్ణసత్యమును ప్రచారము గావించిన బాగుండునేమో !” అని యనెను.

నేను వినయముతో "దేవీ, నేనీ విషయమును క్రొత్తగ వినుచున్నాను. మీ యాజ్ఞయే నాకు శిరోధార్యము" అని యంటిని.

వక్రముగనుండిన భట్టిని యపాంగము వికసించి యామె ముఖము మధ్యాహ్నకాలపు తరుమల్లికా పుష్పమువలె విప్పారెను. ఆమె "భాగవత ధర్మమున నీ పూర్ణత్వమే కనబడుచున్నది!" అని యనెను. నా ఔత్సుక్యమింకను నెక్కువకాగా నే నింకను వినగోరి "దేవీ, నే నెందు దేని కుపయోగపడగలను?" అని యంటిని. భట్టిని దీప్తస్వరమున "నీవా! నీ వీ యార్యావర్తమున నపర కాళిదాసువు. నీ నోట నిర్మలమగు వాగ్ధార వెలువడుచుండును. నీ యంతఃకరణము పరహితభావముచే పరిశుద్ధముగ నున్నది. నీ ప్రతిభ హిమనిర్ఝరిణివలె శీతలముగను, ధవళముగను నున్నది. నీ రసన సరస్వతికి నివాసస్థలము. మ్లేచ్ఛులనబడెడి యీ నిర్దయుల చిత్తమున నీవు సానుభూతి, సమవేదనలను రేకెత్తించి స్త్రీలను ఎట్లు సమ్మానించవలెనో వారికి నేర్పగలవు; బాలకులను ప్రేమించుట నీవు వారికి గఱపగలవు. భట్టూ! నీ వీ భవకాననమున పారిజాతమువంటివాడవు; ఈ యెడారి యందొక సెలయేటివంటివాడవు. నీ వాక్కు నావంటి యబలల యందాత్మ శక్తిని రెచ్చగొట్టగలదు. నీ యండగొని యబలలుకూడ నీ దేశపు సంఘమునందలి జటిలత్వమును సడలింపజేయుగలరు." అని యనెను.

భట్టిని వాగ్ధార నడు గట్టులను త్రెంచుకొని ప్రవహింపసాగెను. ఇంతవఱకు వచ్చిన తర్వాత నామె తన్ను తా

నాపుకొన ప్రయత్నించెను. కాని, పొగరుబోతు గుఱ్ఱమును కళ్ళెమును లాగి యాపినను, అది యేవిధముగ కొంత దూరము పరుగిడి పోవుచునుండునో అదేవిధముగ నామె వాగ్ధార నదుపులో నుంచుకొన్నను కొంత ముందుకు సాగెను. ఆమె "భట్టూ! ఒక జాతి మఱియొక జాతిని మ్లేచ్ఛులనియు, ఒక మనుష్యుడు మఱియొకనిని నీచుడనియు తలచుటకన్న నశాంతికి మరొక కారణమేమి కాగలెను? మానవలోకమునుండి కిన్నరలోకము వఱకు వ్యాపించియున్న యనురాగస్నిగ్ధమగు హృదయము, కరుణాపూర్ణమగు మనస్సును గుఱించి అందఱికి మనసునకు హత్తుకొనునట్లు చెప్పగల సమర్థుడవు నీ వొక్కడవే! మానవుడు లోభమోహద్వేషములకు వశుడై పశుత్వము వైపునకు సాగిపోవుచున్నాడు. నీ వతని హృదయమునకు సంవేదనాశీలమును, కోమలత్వమును ప్రసాదింపగలవు. భట్టూ! ఈ శుష్క కాంతారగర్భమందు అంతఃస్రోతస్విని యొకటి పారుచున్నదనియు, నీ భోగపరాయణత యనెడి వల్కలముల క్రింద నిర్మోహవైరాగ్యదేవత సుప్తయై యున్నాదనియు, నీవు తప్ప మఱి యింకెవ్వరు లోకమునకు చాటగలరు! భట్టూ! నేను నీ కావ్యసంపదను పొందు శక్తిగల దానను కాగలను. నీవు నా ప్రార్థనను మన్నింపుము" అనియనెను.

భట్టిని మాటలయం దెట్టి జడత్వ మావరించినది! మొదటిసారి పరిచయము లభించినపుడు గూడ భట్టిని నన్నపర కాళిదాసని నుడివెను. నేడు కూడ నటులనే నుడువుచున్నది, కాని నాడామె వాక్కునం దెట్టి జడత్వము లేదు. ఆమె

నపుడే ధన్యత నొందగలదు" అని యంటిని. నా మాటలు విని భట్టిని ముఖము వికసించెను! శోభాశ్రీనిర్ఝరిణియు, విశాలాక్షియు నగు నా భట్టిని చిఱునవ్వుతో కలకల లాడు ముఖమును జూచిన తోడనే సగము వికసించిన పద్మము నాకు జ్ఞాపకమునకు వచ్చెను. ఆ మందహాసము నా మనస్సును స్వచ్ఛముగ నొనర్చి చిత్తమును వికసింపజేసి, హృదయమును అననుభూతమగు ననురాగముచే రంజింపజేసెను. నా వాణి కృతార్థమైనట్లును, నా ప్రతి చేష్టయు కృతకృత్యమైనట్లును, నా జన్మయే సఫలమైనట్లును, నాకు తోచెను. నేను గద్గద కంఠమున వినయముగ నిట్లు చెప్పితిని.

"దేవీ, మీ యనుగ్రహము నా వినమ్రత నొక్కింత రూపుమాపినది. మానవ సహజమగు 'తహ తహ పాటు నాలో జనించినది. అది కారణముగ మిమ్ముల నొక విషయమై ప్రశ్నింప సాహసించుచున్నాను. అనుగ్రహము లేశమాత్రమైనను పొంది సంభ్రమపడు మనుష్యుడు చంచలుడగుచున్నాడు. ఒకచో నిరంకుశ స్వాతంత్ర్యము దొరికినచో చపలవ్యక్తియు వాచాలుడగుచున్నాడు. ఆదేశము లేశమాత్రమైనను మనుష్యుని స్నేహవిహ్వలునిగా నొనర్చును. అందువలన, మీరు మన్నించినచో మీ వక్తవ్యమునకు ఫలితార్థమేమని మిమ్ముల నడుగగోరుచున్నాను. ఈ కుసుమ కోమలమగు శరీరము, నవనీత మృదులమగు నీ హృదయము, వజ్రమువంటి యీ దృఢసంకల్పము, అపూర్వమగు నీ భక్తి భావమును దేవలోకమునందును దుర్లభములు. ఒక్క క్షణ కాలమైనను నేనిది తప్పని యనుకొనలేదు. జాహ్నవీ

నిర్మల ప్రవాహపు జన్మస్థాన మెంత మనోజ్ఞముగ నుండునో పార్వతీదేవి జన్మస్థాన మెంత పవిత్రముగ నుండునో లక్ష్మికి జన్మధాత్రి యెంత గంభీరముగ నుండునో నే నెఱుగుదును. ఈ దేవదుర్లభ సౌందర్యము, ఋషిదుర్గమ మగు సత్యవ్రతము, ఈ కుసుమ కమనీయమగు చారుత్వము నే వంశమున జన్మించెనో యది ధన్యతనొందినది. ఆ కులము పవిత్రమైనది, ఆ జనని కృతార్థురాలైనది. ఆ తండ్రి సఫల కాముడయ్యెను. దేవీ! మ్లేచ్ఛజాతి హృదయమును సంవేదనా శీలముగ నొనర్చి, యందు మహత్తరమైన సాధనను సంతరింపజేసి, పూజనీయుల నాదరించుటను వారు నేర్చుకొను నట్లు చేయగల శక్తి మీలో నిక్కముగ నున్నది. కాని నే నభిలషించినను మీలో నే నెట్లు నా కావ్యశక్తిని సంచరింపజేయగలను? ఈ ఆర్యావర్తమున నున్న జటిలములైన ఉచ్చనీచములనెడు తారతమ్యములను తొలగించుటకు నా యొద్ద నే శక్తియును లేదే! దేవీ! ఇదెట్లు సంభవమగునో నేను స్పష్టముగ వినగోరుచున్నాను."

భట్టిని యధరములపై మందహాసము కనబడెను. ఆమె "భట్టూ! నీ యీ నిర్మలమగు వాగ్ధార అద్భుతము; అపూర్వము; ఆశ్చర్యకరము! నా జన్మ సార్థకమైనది. భాగ్యహీనమగు నా జీవితము నేడు కృతార్థమైనది. నీ యీ స్తుతి నా హృదయమున నపూర్వమగు నాత్మగరిమను సంచరింపజేసినది. నేను రాణికి జరుగు మర్యాదలను పొందుటచే సంతుష్టురాలనైతినని నీవు తలచుచున్నావా? కాదు భట్టూ! పవిత్రమగు నీ వాక్స్రోతస్వినియందు స్నానమాచ

రించినచో, నేను పవిత్రతను బొందితిని. ఇందువలననే నా కాత్మబలము లభించినది. నిష్కల్మషమగు నీ హృదయమును జూచినచో నాకు ప్రశస్తమగు సేవాపథము కనబడినది. నీ వనుకొనునది ఏమంత కష్టమైన పనికాదే?" అని యంటిని.

భట్టిని నన్నెక్కువసేపాలోచింపనీయ లేదు. ఆమె "ప్రస్తుతము నీ విషయమును వదలిపెట్టుము. ఆ చాక్య భర్వ్య పాదు లోకపావనమైన ముఖములో నిచ్చటికి వచ్చెదరు. సురల నెచ్చటికి వచ్చినట్లు నా భాగ్యమున ప్రాప్తియున్నదో యెవరి కెఱుక? ఈ గోష్ఠిక కృష్ణవర్ధన రాజు మాతో హర్ష రాజుగారి సభకు గొనివచ్చెదరు. నేను నా మనసులో దేవ రిని గుఱించియు కల్పనము చేసితిని. వారి యనుగ్రహమునకు ప్రతిదాన మొసగుటకు నా యొక్క నేమున్నది? నా యొద్ద నీ వొక్కడవే యున్నావు. అన్నివిధముల నేను నీపై నాధారపడవలసినదే యున్నాను. మహారాజాధిరాజులకు తగిన స్వాగత మొసగుటకేదైన సహాయము మాత్రమొసంగుము. మన స్వాగతార్థమై నేడు నగరమునందలి శ్రేష్ఠులగు కళాకోవిదు లను గుమిగూర్చియున్నానని వినియున్నాను. నా సర్వస్వము నీవే." అని నుడివి విశ్వాసముతో నా వైపునకు చూచెను. ఆమె కన్నులలో కృతజ్ఞతా ప్రభావు లుండెను.

ఇంతలో నెవరో నన్ను కలిసికొనుటకై వచ్చియున్నా రని ద్వారపాలకుడు చెప్పెను. వెలుపలికి వచ్చి చూతును గదా, అత డెవరో కాదు చిరపరిచితుడగు ధావకుడే! నిశ్చింతతో గూడుకొనిన అదే రూపము, ప్రఫుల్లమగు అదే ముఖము, మొరటుతనమును తెలుపు అదే విచిత్రవాలకము!

ఆషాఢమాసమున మాలతీ, జాజి పుష్పములకేమి కొదువ? ధావకుడు శ్యామాయమానములన్నూ, కంఠమునను, శిఖయందును మాలతీ పుష్పమాలలను దాల్చియుండెను. కస్తూరి మలమిన యుత్తరీయముతోపాటు జాజిపువ్వుల కమ్మని వాసనయు కలిసి నందున ధావకుని చుట్టు ప్రక్కల సౌరభమయమగు వాతావరణము నెలకొని యుండెను. నాకు కూడ నతడొక మాలతీ మాలను తెచ్చియుండెను. తాంబూలధారణముచే ధావకుడు చవిగొనుచున్నాడే కదా! నేడు కూడ తాంబూలము నాతడు నిర్దయుడై నమిలియుండెను! నన్ను చూడగనే యాతడు గబాలున లేచి నన్నాలింగనము చేసికొనెను. చాలసేపటి వఱకు మేమిరువురము గాఢాలింగనపాశమున బంధింపబడి యుంటిమి. కుశల ప్రశ్నలు జరిపించిన పిదప ధావకుడు నా వీపు తట్టుచు "మిత్రమా, నీ భాగ్యము వెలుగుచున్నది లెవయ్యా! నేడు చారుస్మిత మయూర నృత్యము; రేపు విద్యుదపాంగ సంగీత ప్రదర్శనమును జరుగగలవు. దేవపుత్రనందిని సైతము అడ్డులేని యనుమతి మొసగినది. అదృష్టశాలివయ్యా నీవు! ముందుగనే చెప్పుచున్నాను. నన్ను నీ ప్రక్క కూర్చుండనిమ్ము. ఇట్టి సమయము లందు మిత్రులను మఱచుట శ్రేయస్కరము కాజాలదు." అని యనెను. ధావకుని కన్నుల లోని రహస్యమగు చమత్కృతి జూచి నే నాతని చెంపగొట్టుచు "మిత్రమా, దాని ఫలమేమగునో చెప్పుమా తెలిసి!" అని యంటిని. ధావకుడు తాంబూలాసక్తమగు స్వరమున "చాల చెడు ఫలమే కలుగును సుమా! మృణాలకోమల మగు, నొకానొక వస్తువుచే బంధింపబడవలసి వచ్చును! కాని ఆ

బంధము స్వయముగా విడిపోదు. సరికదా, విడిపించి పెట్టవలె నన్నను బుద్ధిపుట్టదు" అని యనెను. నే నతనిని మఱింత రెచ్చగొట్టుచు, "మిత్రమా. నీ వెన్నిసార్లు ఆ విధముగ బంధింపఁబడితివి!" అని యంటిని. ధావకుడు నిర్లక్ష్యముగ, "అరే! ధావకుని సంగతి వదలిపెట్టవయ్యా! తామరాకు నీటిలో నున్నను నిర్లేపముగ నుండును. నిజము చెప్ప మందువా మిత్రమా! నాకీ నృత్యప్రదర్శనములే గిట్టవు. ఎవరో పిచ్చివాఁడగు కవి యొకసారి వర్షాకాలమునం దొక నర్తకి నృత్యోల్లాసపులయను వినెను. కాని మఱుక్షణముననే యతని భావనాశక్తి యూహింపజాలనంతగా మొక్కవోయెను. ఆకాశమునందలి మేఘాడంబరమును, నృత్యశీల యగు విద్యుల్లతను జూచి, మేఘగర్జనమును విని, యీ నృత్య ప్రదర్శన సమయమున విద్యున్నర్తకీ నృత్యారంభమును సూచించు మృదంగ మంగళధ్వనులు మ్రోగెనని యీ కవి శేఖరుడు వర్ణించినాడు. మఱి తర్వాత నేమి జరిగినదో తెలియునా! దగ్ధహృదయుడగు బాటసారి, వికసించిన పుష్ప భారముచే వంగియుండిన చెట్లకొమ్మలపై గూర్చుండిన కాకుల కూతలను వినుటయం దుత్సాహవతియైన ప్రియురాలి విలాసభవనమునకు జనెను.* ఛీ, ఛీ, ఇం దేమైన పొందిక

---

* ఈ శ్లోకముతో సరిపోల్చవచ్చును.

దృష్ట్వాడంబర మంబరే ఘనకృతం సౌదామినీ నర్తకీ
నృత్యారంభ మృదంగ మంగళరవం శ్రుత్వాచ తద్గర్జితమ్।
పుష్ప్యత్పుష్పభరానతాంగణ తరుస్కంధావసద్వాయస—
క్వాణౌ కర్ణన నోత్సవప్రియతమం పాన్థాయయు ర్మందిరమ్॥

కుదిరినదా? ఇదియు నొక కవితయా?" అని యనెను. నే నతనిని మాటలాడింప గోరి, "మిత్రమా, నీ కెందు పొందిక కుదురునట్లుండునో చెప్పు, చూతము!" అని యంటిని. ధావకుడించుకయు తడబడక వెంటనే "మిత్రమా! మేఘ గర్జనము, వర్ష ధారల జరజరలతో ఊయల యూపులే పొందిక ముగ నుండగలవు. సువర్ణ కింకిణీ మందక్వాణనము, 'ఝణ ఝణ'మని మ్రోగుచుండు మేఖలముల తరల ఝంకారము, వాచాలములగు కంకణముల కల స్వనముతో బాటు ఊయల లపై నూగుచుండు మెఱపుతీగవంటి దేహకాంతి గల యువతులే వర్షర్తువునందు ద్యుల్లోక భూలోకములను మేళ వింపజేయగలరు" అని పలికెను. నేను తిరిగి "కవనముచేసి వినిపించరాదటయ్యా, యట్టి మాటలలో నేమున్నది!" అని యంటిని. ధాతకు డుల్లాసమునందు మునిగియుండెను. అందుచే నతడు "అట్టి శోభను ఒక కవిమాత్రమే వర్ణింప గలడు! అదికూడ నెప్పుడో తెలియునా? ఇందీవరాక్షుల కృపాకటాక్ష ప్రసాదమును పొందగలిగినపుడే! అత డెవరో నీ వెఱుగుదువా?—అంగహీనుడగు ఒకానొక దేవత!" * అని పలికి ధావకుడు తా నొకడే ఆ దేవత జాడ నెఱిగినట్లు కన్నులను త్రిప్పెను. నే నించుక యాసక్తి జూపుచు అటు లైన నీవు కన్యాకుబ్జేశ్వరుని కీబుద్ధి యేల ప్రసాదింప లేదు!"

---

* ఈ శ్లోకముతో సరిపోల్పవచ్చును.
సౌకర్య మిందీవరలోచనానాం దోలాసులోలాసు యదుల్లలాస।
యది ప్రసాదాల్లభతే కవిత్వం జానాతి తద్వర్ణయితుం మనోభూః॥

అని యడిగితిని. భావకు డుల్లాసముతో "అయ్యో, భగవం తుడా! ఈ మగధదేశపు దద్దమ్మ నాకెక్కడ దాపురించి నాడో! అది కాదోయీ, ఈ యుత్సవములన్నియు మీ భట్టిని కొఱకే ఏర్పాటు చేయబడినవని యనుకొనుచున్నావా! ఇది యంతయు విద్రోహులగు కాన్యకుబ్జపు ప్రజలకు మత్తు గల్గించుటకై రాజుగారి తరఫున జరిగిన యేర్పాటే సుమా! భట్టిని స్వాగతము చేయుట పేరునకుమాత్రమే. ఇచ్చటి రసజ్ఞత నెఱుగని ప్రజలకు కావ్యౌచిత్యముతో నేమి పని! చారుస్మితి విస్మృతపాంగల నృత్యమేదైనను, నొల్లుచుండినను సరే, జను లచట కిక్కిరిసిపోవుదురు. మేధాతిథి, వసుభూతి మొదలగు ధర్మాచార్యులు తల పగులకొట్టుకొని చచ్చినను సరే. కాన్యకుబ్జపు ప్రజలు మహారాజాధిరాజుల కీర్తిగానము చేసెదరు. మిత్రమా! నీ వింతమాత్రము కూడ నెఱుగక యే దేవపుత్రినందని మంత్రివైతివా!" అని తన మాటల వలన నాపై నెట్టి ప్రభావము పడెనో యని భావకుడు లెక్క చేయకయే "అని యీ సుస్మిత యను నర్తకియే, హావ భావ హేలా ప్రదర్శనమున నామె యద్వితీయురాలు. ఆమె సాత్త్వికాభినయము నంత గొప్పగ చేయలేదు, కాని యామె విన్యాసములం దొక యపూర్వ లావణ్యము కలదు. ఆమె పిల్లనగ్రోవి నెంత మనోజ్ఞముగ మ్రోయించునో మృదంగమును కూడ నటులనే వాయింపగలదు. సోమరితన మన్నది యామె చెంతను చేరదు. ఆమె నృత్యము చూడవలసినదే కాని వర్ణింప నలవికానిది. భరతముని తన శాస్త్రమున

నర్తకీగుణముల నామెను చూచియే వ్రాసియుండెను! ధన రూప గుణములయందును, ఔదార్య సౌభాగ్య ధైర్యసాహసములందును, ఆమె కెవరును సాటిరారు. ఆమె యెంత కోమలమైనదో యంత మాధుర్యముగలది. ఎంత నేర్పుగలదో యంత యింపైనది *ఈ నగరమున కామె శృంగారము. నిజమున కామె శోభయే ఆమె నృత్యమునకు మెఱుగు, బెట్టుచుండును" అని యనెను.

నేను ధావకుని యానందమును చవిచూచుచు అతని వలన నింకెన్నో విషయములు తెలిసికొనగోరి "మఱి విద్యుదపాంగలో నేమి గుణములు కలవు?" అని యడిగితిని. అతడు "విద్యుదపాంగ విషయమే వేరు. ఆమె బాగుగ పాడగలదు. రూపమునుగురించి నేనెందులకు చెప్పవలెను. పేరును బట్టి నీవే తెలిసికొనవచ్చును నూఱు మనసులను కలచి వేసినంతనుఱకు లోలకటాక్షములు కూడ హృదయ భేద్యములు కాజాలవని యనుచుందురు. విద్యుదపాంగ కటాక్షము లట్టివే! అని యనెను: నేను మరల "కవీ! నీ వెప్పుడైన గాయపడితివా?" అని యడిగితిని. అతడు పొట్ట చెక్కలగునట్లు నవ్వి "మిత్రమా! కవి యెన్నటికి గాయపడడు. అతడు గాయపఱచుచుండును: క్రీగంటి బాణములతోగాదు కాని వ్యంగ్యబాణములతో" అని యనెను.

---

* ఈ శ్లోకముతో సరిపోల్చవచ్చును.

అర్థరూప గుణౌదార్య సౌభాగ్య ధైర్య వీర్య సంపన్నా
పేశల మధురా స్నిగ్ధా సచవికలా చిత్రకర్మ కుశలాచ ॥

నాట్యశాస్త్రము 34/46

చాలసేపటివఱకు ధావకుడు తాను నవ్వుచు నన్ను నవ్వించుచుండెను. అతనిది ప్రత్యేకమగు నిర్లిప్తమైన యానందలోకము. ఇతర కవులే సన్నివేశమును జూచి కరగి పోవుదురో ఆ సన్నివేశమే తన యానందమునకు ప్రాణపదిక యగును. వెళ్లునపు డతడు "మిత్రమా, ఒక విషయమున మాత్రము నీవు జాగరూకుడవై మెలగుము. కన్యాకుబ్జమున నెవరిపైనను నమ్మకముంచవలదు. అందఱు నీకే కీడు చేయ దలతురు. కాశీనుండి వచ్చుచున్న ఆ మీమాంసాచార్యుని గూడ ననవసరముగ నన్నిచోట్ల తగులుకొనుచుండవలదని హెచ్చరింపుము. కన్యాకుబ్జ మొక విచిత్రమగు ప్రాంతము. ఇచట నొకసారి యుపహాసింపబడినయెడల నతనికి ముక్తి లేదు. విరోధులగు విద్వాంసుల నిచ్చటివారు చిటికెలో నొకర గొట్టుదురు" అని చెప్పెను! వెళ్ళునపుడు ధావకుడు నన్ను గాఢాలింగనము చేసికొని నా యొద్ద సెలవు తీసుకొనెను. నే నతనిని సాగనంపుటకు చాల దూరమునకు వెళ్ళితిని. నేను వెంట నున్నంతవఱకు ఒక నిముసమైనను అతని నోరు మూతబడలేదు. అతనివలన నెన్నో విషయములు నాకు తెలిసినవి, అవధూతపాదులగు అఘోరభైరవు లిచటనే చండికాలయమున నున్నారనియు సుచరితావిరతివ్రజుల త్రైలోక విచిత్రమగు ధర్మాచరణము శాంతముగ నడచు చున్నదనియు, ఉడ్డియానపీఠమునకు జెందిన వైష్ణవాచార్యుడు మాయమైపోయెననియు మహారాజాధిరాజులు 'రత్నావళి' యను నాటికను రచించిరనియు ' ఆ నాటికయందు వారు మారవధూశరణ్యమగు బోధిసత్వుని ప్రార్థనచేయుట

*పార్వతీ లక్ష్ములు నామములను స్మరించి హరిహరులను ప్రార్థించెననియు భావకుని కొన్ని శ్లోకములందు చేర్చబడిన వనియు మున్నగు విషయములు నా కతనివలన తెలియవచ్చెను. అతనిని సాగనంపివచ్చిన తర్వాత నతడు చెప్పిన మాటలు నా చెవులలో గింగురుమనుచుండెను. ఈ కవియొక్క సర్వాంగముల నావరించుకొని యెట్టి సహజమగు నానంద ప్రవాహము అలలు కొట్టుచున్నది. ఇట్టి యుత్సాహము, ఇంత యుల్లాసము, ఇంతేటి నిర్లిప్తతను కలిగించు ఆ రసనిర్ఘరణి యెట్టిదో కదా! తన కెవరైన విరోధులుందురను భయము గాని, తన మాటలవలన సితికులు తనను మంచివాడని యో, చెడ్డవాడనియో ఎంచెదరేమోయని యోచనగాని యతనికి లేదు. ఆతడీ ప్రపంచమునుండి ఆనందరసమును గ్రోలుటకు మాత్రమే జన్మించెనాయని యనిపించుచుండును. అందు వలన నితరులకు సుఖము కలిగినను సరే, దుఃఖము కలిగినను సరే, చెరకుముక్కనుండి కృషీవలుడు రసము గ్రహించినట్లు అతడుమాత్ర మానందరసమును గ్రోలుచుండును.

*నాగానందములోని ఈ శ్లోకములతో సరిపోల్చునది :—

ధ్యాన వ్యాజముపేత్య చింతయసి కాముస్మీల్య చక్షుః క్షణం
పశ్యానంగ శరాతురం జనమిమంత్రాతాపినో రక్షతి।
మిథ్యాకారుణికోఽసి నిర్ఘృణ తరస్త్వత్తః కుతోఽన్యః పుమాన్
ఇత్థం మారవధూభిరత్యభిహితో బౌద్ధాజినః పాతువః॥
కామేనాకృష్య చాపం హతపటుపటహావల్గిభిర్మారవర్గై
ర్భ్రూభంగోత్కంప జృంభాస్మిత లలితవతా దివ్యనారీజనేన।
ప్రహోవ్వత్త మాంగైః పులకిత వపుషా విస్మయాద్వాసవేన
ధ్యాయం బోధేరవాప్తా వచలిత ఇతివః పాతుదృష్టో మునీన్ద్రః॥

చారుస్మిత నృత్యము కన్యాకుబ్జపు విద్రోహులగు ప్రజలను పీకపట్టుకొనుటకై ప్రయోగింపబడిన యంత్రమని ధావకుడు చెప్పియుండెను. ఇది నిజమేనా ? ఇది యెట్టి హృదయము విదారకమగు వార్త. కాని ధావకుడీ వార్త నెంత సహజముగ జెప్పెను ! చారుస్మిత కీర్తిని నేను వినియుంటిని. ఆమె గుణములను నేడు ధావకుడు వివరించియుండెను. ఆమె యెట్టి గుణసంపన్నురాలు ! కాని యెట్టి నీచోద్దేశముతో నామె నుపయోగించుకొనుచున్నారు ? గణిక నగరమునకు శృంగారమా ? లేక నగరమున కలంకారమా ? ఆమెయందు అమృతవిషములొకే సారిగ మేళవించినవా ! శూద్రకుడు వసంతసేనను పద్మములేని లక్ష్మి, అనంగుని సుకుమారాస్త్రము, కులకాంతల శోకము, మదనవృక్షపు కుసుమము అని వర్ణించెను. * ఇదెట్టి క్రూర పరిహాసము ! ఏది లక్ష్మియో అదే శోకముగను, ఏది కుసుమమో అదే మారణాస్త్రముగ నున్నది ! "మ్లేచ్ఛులని మీరు తలంచు స్త్రీలలో రాణి మొదలుకొని పరిచారికవటుకును వందలాది అంతస్తులు లేవని" భట్టిని నాతో చెప్పియుండెను. ఇది నాకు ఆశ్చర్యము గొల్పు విషయమే ! ఆ సంఘములోనే స్వర్గముండునని నా మనస్సు చెప్పుచున్నది. నేడు కనబడుచున్న దుఃఖతాపము,

---

* అపద్మాశ్రీరేషా, ప్రహరణ మనంగస్య లలితం
కులస్త్రీణాం శోకో, మదన వరవృక్షస్య కుసుమమ్
సలీలం గచ్ఛన్తీ రతి సమయ లజ్జాప్రణయనీ
రతిక్షేత్రే రంగేప్రియ పథిక సార్థైరనుగతా ॥

(మృచ్ఛకటికము 5/12)

ప్రతి హింస, ఘర్షణము, పర స్త్రీ గమనము, మొదలగునవి వికృతమగు సంఘవ్యవస్థకు పరిణామములు. ఈ విషయమును భట్టిని తెల్పికొనెను. ఆమె రక్తజ్వాలలందు తపించి యీ పవిత్రజ్యోతి వెలువడినది. మ్లేచ్ఛులలో శాస్త్రాభ్యాసము లేకుండ నుండవచ్చును; ధర్మాచరణము తక్కువై యుండవచ్చును; దారిద్ర్యము ప్రబలియుండవచ్చును; ఆ లోపములను తొలగించిన యిచట స్వర్గము నిర్మింపబడినట్లే కాని యీ సంఘములో స్వర్గనిర్మాణము కష్టమైనది. ఇచట స్వార్థము ప్రబలముగ నున్నది లోభమోహములు బలిసిపోయి యున్నవి. మహాకవి కాళిదాసు భావించిన యక్షలోకమునందలి సంఘమున నందఱికి నొకేవిధమగు గౌరవముండెను. అశ్రువు లున్నచో నవి యానందాశ్రువులే; పీడయున్నదియున్నచో నది ప్రేమపీడయే; వియోగమున్నచో నది ప్రణయ కలహమున ఉత్పన్నమైనది. ముసలితనమనుట యచ్చునకైనను లేదు * హిమాలయపుకొండల కటువైపున కాళిదాసు భావించిన యక్షలోకమును గాంచనగునని భట్టిని చెప్పుచున్నది, కాని నాలో అంతటి శక్తి కలదా?

కొండ చరియల కటువైపు గర్హింపదగిన మ్లేచ్ఛజాతులు నివసించుచున్నవని నేను వినియుంటిని. దారి దోపిడి

---

* ఆనందోత్థం నయన సలిలం యత్రనాన్యైర్నిమిత్తై
ర్నాన్యస్తాపః కుసుమ శరజాదిష్టసంయోగసాధ్యాత్।
నాప్యన్యస్మాత్ ప్రణయకలహా ద్విప్రయోగోపపత్తిః
విత్తేశానాంనచ ఖలు వయో యౌవనాదన్యదస్తి
మేఘసందేశం 2/4

డియే వారి వృత్తి. దేవాలయముల నపవిత్ర మొనర్చుటయే వారి మతము. బ్రాహ్మణ శ్రమణులను వధించుట వారి వినోదము. కుల స్త్రీలను, కన్యకలను చెఱచుటయే వారి విలాసము. హత్య, గృహదహనము మున్నగునవి వారి కర్తవ్యములు. పురుషపురమునుండి సాకేతమువఱకు నున్న విశాల జనపదమునంతయు వారు నలుగద్రొక్కి యుండిరి. మహాకవి రఘువంశమున విధ్వంసమైన అయోధ్యానగరమును వర్ణించు నెపమున నీ నీచులగు దోపిడిగాండ్ర పాపకృత్యములను వర్ణించెనని మనము పరంపరాగతముగ వినుచున్నాము. ఈ దారుణ విధ్వంస లీలలను దలచుకొన్నపుడు నా యొడలు పులకరించును. ఏతత్కారణముననే సాయంసమయమున ప్రచండమగు ఝంఝూమారుతము వలన పటాపంచలైన మేఘములవలె నగరములు కాంతిహీనమైనవి. గాఢాంధకారపు రాత్రులందే రాజమార్గములయందు నిర్భయముగ తిరుగుచున్న అభిసారికల మంజీర ధ్వనులు వినబడుచుండెనో వానియందు తోడేళ్ళ భయంకరారావము వినబడసాగెను. ఏ సరోవరమందు జలక్రీడాసమయముల మృదంగ మధుర ధ్వని వినబడుచుండెనో వాని నిర్మల జలములు అడవి దున్నలు పొరలాడుటచే బురదమైపోయెను. మృదంగ తాళము ననుసరించి లాస్యముచేయు నభ్యాసము గలిగి సువర్ణయష్టుల మీద విశ్రమించుచున్న క్రీడా మయూరములు అడవి నెమళ్ళవలె మ్రాటిపోయెను; వాని కోమల పింఛములు దావాగ్నిచే మాడిపోయెను. ఏ మేడల మెట్లపై రమణీమణుల కలస్వనయుక్తమగు పదసంచారము జరుగు

చుండెనో, అందు పెద్దపులుల రక్తసిక్తములగు నడుగులు పడు చుండెను! తామరవనమునందు దిగి మృణాలనాళములచే కరేణువులను తృప్తినొందించుచుండిన రాజుగారి పెద్ద పెద్ద మదగజములు సింహములచే తఱుమబడెను. సౌధస్తంభములపై నున్న దారుబొమ్మల రంగు మాసిపోయి వానిపైని వ్రేలాడుచుండిన పాము కుబుసములే, యా బొమ్మల యుత్తరీయములై యొప్పుచుండెను. రాజమహలుల యొక్క నిర్మలములైనట్టియు, ధవళములైనట్టియు ప్రహరీగోడలు నల్లబడి వాని నెఱియలనుండి గడ్డిపోచలు మొలిచియుండెను; చంద్రకిరణములు గూడ వానిని పూర్వమువలె ప్రకాశింపజేయజాలకున్నవి. విలాసినులే యుద్యానశాలనుండి ప్రేమతో పువ్వులు కోసికొనుచుండిరో! వానిని వానరములు ఛిన్నాభిన్నము లొనర్చెను. మేడల కిటికీలు రాత్రులందు మంగళదీపములచేతగాని, పగటియందు గృహలక్ష్ముల ముఖకాంతులచేతగాని భాసిల్లుచుండుటలేదు. వారి మానము కాపాడుటకా యన్నట్లు వానిపై సాలీళ్ళు తమ గూళ్ళ నల్లియుండినవి. నదీసైకతములపై పూజావస్తువు లేవియు కనబడుటలేదు. స్నానముల హడావిడి తగ్గిపోవుటచే నదీతీరమున నున్న ప్రబ్బలి తీగల పొదరిండ్లు శూన్యములయ్యెను. * ఇట్టి విధ్వంసలీలల క్రీడించునట్టి మ్లేచ్ఛులకు గూడ మానవులకు బోలె హృదయమున్నదా! భట్టిని యేల ఇట్లనుచున్నది! మానవు లింత నిర్దయులై, యింత బీభత్సులై, క్రూరులై

---

* చూడుడు రఘువంశము 16-11-21

యుండుట సంభవమా! కాని భట్టిని వీరికి గూడ రాగాత్మక మగు హృదయము గలదని యనుచున్నదే!

నేనీవిధముగ నాలోచనా పరంపరలలో చిక్కుకొని కూర్చొనియుండ, నిపుణిక వచ్చి నన్ను పిలిచెను. అప్పటి కాకాశము నీలమేఘములచే నల్లబడి యుండెను. దూరమున నున్న వృక్షముల నల్లని రేఖలపై మేఘచ్ఛాయలు పడి నందున వనప్రాంతమంతయు మఱింత నల్లనై యుండి యాకాశము సూర్యబింబమునే ఒక పెట్టున మ్రింగి వేసినా యన్నట్లుండెను. ప్రొద్దింకను మిగిలియున్నను ప్రకాశము పూర్తిగ లోపించియుండెను. ఈ నల్లదనపు పార్శ్వమున, నిపుణిక గీటురాయిపై బడిన బంగారు గీతవలె కమనీయముగ నగపడుచుండినది. ఆమె పాండురకపోలముల మధ్య ఆనంద రసాయనముచే నపూర్వ సౌందర్యమును దాల్చియుండినది. ఆమె స్వరమునందు మునుపటికన్న నెక్కువ మాధుర్యము వచ్చియుండెను. నిపుణికను జూచి నాకు చాల సంతోషము కలిగినది. ఆమె యధరములపై చిఱునగవు తొణుకుచుండి నది; కన్నులలో లీలావిలాసము మెఱయుచుండినది. స్వరము నందొక ప్రమత్తత గోచరించినది. నేను హర్షముతో "ఏమి సమాచారము, నిఉనియా!" అని యడిగితిని. నిపుణిక నా వైపు గూడకయే "భట్టిని చెప్పినది నీ కర్థమైనదా!" అని యడిగెను. నేను "భట్టిని యెన్నో విషయములు చెప్పినది. అందుకొన్ని విషయములను నే నర్థము చేసికొన్నాను. కొన్నింటి నర్థము చేసికొనుటకు ప్రయత్నించుచున్నాను" అని యంటిని; నిపుణిక నవ్వుచు "అదికాదు, నే నన్నిమాటల

విషయమై యడుగుటలేదు; మహారాజాధిరాజుల స్వాగతము నకు తగిన యేర్పాటు చేయుమని యాదేశించియుండెనే. దానిని నీ సర్థము చేసికొన్నావా ?" అని యనెను. నే నెన్నో యాలోచనల మధ్య ఆ విషయమునే మఱచియుంటిని. నేనా విషయమై యాలోచింపనే లేదు. నే నందుకై చింతిల్లుచుండుట జూచి గాబరాపడవలసిన పనిలేదు లెమ్ము. నేను చెప్పునది వినుము. నీవును నేనును మరల నాటకాభినయనముల నలవాటు చేసికొనవలసి యుండును. నీ నటనాకౌశలమును గుఱించి భట్టిని నావలన నెన్నో సంగతులు తెలిసికొని యున్నది. నీ మనోహరమగు నటన జూడవలెనని యామె మనసునందు కోర్కె గలదు. మహారాజాధిరాజేదో నాటిక రచించెనని నీ కవిమిత్రుడు చెప్పుచుండెను గదా! దానినే నాడు నీవు రంగస్థలమున నేందుకు ప్రదర్శించరాదు? అని యనెను. నిపుణిక నన్నొక క్రొత్త చిక్కులో పడ వేసెను. నేను నాటకాభినయనమును విడిచిపెట్టి యెన్నో దినములైనది. అంతేకాక భట్టిని యెదుట నభినయించుట యసంభవముగ తోచుచుండెను. కాని ఆమెకా యభిలాష యున్నయెడల అసాధ్యమగు దానియందైనను దుముకవలసినదే. నే నింకను మఱికొన్ని విషయములు తెలిసికొననెంచి "నిపుణికా, రంగస్థలము పైకి వచ్చు సాహస మింకను నీకు కలదా ?" అని యంటిని. నిపుణిక తన కన్నులను వాల్చుకొనెను. ఆమె నవ్వొక క్షణములో మాయమై యామె నిట్టూర్పామె పాండుర ముఖమండలమును ధూమ్రమొనర్చెను. ఆమె "నే నిప్పుడభినయము నేకదా చేయుచున్నది, నిజమైనదాని నణగ

ద్రోక్క నిజముగ నిదాని నాంగీకరించుట అదేకదా యభి నయము. జీవితమంతయు నీ నటనయే చేసితిని. ఒక దినము రంగభూమిపై నభినయించుటవలన చెడిపోవునదియు లేదు. సిద్ధించునదియు లేదు" అని యనెను. నిపుణిక మాటలు నా హృదయమును కలచివైచెను. నిజముగ నీ జీవితమొక నటనయా? అడుగడుగున బంధవము. ప్రతిశ్వాసము నడచి వేయుట—ఇవి యన్నియు నభినయనము లేకదా? నిపుణిక యిందులకై దుఃఖించుచున్న దేల? ఈ యభినయమునుండి తప్పుకొనుట సాధ్యమా? ఒక్క క్షణకాలము జీవితమునందలి యీ జడబంధమునుగూర్చి యాలోచింపసాగితిని. కాని మఱుక్షణమే దాని యుత్తమగుణముకూడ గుర్తునకు వచ్చెను. ఈ కట్టుబాట్ల నడిగట్లమధ్య బంధింపబడినపుడె జీవితమను నదినది గతిమంతమై, రసవంతమై మధురమగుచున్నది; నేను కాదు. నిడునియా! బంధనమే సౌందర్యము. ఆత్మదమనమే సురుచి. అడ్డంకులే మాధుర్యము. ఇవి లేనిచో ఈ జీవితము వ్యర్థమైన భారస్వరూపమగును. నగ్నరూపమున ప్రకటితమైనప్పుడు వాస్తవికము గర్హణీయమగుచున్నది" అని యంటిని. ఉద్దీపితమగు దీపశిఖ అంధకారమును తొలగించు చందమున, ఈ చిన్నమాట నా హృదయమును జ్యోతిర్మయ మొనర్చెను. మ్లేచ్ఛజాతియందు సంశయము లేదు. ఆత్మనిగ్రహము లేదు. వారి కిదియే యవసరము భారత దేశమున సంఘము బంధములనే సత్యమని నమ్మి ప్రపంచమున కొక గొప్ప మేలొనగూర్చినది. చాలసేపటివఱకు మే మిరువురము మౌనముగ కూర్చుండి యుంటిమి. వెలుపల

కుండపోతగా వర్షము కురియుచుండెను. లోపల ఆలోచనా ప్రవాహములు తీవ్రవేగమున పరుగులెత్తుచుండెను. అట్టి సమయమున మధురకోమల స్వరముతో శూన్యమునంతయు నింపుచు భట్టిని మహావరాహుని స్తోత్రము చేసెను.

జలౌఘమగ్నా సచరాచరాధరా, విషాణకోట్యాఖిల
విశ్వమూర్తినా।
సముద్ధృతా యేన వరాహరూపిణా, స మే
స్వయంభూర్భగవాన్ ప్రసీదతు ॥

మా యాలోచనల కంతరాయము కలిగెను. భట్టిని పూజ ముగిసెను. నిపుణిక నిద్రనుండి మేల్కొన్నదానివలె "నిజమే భట్టూ, బంధనమే మాధుర్యము" అని పలికి భట్టిని చెంతకు వెడలిపోయెను.

# పందొమ్మిదవ అధ్యాయము

శ్రీ హర్షవర్ధన మహారాజులను, రాజ్యశ్రీ మహారాణిని సందర్శించి భట్టిని చాల సంతోషించాను. మహారాజుగారి సౌజన్య స్నేహము లామె హృదయమును వశము చేసికొనెను. ఆమె వారి సొంత చెల్లెలువలె నుండెను. రాజశ్రీ మహారాణి యాజ్ఞను పొంది నేను వాగ్భట్టుని భట్టినియొద్దకు గొని తెచ్చితిని. ఆమె యతని గలిసికొన నభిలషించెను. ఏ దేవపుత్రనందికి సామ్రాజ్య మంతయు ముప్పొంగి పోవుచున్నదో ఆమె యొకానొకప్పుడు చిన్నరాజుగారిచే నపహృతయై తన కాపురదలతో నుంచబడిన రాకుమార్తెలలో నొకతెయని యీ వృద్ధున కింకను తెలియలేదు. త్రోవలో నన్నాతడు రెణ్ణుమార్లు, "భద్రా, దేవపుత్రినందిని నన్నెందుకు పిలువనంపినది!" అని యడిగెను. వృద్ధుని సాకణ్యము మోహముగ నుండెను. నేనుకూడ నాశ్చర్యమును కనబఱచుచు "నిజమే దేవపుత్రనందిని యిమ్మాల నెందులకు పిలువనంపినదో నాకుకూడ నాశ్చర్యముగనే యున్నది!" అని యంటిని. చివరకతడు తనకు తానే మనస్సును సమాధానపఱచుకొని "భద్రా దౌర్భాగ్యపు పరిహాస మిది. ఇరువది సంవత్సరములనుండి నేను మౌఖరీ రాజవంశపు టంతఃపురమునందు కంచుకినై పనిచేయుచున్నాను. నా భాగ్యము నాయందున్న మౌఖరీవంశపుటన్న సారమును పూర్తిగా పీల్చివేయదలచినట్లున్నది. నే నంతఃపురమును రక్షించుట కసమర్థుడనని దృఢపరచుకొన్నాను.

నన్నింకెవ్వరు నమ్మగలరు, మహారాజుకి నాపై నున్న
విశ్వాసమే యంతరించినది. ఈ ముసలితనమునందు పురుష
పురమునకు వెళ్ళవలెనో లేక కొండకనుమల కటువైపు వెళ్ళ
వలయునో తెలియకున్నది" అని వృద్ధుడు గ్రుడ్ల నీరు గ్రుక్కు
కొనెను. పాపము ఆ ముదుసలి మనస్సున మౌఖరీవంశపు
టన్నమునకై యెట్టి మోహముండెను?

స్కంధావారపు వెలుపలి భాగమున నేను వృద్ధుని
కూర్చుండబెట్టి భట్టినికి సమాచార మందజేయుట కుద్యు
మించుచుండ నిపుణిక యచటికి వచ్చెను. ఆమె తన చీర
కొంగును మెడకు చుట్టుకొని యా వృద్ధునికి సాష్టాంగ
ప్రణామ మాచరించెను. వృద్ధుని మందదృష్టి మొట్టమొదట
నామెను గుర్తింపలేదు. కాని యామె ప్రణామ మాచరించి
లేచునంతటిలో అతడామెను గుర్తుపట్టెను. ఒక్క క్షణకాల
ములో అతని ముఖము వెలవెలబోయెను. అతడు భయ
పడుచు, "నీవా నిపుణికా!" అని యనెను. నిపుణిక వృద్ధుని
మనోభావమెఱింగి యాతని నూరడించుటకై, "అవును
ఆర్యా! నేనే. కాని నీ ముఖ మెందులకింత వెలవెల బోవు
చున్నది! నేను మిమ్ములను భట్టినికడకు తీసికొనిపోయెదను
రండు" అని యనెను. పాపము వృద్ధునికి తేలుకుట్టినట్లయ్యెను.
అతడాశ్చర్యచకితుడై "భట్టినియా?" అని యనెను; నిపుణిక
"ఆర్యా! అవును భట్టినియే మిమ్ములను పిలువనంపినది"
వృద్ధుని శరీరము చెమటలు కారజొచ్చెను. అతడేదో
అర్థము చేసికొనుటకు ప్రయత్నము చేయుచుండెను. కాని
యతని కేమియు బోధపడలేదని క్రిందకు జూచుచున్న

యతని కన్నులే తెలుపుచుండెను. అతడు గాబరాపడుచు "నీ వేమనుచుంటివి? ఏ భట్టిని?" అని యనెను. నిఉనియ ప్రశాంతముగ, "ఆర్యా! వ్యాకులత నొందకుడు. నేను మిమ్ములను దేవపుత్రనందినికడకు గొనిపోవుచున్నాను" అని యనెను. వృద్ధుడు సందేహముతో నన్ను జూచి యిష్టము లేనట్లు నిపుణిక వెంట లోనికి వెళ్ళెను.

వృద్ధుని జూచినంతనే భట్టిని విశాల నయనముల నీరు గ్రమ్మెను. ఆమె యాదరముతో నతనికి నమస్కరించెను. పాపమా వృద్ధునికి దిక్కుతోచమి ప్రతి నమస్కారము కూడ చేయలేదు, నతడు భయ సంభ్రమములతో, "భావి మహారాజ్ఞికి జయమగుగాక!" అని బిగ్గరగా నరచెను. భట్టిని కపోలపాలిపై కన్నీటి బొట్టు బొట్టు కారుచుండెను. వృద్ధుడా విషయము నర్థము చేసికొనుచు, "దేవీ, అపరాధము క్షంతవ్యము. అభ్యాసవశమున నే ననుచితము పలికినను క్షమింతురు చున్నాను. చిన్న రాజవంశపు భావి మహారాజ్ఞిని గుర్తించుటలో నేను పొరబడుచుండలేదు కదా! దేవీ, మౌఖరీవంశీయుల కలచుకన్నై నేను నా జీవిత సర్వస్వమును నాశము చేసికొన్నాను. నేడు మహాదేవిని చూచి నేను సంతోషింపవలయునో, దుఃఖపడవలయునో నాకు తెలియకున్నది. తల్లీ! అవయవములు సడలిన వృద్ధుడు మీ దయకు పాత్రుడు. నేను తమ ముఖతః యెన్నియో విషయములు వినగోరుచున్నాను" అని యనెను. భట్టిని ప్రత్యుత్తర మొసగక కొయ్యబారినదై యా వృద్ధుని చాల సేపటివరకు జూచుచుండెను. జరిగిపోయిన సంగతు లెన్నో జ్ఞాపకమునకు వచ్చుటచే నిపుణిక కూడ

సుద్రిక్తురాలై మూర్ఛబోయెను. పాపము వృద్ధుడు వారిని చూచుచు, పరిస్థితి సర్దుము చేసికొనుటకు ప్రయాసపడు చుండెను! కడపట నేను, "త్ర్యా! చకితునివలె నెందుకు జూచుచున్నావు? నీ యెదుట నున్నది దేవపుత్రనందినియే. ఈమెనే మౌఖరీవంశీయుడగు చిన్న మహారాజు తన యంతః పురమున బలాత్కారముగ చెరబట్టియుండెను. వ్యర్థముగ నీ వామెను "భావి మహాదేవి" అని సంబోధించి మానిపోయిన ఆమె గాయములను రేపుచున్నావు. నిపుణియు సాహసమువల ననే నేడార్యావర్తము, వినాశ గహ్వరమున పడకుండ తప్పించుకొనుట కాంచుచున్నది. అందువలన నీవు నిపుణికు నభినందింపుము" అని యంటిని. ఈ మాటలు వినినతర్వాత నా వృద్ధుని సంభ్రమము కొంచెము తగ్గెను. అతడు కొంచెము స్థిమితపడి గద్గద కంఠముతో నాశీర్వదించుచు, భట్టిని తలను తన చేతితో నిమిరెను. అతడు, "తల్లీ! నేను సంతుష్టుడనైతిని. నేడు నా పరితాపము కరగిపోయినది. మౌఖరీవంశజుల యంతఃపుర మారక్షణము గావింపలేదను క్షోభ నేడు నా మనసు నుండి తొలగిపోయినది. ఇరువది సంవత్సరముల క్రింద నేనీ పదవియందు ప్రవేశించియుంటిని. ఇన్ని సంవత్సరములలో రెండుమార్లు మాత్రమే నేను నా కర్తవ్యమును నెఱవేర్చలేకపోయితిని. కాని త్రిపుర భైరవి కటాక్షమున నీ రెండు పర్యాయములు నా యపరాధము మూలమున విశాలమగు నీ ప్రపంచమునకు లాభములు కలిగి నవి. గడచిన కొన్ని మాసములనుండి నే సంతాపమున దగ్ధుడనగుచుంటిని. జీవితాంతమున నేను కళంకితుడనైతినని

యనుకొనుచుంటిని. కాని నేను నీ పరిచయమును పొంది యూరడిల్లితిని. త్రిపురసుందరి మాయ నెవరెఱుగగలరు!" అని యనెను. వృద్ధుని యాసీనునిగఁజేయుమని భట్టిని సైగచేసెను. ఆమె కంఠ మప్పటికిని బొంగురుబోయి యుండును. వృద్ధు డాసీనుడైన పిదప మే మందఱము కూర్చుంటిమి, పాపమతని కన్నులనుండి స్నేహాపూరితమగు నశ్రువులు కారుచుండెను. అతడు గడచిపోయిన సంఘటనల నన్నిటినో చాలసేపటి వఱకు జ్ఞప్తికి తెచ్చుకొనుచు, భట్టిని వైపునకు చూచు చుండెను. ఇంతలో నిపుణికకు తెలివివచ్చెను. ఆమె గద్గద కంఠముతో, "ఆర్యా! విశ్వాస ఘాతుకురాలగు నిపుణిక క్షమాపణ వేడుటకు కూడ నసమర్థురాలు. అయినను నేనీ విషయమున నిర్దోషిననియే నా యంతర్యామి వక్కాణించు చున్నది. కాని మిమ్ములను చిక్కులలో పడద్రోసిన దుఃఖము నా కెక్కుడుగ నుండెను. నాకంటె భట్టిని క్కా దుఃఖ మెక్కువగ కలుగుచుండెను. మొదటిమారవకాశము లభించినదే తడవుగ భట్టిని మిమ్ములను రక్షించుటకు ప్రయ త్నించెను. అయినను మీకు కష్టము కలిగినది" అని యనెను, వృద్ధుని కన్ను లశ్రుపూరితము లయ్యెను. అతడు "తల్లీ పశ్చాత్తాపాగ్నిలో క్రమక్రమముగ తప్తమగుచున్నందున ఇపుడు కలుగుచున్నంత దుఃఖము నన్ను నిలువున కాల్చి వేసినను నాకు కలుగదు! నన్ను కృష్ణవర్ధనుల యింటికి నకస్మాత్తుగ పిలిపించినపు డెవరైన నాకు దేవపుత్రనందినిని గుఱించిన యథార్థమును తెల్పియుండిన నే నిట్లు పరితాపా గ్నిలో మాడియుండను" అని యనెను. ఈమాటు భట్టిని

కలుగజేసికొని "ఆర్యులకేదైన దండన విధింపబడెనా!" అని యడిగెను. వృద్ధుడు "తల్లీ! నాకు దండన విధింపబడ లేదు. ఇంత గొప్ప యపరాధమునకు నాకు మృత్యుదండన యేల విధింపబడలేదో నాకు బోధపడలేదు!" అని యనెను.

వృద్ధుడు కొంతసేపటివఱకు కన్నులు మూసికొని యేదో యాలోచించుచుండెను. తర్వాత నతడు భట్టినిని జూచుచు "తల్లీ! నీవు వెళ్ళిపోయిన తర్వాత నేను చాల దుఃఖితుడనై యున్నాను. నేను నా యన్నదాత సేవయందు దోష మొనర్చితిననియు తుషానలములో నన్ను వేసినను నా పాపము శమింపదనియు కాని నా విశ్వాసమే చలించి పోయెనని నాకు స్ఫురించుచున్నది. నేటికి పదునైదు సంవత్సరములకు ముందొక తాంత్రిక యోగి చెప్పిన జోస్యము అక్షరాలా సరియగుచున్నది. జీవితమునందలి గొప్ప సత్యమును నేను నేడు గాంచుచున్నాను. నా ప్రత్యణువు కంపించుచున్నది" అని యనెను.

భట్టిని యాశ్చర్యముతో "ఆర్యా, తాంత్రిక యోగి యేమని చెప్పియుండెను?" అని యడిగెను.

వృద్ధుని యవయవము లలసిపోయి యుండెను. భట్టిని నిపుణిక వైపునకు చూడగనే నిపుణిక శీఘ్రముగ వెళ్ళి కొంచెము పాలు తీసికొని వచ్చెను. పాలు త్రాగిన తర్వాత వృద్ధుని ప్రాణములు కుదుటబడెను. నిపుణిక మెల మెల్లగ వినుచుండ వృద్ధు డీవిధముగ చెప్పదొడగెను.

"తల్లీ! ఇరువది సంవత్సరముల క్రిందట నేను కంచుకిగా చేరితిని. మొదట నేను మౌఖరీవంశపు రాజుల యంతః

పురమున కంచుకిగా నియమింపబడితిని. నే నప్పటికే డెబ్బది సంవత్సరముల వయసుగలవాడనైనను నా నాడులలో శక్తి యుండెను. ఏమి చెప్పను తల్లీ, రాజాంతఃపురమున వేత్రమును ధరింపవలెనను నియమము గలదు. ఆ దినములలో బెత్తము నాచారమని యెంచి నేను ధరించితిని. నేడు శరీరమునందు శక్తి తగ్గిపోగా ఆ బెత్తమే యూతకఱ్ఱవలె నుపయోగపడుచున్నది; తడబడకుండ నడచుటయే యరుదగుచున్నది. నేను చిన్నరాజుగారి యంతఃపురమున గడచిన యైదు సంవత్సరముల నుండియే పనిచేయుచున్నాను. ఈ యిరువది సంవత్సరములలో అంతఃపురమున కెందఱో యువతులు గొని రాబడిరి. నే నందఱిని మౌఖరీవంశపు నా పితృ పితామహులు నా కొసగిన శిక్షణ యిదే. నే నే యువతిని గుఱించియు తెలిసికొనుటకు ప్రయత్నించలేదు. వారు మౌఖరీవంశపు కులవధువులనియే వారిని గుఱించి నాకు తెలిసిన సంగతి. నా జీవితమున రెండు పర్యాయములు మాత్రమే యిచ్ఛలేకపోయినను ఆ యువతుల పూర్వ జీవితమును గుఱించి తెలిసికొనవలసివచ్చెను. నేడొక యువతినిగూర్చియు మఱియొక యువతినిగూర్చి పదునైదుసంవత్సరములకు ముందును తెలిసికొంటిని."

వృద్ధుని కన్నులలో నొక క్రొత్త వెలుగు కనబడెను. అతడు దగ్గి, గొంతు సవరించుకొని తిరిగి యిటుల జెప్పనారంభించెను.

"నేటికి పదునైదు సంవత్సరములకు పూర్వము గ్రహవర్మ యంతఃపురమున సాధారణముగ నంతఃపురములలో

జరుగని యొక సంఘటన జరిగెను. మౌఖరీ నరేశుడు కులూత రాజకన్యను వివాహమాడి యుండెను. నేను నియమింపబడుటకు ముందే యా వివాహము జరిగియుండెను. అప్పుడప్పుడు వదరుబోతు దాసీజనము రాజుగారికిని రాణికిని పొందిక లేదని చెప్పుచుండెడిది. కాని నేను రాణిగారియందే విధమగు కాఠిన్యముగాని దుఃఖముగాని జూచియుండలేదు. ఆమె యహోరాత్రములు పూజాదులయందు నిమగ్నరాలై యుండెడిది. రాజుగారామె చెంతకు ఎప్పుడో యొకసారి వచ్చెడివారు. కాని వారు వచ్చినపుడు మాత్రము రాణిగారు వారికి మర్యాద చేసెడిదే కాని యెక్కడనో యేదో ఘర్షణ జరుగుచుండెనదనుటకు సందేహము లేదు. ఏలయన రాజుగారామెకడ నొక ముహూర్తకాలమునకంటె నెక్కువగ నెప్పుడు నుండలేదు. నేనీ రహస్యమును తెలిసికొనుటకెప్పుడును ప్రయత్నము చేయలేదు. అవరోధ జన రహస్యముల నెఱుంగగోరుట కంచుకి ధర్మమునకు విరుద్ధము. ప్రాణముల నర్పించియైన కులవధువులను రక్షింపవలెననియే మా పితృ పితామహులు నాకొసగిన శిక్షణ. నాకందఱు వందనీయులే. అందఱు సమానులే. రాజైనను సరియే, అంతఃపుర మర్యాదల నుల్లంఘించు వాని తలనుత్తరించుటయే నా విధి. రాజు ప్రపంచమునకంతకును రాజు కావచ్చును; కాని యంతఃపురమున మాత్ర మతడు స్వతంత్రుడు కాడని మా పితృపాదులు నాకు చెప్పియుండిరి. కంచుకి రాజుగారి యుప్పుతినును. అతడు రాణిగారి యుప్పుతినియే బ్రతుకుచుండును. అందువలననే

కులూతరాజు కుమార్తె రహస్యము నెఱుగుటకు నేను ప్రయత్నింపలేదు.

ఒకనాడు రాణి స్వయముగా నన్ను పిలిపించి "మహామాయ సన్న్యాసము స్వీకరించినదని రాజుగారితో చెప్పుము" అని నన్నాదేశించెను. ఆశ్చర్యము, దుఃఖము జిజ్ఞాస మొదలగు భావము లొకదాని వెంట నొకటి నాకు కలుగుచుండ నే నామె వైపునకు జూచితిని. ఆమె కాషాయ వస్త్రములను దాల్చి కుంకుమ పూసిన త్రిశూలమును చేత బట్టుకొని యుండెను. లోధ్రపుష్పము వలె అడవిలో వికసించిన చంద్రమల్లికాపుష్పము వలెను, నామె ముఖము సంభ్రమ వ్యాకులత్వములతో గూడియుండెను. భర్తృశోకముచే క్రుంగిన రతీదేవివలె నామె సన్న్యాసినీ వేషమును దాల్చియుండియు మనోజ్ఞముగ నుండెను. ఆమె యా వేషమును జూచి నా కడుపు మండిపోయెను. కాని యామె ప్రశాంతముగ నుండెను. మిక్కిలి యాదరముతో నామె నన్ను మహారాజుగారి కడకు బొమ్మని చెప్పినది. "ఆర్య వాత్స్యాయనా! నేనీ ప్రపంచమును విడనాడితిని. నా మనసు అంతఃపురమును దాటి చనినది. అట్టిలతి యీ శరీరము అంతఃపురమునందున్నను లేకున్నను వొకటే. మహారాజుగా రనుమతించిన నే నంతఃపురమును విడిచిపెట్టెదను. లేకున్న నే నిచటనే యుండెదను. కాని యిక నేను గృహస్థ ధర్మమున నుండజాలను. నేను చాల కాలమునుండి దీనికొఱకు ప్రతీక్షించుచుంటిని. నీవు మహారాజుగారికీ సమాచార మందజేయుము" అని యనెను.

నేను చేతులు జోడించి "దేవీ, మీ యీ వేషమును జూచి నా కడుపు మండిపోవుచున్నది. ప్రపంచము మిమ్ముల నేమి కష్టపెట్టుచున్నదని మీరు దానిని విడనాడుచున్నారు! నే నీ సమాచారము రాజుగారికి తప్పక తెలిపెదను! కాని యీ వృద్ధుని యపరాధము మన్నించిన మీ రీ కఠోరమగు సంకల్పము నేల గావించితిరో తెలిసికొనగోరుచున్నాను. మహారాజులు దేవిగారి మర్యాదకు భిన్నముగ నేమైన నడచుకొనిరా!" అని యడిగితిని. రాణిగారి ప్రశాంతమగు ముఖముపై చిఱునవ్వు వెలసెను. ఆమె "ఆర్యా! మహారాజు లనుచితము నేదియు జేసియుండలేదు. వారు నన్ను సాధ్యమైనంతవఱకు సంతుష్టురాలనుగా చేయుటకు ప్రయత్నించినారు. అయినను నే నీ ప్రపంచమును విడనాడవలసియే యుండును. అదే త్రిపురసుందరి కోరిక! నేటిరాత్రి నేను స్వప్నమునందు వినిన పిలుపు నుపేక్ష చేయజాలను. ఆర్యా, కొంచెము పరికించి చూడుడు! త్రిపురసుందరి ప్రతిమ నవ్వుచున్నది. ఇది యశుభసూచికము. నే నీ సమయముననే రాజుగారితో సంబంధము తెంచుకొనకుండిన వారి కమంగళము తప్పదు" అని యనెను. నేను రాణిగారి మాటలు విని చాల జాగ్రత్తగ త్రిపురసుందరి విగ్రహమును పరికించి చూచితిని. కాని నా కెక్కడను అది నవ్వుచున్నట్లు కనపడలేదు. రాణిగారి కేమైన మానసిక విక్షోభము కలిగినదా! అని నే ననుకొంటిని. రాణిగారు నా భావమును గ్రహించి "ఆర్యా, నీవు చూడలేవా? జాగ్రత్తగ చూడుము!" అనెను.

నే నేమి చూతును! ప్రతిదినము కనబడుచున్నట్లే నేడు గూడ నా విగ్రహ మగపడుచుండెను. కాని రాణీగారిని సంతోసింప జేయుటకు నేను "ఆ! నిజముగ నవ్వుచునే యున్నది!" అని యంటిని. రాణిగారు సంతోషపడి మిక్కిలి యాదరముతో "ఆర్య వాభ్రవ్యా! రాజుగారితో వివాహము కాకమునుపే నన్ను మఱియొకరి కిచ్చుటకు వాగ్దానము జరిగెను నా తండ్రి ఉలూతరాజు కాదు. నే నపహరింప బడిన కన్యను. ధూర్తులు నన్ను మోసగించి రాజుగారితో నాకు వివాహము జరిపించినారు. నే నీ యంతఃపురమున చాల కాలము విలపించి యుంటిని. నేను మీ భార్యను కానినియు, నా తండ్రిగా రెవ్వరికిచ్చుటకు వాగ్దానము చేసి యుండిరో నే నతని భార్యనే యనియు, నేను మహారాజు గారికి స్పష్టముగ తెలిపియుంటిని. మహారాజు నా మనోభావముల నాదరించి కడు నాదరమున నన్నంతఃపురమునందుంచి యున్నారు. కాని నన్ను భార్యగా గ్రహించవలెనను మోహమును వారు వదలలేదు. నన్నెవరి కియ్యవలయునని మా తండ్రిగారు సంకల్పించియుండిరో యతడు నిరాశజెంది సన్న్యాసమును స్వీకరించెను. పాప మతడు వింధ్యపర్వతము లందెచ్చటనో తపస్సు చేయుచున్నాడు. ఆర్యా! నా కతని పిలుపు సదా వినపడుచునే యుండును. కాని నిన్న నేను విన్నది/మాత్రము నా యొడలిని పులకరింపజేయుచున్నది. నే నీ ప్రపంచమును విడనాడవలసినదే. నీవు వెంటనే మహారాజుగారికి సంగతి తెలుపుము. ఆలస్యమయిన ముప్పు వాటిల్లగలదు" అని నుడివెను. నేను అతి కష్టముమీద నామె

యాజ్ఞను పాలించితిని. భట్టని కలుగజేసికొని "ఆర్యా! ఆ రాణి పేరు మహామాయయేనా!" అని యడిగెను. వాభ్రవ్యుడు అదియేనని యొప్పుకొన్నమీదట నామె విస్మయమున్నొందు మ నన్ను చూడసాగెను. నిపుణిక కన్నులు పెద్దవి చేసి "ఎంత యాశ్చర్యము!" అని యనెను. వృద్ధుడు మరల నిట్లు చెప్ప సాగెను.

"మహారాజు ఈ సమాచారము విన్నంతనే చాల వ్యాకులచిత్తుడయ్యెను. అతడు వెంటనే తన్ను మహారాజ్ఞి కడకు గొనిపొమ్మని ప్రార్థింపగా నే నతనిని ఆమెకడకు గొంపోయితిని. మహారాజు రాణి ధరించిన సన్న్యాసినీ వేష మును జూచి కన్నుల నీరు గ్రుక్కుకొని 'దేవీ! అంతఃపురాచా రములకు విరుద్ధముగ నీ వేషమును ధరించుటకు నేడేమి కార ణము కలిగినది? నావలన తెలియక నేదైన నపరాధము జరిగినదా?' అని యడిగెను.

మహామాయ ముఖమునందెట్టి వికారము నగపడ లేదు. ఆమె ప్రశాంతముగ, 'మహారాజా! నా హృదయాంత రాళమునకెన్నిరోజులనుండి జరుగుచున్న ఘర్షణ నేడు దూరత రించినది. నేడు నాకు త్రిపురసుందరి యాజ్ఞ లభించినది. ఇక నేను మీ యంతఃపురమున నున్నచో నశుభము తప్పదు. మహారాజా! ఒక్కమారా దేవీ విగ్రహమును చూడుడు. నేడా విగ్రహము నవ్వుచున్నది. ఇట్టి యపశకునమ్ము నేను మున్నెన్నడును చూచియుండలేదు. కడచిన రాత్రి నాకు దేవీ దర్శనము లభించినది. వింధ్యపర్వతములందున్న ఘూర్ణమగిరి నుండి నన్నాకర్షించు నాహ్వాన మొకటి నాకు

వినబడినది. నేడే మహారాజులతో నా సంబంధము తెగ తెంపులు చేసికొనకున్న మహారాజులకు సర్వనాశనము తప్ప దని దేవి నాకు స్పష్టముగ చెప్పినది. మహారాజా! వేయి నాల్కల నాగుబాము మౌఖరీవంశమును కాటువేయు చున్నట్లు నేను చూచితిని' అని పలుకుచున్న మహారాజ్ఞి కంఠము బొంగురుబోయెను. కన్నులనుండి యశ్రుధార జోట జోట కారుచుండెను. ఆమె అతని పాదములపై బడి 'మహా రాజా! నా యపరాధములను క్షమింపుడు. సన్న్యాసిని ని కాకుండా నేను మీతో గల నా సంబంధమును తెంచుకొన జాలను. లోకవిహితము శాస్త్రవిహితము నగు మర్యాదలను గాపాడుటకు దీనికంటె మఱొక మార్గము లేదు' అని యనెను. మహారాజు కొంచెముసేపు మర్మాహతుడై కూర్చుండి యుండెను. తర్వాత నతడు 'దేవీ! నేటివఱకు నేను నీ మాట కడ్డముగ రాలేదు. ఒకసారి మాత్రము నీవు నా యభిలాషకు అడ్డురాకుము' అని యనెను. కృతజ్ఞతతో రాణి 'మహారాజా తమ యభిలాష యేదో సెలవిచ్చెదరా?' అని యడిగెను.

'దేవీ, యేదో వశీకరణ ప్రయోగము జరుగుచున్న దని నాకు సందేహము కలుగుచున్నది. ఇది నా పాప భూయిష్టమగు మనస్సున పుట్టిన భావము కావచ్చును. కాని దానిని కప్పిపుచ్చక నేను చెప్పుచున్నాను. నీ వనుమతించి నచో నేను స్వయముగ ధూమ్రగిరికి వెళ్ళి చూచివచ్చెదను. అంతవఱకు అంతఃపురమునందుండుట కనుగ్రహింపుము. నా వెంట నీ విశ్వాసపాత్రుడగు సేవకుని పంపుము.

సన్న్యాసినియైనరాణి గారి యదరపుటములపై సుమధుమగు నవ్వు కనడినది. ఆమె 'మహారాజా! అటులనే వెళ్ళి రండు. మీ పై నాకు విశ్వాసము కలదు.

'కాని దేవీ! స్వయముగ నా పై నాకు విశ్వాసము లేదు. నేను నా ప్రాణముల నర్పించియైనను నిన్నంతఃపురము నందే యుంచవలెనని కోరుచున్నాను.'

'మహారాజా, మీ పై నాకు విశ్వాసమున్నదని చెప్పితినిగదా ?'

'వలదు. నీవు నీయనుచరుని నా వెంట తప్పక పంపుము.'

'అటులైనచో ఈ వృద్ధ వాభ్రవ్యుడే మీ వెంట రాగలడు.'

మహారాణి యాజ్ఞ ననుసరించి నేను మహారాజుగారి వెంట 'ధూమ్రగిరి'కి బయలుదేరితిని చాల కొలది దూరము వఱకే మేము రథమునందు వెళ్ళితిమి. అటు పిమ్మట వింధ్యాటవిని ప్రవేశింపగనే కాలినడక తప్ప మాకు గత్యంతరము లేకపోయినది.

'ధూమ్రగిరి' క్రిందినుండి పై వఱకు తృణగుల్మ రహితములగు కపిశ వర్ణముగల చట్టాళ్ళతో నిండిన యొక చిన్నకొండ. దాని పై భాగమున మాత్రము కొన్ని చెట్లు కన్పబడుచుండెను. ఒక గొప్ప నిప్పు ముద్దపై నల్లని పొగ వ్యాపించియున్నదా యన్నట్లు కనబడుచుండెను. దానిని 'ధూమ్రగిరి' యనుట కదే కారణమై యుండవచ్చును. కొండపై కెక్కుటకు కొండను చెక్కి కడు ప్రయాసచే

నిర్మింపబడిన మార్గ మొక్కటే కలదు. మార్గమునందచ్చ టచ్చట యోగినుల ప్రతిమలు, విచిత్రములగు తాంత్రికుల యంత్రములును చెక్కబడియుండెను. కొండపై నిర్మలమగు సరోవర మొకటి యుండెను. దానిపై పెద్ద పెద్ద తాళ్ళను జోడించి ఒక వంతెన కట్టబడియుండెను. సరోవరమున కిటు వైపు కొన్ని గుహలు, అటువైపు ధూమ్రేశ్వరీ దేవాలయము నుండెను. అది పేరునకు మాత్రమే యాలయము ఒక గుహ యందు మఱియొక చిన్న గుహలో పది చేతులు గల్గిన విగ్రహము స్థాపితమై యుండెను. అదే ధూమ్రేశ్వర దేవా లయము. చాల ప్రయాసపడి మేమా మందిరమును చేరు కొంటిమి. ఆలయపు ద్వారమువద్దనే మాకొక యోగి కన బడెను. అతడు పసుపుపచ్చని వస్త్రములను ధరించి యొక చేత మెలికలు తిరిగిన కత్తి నొకదానిని పట్టుకొని యుండెను. అతని కంఠములందు, బాహుమూలములందు, చెవుల యందును రుద్రాక్షలు వ్రేలాడుచుండెను. అతని వికట జటాసమూహమును జుట్టుకొని యొక గవ్వలదండ వ్రేలాడు చుండ, దానిముందు భాగమున నొక యినుప పుఱ్ఱె తగు లొక్కొని యుండెను. మమ్ములువురను చూడగనే అతడు వికటాట్టహాసము గావించి తన చేతనున్న కత్తిను రాజుగారి మీదకు విసరెను. కాని నేను త్వరగా అడ్డుపడినందువలన రాజుగారికా కత్తి తగులక నాకు తగిలెను. యోగి మఱింత భయంకరముగ నట్టహాసము గావించి రాజు నుద్దేశించి, 'గ్రహవర్మా! నీవు భాగ్యహీనుడవు. ధూమ్రేశ్వరీ దర్శన

మును గావించుకొనుము. నీ తలపైన అమంగళ మావరించు కొని యున్నది' అనెను.

రాజుగారి ముఖము కాంతిహీనమయ్యెను. వారు వీరులైనను వారి పేరు విన్నంతమాత్రమే ఉత్తరాపథమంతయు గడగడలాడుచుండినను, యోగి మాటలను విన్నంతనే వారు భయభ్రాంతులైరి. యోగి నన్ను చూచి 'నీవు భాగ్యవంతుడవు. నీవు దేనిని ధర్మమని తలచుచున్నావో అది యధర్మమనియు, నీవు దేనిని యధర్మమని తలచుచున్నావో అది ధర్మమనియు నీ వేనాడు గుర్తింపగలవో ఆనాడు నీవు త్రిపురసుందరిని దర్శింపగలవు. వెళ్ళుం. వెళ్ళి దర్శనము చేసికొమ్ము' అని యనెను.

మహారాజు చేతులు జోడించి, 'యోగీశ్వరా, నాకు త్రిపురసుందరి దర్శనభాగ్య మెన్నడు లభించును' అని యడిగెను. 'నీవు సిగ్గుమాలినవాడవు. ఈ కంచుకి మూర్ఖుడు. ఇతడు ధర్మాధర్మములని ఏర్పరచిన మార్గముల ననుసరించువాడు. ఇతనికి ఒకానొకప్పుడైనను సత్య స్వరూపము కనబడగలదు. కాని నన్ను నీవు బుద్ధిమంతునిగ తలచుచున్నావు. నీవు పైకి ధర్మాత్మునివలె నటించుచున్నావు. వంచకుడా! అసత్యవాదీ! వెళ్ళి దర్శనము చేసికొనుము.'

మహారాజు వశీభూతుడైనవానివలె యోగి చరణములపై బడి 'యోగీశ్వరా, నా యీ పాప మెట్లు క్షీణింపగలదు' అని యనెను.

యోగి ముఖము వికసించెను. అతడు' రాజా మొదటి నుండి నిన్ను నీవే మోసగించుకొనుచుంటివి. రాణిని నీవు

విడువ నిష్టపడలేదు. కాని యామెను గ్రహించుటకైనను నీవు ప్రయత్నము చేయలేదు. వశీకరణ తంత్రమును జూడ వచ్చితివా ? వశీకరణ మన్న ఏ కేమియో. తెలియునా తన్ను తాను సంపూర్ణముగ నర్పించుటయే వశీకరణము నిన్ను నీవు నిశ్శేషముగ నర్పించుకొననులేదు. ఇతరులను నిశ్శేషముగ గ్రహించుటకును ప్రయత్నము చేయలేదు. వెళ్లుము. లోపలికి వెళ్ళుము. వశీకరణమనగా నెట్టిదో నీవు చూచెదవు. ఆలసింపక వెళ్ళుము' అని యనెను. గుహ యందు దశభుజముల విగ్రహ మొకటి యుండెను. ఆ విగ్రహ మున కెదుట అస్థిపంజరము మాత్రము మిగిలియున్న భక్తు డొకడు నివాత నిష్కంప దీపమువోలె ధ్యానమగ్నుడై కూర్చుండియుండెను. అతడెన్నియో యేండ్లనుండి స్నానము చేసినట్లే లేదు. పాప మతనికి భోజనము లభించినదో లేదో ఎవరికెఱుక ! యోగి యతనిని చూపి 'చూచితివా, వశీకరణ మెట్లు జరుగుచున్నదో ! ఇంకను లోపలికి వెళ్ళుము' అని యనెను.

మేము విగ్రహము వైపునకు పోవుకొలది ఆ విగ్రహమునందు కొంత మార్పు కనబడసాగెను. తుదకు మే మా యువక తపస్వికడకు చేరుసరికి ఒక్కమారుగా ఆ విగ్రహము మహామాయరాణి రూపముదాల్చెను. నేను సంభ్రమాశ్చర్య చకితుడనై గట్టిగా కేక వేసితిని. మహారాజు నిర్వెరపోయి జూచుచుండిరి. యోగి మఱొకమారు రెచ్చగొట్టుచు, 'మహారాజా ! చూచెదవేమి ? దేవికి ప్రణమిల్లుము. నీయ మంగళములన్నియు ప్రతిహతములగును' అనెను. మహా

రాజు నొడలు చెమటచే తడసిపోయెను. భయముతో వారు చీత్కారముగావించి కూర్చుండి మెల మెల్లగా భూమిపై కొరిగిరి. నేను 'పాహి పాహి' యని కేకలు పెట్టితిని. నా కేకలకు యువకుని తపస్సున కంతరాయము కలిగెను. యోగి నన్నోదార్చుచు 'భయపడవలదు. దేవికి ప్రణమిల్లుము' అని యనెను. నేను సాష్టాంగదండ ప్రణామ మాచరించితిని. అంత యోగీశ్వరుడు యువకుని పేరుపెట్టి పిలిచెను. నాకా పేరు జ్ఞాపకము లేదు. కాని యా పేరు కొంచెము విచిత్రమైనదే. ఆ దుర్బల యువక తపస్వి యాశ్చర్యముతో మమ్ములను చూచెను. అప్పుడు యోగీశ్వరుడు 'వత్సా, ఇతడు గ్రహవర్మ; అతని వెంటనున్నవాడు అతని కంచుకి' అని యనెను. యువకుని కన్నులయం దొక విచిత్రమగు ప్రేమ భావ ముదయించెను. అతడు 'గ్రహవర్మయా! ఆహా!' అని మహారాజు కపోలములపై మెల మెల్లగా తన చేతితో నిమురుచుండెను. మేము మహారాజు నచ్చటనుండి సరోవరము చెంతకు మోసికొని వచ్చితిమి. కొంత యుపచారము చేసిన తర్వాత మహారాజునకు తెలివి రాగానే యోగీశ్వరుడు 'మహారాజా, తప్పిపోయితివి. నీవు దేవిని ప్రసన్నురాలినిగ నొనర్పలేకపోతివి. నీ వింటికి మరలిపొమ్ము. మౌఖరీ వంశమునకు చెడుకాల మాసన్నమైనది. నీవు త్రిపురసుందరి స్వరూపము నేనాడైనను గాంచగల్గినచో నంత బాగుండెడిది! మహామాయను దేవీరూపమున నీవు పొందజాలకున్నను, దేవిని నీవు మహామాయ రూపమున జూచియున్నావు. నీవు ప్రయత్నించుము. నీ భాగ్యము బాగుండిన నొకా నొకనాడు

నీవు దేవీదర్శనము పొందగలవు. కాని మౌఖరీ రాజ్యలక్ష్మి యిక యెన్నో రోజులు నిలువజాలదు. నీవు చాల కాలము జీవించవు, కాని నీవు రెండవ వివాహము తప్పక చేసికొనుము. ఆర్యావర్తమంతయు భస్మము కానున్నదని నిన్న రాత్రి దేవి వచించినది. మహామాయయే దాని నుద్ధరింపగలదు. నీవు దాని నడ్డగింపకుము' అని యనెను.

యోగీశ్వరుడు నన్ను జూచి 'మౌఖరీవంశపు టశుభమును తొలగించుటకై నేను విసరిన కత్తి కడ్డుతగిలి దానిని నీవు నీపైన బడవేసికొన్నావుగదా!'మూర్ఖుడా, పొరపాటున నీ వెంతటి యనర్థము జేసితివి! కాని నీవలననే ఒకానొకనాడు ఆర్యావర్తమునకు శుభము కలుగును లెమ్ము. ఇక నింటికి మరలిపొమ్ము' అనెను.

మహారాజు మారుపల్కక వినుచుండెను. రాజుగారచట నున్నంతసేపు యువక తపస్వి రెప్పవాల్చక మహారాజుగారినే చూచుచుండెను. ఆతని కన్నులు గుండ్రమగు గవ్వలవలె నుండెను; వానినుండి తేజస్సు వెలువడుచుండెను. అతడు కదలక మెదలక మిన్నకుండెను. రాజుగారు లేచి వెడలునపుడా యువక తపస్వి కన్నులలో కృతజ్ఞతాశ్రువులు నిండెను. మహారాజుపై దీని ప్రభావము పడినను నతడు మౌనము దాల్చియే యుండెను.

అచటనుండి తిరిగి వచ్చుచున్నపుడు రాజుగారు మౌనము దాల్చి యేదో యాలోచించుకొనుచుండిరి. నగరమును ప్రవేశించిన పిదప నతడు 'వాభ్రవ్యా, నీ వేమి చూచితివి?' అని ప్రశ్నించెను. నేను సంభ్రమముతో 'ప్రభూ,

మహాదేవిసోం ధూమ్రేశ్వరికనా!' అని యంటిని. మహారాజు తిరస్కారముతో 'మూర్ఖుడా!' అని యనెను. నే నూరకుంటిని. మహారాజు తిరిగి 'వాభ్రవ్యా, ఇది వశీకరణమునకు సంబంధించిన యభిచారము కాదా!'

'అభిచారమా ప్రభూ?'

'అవును అభిచారమే. నే నీ సిగ్గులేని తంత్రవేత్త మాయలలో చిగుల్కొనువాడనుగాను. నేను మహామాయను విడువజాలను. ఆమె మౌఖరీవంశమునకు లక్ష్మి.'

ఇల్లు చేరిన పిదప మహారాజు రాణిగారి కేమిచెప్పిరో తెలియదు. కాని నాటి సాయంకాలము గోధూళివేళ రాణి మహామాయ నన్ను పిలువనంపెను. ఆమె యడిగిన మీదట నే నన్నివిషయములను యథాతథముగ నామె కెఱింగించితిని. ఆమె చింతిల్లుచు 'యోగీశ్వరుడు నన్ను కావలనని రాజుగారికి చెప్పలేదా?' అని యడిగెను. నేను 'అవును దేవీ, యోగీశ్వరుడు రాణిగారి నింక చూపవలదని స్పష్టముగ రాజుగారికి చెప్పినాడు?' అని యంటిని. మహామాయ కొంతసేపటివఱకు చింతించుచు నిలుచుండి తర్వాత వాభ్రవ్యా, నన్ను ధూమ్రమగిరికి పోనిమ్ము, మహారాజు మోహాబద్ధుడై యున్నాడు. అందుచే నతడు సత్యమును గాంచలేకున్నాడు. మీరు రండఱు కలిసి ప్రయత్నించి యతనికి తిరిగి వివాహము చేయుడు. నే నిచటి నిలిచియుండిన మౌఖరీ రాజ్యలక్ష్మి యలుక పూనగలదు త్వరపడుము' అని యనెను. నేను రాణిగారి నంతఃపురమునుండి వెడలనిచ్చితిని. మఱునాడు మహా

రాజు నన్ను పిలువనంపి యడిగినపుడు నే నన్ని సంగతులను పూసగ్రుచ్చినట్లు వారికి విన్నవించుకొంటిని. మహారాజు తల పట్టుకొని కూర్చుండి నాతో 'సరే, వెళ్ళి నీ పని చూచు కొనుము' అని యనిరి.

ఇంతవఱకు చెప్పిన తర్వాత వాభ్రవ్యుడు నిట్టూర్పు విడిచి భట్టినిని చూచి 'తల్లీ నేను రాజుగారి యెదుట నా యపరాధము నంగీకరించినను, నే నేయియు ననుచితము చేయలేదని నా యంతర్వాణి నాకు చెప్పుచుండెను. నేను చేసిన రెండవ పొరపాటు కూడ మంచిదేనని నేడు నాకు తెలియుచున్నది' అని చెప్పి వృద్ధు డూరకుండెను. అతడు వాత్సల్యముతో భట్టిని నుదుటిని తన చేతితో నిమురు చుండెను. చాలసేపటివఱకు అందఱు నిశ్శబ్దముగ కూర్చుండి యుండిరి. కడపట వృద్ధుడే తన యుపన్యాసమును ముగించుచు 'ఆర్యావర్తము నాశనమునుండి తప్పించుకొనగలదు, దేవపుత్రనందినీ మహామాయలు దానిని రక్షింపగలరు. యోగీశ్వరుడు పలికిన మాట వ్యర్థము కాజాలదు' అని పలికి నిపుణికను జూచి 'అమ్మాయీ, నీవు ధన్యురాలవు. నేను నిన్నెన్నో విధముల శపించియుంటిని. కాని నేడు నా శాపములను వరములనియే భావించుచున్నాను. సంఘముచే విధింపబడిన యాచ్ఛార నియమములలో ధర్మమిముడ జాలదని నేను నేడు గ్రహించితిని. అది నియమములకన్న పెద్దది. ఆచారముల కన్న మిన్నయైనది. నే ననుకొన్న ధర్మములు సర్వకాల సర్వావస్థలయందు ధర్మములు కాలేదు. నే ననుకొన్న యధర్మములుకూడ సర్వకాల సర్వావస్థలయం దధర్మములు

కౌజాలవు. ధర్మమునే యధర్మముగను, అధర్మమునే ధర్మము గను నే నేనాడు గుర్తింతునో యానాడు నేను త్రిపురసుందరిని దర్శింపగలుగుదునని యోగీశ్వరుడు చెప్పియుండెను. ఇది యెంత యాశ్చర్యము" అని పలికెను.

నిపుణిక కృతజ్ఞతాపూర్వకముగ వృద్ధుని జూచుచు, "ఆర్యా, నేనొక విషయము నడుగగోరుచున్నాను. యోగీశ్వరుడు రాజుగారిని తిరిగి వివాహము జేసికొనుమని చెప్పెను! అందువలన పూజ్యురాలగు రాజ్యశ్రీవంటి సాధ్వి జీవితము మంటగలవలెనా? వైధవ్యమునకన్న నెక్కువైన దుఃఖము స్త్రీకి మఱి యేదికలదు?" అని యనెను. వృద్ధుడామెను మందలించుచు, "ఛీ, ఛీ నిపుణికా, ఏమి మాటలివి! రాజ్యశ్రీ జీవితము వ్యర్థమైనదా? పిచ్చిదానా! సార్థకత్వ మనగా నేమి? తన్ను తాను నిశ్శేషముగ నర్పించుటయే వశీకరణమని యోగి నిక్కముగనే పలికినాడు. జీవితాంతమున మాత్షురీ నరేంద్రునకీ సిద్ధి లభించినది. చూడు తల్లీ! మనుష్యుడు తానెంత యొంటరివాడగునో యంత తాను పొందగలడు. అతడు ప్రాణముల నొసగిన తిరిగి ప్రాణములను పొందును. మనస్సు నిచ్చిన మనస్సు పొందును. దాతను పరిగ్రహీతను, నిర్మాణదాను కృతార్థుల జేయునట్టిది ఆత్మత్యాగము. రాజ్యశ్రీ యట్టి త్యాగము గావించి యట్టిదానినే పొందినది. ఐహిక దృష్టితో నానందమును కొలువలేము. దుఃఖమనునది మనుష్యుని మనోవికల్పమే. మానవుడు ఆపాదమస్తకము పరమానంద స్వరూపుడు. తన్ను తాను నిశ్శేషముగ నర్పించుటవలన మనుష్యుడు దుఃఖముల

పోగొట్టుకొని మహానందమును పొందుచున్నాడు. యోగి పుంగవుని మాట నాకు చాల భావగర్భితముగా తోచినది. నే నింకొకమారు ఆ యోగియొద్దకు వెళ్ళియుంటిని. కాని యతడు నన్ను మందలించి పంపివేసెను. ఒకమారు మాత్ర మతడు 'మూర్ఖుడా! నీవు దుఃఖమునే సుఖమని భావించి యుండినచో నెంత బాగుండెడిది!' అని యనెను. కాని తల్లీ, ఎన్నడు నే నట్లు భావించితిని?"

తర్వాత అందరు కొంతసేపటివరకు నిశ్శబ్దముగ నుండిరి. నేను "ఆర్యా, ఆ యువక తపస్వి పేరు అఘోర భైరవుడా?" అని యడిగితిని.

వృద్ధు డానందాశ్చర్యములతో "అవును భట్టూ, విచిత్రమైన పేరు!" అని యనెను.

నిపుణిక భట్టిని వైపునకు చూచెను. భట్టిని హరిణేక్షణములు కర్ణములవరకు వికసించెను. ఆమె "ఎంతే యాశ్చర్యము! ఎట్టి వింత!" అని పలికి చాలసేపు ఆవేశముతో గూడుకొన్నదానివలె నన్ను చూచుచుండెను. నిపుణికి తన్ను తానే మఱచినట్లు నిలబడెను. ఆమెలో చాలాసేపు స్పందన మేదియు కనబడలేదు. తర్వాత స్వప్నమునుండి మేల్కొన్నదానివలె "తన్ను తా నశేషముగ నర్పించుటయే వశీకరణము!" అని పలికెను.

# ఇరువదవ అధ్యాయము

నేను నా దౌర్భాగ్యము నెక్కువగ వెళ్ళబోసికొననని ముందుగనే మాట యిచ్చియుంటినికదా!. అదృశ్య శక్తుల ద్వారా మానవజీవితము సంస్కరింపబడుచున్నది. దైవసంకల్పము మానవ సంకల్పమునకు దోహదకారియైనచో మానవుడు చరితార్థుడగును. ఈ ఇరువదవ అధ్యాయము నందలి కథ నా దౌర్భాగ్యపు జీవితగాథ కాదని నే నెట్లన గలను! అంతేకాదు, ఇందే నా సౌభాగ్యముకూడ ప్రకటితము కాలేదని, నే నెట్లు చెప్పగలను. నిజముగ నిది నా సౌభాగ్యమే! ఇంతకన్న నెక్కువగ నేనేమి చెప్పగలను!

మహారాజాధిరాజులు తాము రచించిన క్రొత్త నాటికను భట్టినియొద్దకు పంపిరి. ఆ నాటిక పేరు 'రత్నావళి' దీనిని గూర్చియే ధావకుడు నాతో ముచ్చటించియుండెను. భట్టినీ నిపుణికలు నాటికను చాల సుత్సాహముతో చదివిరి. వారి కది బాగుగ నచ్చియుండవచ్చును. వలయున మనభిష్టానుసారముగను, రాజానుమతిని రత్నావళి నాటిక మహారాజుల సమక్షమున ప్రదర్శితము కావలయునని వా రానాడు వాంఛించిరి. ఈ మధ్య చాల దినములనుండి నే ననేకము లగు నుత్సవములలో తగుల్కొనియుంటిని. చారుస్మిత విద్యుదపాంగల నాట్యసంగీతములు నగరమ్ము నందెల్లెడలను నద్భుతమగు ప్రభావమును ప్రసరింపజేసి యుండెను. అట్టి సమయమున ఆచార్యభర్వుపాదులు వచ్చుచున్నారని తెలిసెను. మౌఖరీవంశస్థుల బ్రాహ్మణగురువుల రాకను గుఱిం

చిన సమాచారము వినినంతనే ప్రజలానందముతో నున్మత్తు లైరి. ఈ సమాచారము బౌద్ధ సన్న్యాసి యగు వసుభూతికి కొంత కష్టము కలిగించెను. భర్వుశర్మను బౌద్ధులు చంపి వేయుటకు నిశ్చయించుకొన్నారను వార్త నగరమునందు వ్యాపించినది. అడవియందు దావాగ్ని జ్వాలలెంత వేగ ముగ వ్యాపించునో యంత వేగముగ స్థానేశ్వరమునందు వార్తలు వ్యాపించుచుండును. అతి భయంకరమగు సమ యమున ప్రజలయందు చిత్త విభ్రమము కలిగెను. దైవ యోగమున మా యన్నగారగు ఉడుపతిభట్టు అదే సమయ మున కాశీనుండి వచ్చిరి. కృష్ణవర్ధన రాజకుమారులీ మధ్య చాల వ్యాకులచిత్తులై యుండిరి. భర్వుశర్మను అప్రసన్నునిగ చేయుటవలన నెంత యనర్థము సంభవింపగలదో యతడు బాగుగా నెఱుగును. అతడు మాటి మాటికి మహారాజాధిరాజు లనుదర్శించి సంప్రతించుచుండెనే కాని యే యుపాయమును వారికి తోచకుండెను. హఠాత్తుగ నొకనాడు వారు నన్నును మా యన్నగారిని పిలువనంపిరి. మే మిరువురము వారి యింటివద్దకు చేరగనే రాజకుమారులు మాకు సగౌరవముగ స్వాగతమొసగిరి. అతడు మా యన్నగారిని జూచి "ఆర్యా! బౌద్ధపండితుడగు వసుభూతికిని బ్రాహ్మణులచే నెన్నుకొన బడిన పండితశ్రేష్ఠునకి నడుమ శాస్త్రార్థము జరగవలెనని మహారాజాధిరాజులు నిశ్చయించినారు. ఇచ్చటి కన్యాకుబ్జ పండితులందఱు వివాద సభయందు తమను ప్రతిపక్షిగ నెన్ను కొనగోరుచున్నారు. తమరు శాస్త్రార్థ విచారమునందు వసు భూతి నోడింపగలరా? ఇచ్చటి బ్రాహ్మణుల మానప్రతిష్ఠలు

మీా విజయముపై నాధారపడి యున్నవి. ఆర్యావర్తపు భవిష్యత్తుకూడ దానిపై నాధారపడి యున్నది" అని యనెను. ఉడుపతిభట్టే విధమగు జంకుగొంకులు లేక తాను సంసిద్ధుడనని పలుకగా రాజకుమారుడు వారిని వెంట బెట్టుకొని మహారాజాధిరాజుల యొద్దకు వెళ్ళిపోయెను. నేను భట్టినియొద్దకు మరలివచ్చితిని. రాజుగారి సముఖమున ఉడు పతి భట్టునకును వసుభూతికిని చాలసేపు శాస్త్రార్థము జరి గెను. మఱునాడు శాస్త్రార్థ విచారణయందు ఉడుపతి భట్టు జయించెనని మహారాజాధిరాజుగారికి తిరిగి బ్రాహ్మణ ధర్మమునందు శ్రద్ధగలిగెననియు, గ్రహవర్మ మహారాజు కాల మున బ్రాహ్మణ పండితుల కేవిధముగ సన్మానములు జరుగుచుండెనో యట్టులనే నేటినుండి మహారాజుగారి రాజ సభయందు జరుగగలవనియు, మహారాజాధిరాజులు సుమా రొక వందమంది సామాధ్యాయులకు భూదానము గావింతు రనియు, బ్రాహ్మణులందు చతుర్వేది, త్రివేది, ద్వివేది, అను తరగతు లేర్పరుపబడి యున్నను, నందఱు నొకేవిధముగ రాజాదరణకు పాత్రులగుదురనియు, భరద్వాజశర్మ వంశస్థులు బాలకులై రెండు వేదములనే యభ్యసించినను, వారు చతు ర్వేద త్రివేదులవలెనే సమ్మానమునకు పాత్రులగుదురనియు, బౌద్ధమఠముల కొసగబడిన దానము లట్లే యుంచబడు ననియు, మహారాజాధిరాజులు బ్రాహ్మణ బౌద్ధుల నొకే విధ ముగ సమ్మానింప నిశ్చయించిరనియు, ఇంతవఱకు రాజులు తమ తేజోవిక్రమములను తెలుపుటకై 'విక్రమాదిత్య' యను బిరుదము దాల్చుచుండిరికాని నేటినుండి అందరి దుఃఖ

ములను పశమింపజేసి నందన మహారాజాధిరాజులు "నరేంద్ర చంద్రులు" అను బిరుదమును వహింపగలరనియు, వారి ప్రతాపమువలన దేశమునందు శాంతిస్థాపితమగు ననియు నగరమునందంతటను చాటింపబడెను. ఈ చాటింపు ప్రజల యందొక యపూర్వమగు విజయోన్మాదమును ప్రసరింప జేసెను. పురవీధులు నరేంద్ర చంద్రుల జయ జయ ధ్వనులచే మారుమ్రోగెను. హర్షోల్లాసముచే నగరమంతయు నున్మత్తమైనదానివలె నూగిపోయెను. సరిగా నిట్టి సమయమున నాచార్య భర్వుపాదులు వేంచేసిరి. భట్టిని యానందము నేడు కెన్నులు తెంచుకొని ప్రవహింప నుద్యమించినది. సహజముగ గంభీరముగ నుండు భట్టిని నేడు చపలయగు బాలికవలె రూపొందెను.

మహారాజగారి యొక్కయు, భర్వుశర్మయొక్కయు ఆగమన గౌరవార్థము 'రత్నావళి' నాటికను ప్రదర్శించు భారము నాపై బడినది. మహారాజు లా నాటికను ప్రదర్శించుట కనుమతి నిచ్చుటయేకాక ఆ నాటికయందు యథేచ్ఛగ మార్పులు జేయుటకు కూడ నాకును ధావకునికిని నధికార మిచ్చి యుండిరి. అక్కడక్కడ నేను కొన్ని మార్పులు జేసితిని. ఒక శ్లోకమునందు నేను చాల చతురతతో నా పేరును కూడ జోడించితిని. నాట కారంభముననే యా శ్లోక మున్నది. నేను నా పేరగు 'దక్ష'ను చాల నిపుణతతో నందు జోడించితిని. *మహారాజులకు గూడ నీ శ్లోకము చాల నచ్చి

* రత్నావళి, ప్రస్తావన

శ్రీ హర్షో నిపుణః కవిః పరిషదప్యేషా గుణగ్రాహిణీ
లోకే హారిచ వత్సరాజచరితం నాట్యేచ దక్షావయమ్ ।

వది. వారు దానిని తన యితర నాటకములలోగూడ చేర్చిరి. మహారాజాధిరాజులు చేసిన ప్రకటనను జోడించుటయే గొప్పవిషయము. దీని ప్రభావము ప్రజలపైననే కాక 'ఆచార్య భట్టపాదులపైనను బాగుగ పడినది. నాటక ప్రదర్శనము నాడు సూత్రధారుడు గద్గద కంఠముతో

జితమురుపతిన్నా, నమః సురేభ్యో, ద్విజ వృషభా!
నిరుపద్రవా భవంతు
భవతు చ పృథివీ సమృద్ధ సస్యా, ప్రతపతు చంద్ర
వపుర్నరేంద్ర చంద్రః

అని చదివినపుడు ఆచార్యపాదులు "బాగు బాగు" అని యభినందించిరి. ఆచార్యపాదుల యభినందనమును జూచి ప్రేక్షకులుకూడ సంతోషించిరి.

కాని యీ నాటిక నభినయించుటకు నట నటీమణులు కష్టము మీద లభించిరి. నా యొత్తిడివలన నాయుస్మిత 'రత్నావళి' పాత్రను ధరించుటకు సమ్మతించెను. ఆమె 'వర్ణికా భంగము'నం దద్భుతమగు నైపుణ్యము కలది. అందువలన నామెను నాటకమునకై సిద్ధముచేయుటకు కష్టపడవలసిన పనియే లేకపోయెను. నిపుణిక స్వయముగ వాసవదత్త పాత్రను వహింపగోరుచుండెను. రాజు పాత్రను నేను ధరించితిని. విదూషకుని పాత్రను నిర్వహించుటకు ధావకానందనే యుండెను. మిగిలిన పాత్రలను ధరించుటకు చటనే మరికొందఱు చేరిరి. భట్టినీ యీనాటికా ప్రదర్శనమునం దపూర్వమగు నుత్సాహము జూపుచుండెను. ఆనాడామె యేమి మాటలాడినను ఈ నాటికా ప్రసక్తియే తెచ్చుచుండెను

నేనొకమా రామెను "దేవీ, మీ రింతగా మారిసి పోవుట కీ నాటకప్రదర్శనమున నేమంత విశేషము కలదు?" అని నేను ప్రశ్నింపగా నామె నవ్వి యూరకుండెను. కాని నిపుణిక నామెవలె నంత గంభీరముగ నుండజాలకపోయెను. ఆమె మిక్కిలి యుత్సాహముతో "భట్టూ, ప్రతికూలవేళల యందు సాగుచున్న ప్రేమను వాసవదత్త యేవిధముగ నైక్య మొనర్చినదో నీ వెఱుగవా? ప్రేమ యనునది యొక్కటే! అది యవిభాజ్యము. ఈర్ష్యాసూయలు, దానిని విభజించి పరిమిత మొనర్చుచున్నవి!" అని పలికెను. నిపుణిక వాక్యములలోని యంతరార్థము నే నప్పుడైనను గుర్తించి యుండిన గొప్ప యనర్థము సంభవించి నా జీవితము నాశనమై యుండి యుండదేమో! కాని సరియైన సమయముననే నాకు నా కర్తవ్యము బోధపడదు. ఇప్పుడేమి బోధపడగలదు!

జరుగవలసినదే జరిగినది. నాటకప్రదర్శనము చాల నద్భుతముగ నుండెను. వాసవదత్త పాత్రను ధరించిన నిపుణిక ప్రేక్షకులను వెఱ్ఱెత్తించెను. నిపుణిక చేసిన హర్షశోకానురాగముల యభినయము చాల సహజముగ నుండెను. మందభాగ్యుడనగు నేనా యభినయమును కేవల మభినయమనియే తలచుచుంటిని. కాని నిజమున కది యభినయముకంటె నెక్కువగను, భిన్నముగను నుండెను. నిపుణిక అందు తన హృదయమును బహిర్గత మొనర్చెను. చివరిరంగమున రత్నావళి చేతిని నా చేతిలో నుంచునపుడు ఆమె నిజముగనే చలించిపోయెను. ఆమె ఆపాదమస్తకము కంపించెను. ఆమె నాడులన్నియు సడలిపోయెను. భరతవాక్యము ముగిసినంతనే

యామె నేలఁగూలెను. ప్రేతశకుల హర్షధ్వనులచే దిగంతములు కంపించుచుండ తెర వెనుక నిపుణిక ప్రాణములు పోవుచుండెను. భట్టిని పరుగెత్తుకొని వచ్చి, ఆమె తలను తన యొడిలో నుంచుకొని కురరీ పక్షివలె కాతరముతో నఱచుచు "అయ్యో భట్టినీ! మందభాగ్యురాలి యభినయము నేటికి సమాప్తమైనది. ఇరువైపుల ప్రవహించుచుండు ప్రేమ నామె యొక్క ముఖమునకు తెచ్చినది!" అని మూర్ఛిల్లి నిపుణిక మృతశరీరముపై నామె పడిపోయెను. అభినయము చేసి నే నెవరిని సంపాదించుకొనియుంటినో యామెను నే నభినయము చేసి పోగొట్టుకొంటిని!

నేను జీవితమంతయు తెలిసికొనలేకుండిన విషయము ధావకు డొక నిమిషములో తెలిసికొనెను. అతడు శీఘ్రముగ యవనికను దించివేసెను. మహారాజాధిరాజులును, భర్వుపాదాచార్యులును ఈ దుర్ఘటనావృత్తాంతము బొత్తిగా తెలియరైరి. పురజనుల యానందోల్లాసమునకు కొంచెమైన నంతరాయము కలుగలేదు. ధావకుడు కడు లాఘవమున భట్టిని నటనుండి తొలగించి నిపుణిక శవమును శ్మశానమునకు చేర్చెను. తలకొఱివి నేనే యుంచితిని. పాపము! ధావకుడు కూడ చివరివఱకు స్థిరచిత్తుడై యుండజాలక ఆవేశముతో నతడును చితికి సాష్టాంగ ప్రణామ మాచరించెను. ఆనందోన్మాద మేముఖమున నెల్లప్పుడు నుచ్ఛ్వసితమగుచుండెనో, దానిపై నేడు మొదటిమాఱు విషాదధూమ మావరించెను. వర్షాకాలపు మేఘములవలె నిరంతరమే జిహ్వనుండి వాగ్ధార వర్షించుచుండెనో, నేడా జిహ్వ చదువి

గట్టుకొనిపోయెను. ధావకుని గతి విచిత్రమగుచుండెను. మేము వెడలుటకుద్యమించుచుండ, చారుస్మిత తెల్లని చీరను ధరించి తన చేతులలో పుష్పమంజరుల దీసికొని యచటికరుదెంచెను. అసాధారణమగు వేష మామె సౌందర్యమునకు వన్నెపెట్టుచుండెను. మేఘమాల జలభరితమైనను, జలరిక్తమైనను మనోజ్ఞముగనే యుండునుగదా! చారుస్మిత కన్నులలో భక్తి తొణకాడుచుండెను. ఆమె మోకరించి చితికి నమస్కారము చేసి తలపై నిడుకొన్న బద్ధాంజలినుండి విలాసముగ పుష్పమంజరుల నదృశ్యముగ స్వర్గమునకు వెడలుచున్న నిపుణిక నుద్దేశించి సమర్పించెను. ధావకుని కన్నులనుండి యశ్రువులు జొట జొట కారజొచ్చెను. నా స్థితి యెటుల నుండెనో నే నెట్లు చెప్పగలను. నాకు దిశలన్నియు శూన్యములై యాకాశమండల మంతయు కుమ్మరసారెవలె గిఱ్ఱున తిరుగుచుండినట్లనిపించెను. చారుస్మిత నన్నూఱడించుచు "ఆర్యా! విచారింపకుడు. ఈ నశ్వర జగత్తున నిదియే యొక శాశ్వతమగు సత్యము. నిపుణిక స్త్రీ జాతికి శృంగారమువంటిది. సతీత్వమునకు మర్యాదవంటిది. త్రోవదప్పి నడచుచున్న మా బోటులకు మార్గదర్శకురాలు" అని యనెను. చారుస్మిత కన్నులలో కరుణకోమల భావముదయించెను. ధావకుడు మొదటిసారి నోరు విప్పుచు, "నిజమే, పోదము పద" అని యనెను. నేను మెల్ల మెల్లగ ధావక చారుస్మితల వెనుక నడచుచుంటిని. త్రోవలో నొకమాటు మాత్రము చారుస్మిత నిట్టూర్పు విడచి "ప్రపంచము

రాత్రి బొమ్మలకై తన ప్రాణము లర్పించుచున్నది!" అని యనెను. ఇదాని భావ మామె యంతర్యామియే యెఱుగును.

అప్పటికి భట్టిని స్కంధావార మంతయు నిశ్శబ్దముగ నుండెను; శోకపీడితయగు భట్టినిని ఒంటరిగ విడిచిపెట్టిన, నేమి యనర్థము వాటిల్లునో యని నేను లోలోన భయపడు చుంటినిగాని ప్రశాంతమగు స్కంధావారమును జూచి నా చిత్తమూరట జెందెను. లోపలికి వెళ్ళి జూడ సుచరిత భట్టిని శిరము తన యొడిలో నుంచుకొని కూర్చుండి యుండెను. ఈ మధ్య సుచరిత ప్రతిదినము రాత్రి జాము ప్రొద్దుమీరిన తర్వాత వచ్చుచుండెడిది. సాయంకాలపు పూజను, పతిసేవను, గురు శుశ్రూషను యథావిధిగ ముగించిన తర్వాతనే యామెకు తీరిక లభించుచుండెను. నేడు ఆమె రాగానే నిపుణిక మరణవృత్తాంత మామె వినెను. ఆమె చితిపై తన శ్రద్ధాంజలి నర్పించుటకు రాదలచియుండెను. కాని శోకాతురయగు భట్టినిని జూచి యామె యచటనే యుండిపోయెను. అది కూడ నొకందుకు మంచిదే అనిపించెను. లేకున్న అప్పటి భట్టిని పరిస్థితి చూడగా నేదో యనర్థము సంభవింపగలదను భయము కలుగుచుండెను. సుచరిత శాంతముగ ప్రతిమవోలె కూర్చుండియుండ భట్టిని యామె యొడిలో తన మేనును వాల్చి యనాథశిశువువై పునకు శూన్యదృక్కులను బఱపు చుండెను. ఆమె నన్ను చూడలేదు. సుచరిత మాటాడక నన్ను కూర్చుండుమని సైగ చేసెను. చాలసేపు వాతావరణ మంతయు నిశ్శబ్దముగ నుండెను. భట్టిని కన్నులలో నశ్రువులులేవు. హృదయమున రగుల్కొనిన శోకాగ్ని వానినెగుర

గొట్టియుండెను. ఆమె కన్ను లెచ్చటికో యెగిరిపోవ నుద్య
మించుచున్నట్లుండెను. ఆమె భుజలతలు సుచరిత యొడిలో
చైతన్యరహితములై పడియుండ నామె ధమ్మిల్లమూడి
యెడమ భుజముపై దొరలుచుండెను. భట్టినియొక్క యీ
దయనీయస్థితిని జూచి నా హృదయము పగిలిపోవుచుండెను.
అయ్యో నిపుణికా, నీ వెంతపని చేసిపోయితివి! జీవిత
మంతయు నీవు నీ ప్రత్యణువును సమర్పించి యే పాషాణమును
కరగింపదలచితివో యది చివరకు పాషాణముగనే యుండెను!
కాని యే వెన్నముద్దను నీవు వల్కలమువలె నాచ్ఛాదించి
యుంటివో అది యెట్లు మాఱిపోయినదో చూడుము! మంద
భాగ్యుడగు బాణభటుడు ఇది యంతయు చూచుచుండవలసి
వచ్చినదికదా! తన్నుతాను నిశ్శేషముగ నర్పించుటయే వశీ
కరణమని ఆర్యబాభ్రవ్యుడే నాడు వచించెనో, నాటినుండియే
నిపుణిక యందొక గొప్ప మార్పు ప్రారంభమయ్యెను.
'రత్నావళి' నాటికయందలి వాసవదత్త యందామె యట్టి
విశిష్టతను గాంచియుండెను. ఛీ ఛీ! వెఱ్ఱిదానా! వశీకర
ణమునకై యిట్టి యాత్మత్యాగము చేయవచ్చునా? స్వర్గమున
నానందముతో విహరించుచున్న నిపుణికను నేను కన్నులు
మూసికొని స్పష్టముగ జూచుచుంటిని. ఆమె మందహాస
ముతో "నే నేమియు మిగుల్చుకొనలేదు. నేను నా సర్వస్వ
మును నీ కర్పించితిని. భట్టినికి కూడ నేను నా సర్వస్వము
నర్పించితిని. ఈ రెంటిలో నెట్టి వైరుధ్యము లేదు. పరస్ప
రము విరోధముగ నున్న ప్రేమదిశలు నొకటైనవి" అని

యనుచున్నట్లుండెను. నిజముగ నీ దిశలు రెండును నొక్కటైనవా !.

భట్టిని క్షీణస్వరమున, "సుచరితా !" అనిపిలిచెను.
"ఏమి తల్లీ ?"
"భట్టు వచ్చినాడా ?"
"వచ్చినాడు, దేవీ !"
"అతనిని పిలువనంపుము."
"ఇదుగో, యిచటనే యున్నాడు."

భట్టిని తడబడుచు లేచి కూర్చుండుటకు ప్రయత్నించెను. సుచరిత యామెను వారించుచు "దేవీ, జాగ్రత్త !" అని యనెనుగాని, భట్టిని యూరక లేచి కూర్చుండెను. ఆమె చాలసేపు నావైపే చూచుచుండెను. ఆమె చూపు నా హృదయమును భేదించివేసెను. ఇంతవఱకు నాగియుండిన కన్నీరొక్కమాఱుగ తెనృలు త్రెంచుకొని నా కన్నులనుండి ప్రవహింపసాగెను. సుచరితకూడ, విలపింపసాగెను. కాని భట్టిని మాత్రము తన్ను తాను మఱచి భ్రమించినదానివలె కదలక మెదలక చూచుచుండెను. కొంతసేపా విధముగ నుండిన తరువాత "భట్టూ, నిపుణిక వెడలిపోయినది, నీవు, నేను, ఇరువురము నిలచిపోతిమిగదా ! అయ్యో భట్టూ" అని యామె స్మృతిలేక శయ్యపై బడిపోయెను. సుచరిత యామె తలను మెల్లగ నొత్తుచు, నన్ను విసరుమని చెప్పెను. కొంతసేపటికి భట్టినే నిదురపోయెను.

సుచరిత స్కంధావారము వెలుపలికి వెళ్ళుదమని సైగచేసి చెప్పెను. వెలుపల ధావకుడును చారుస్మితయు

అంతవఱకు మౌనముగ కూర్చుండి యుండిరి. సుచరిత వారిని చూడనే లేదు. ఆమె నన్నూరడించుటకై కొంత ప్రయత్నించెను. 'ఆమె కంఠమునందప్పటికిని మిక్కిలి స్పష్టమగు మధురధ్వని వెడలుచుండెను. తన సఖిని కలిసికొనలేదను క్షోభ యామె హృదయమున నున్నను నామె శోకాతుర కాలేదు. ప్రేమతో నామె "ఆర్యా, నిపుణిక ధన్యురాలు. ఆమెనుగుఱించి యాలోచింపకుడు. కాని యామె యొసగిన బలిని, నీవు గ్రహించిననాడే యది సార్థకము నొందును. "భట్టూ ! నారాయణ లీల విచిత్రమైనది. నిపుణిక తన దుఃఖ భాజనమగు జీవితమున స్త్రీ జన్మపు మర్యాదను నిలువబెట్టునని యెవరనుకొనిరి ? ఆర్యా ! శోకింపకుము. భట్టినిని సేవించుచుందుము. నీవు ప్రాప్తించిన దుఃఖమును నారాయణుని ప్రసాదమని యెంచుకొనుము. ఏదో శుభము కలుగనున్నది. నరలోకమునుండి కిన్నరలోకమువఱకు వ్యాపించి యున్న రాగాత్మకమగు హృదయమును వెదకు కార్యమునకంతరాయము కలిగినదని భట్టిని అనుచుండెను. ఇట్లెందుకు జరుగవలెను ? ఈ పవిత్ర కార్యము సఫలమైననాడే నిపుణిక చేసిన ఆత్మత్యాగము సార్థకమగును. ఆర్యా ! ఉషఃకాలమాసన్నమైనది. నేను అత్యావశ్యకములగు కర్తవ్యములను నిర్వహించుటకు వెళ్లవలసియున్నది. నేను మరల శీఘ్రముగనే తిరిగివత్తును. మీరు అప్రమత్తులై యుండుడు. నేను వెళ్ళుచున్నాను" అని యనెను.

ఆమె వెళ్ళుటకుద్యమింపగనే చారుస్మిత యామెకు కనబడెను. ఆమె చేతులు జోడించి సుచరితకు ప్రణమిల్లెను.

ఆ యపూర్వ సౌందర్యరాశి యెవరో తెలిసికొనుటకై సుచరిత నా వైపునకు తిరిగెను. నేను ముక్తసరిగ, "ఈమె కన్యాకుబ్జపు నగర శోభయైన చారుస్మిత" అని యంటిని. సుచరిత ఆశ్చర్యముతో స్తబ్ధురాలై యనుమానించు కంఠస్వరమున, "ఈమె చారుస్మితయా!" అని యనెను.

చారుస్మిత యించుక సిగ్గుపడుచు "అవును, దేవి, నేనే చారుస్మితను. మీ రనుమతించిన నేను నేను భట్టినికి సేవ చేసెదను" అని అనెను. సుచరిత విషాద నేత్రములలో నాశ్చర్యము కనబడుచుండెను. ఆమె "చెల్లీ, నేను వలదు. నేను భట్టిని చెంత ఇతనినే యుండనిమ్ము" అని యనెను. పాపము! చారుస్మిత ముఖము వాడిపోయెను. దీనిని ధావకుడు గ్రహించి "నిజము చారుస్మితా, భట్టినికి సేవ చేయు నవకాశము లెన్నియో మనకు లభించగలవు. అపరిచిత ఇంటికి, నేను వెళ్ళుట భావ్యము కాదు." అనెను. తరువాత ధావకుడు సుచరిత వైపునకు తిరిగి, "అమ్మా, చారుస్మిత ఆర్య వేంకటేశ భట్టుల దర్శనము పొందగోరుచున్నది. మీ రీ విషయమున నామెకు సహాయపడగలరా?" అని యనెను. సుచరితకు మరింత యాశ్చర్యము కలిగెను. ఆమె చారుస్మిత నొకసారి పరికించి చూచి, "చెల్లీ, రేపు సాయంకాలము నీవు మా కుటీరమునకు రాగలవా?" యని ప్రశ్నించెను. చారుస్మితకు కోరిన వరము దొరికినంత యానందము కలిగెను; ఆమె గద్గద కంఠముతో, "చిత్తము, దేవీ!" అని పలికి భక్తితో తలవంచుకొని నిలబడెను.

సుచరిత వెడలిపోయిన తర్వాత ధావళ చారుస్మితలు నా యొద్ద సెలవు గైకొనిరి. నేనొక్కడనే భట్టిని చెంత నుంటిని. నా హృదయము నేడు వ్రయ్యలగుచుండెను. నిపుణిక లేకుండ భట్టిని యుండునని నేను భావించియే యుండ లేదు ఇంకను భట్టిని నిదురించుచునే యుండెను. కాని యామె ప్రత్యంగమునందు చైతన్యమవసన్నమై కంపించు చున్నట్లుండెను. నిజముగ నామె నిద్రకంటె సమాధియం దెక్కువగ నుండి యామె చిత్తవృత్తు లన్నియు నదృశ్య సఖి యందు లీనమై యుండెను. క్రమక్రమముగ తెల్లవారగనే భట్టిని మేల్కాంచెను. ఆమె వాడిపోయిన కన్నులు మూయు మూలలవఱకు వ్యాపించి నిపుణిక స్మృతివలన నింటికి కలిగిన లోటును లెక్కపెట్టుచున్నవా యన్నట్లుండెను. పడక మీద నుండి లేచినప్పుడామె యెవరి సహాయమునో అపేక్షించుచున్నట్లుం డెను. నేనామె దగరకు వెళ్ళి "దేవి, యేమి యాజ్ఞ?" అని యంటిని. ఆమె నా చేయూత గైకొని లేచి నిలుచుండి స్నానము చేయవలెనని కోరెను. నేనామెను స్నానాగారము కడ చేర్చి తిరిగి యామె పడుక యొద్దకు వచ్చి కూర్చుంటిని. కొంత సేపటికామె యడుగుల చప్పుడు వినబడెను. ఆమె తిన్నగా మహావరాహుని ప్రతిమకడకు వెళ్ళి, ఒక్క క్షణమైన తరువాత నన్ను పిలిచి డగ్గుత్తికతో "భట్టా నేడు నీవే మహావరాహున్ని స్తుతి చదువుము. నేను, చదువలేను?" అని యనెను.

నా కంఠము కూడ బొంగురుపోయి యుండెను. కాని భట్టిని యాదేశము త్రోసిపుచ్చరాదని నేను గద్గద మగు కంఠస్వరమున మహావరాహుని స్తోత్రము చదివితిని. సమస్త

చరాచరములచే నిండిన ధరిత్రిని జలరాశినుండి యుద్ధరించిన ఓ వరాహమూర్తీ! ఇది యెట్టి పరిహాసము! దీనివలన నీ వెట్లు మేలుచేయదలచుకొన్నావో కదా! నిపుణిక గలించిపడి. భట్టిని రెక్కలు నరికిన కోయిలవలె నశించుచున్నది. అట్టి సమయమున నిన్నేమని స్తుతింతును! అని యనుకొనుచు నేను,

జలౌఘమగ్నా సచరాచరాధరా,
విషాణ కోట్యాఖిల విశ్వమూర్తినా!
సముద్ధృతా యేన వరాహరూపిణా
స మే స్వయంభూర్భగవాన్ ప్రసీదతు॥

అని చదివితిని. భట్టిని స్మృతితప్పి మహావరాహ పాదములపైకి ఒరిగెను. అయ్యయ్యో! యెట్టి యనర్థము సంభవించినది! ఆమె ముఖము ప్రభాతకాలపు చంద్ర బింబమువలె కాంతిహీనమయ్యెను. నేను భట్టిని తలను నా యొడిలోనికి తీసికొంటిని. మహావరాహునికి నైవేద్యము చేసిన పవిత్ర జలము రెండు మూడు చుక్కలామె నోటిలో పోసి కాతరభావమున నేను, "ఓ భగవంతుడా! నా పాపములకు ప్రాయశ్చిత్త మింకను పూర్తి కాలేదా! ఓ జగద్గురూ! ఇంతవరకు లాగుకొనివచ్చి నీవు నన్ను నరక ద్వారమున విడచిపోదలచుకొన్నావా! తల్లీ, త్రిభువన మోహిని! భట్టినిని రక్షింపుము!" అని ప్రార్థించితిని. నా ప్రార్థన వ్యర్థము కాలేదు. కొంతసేపటికి భట్టిని కన్నులు తెరచెను. ఆమె సిరసముగ నుండి నలువైపుల తన శూన్య

దృష్టిని బఱపఱచుచుండెను. నే నామెకు యుత్సాహము కలిగించుచునూ "దేవీ! మీ రిట్లు చింతింపఁదగదు. నరలోకమునుండి కిన్నరలోకమువఱకు వ్యాపించిన రాగాత్మక హృద్దమును కనుగొనవలసి యున్నది. మీరు మీ జీవితమునకు సరియైన మార్గము జూపుడు. నిపుణికకై చింతింప నవసరము లేదు. మీరు నాకై చింతింపుడు. మీరు నన్నింత కంటె సనాథునిగ చేయవలెను. దేవీ, లెండు. మీరు ఆర్యావర్తమును, మ్లేచ్ఛుల వేగమును, మానవజాతిని సంరక్షింపవలసి యున్నది. దేవపుత్రనందినికి పరవశత శోభింపదు" అని యంటిని. భట్టిని నామాటలతో నొక విధమగు చైతన్యము కలిగెను. ఆమె నా యొడిలోనుండి తల యెత్తుకొను ప్రయత్నింపలేదు. ఆమె క్షీణమగు కంఠస్వరముతో "క్రిందనుండి పైవఱకు నొక్కటే రాగాత్మికమగు హృదయము వ్యాపించి యున్నది. ఈ విషయము నే నిప్పుడిక స్పష్టపఱచితిని. భట్టూ! నీవు నా సహాయము చేసెదనని మాట యిచ్చెదవా?" అని యడిగెను. నేను దృఢస్వరమున "దేవీ! ఈ సేవకుడు మీ ప్రతి యాజ్ఞను పాలించుటకు సంసిద్ధుడై యున్నాడు" అని యంటిని.

భట్టిని లేచి కూర్చుండి మెల మెల్లగా "భట్టూ, ఈ మాఱు ఆర్యావర్తనముపై బడనున్న యాపద తొలగిపోయినది. మహామాయ యొక్క లక్షలాది శిష్యులు పురుషపురమునకు ప్రక్క గుమిగూడి యున్నారనియు, వారియందెక్కువమంది ప్రశిక్షణ లేనివారనియు, వారికి మా తండ్రిగారు తగు శిక్షణ నొసగుచున్నారనియు, ఆచార్య భర్వు

# ఉపసంహారము

బాణభట్టుని స్వీయచరిత్ర' యింతవఱకే నాకు లభించి నది. ఇది యసంపూర్ణమగుటవిదితమే ఇందలి యంశములనింత వఱకు 'మనకు లభించుచున్న బాణభట్టు విరచితములగు గ్రంథములతో పరిపోల్చుటతో తృప్తినొందక యిందలిసాహిత్యసంపదను పరీక్షించి చూడవలయునని నేననుకొనియుంటిని. పై పైని చూచుట కీ కథాశిల్పనైపుణి 'కాదంబరి' శిల్ప నైపుణి కెంతయు సన్నిహితముగనున్నది. ఇతర ఇంద్రియ ముల కన్న కన్నులకు ప్రాధాన్యమిందెక్కువగ నున్నది, అనగా, రూప శోభా సౌందర్యములిం దెక్కువగ నభివర్ణింప బడి యున్నవి. కాని సాహిత్య సమీక్ష యింతటితో పూర్తి కాదు. ఈ కథను జాగ్రత్తగ చదువు ప్రతి సహృదయుని కొక విషయము స్పష్టము కాగలదు. కథారచయితకు గ్రంథ రచన ప్రారంభించి నప్పుడు కథ యంతయు పూర్తిగ తెలిసి యుండలేదు. అందువలన నీ రచన చాలవఱకు నేటి "డైరీ" ఫక్కీపై సాగినది. సంఘటన లెట్లు కథకునికి తెలియవచ్చు చుండెనో వాని నట్లే యతడు లేఖనీబద్ధ మొనర్చియున్నాడు. భావావేగము తీవ్రమైనపుడు రచయిత పట్టుగ వ్రాసినట్లును, దుఃఖ మధికమైనపు డతని లేఖని తడబడుచున్నట్లును, పాఠకు లకు స్పష్టముగ కనబడుచుండును. కడపటి అధ్యాయమున రచయిత తనలో తాను క్రుంగిపోవుచున్నాడా యని యని పించక మానదు. నాకీ విషయము విచిత్రముగ తోచెను. సంస్కృత సాహిత్యమునం దీ శైలి క్రొత్తగ నున్నట్లు కన

బడినది. నాకీ విషయము కొంత సందేహము కలిగించెను. అంతేకాదు, కాదంబరియందు ప్రేమాభివ్యక్తియందు దాక వేగమగపడుచుండును. కాని యీ కథయందన్ని చోట్లను ప్రేమాభివ్యక్తి గూఢమై సహ్యముగ కనబడుచున్నది. స్త్రీ జనోచితమగు లజ్జ అన్ని చోట్ల యీ యభివ్యక్తి కంతరాయము కల్గించుచున్నట్లు స్పష్టముగ తెలియుచున్నది. కథయందన్ని చోట్లను స్త్రీకి గల గొప్పదనము, తర్కయుక్తముగ సమర్థింపబడి యున్నది. కథా ప్రారంభపు వైఖరినిబట్టి చూడ, నది యప్రకటితమగు ప్రేమయందే సహజపరిణతి పొందవలసి యుండుననుట సువిదితమే. కథావికాసమునందెక్కడను నాకు విరోధముగాని, దోషముగాని కనబడలేదు. కాని బాణభట్టుని లేఖనినుండి ప్రేమ యెంత స్పష్టముగను, ప్రముఖముగను వెలువడి యుండును. కాదంబరియందు హావభావములు, సాత్వికానుభావములు మొదలగు అయత్నసాధ్యములగు నలంకారములకు ప్రాధాన్యము మెండుగనుండ, వానికి బదులుగ నీ కథయందు లజ్జ, జడిమ, అవహిత్థ మొదలగు మనోవికారముల కెక్కువ ప్రాధాన్యము గలదు. నాకీ విషయములుగూడ కొంచెము విపరీతముగ కనబడుచుండినవి. ఉదాహరణ పూర్వకముగా నేనీ విషయములను తెలియజేయ సంకల్పించితిని.

చారిత్రక దృష్ట్యా తువరమిళిందు ద్వార 'గొప్ప చిక్కును కల్పించు వ్యక్తి, 'కాదంబరి' ప్రారంభమున బాణభట్టు భర్వు శర్మను స్తుతించియున్నాడు. ఇతడు బాణభట్టునకు గురువు. ఈ కథయందు బాణభట్టు అవధూతస్వామి

యగు అఘోరభైరవుని యెడ భవ్యశర్మ మీదనున్న నెక్కువ శ్రద్ధాభక్తులను కనబఱచియున్నాడు. ధావకుని పేరునందలి యర్థమునుబట్టి యూరపుదేశపు విద్వాంసులా కవి రజకకులమునకు చెందినవాడై యుండవచ్చునని యూహించి యున్నారు. కాని యీ కథయందట్టిది నిరూపితమై యుండ లేదు. చరిత్రలో పోల్చిచూడ నొకటి రెండు అసంగత విషయములు కనబడవచ్చునుగాని మన కింతవఱకు లభించిన చారిత్రక విషయములకును కథయందలి విషయములకును వైరుధ్య మెక్కడను లేదు. ఈ సంఘటనలన్నియు నే ప్రాంతమున జరిగియుండును అన్నదియే ముఖ్యముగ గమనింపదగిన విషయము. ఇందు స్థాణ్వీశ్వరము, చరణాద్రి (చునార్) దుర్గములు పేరునకు మాత్రము వచ్చియున్నవి. కాని భద్రేశ్వర దుర్గము, దాని సమీపమున నున్న మఱికొన్ని స్థలములు ఎక్కువగ వర్ణింపబడియున్నవి. ఇవి జాగ్రత్తగ పరిశీలింపవలసిన విషయము.

'రత్నావళి' నాటకమునందలి "జితముడుపతినా" అను శ్లోకములోని చిక్కు ప్రశ్న కిందు పూర్ణముగ సమాధానము లభించుచున్నది. చాల కాలమునుండి యీ శ్లోకము పండితుల వివాదమునకు గుఱియై యున్నది. ఇంతవఱకు దీనికి సరియైన వ్యాఖ్యాన మెవరును చేసియుండలేదు. ఎన్నియో విధముల ఊహాగానము మాత్రము జరిగినది. ఇట్టి మహత్త్వపూర్ణమగు ప్రశ్నలకు సమాధానములను సూచించుచున్న యీ కథను కడు జాగ్రత్తగ పరీక్షింపవలయునని నే ననుకొంటిని. అట్టి సమయమున 'దీదీ' నుండి నాకీ లేఖ వచ్చినది.

నే నిక వచ్చి మీ మధ్య నుండలేను. నిజముగ నేను సన్యాసమునే స్వీకరించి, నే నుండుటకు నిర్జనస్థానమును గూడ నేర్పఱచుకొని యున్నాను. ఇదియే నీకు నా కడపటి లేఖ. 'స్వీయచరిత్ర' విషయములో నీ వొక పెద్ద పొరపాటు చేసియున్నావు. అది యొక "ఆటో బయాగ్రఫీ" యను నభిప్రాయము కలుగునట్లు నీవు ఆముఖమున వ్రాసి యున్నావు. చూడు మఱి! నీవు సంస్కృతము చదివి యున్నావనియే నా నమ్మకము. అట్లుండియు, నీ వీ యన ర్థము నెట్లు చేసితివి? బాణభట్టుని యాత్మ శోణనదియందలి ప్రతి సికతాకణమునను లీనమై నిలచియున్నది. ఛీ! నీ వెంత యమాయికుడవు! నీకు దాని పిలుపు వినబడుచుండుట లేదా! చూడు బాబూ! నీవు పురుషుడవు, యువకుడవు. నీ కిట్టి భ్రమ శోభింపదు.

ఆ పాడుపిల్లి తన కూనల సైన్యము నొకదానిని తయారుచేసినది. యుద్ధసమయమున నెన్నో బాంబులు పడి నవి! కాని యీ పాడు దయ్యములలో నొకదానికైనను చావ లేదుకదా! నేను వీని నెన్ని రోజులు సాకగలను? జీవితమున నొకసారి పొరపాటు జరిగినదా, మఱి దానిని దిద్దుకొన లేము. ఈ పిల్లిని సాకుట నేను చేసిన పొరపాటులలో నొకటి. నేను నీతో అనేక పర్యాయములు చెప్పినను నీవు గ్రహింపనే లేదే! వెఱ్ఱివాడా! 'భాణభట్టులు' కేవలము భారతదేశమునందే జన్మింప రు. ఈ మానసలోకమునుండి కిన్నరలోకమువఱకు నొకే రాగాత్మకమగు హృదయము వ్యాప్తమైయున్నదని నీవు మఱచితివా? నీ 'డీదీ'ని అర్థము చేసికొనుటకు ప్రయత్నము చేసి

శివా! ప్రమాదము, సోమరితనము, తొందరపాటు ఈ మూడు లోపములనుండి తప్పించుకొని తిరుగుము. ప్రతి దినము నీకీ విషయములను చెప్పుటకు 'దీదీ' నీ వెంట నుండదు. జీవితమున జరిగిన పొరపాటుగాని, తప్పుగాని, సంకోచముగాని, యెంతకాలమో, మనస్సును దహించుచుండును. నీ వీ లోపములనుండి తప్పుకొనగలందులకు నిన్ను నే నాశీర్వదించుచున్నాను.

ఇట్లు,
కేథరీన్.

'స్వీయచరిత్ర'ను నేను ఆటోబయాగ్రఫీ యనుకొని యనర్థము గావించితినని 'దీదీ' యభిప్రాయము! నా ప్రమాదము, సోమరితనము, అజ్ఞానము మొదలగువాని మాట యటుండనిండు అది నా స్వవిషయము. కాని యీ లేఖలో ఈ విషయమే కాదు. ఇంకను మఱికొన్ని విషయము లున్నవి. నాడు దీదీ చాల భావ విహ్వలయై ఒక నక్ష- కథను వినుపించవలెనని కుతూహల పడుచుండెను. ఆ నక్ష- బుద్ధదేవుని కాలమునకు చెందినదని యామె నమ్మకము! కాని బాణభట్టుని కాలపు జంతువేదైనను నా మొకు కన బడెనా! శోణ నదియందలి యనంతమగు, సికత కణముల లో నే కణము దీదీకి బాణభట్టుని యాత్మయొక్క హృదయ విదారకమగు ఘోషను వినిపించెనో కదా! పాపమా వృద్ధు

రాలి హృదయమునం దెంత పరితాపము సంచితమైయుండెనో కదా! ఆస్ట్రియా దేశపు యువకుమారి యగు దేవపుత్ర నందినియే యీ ఆస్ట్రియా దేశ నివాసిని కాదుగదా! 'బాణ భట్టులు కేవలము భారతదేశమున మాత్రమే జన్మింపరు!' అను నామె మాటలోని యంతరార్థ మేమైయుండును! ఆస్ట్రియా దేశమున జన్మించిన యా 'యభినవ బాణభట్టు' ఎవరు! మనకు తెలియని తన ప్రియుడగు ఆ కవి దృష్ట్యా తన్ను తాను చూచుకొనుటకు దీదీ ప్రయత్నించినదా? ఇదెట్టి రహస్యము! ఈ రహస్యమును దీదీతప్ప మతెవ్వరు వివరింప గలరు! ఆ బాణభట్టుని కథను తెలిసికొనుటకై నా మనస్సు ఉబలాట పడుచున్నది. నేవి విషయమును మొదటనే దీదీని అడిగియుండవలసినది. కాని 'జీవితములో నొకసారి తప్పు జరిగిన నది యటులనే యుండిపోవును!'

లేఖ చదివిన తర్వాత నా మనసున గలిగిన భావము లివియే. నాకు తెలిసినంతవఱకు సాహిత్యమున నభినవ ప్రయోగమిది. కృష్ణుడు తన్ను గురించి యేభావములు కలిగి యున్నాడని రాధ తెలిసికొన నభిలషించెనో వానిని మధ్య యుగపు కవులు వర్ణించి యుండిరి. రాధ తన మనసునందు కృష్ణుని గుఱించి యెట్టి యభిప్రాయములు గలిగి యుండెనో కృష్ణుడు తెలిసికొన గోరుచుండెననియు అందువలననే అతడు నవద్వీపమున చైతన్య ప్రభురూపమున జన్మించెననియు ప్రతీతి

కలదు. కావ్యమునందును, మతసాధనలోను గల కల్పనము దీదీ తన జీవితమున సత్యమని జూపియుండెను. ఈ విషయమును తలచుకొన్నపుడు నే నమితానందము జెందుచుందును. కాని నా యీ వ్యాఖ్యానమువలన నేను సహృదయులం దుత్పన్నములగు భావముల కంతరాయము కలిగింపను. అందువలననే నేను సాహిత్య సమీక్ష చేయక విరమించు కొనుచు కథను యథాతథముగ పాఠకుల యెదుటనుంచితిని.

వ్యోమ్.

